శ్రీ వేదాంత దేశికులు అనుగ్రహించిన

# శ్రీవరదరాజ పంచాశత్

## సర్వంకషా వ్యాఖ్య



వ్యాఖ్యాత :

వాచస్పతి, పండితరత్న

**శ్రీమాన్ కే.వి. రాఘవాచార్యులు**

తిరుమల ఛారిటబుల్ ట్రస్టు, హైదరాబాద్



# శ్రీ లక్ష్మీ నృసింహ దివ్యపాదుకా సేవక శ్రీవణ్ శఠకోప శ్రీనారాయణ యతీన్ద్ర మహాదేశికన్

శ్రీ అహోబిలమఠం 45వ పీఠాధిపతులు

శ్రీమతే రామానుజాయనమః
శ్రీ దేవాధిరాజాయనమః
శ్రీ వేదాంత దేశికులు అనుగ్రహించిన

# శ్రీ వరదరాజ పంచాశత్

సర్వంకషా వ్యాఖ్య

వ్యాఖ్యాత :

**కే.వి. రాఘవాచార్యులు**

ప్రచురణ
తిరుమల ఛారిటబుల్ ట్రస్టు
హైదరాబాద్

శ్రీ వేదాంత దేశికులు అనుగ్రహించిన

# శ్రీ వరదరాజ పంచాశత్ (సర్వంకషా వ్యాఖ్యా సహితము)


వ్యాఖ్యాత : **శ్రీమాన్ కె.వి. రాఘవాచార్యులు**

కాపీరైట్ : సర్వ హక్కులు గ్రంథకర్తవి

ప్రథమ ముద్రణ : నందన శ్రీరామనవమి, 2012

ప్రతులు : 500

మూల్యము : రూ. 100/-

ప్రాప్తిస్థానము : **శ్రీ మాలోల గ్రంథమాల**
శ్రీ అహోబిల మఠము
2-2-20/28. డి.డి. కాలనీ,
హైదరాబాద్- 500 013

ముద్రణ సహకారం : **"పుస్తక శిల్పి" శ్రీ తాళ్లపల్లి మురళీధర గౌడు**
9393 176 552

ముఖచిత్ర రూపకల్పన : **అక్రం**

అక్షరాలంకరణ : **కె.బి.టి. కొండయ్య**

ప్రచురణ కర్తలు : **తిరుమల ఛారిటబుల్ ట్రస్టు,**
సి-501, నఫీజ్ రెసిడెన్సీ,
ఏ.సి.గార్డ్స్, హైదరాబాద్- 500 028

ముద్రణ : **కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్**
విద్యానగర్, హైదరాబాద్ - 500 044
ఫోన్ : 040-2761 8261

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యులు
**శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ**
**రామానుజ జీయర్‌స్వామివారు**
వేద విశ్వవిద్యాలయ ప్రాంగణము
శ్రీరాంనగరం, శంషాబాద్, హైదరాబాద్



# మంగళాశాసనాలు

*శ్రీమతే నారాయణాయనమః*

*అనేక మంగళాశాసనాలు*

*ప్రియ స్వామినః!*

దేవరవారు శ్రీమద్దేశిక స్తోత్ర సారస్వతాన్ని ఆంధ్ర పాఠకలోకానికి అందించడానికి చేస్తున్న అవిశ్రాంత పరిశ్రమ సర్వథా స్పృహణీయం అభినందనీయం. పాదుకాసహస్రంలాంటి మహాకవితావైభవం కల స్తోత్రరాజాన్ని వ్యాఖ్యాముఖంగా విశదపరచగలిగిన దేవరవారికి మిగిలిన స్తోత్రాలు సులభసాధ్యాలనడం స్వభావోక్తి. యతిరాజసప్తతిలాంటి సాంప్రదాయిక రహస్యాలంబనాలు పూర్వాచార్యవైభవ ప్రకాశకాలు, దార్శనికమర్మోద్ఘాటకాలు అయిన స్తోత్రాలను సహితం అవలీలగా వ్యాఖ్యానించి దేశిక స్తోత్రాల పట్ల తమకు గల అవ్యాజాభినివేశాన్ని చాటిన దేవరవారు, కంచి వరదుని వైభవాన్ని జగద్విదితం చేసే వరదరాజ పంచాశత్తుకు వ్యాఖ్యను వెలయింప నుద్యమించడం మాకు చాలా ఆనందాన్ని కలుగజేస్తున్నది. ఇందులోనూ మీకు గల శ్రీ భాష్యాది పరిచయాన్ని బాగా ఆవిష్కరించారు. ద్రవిడోపనిషత్తాత్పర్య రత్నావళీ వ్యాఖ్య- భగవద్విషయానువర్తనాల ద్వారా ద్రావిడ ప్రబంధ సారస్వతం పట్ల కూడా ప్రీతిని ఆవిష్కరించిన దేవరవారి కృషి ఉభయ వేదాన్త విశ్రాన్తమై, సర్వోపకారియై వర్ధతామ్ అభివర్ధతామ్.

ఇతి

(చిన్న శ్రీమన్నారాయణరామానుజజీయర్)



'శాస్త్రరత్నాకర' 'శాస్త్రవిద్వన్మణి'
**డా॥ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యులు**
డైరెక్టర్, ఎకడమిక్ కౌన్సిల్-జీవ,
శ్రీరామనగరం-ముచ్చింతల్ రోడ్,
పాలమాకుల పోస్టు 509 325 ఆర్.ఆర్. జిల్లా

# దేశికపరివస్య

**భ**గవద్రామానుజ సిద్ధాన్త ప్రతిష్ఠాపనధురంధరులు శ్రీమన్నిగమాన్తమహాదేశికులు. ఏ సంప్రదాయానికైనా దార్శనికత ఏర్పడడానికి దార్శనిక సిద్ధాంతం ఉండాలి. అలాగే సాంప్రదాయికత కుదురుపడటానికి సాంప్రదాయిక సిద్ధాంతాలుండాలి. దార్శనిక సిద్ధాన్తాలను ఆవిష్కరించే గ్రంథాలు దర్శనగ్రంథాలుగా ప్రసిద్ధి చెందుతాయి. ఇవి రెండు రకాలుగా ఉంటాయి- 1. వ్యాఖ్యానరూపాలు, 2. స్వతంత్ర గ్రంథాలు. వేదాన్తదర్శనానికి సంబంధించిన ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, శ్రీగీత, మౌలిక గ్రంథాలు కాగా, వీటికి ఆయా ఆచార్యులు వెలయించిన భాష్యాలు, తద్వ్యాఖ్యానోపవ్యాఖ్యానాలు ఇవన్నీ వేదాన్తదర్శనంలో చేరి, దార్శనిక గ్రంథాలుగా పరిగణింపబడతాయి. ఈ గ్రంథాలలోని దార్శనిక రహస్యాలను క్రోడీకరించి, విస్తరించిగాని, లేదా సంగ్రహపరచిగాని ఆయా ఆచార్యులు స్వతంత్రంగా గ్రంథాలు వ్రాస్తే అవికూడా ఆ దర్శనంలోని భాగంగానే గ్రహింపబడతాయి. ఇలా ఏ సంప్రదాయానికైనా, దార్శనిక గ్రంథపరంపర ఏర్పడి దర్శనసిద్ధాన్తం ప్రచారం పొందుతుంది. ఇలా దార్శనిక భూమి లేకపోతే ఆ సంప్రదాయానికి ప్రామాణిక ఏర్పడదు.

సాధారణంగా వేదాన్తదర్శనంలో ఆత్మ, పరమాత్మ, బంధం, మోక్షం, కర్మ, జ్ఞానం అనే అంశాలు సామాన్యంగా ఉంటాయి. ఆయా సంప్రదాయాలవారు, వారి వారి సంప్రదాయరీతిని బట్టి ఆత్మాదితత్త్వాల నిరూపణ ప్రక్రియను సాగించి తమ సంప్రదాయానికి చెందిన దార్శనిక ప్రక్రియను ఆవిష్కరిస్తారు. ఇక అదే సంప్రదాయానికి చెందిన అనుష్ఠాన ప్రక్రియలు ఉంటాయి. ఈ అనుష్ఠాన ప్రక్రియలు దైనందిన వ్యవహారంలో చేరి ఉండి, ఆచరణలో అన్వయించి ప్రాచుర్యాన్ని పొంది ఉంటాయి.

ఈ అనుష్ఠాన ప్రక్రియలకు కూడా శ్రుతి, స్మృతి సదాచారాలు ఆలంబనగా ఉంటాయి. ఒకప్పుడు భిన్న భిన్న సంప్రదాయాలకు ఆలంబనగా శ్రుతి, స్మృత్యాదులున్నా వాటి నిర్వచనంలో ఉన్న తేడాను బట్టి, దేశీయాచార విధానాలను బట్టి సంప్రదాయ భేదం ఏర్పడుతూ ఉంటుంది. ఇలాంటి సాంప్రదాయికానుష్ఠానాది రీతులను ఆవిష్కరించే గ్రంథాలు సాంప్రదాయికానుష్ఠాన ప్రక్రియలను సిద్ధాన్తపరచి సాంప్రదాయిక సిద్ధాన్తాలుగా ప్రచారం చేస్తాయి.

శ్రీ వైష్ణవ సంప్రదాయానికి చెందిన దార్శనిక సిద్ధాన్తాలను ఆవిష్కరించే గ్రంథ రాజాలు, సాంప్రదాయికానుష్ఠాన రీతులను చెప్పే గ్రంథాలు విడివిడిగా ఉన్నాయి. భగవద్రామానుజుల శ్రీభాష్య, గీతా భాష్యాలు, వేదార్థ సంగ్రహం, వేదాన్తసార, వేదాన్తదీపాలు దార్శనిక సిద్ధాన్త ప్రతిపాదక గ్రంథాలు కాగా, శరణాగతి గద్య, వైకుంఠ, శ్రీరంగగద్యలు, నిత్యగ్రంథం సాంప్రదాయిక అనుష్ఠానరీతిని, తదాలంబన తత్త్వాలను ఆవిష్కరించే గ్రంథరాజాలు అవుతున్నాయి. అయితే ఇలాంటి దార్శనిక గ్రంథాలు కూడా రెండు రకాలుగా ఉంటాయి: 1. ప్రకరణ గ్రంథాలు, 2. వాదగ్రంథాలు. ఇలా దార్శనిక సిద్ధాన్త నిదర్శకాలైన గ్రంథాలతోపాటు, సాంప్రదాయిక రీతులను అందించే గ్రంథాలను కూడా అనుగ్రహించినవారు భగవద్రామానుజులకు పూర్వులు శ్రీమద్యామునులు కాగా, తరువాతి వారిలో ప్రముఖులు శ్రీమన్నిగమాన్తమహాదేశికులు. భగవద్రామానుజుల గ్రంథాలకు వ్యాఖ్యానాలను వెలయించడంతో పాటు, దార్శనిక సిద్ధాంతాలను సూటిగా విచారించి నిరూపించే స్వతంత్ర గ్రంథాలతోపాటు, సంస్కృత ద్రావిడ భాషల్లో సాంప్రదాయిక రహస్యాలను ఆవిష్కరించే గ్రంథాలను కూడా వెలయించారు. ఇవి అన్నీ ఒక ఎత్తు కాగా, వీరు అనుగ్రహించిన స్తోత్రాలు బహుళంగా వున్నాయి.

స్తోత్రాలనేవి సాధారణంగా భగవత్ స్వరూప, రూప, గుణవైభవాలను అవికలంగా ఆవిష్కరించేవే అయినా, మన పూర్వాచార్యులు స్తోత్రాలను సహితం దార్శనికమర్మాలను, సాంప్రదాయిక రీతులను ఆవిష్కరించడానికి వినియోగించడం జరిగింది. కూరత్తాళ్వానులు, పరాశరభట్టరులు అనుగ్రహించిన స్తోత్రాలు ఇలాంటివే.

శ్రీమన్నిగమాన్తదేశికులుగా ప్రసిద్ధులైన వేంకటనాథులు అనుగ్రహించిన అసంఖ్యాక స్తోత్రాలలో పై రెండురీతులు పరస్పర సమన్వయంతో గోచరించడం

మనం గమనించవచ్చు. శ్రీమద్దేశికుల స్తోత్రాలలోని మర్మాలు తెలుగువారికి అవికలంగా అందించడానికి అవిశ్రాన్తంగా కృషిచేసి కృతకృత్యులైన ప్రముఖ పండితులు ఉ.వే. శ్రీమాన్ కె.వి. రాఘవాచార్య స్వామివారు సర్వధా అభినందనీయులు. దేశికుల బృహత్స్తోత్రమైన పాదుకా సహస్రంతోపాటు ఎన్నో స్తోత్రాలకు తెలుగులో వ్యాఖ్యలు వెలయించి, ఆంధ్రలోకానికి దేశిక సారస్వత సమాస్వాదాన్ని హృదయభోగ్యం చేసిన మహనీయులు శ్రీమాన్ రాఘవాచార్య స్వామివారు. వీరు ఇతఃపూర్వమే భగవద్ధ్యానసోపానం, శ్రీస్తుతి, అభీతిస్తవం, దయాశతకం, సుదర్శనాష్టకం, యతిరాజసప్తతి, ద్రవిడోపనిషత్తాత్పర్య రత్నావళి అనే స్తుతులకు పాదుకాసహస్రంతో పాటుగ, వ్యాఖ్యలను వెలయించి, దేశికస్తోత్ర సారస్వతానికి ఎనలేని సేవ చేసారు. ప్రస్తుతం **"వరదరాజ పంచాశత్"** అనే ఏభై శ్లోకాలు గల స్తోత్రానికి **"సర్వంకషా"** వ్యాఖ్యను వెలయించి ప్రకాశింపజేస్తున్నారు మన స్వామి.

## వరదరాజ పంచాశద్వైభవం

దేశికులు అనుగ్రహించిన స్తుతులలో కంచిలో వేంచేసిన వరదరాజ పెరుమాళ్ళ పరంగా కృప చేసిన ఏభై శ్లోకాలు గల **'వరదరాజ పంచాశత్'** ప్రశంసమైది. శ్రీ వైష్ణవ దర్శన సిద్ధాన్తాలను, సాంప్రదాయిక రీతులను కూడా ఆవిష్కరించే స్తోత్రం ఇది.

ఈ స్తోత్రంలోని మూడు శ్లోకాల్లో ప్రధానంగా స్వామి కాంచీపురిలోని హస్తిశైలంలో పుణ్యకోటి విమానంలో ఆవిర్భవించిన వైనాన్ని దేశికులు నిర్దేశించారు.

మొదటి శ్లోకంలోనే **'ద్విరద శిఖరిసీమ్నా- సద్మవాన్ పద్మయోనేః తురగసవన వేద్యాం శ్యామలో హవ్యవాహః'** అనడం ద్వారా చతుర్ముఖుడు చేసిన అశ్వమేధయాగంలో శ్యామవర్ణం కల హోమాగ్నిగా స్వయంగా ప్రతిష్ఠితుడైన స్వామి కరిశైలధాముడైనాడని స్పష్టపరచారు దేశికులు.

తురగసవనవేదియందే సాక్షాత్తు హవ్యవాహనుడుగా ఆవిర్భవించినాడు స్వామి. దీన్నే దేశికులు యాదవాభ్యుదయంలో 'త్రివేదీ మధ్య దీప్తాయ' అన్నారు. ఇక్కడ వేదానాం త్రయాణాం సమాహారః-త్రివేదీ మూడు వేదాల సమాహారం త్రివేది కాగా, దానిలో ప్రకాశించినవాడు అని ఒక అర్థం- త్రిస్రశ్చతాః వేద్యశ్చ త్రివేద్యః- త్రివేదీనాం

మధ్యం త్రివేదీ మధ్యం, తస్మిన్ దీప్తః త్రివేదీ మధ్య దీప్తః తస్మై- మూడైన వేదులు త్రివేదులు, అంటే మూడు అగ్నిస్థానాలు, త్రివేదులు. దక్షిణాగ్ని, గార్హపత్యం, ఆహవనీయం అనే మూడు వేదికలయందు మూడు అగ్నులుంటాయి కనుక, త్రివేదీ మధ్యంలో మూడు అగ్నులుగా ప్రదీప్తుడైన వాడు స్వామి "త్రివేదీమధ్యదీప్తుడు". కనుక సాక్షాత్తు అగ్నిస్వరూపుడు స్వామియే. శ్రీ భాగవతం ఇలా అంటుంది.

*దేశఃకాలఃపృథక్ ద్రవ్యం మన్త్ర-తన్త్ర-ఋత్విగగ్నయః।*
*దేవతా యజమానశ్చ క్రతుర్ధర్మశ్చ యన్మయః॥*
*తద్బ్రహ్మ పరమం సాక్షాత్ భగవన్తమధోక్షజమ్।*
*మనుష్యదృష్ట్యా దుష్ప్రజ్ఞా మర్త్యాత్మానో నతే విదుః॥*

దేశము-కాలము-వేరువేరు హవిర్ద్రవ్యాలు-మన్త్రాలు, క్రియాకలాపం (తన్త్రం) ఋత్విక్కులు, అగ్నులు, దేవతలు, యజమానుడు ఏతద్రూపుడైన క్రతువు దానికి ఫలమైన స్వర్గాపవర్గాలు ఇవన్నీ స్వామియే. కనుక, బ్రహ్మ నిర్వహించిన అశ్వమేధంలో స్వామియే హవ్యవాహనుడై హవిర్ద్రవ్యాన్ని పుచ్చుకొని, తానే సర్వదేవాత్మకుడై, తానే హవిర్భోక్తయని ఉద్ఘోషించాడు. ఇలాంటి స్వామి చక్షురిన్ద్రియ గోచరుడు కాకపోయినా, బ్రహ్మ, తన సుదీర్ఘమైన పుణ్యవిశేషం చేత సాక్షాత్కరింప గలిగినాడంటారు దేశికులు, **"యం చక్షుషామ విషయం హయమేధయజ్వా ద్రాఘీయసా సుచరితేన దదర్శ వేధాః"** అని.

బ్రహ్మ నిర్వహించిన హయమేధంలో స్వామి అగ్నిస్వరూపుడై అగ్నిలోనే పుణ్యకోటి విమానస్థుడై సాక్షాత్కరించాడనే భావనకు ఆళ్వారుల వచనాలు స్ఫూర్తిదాయకాలు అనక తప్పదు. పూదత్తాళ్వారులు, తమ ఇరండాం తిరువన్దాదిలో ఇలా కటాక్షించారు.

*"అత్తియూరాన్ పుళ్ళైయూర్వాన్*
*అణిమణియిన్ తుత్తిశేర్ నాగత్తిన్ మేల్-తుయిల్వాన్*
*ముత్తీమఱైయావాన్ మాకడల్ నంజుండాన్ తనక్కుమ్ ఇఱైయావాన్*
*ఎంగళ్ పిరాన్"*

అనే పాశురంలో "ముత్తీమత్తైయావాన్" అన్నారు. "మూడు అగ్నులను ప్రతిపాదించే వేదంచే ప్రతిపాదింపబడేవాడు స్వామి" – అనడం చేత మూడు అగ్నులను ప్రతిపాదించే వేదాలు అనడంలో ఆ మూడగ్నులు స్వామియేనని సూచించడమే. ఈ పాశురం కంచిలోని స్వామిని ప్రతిపాదించేదని పెద్దల నిర్వాహం- **మూన్ఱగ్నియైయుం శొల్లప్పుడానిన్ఱ వేదాత్తాలే, సమారాధ్యతయా ప్రతిపాదిక్కపట్టవన్** అని పెరియవాచ్చాన్పిళ్ళై వివరణం. దేశికుల శ్రీసూక్తికి ఆళ్వార్ సూక్తి మూలమని అనక తప్పదు కదా!

ఇక్కడ బ్రహ్మ చేసిన హయమేధానికి సంబంధించిన ఒక ఐతిహ్యం ఉంది. బ్రహ్మ, కరిశైలంలో అశ్వమేధయాగం చేస్తున్నాడు. ఇన్ద్రాది దేవతలు వారి వారి హవిర్భాగాలను స్వీకరించడానికి వచ్చి వారికి ఉద్దేశింపబడిన ఆసనాల్లో కూర్చున్నారు. స్వామి, శ్రీమన్నారాయణుడు రాలేదు. ఆయా దేవతలకు చెందిన హవిర్భాగాలు వారికి అందలేదు. దీనికి కారణం తెలియక, దేవతలు తమ హవిర్భాగాలను తమకు ఇవ్వాలని బ్రహ్మను నిర్బంధించారు. శ్రీమన్నారాయణుడు రాగానే ఇస్తానన్నాడు బ్రహ్మ. మా హవిర్భాగాలు మమ్మే ఉద్దేశించినవి కనుక, నారాయణునితో నిమిత్తం ఏమిటి? ఆయన రాకపోతే మావి మాకు చేరవా? అని దేవతలు వాదించారు. ఇంతలో శ్రీమన్నారాయణుడు ఆవిర్భవించి హవిస్సును స్వీకరించసాగాడు. దేవతలకు ఉద్దేశించిన హవిస్సులన్నీ ఆయన చేతిలోనే చేరి ఉన్నాయి. దేవతలు కలవరపడ్డారు. ఇది అన్యాయమని ఆక్రోశించారు. అప్పుడు బ్రహ్మ, శ్రీమన్నారాయణుడే యజ్ఞస్వరూపుడు, యజ్ఞహవిర్భోక్త, యజ్ఞఫలప్రదాత. దేవతలందరిలోను అంతర్యామిగా ఉండి హవిస్సులను గ్రహించి, వారి ద్వారా ఆయా ఫలాలను ఇచ్చేవాడు కూడా ఆయనేనని విశదపరచాడు. శ్రీమన్నారాయణుని అనుగ్రహం చేత దేవతలకు హవిస్సులు అందాయి. వాటిని పరిగ్రహించిన దేవతలు తమ తప్పును తెలిసికొని నారాయణుని పట్ల ప్రహ్వాభావులై తమ స్వాతన్త్ర్యబుద్ధిని విడచినారట. దీన్నే దేశికులు-

*"తత్తత్ పదైరుపహితేఽపి తురఙ్గ మేధే శక్రాదయో వరద! పూరమలబ్ధ భాగాః*
*అధ్యక్షితే మఖపతౌ త్వయి చక్షుషైవ హైరణ్యగర్భ హవిషాం రసమన్వభూవన్॥"*

అనే ఎనిమిదవ శ్లోకంలో స్పష్టపరచారు.

ఇక్కడ ఒక వేదాన్త విచారం కూడా ఉంది. వేదంలో బ్రహ్మా, శంకరః, ఇన్ద్రః, స్వరాట్, ఆత్మా ఇలా ఎన్నో శబ్దాలున్నాయి. ఇవన్నీ ఆ శబ్దాల పార్యన్తికార్థం ఎరుగని వారికి కేవలం బ్రహ్మశంకరాది నామ ప్రసిద్ధులైన దేవతా విశేషాలను మాత్రమే బోధిస్తాయని సాధారణ వ్యుత్పత్తి కలవారు భావిస్తారు. శాస్త్రమూలంగా వారికి కలిగిన లౌకిక వ్యుత్పత్తి అపరిపూర్ణం. కనుక, వారు వేదాన్తాన్ని అధ్యయనం చేసినప్పుడే వారి వ్యుత్పత్తి పరిపూర్ణం అవుతుంది. భగవద్రామానుజులు తమ వేదార్థ సంగ్రహ గ్రంథంలో ఇలా అన్నారు. "అశ్రుతవేదాన్తాః పురుషాః సర్వే పదార్థాః సర్వే జీవాత్మానశ్చ బ్రహ్మాత్మకాః ఇతి న పశ్యన్తి। సర్వశబ్దానాం చ కేవలేషు తత్తత్పదార్థేషు వాచ్యైకదేశేషు వాచ్యపర్యవసానం మన్యంతే। ఇదానీం వేదాన్త వాక్య శ్రవణేన బ్రహ్మకార్యతయా తదన్తర్యామికతయా చ సర్వస్య బ్రహ్మాత్మకత్వం సర్వశబ్దానాం తత్తత్ప్రకార సంస్థిత బ్రహ్మవాచిత్వం చ జానన్తి"...

వేదాన్తం ఎరుగనివారు అన్ని పదార్థాలు, అందరు జీవాత్మలు బ్రహ్మాత్మకులేనని చూడజాలరు. అన్ని శబ్దాలకు కేవలం, ఆయా శబ్దాల పరిపూర్ణార్థాలకు చెందిన కొంత భాగాన్ని మాత్రమే పరిపూర్ణార్థమని భావించి ఈ శబ్దాలకు ఇదే అర్థమని నిర్ణయించుకుంటారు. ఇప్పుడు వేదాన్తవాక్యాలను విన్న తరువాత- అంటే 'అనేన జీవేన ఆత్మనా అనుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి'. ఈ జీవుని ద్వారా నేనే ప్రతి వస్తువులోను ప్రవేశించి, వాటికి పేరు, ఆకారం ఏర్పడేలా చేస్తాను' అని ఉపనిషత్తుల్లోని భగవత్ సంకల్పాన్ని చెప్పే వాక్యాలు విని, ప్రతి వస్తువుకు పేరు, ఆకృతి అనేవి భగవానుడు జీవుని ప్రవేశపెట్టి తాను కూడా ఆ వస్తువు లోపల ప్రవేశించినందువల్లనే కలుగుతున్నది తప్ప- కేవలం ఆ వస్తువులకు మాత్రమే స్వతన్త్రంగా పేరు, ఆకృతి ఉండవని తెలుసుకుంటారు. ఇలా సర్వపదార్థాలు జీవులతోను, వారికి ఆధారమైన పరమాత్మతోను కూడియే ఉంటాయి. కనుక, బ్రహ్మాత్మకాలేనని గ్రహింపగల్గుతారు. ఇప్పుడు 'చెట్టు' అని అంటే కేవలం ఆకులు, కొమ్మలు, కాణ్డం కల వస్తువును మాత్రమే ఆ శబ్దం బోధించదని, దాని లోపల ఉన్న జీవుని, ఆ జీవునికి ఆధారంగా అన్తర్యామియై ఉన్న పరమాత్మను కూడా బోధిస్తుందని, ఇలా ఈ శబ్ద తత్త్వాన్ని ఎరుగనివారు, జీవాత్మ పరమాత్మలు కంటికి అగుపించరు కనుక, పైన కనిపించే

ఆకులు కొమ్మలు కాణ్డం మాత్రమే చెట్టని భ్రాంతి పడి అలానే గ్రహిస్తారు, వ్యవహరిస్తారు. ఇదే విధానం వైదిక శబ్దాలకు కూడా అన్వయించాలని రామానుజులు చెప్పారు. "ఏవమేవ వైదికశబ్దాః సర్వే పరమాత్మ పర్యన్తాన్ స్వార్థాన్ బోధయన్తి" ఇలాగే వేదాల్లోని శబ్దాలన్ని ఆయా ఆకారాలు గల వ్యక్తులతో పాటు, లోనున్న జీవులను, పరమాత్మను కూడా బోధిస్తాయి.

పరమాత్మ ఈ లౌకిక పదార్థాలను వ్యవహరించడానికి కావలసిన శబ్దాలను వేదాలనుండే వెలికితీసి, వాటి వాటికి పేర్లుగా ఏర్పరచాడు.

*సర్వేషాంతు సనామాని కర్మాణి చ పృథక్ పృథక్।*
*వేద శబ్దేభ్య ఏవాదౌ పృథక్ సంస్థాశ్చ నిర్మమే॥*

అని మనువచనం.

ఇలాగే ఇన్ద్ర-బ్రహ్మాది శబ్దాలకు కూడా పైకి కనిపించే ఆయా దేవతలు మాత్రమే అర్థం కాదు- వారి లోపల ఉన్న పరమాత్మ కూడా అర్థమే. ఈ తత్త్వాన్ని లౌకిక జనులు ఎరుగనట్లే, బ్రహ్మాది దేవతలు కూడా, ఆ పేర్లు తమవేనని, ఆ పేర్లతో ఇచ్చే ఆహుతులూ తమవేనని భ్రమిస్తారు. అహంకరిస్తారు. కాని ఆ శబ్దాలకు పరమాత్మే అర్థం. ఆ పేర్లతో ఇచ్చే హవిస్సులు పరమాత్మకే చెందుతాయని గ్రహింపజాలరని పై కథ తెలియజేస్తున్నది. ఈ వేదాన్త రహస్యాన్ని దేశికులు "బ్రహ్మేతి శంకర ఇతీన్ద్ర ఇతి స్వరాడిత్యాత్మేతి" అనే శ్లోకంలో ఆవిష్కరించారు. ఇదే భావం "సామాన్య బుద్ధి జనకాశ్చ" అనే 15వ శ్లోకంలో కూడా స్పష్టపరచారు. ఇక్కడ మరొక విషయం. ఇన్ద్రాది దేవతల్లో ఉన్నది పరమాత్మయేనని గ్రహింపలేనట్లే, భగవానుడు ఆయా రూపాల్లో ఈ భూమిపై ఆవిర్భవించినప్పుడు ఆయన ధరించిన ఆ బాహ్యాకారాలే ఆయన అని అనుకుంటారే తప్ప, ఆ ఆకృతులకు మూలమైన పరమాత్మ తత్త్వం ఒకటి ఉన్నదని కూడా గ్రహింపజాలరంటారు దేశికులు "మాయావశేన మకరాదిశరీరిణం త్వాం తానేవ పశ్యతి కరీశ యదేషలోకః" అని. దేశికుల ఈ శ్లోకాలకు, కూరేశులను గ్రహించిన వరదరాజస్తవంలోని శ్లోకాలకు రచనలో కొంత తారతమ్యమున్నా తాత్పర్యసామ్యం చాలా ఉంది. "సంచింతయన్త్యఖిల హేయవిపక్షభూతం" "విశ్వాతిశాయి సుఖరూప" ఇత్యాదిశ్లోకభావానికి, కూరత్తాళ్వానుల 'నిరాబాధం' (12)

'ప్రశాన్తానన్తాత్మా' (13) ఇత్యాది శ్లోకాల సంవాదం గమనించాలి. 'నిత్యం కరీశ' అనే శ్లోకంలో దేశికులు సిద్ధోపాయనిష్ఠను దర్శింపజేసి తమ ఆర్తిని ఇంచుమించుగా 29వ శ్లోకం నుండి 41వ శ్లోకం వరకు ఆవిష్కరించారు. శ్రీ కూరత్తాళ్వానులు తమ వరదరాజస్తవంలో 72వ శ్లోకంలో ఇదే ఆర్తిని స్తోత్రం చివరి వరకు ఆవిష్కరించారు. ఇరువురూ భగవదనన్యశరణాగతి చేసి దాస్యాన్ని ప్రార్థించారు. "త్వంచేత్ప్రసీదసి" అనే శ్లోకంలో దేశికులు, స్వామీ నీ దాస్యం ఉంటే, నీ ప్రసాదం ఉంటే, నీ పట్ల నిర్వ్యాజభక్తి ఉంటే నాకీ సంసారమే అపవర్గం అన్నారు. ఇక కూరత్తాళ్వానులు స్వామీ "నీ దాస్య మహారసజ్ఞత" నాకు కలిగితే బ్రహ్మాది పదాలేవీ అక్కరలేదన్నారు. 'భోగా ఇమే, విధిశివాది పదం (81) అనే శ్లోకంలో. ఇలా తరచి చూస్తే ఎన్నో పోలికలు- ఎన్నో తత్త్వరహస్య సంవాదాలు గోచరిస్తాయి. ఇక మన స్వామి రాఘవాచార్యులవారు దేశికుల స్తోత్రాన్ని కూలంకషంగా పరిశీలించి ఆళ్వారుల శ్రీ సూక్తులతోను, శ్రీ భాష్యాది గ్రన్థ సమన్వయంతోను ప్రామాణికంగా వ్యాఖ్యను వెలయించి పరమధన్యులైనారు. ప్రతి శ్లోకంలోని ప్రతి పదాన్ని చక్కగా నిర్వచిస్తూ, ప్రమాణవచనోట్టంకన పురస్సరంగా విశదపరచడం ఈ స్తోత్రావగాహనకు సౌలభ్యాన్ని కలిగిస్తున్నది. ఆర్తిప్రధానాలైన శ్లోకాల్లోని ఆర్తిని ఆవిష్కరించడంతోపాటు, దార్శనికత, సాం(ప్రదాయికత ముద్దగట్టిన శ్లోకాల్లోని మర్మాన్ని ఆవిష్కరించడంలోను సమస్కంధతను దర్శింపజేసారు మన స్వామి.

"త్వద్భక్తి పోతమవలంబితుమక్షమాణామ్" ఇత్యాది శ్లోకంలో ప్రపత్తి వైభవాన్ని ఆవిష్కరించిన తీరు బాగున్నది. భక్తి-ప్రపత్తుల పరిధులను విస్పష్టపరచారు. ప్రాప్య-ప్రాపక నిష్కర్ష చేయడంలో 'పరాధికరణం' ఎలా ప్రమాణమో రమ్యంగా విశదపరచారు. 'అంతఃప్రవిశ్య' 'అజ్ఞాతనిర్గమ' 'పర్యాకులం' ఇత్యాది శ్లోకాల్లోని 'దయా' గుణవైభవాన్ని, 'భూయోపిహస్త' అనే శ్లోకంలో భగవత్సంకల్పానికి గల రక్షణక్షమతను, 'నిర్యన్త్రణం' అనే శ్లోకంలోను "యావన్నపశ్యతి" అనే శ్లోకంలోను, త్వరాతిశయాన్ని, 'సత్యం సఏవ' అనే శ్లోకంలో స్వామికి గల రక్షణపరికరపౌష్కల్యాన్ని, 'నిర్వాపయిష్యతికదా' అనే శ్లోకంలో దేశికులు పడిన ఆర్తిని, మన స్వామి లెస్సగా ఆవిష్కరించారు. 'ముక్తః స్వయమ్' అనే శ్లోకంలో సాంపరాయాద్యధికరణ సిద్ధమైన సర్వపాపనిబర్హణ పూర్వక-గతి- వైభవాన్ని ఆయా బ్రహ్మసూత్ర వివరణముఖంగా విస్పష్టపరచారు. 'అనిభృతపరిరంభైః' అనే దేశిక శ్లోకానికి, "పద్మాయాః ప్రణయ రసాత్సభాజజన్మాః

(41) ఇత్యాది, కూరత్తాళ్వానుల శ్లోకం ఆలంబనం అన్న రహస్యాన్ని ఆవిష్కరించారు స్వామి.

ఇలా దేశికుల స్తోత్రాన్ని శాస్త్రీయంగా, సంప్రదాయ-దార్శనిక సిద్ధాన్త సరణులను మారకుండా వివరించిన తీరు, సర్వథా మన స్వామిని "వ్యాఖ్యాతృ సార్వభౌము"ని చేస్తున్నదని వినమ్రభావన. ఈ దేశికవరివస్యకు ప్రోత్సాహకులైన స్వామివారిని సర్వథా ప్రణతిపురస్సరంగా సంభావిస్తూ సెలవు దీసుకొను-

దాసుడు

**రంగరామానుజాచార్యులు**

మహా మహోపాధ్యాయ,
కవిశాబ్దిక కేసరి, శాస్త్ర రత్నాకర,
ఉ.వే. శ్రీమాన్
**డా॥ శ్రీ.న.చ. రఘునాథాచార్యులు**

# అమృతాస్వాదము

శ్రీ వేదాన్త దేశికులవారి నవనవోన్మేష ప్రతిభావల్లరిలో ఆవిర్భవించిన ఒక మనోహర పరిమళ మిళితమైన పుష్పగుచ్ఛమే 'వరదరాజ పంచాశత్' అనే స్తోత్రం. అందలి కేసరములవంటి ప్రతి శ్లోకంలోను గుబాళించే భావసౌరభాన్ని ఆస్వాదించగల భాగ్యం సహృదయ హృదయ మధుకరాలకే దక్కగలదు. అయితే, ఆ సౌరభాన్ని విస్తృత్వరం చేసే మందమారుతం వీచాలి గదా! అందుకు శ్రీమాన్ విద్వద్వరేణ్యులైన కె.వి.రాఘవాచార్యస్వామి వారి ఈ సర్వంకష వ్యాఖ్య మందమారుత కృత్యాన్ని నెరవేరుస్తున్నది.

అటు శ్రీ భాష్యాది ప్రబంధాలలోని సంస్కృత ప్రమాణాలను, వాటితోపాటు ఆళ్వారుల దివ్యసూక్తులను అనర్గళంగా కురిపిస్తూ వ్రాయబడిన ఈ వరదరాజ పంచాశత్ వ్యాఖ్యానం సర్వంకషం, సర్వతో భద్రం కూడా. ఈ స్తోత్రంలో శ్రీ దేశికులు భగవదభిముఖులై తమ ఆర్తిని ఎంతగా ప్రకటించుకొన్నారో, దానిని యథాతథంగా ఈ వ్యాఖ్య ప్రస్ఫుటంగా ఆవిష్కరిస్తున్నది.

శ్రీ దేశికులవారి అద్భుత కవిత రసబంధురమైనది. విషయం- శ్రీ కంచి వరదరాజ పరబ్రహ్మము యొక్క కల్యాణ గుణవైభవం. "యావదర్థ పదాం వాచం" అన్నట్లు నిగూఢ భావసౌరభాన్ని అందించగల మధురమైన వ్యాఖ్య శ్రీ రాఘవాచార్యులది. ఇక ఈ త్రితయ సమాగమం అమందానంద సంధాయక మనుటలో సందేహ మేమున్నది?

ఇందుకు యోగ్య దృష్టాంతంగా ఇపుడు నా స్మృతిలో స్ఫురించిన కాళిదాసుని రఘువంశంలో 15వ సర్గలో గల చిన్న శ్లోకాన్ని (64) అందిస్తున్నాను. పాఠకోత్తములు గుర్తించ ప్రార్థన.

శ్లోకం: *వృత్తం రామస్య, వాల్మీకేః కృతిః, తౌకిన్నర స్వరౌ।*
*కింతత్, యేన మనోహర్తుం, అలంస్యాతాం న శృణ్వతామ్॥*

ఆది కావ్యమున వర్ణితమైనది జగదభిరాముడైన శ్రీరాముని వృత్తాంతము. రచయిత- మధుమయ ఫణితి మార్గదర్శియైన వాల్మీకి. ఇక గాయకులు- కిన్నర కంఠులైన కుశలవులు. ఇక శ్రోతల హృదయాలను ఆకర్షింపని అంశమేమున్నది? బ్రహ్మానంద సంధాయకమే గదా! ఈ త్రితయ సమాగమము.

ప్రకృతస్తుతి గ్రంథాస్వాదనకు సముచిత తరమైన దృష్టాంతము ఈ కాళిదాస శ్లోకమే. ఇక శ్రీ రాఘవాచార్యులవారి మధుర వ్యాఖ్యతో అమృతము నాస్వాదించండి.

స్వస్తి సౌహార్దాయ.

ది: 23-2-2012
16-4-523
శివనగర్, వరంగల్-2

ఇట్లు, విద్వద్విధేయుడు
మహా మహోపాధ్యాయ
**శ్రీ.న.చ. రఘునాథాచార్యుడు**

ఉభయవేదాన్త వాచస్పతి,
ద్రావిడవేదాంత విశిష్ట పండిత,
పండితరత్న, శ్రీమాన్
**కె. వెంకటాచార్యులు**

స్వస్తిశ్రీర్దిశతాత్

# శ్రీ వరదరాజ పంచాశత్ - ఆనందానుభవం

*శ్రీమాన్ వేంకటనాథార్యః కవితార్కిక కేసరీ।*
*వేదాన్తాచార్యవర్యోమే సన్నిధత్తాం సదాహృది॥*

కవితార్కిక సింహులు, సర్వతంత్ర స్వతంత్రులు, శతాధిక గ్రంథకర్తలు అయిన శ్రీమద్వేదాన్త దేశిక సార్వభౌములు వైదిక సిద్ధాంత చూడామణి. భగవద్రామానుజ సారస్వతం అకుతో భయంగా నుండుటకు శ్రీ దేశికుల కృషియే ప్రధానమనుట పండిత లోక ప్రసిద్ధం.

పరవాది మత్తేభ కంఠీరవులైన వేదాన్తదేశిక చరణులు

*"సాహిత్యే సుకుమార వస్తుని తథా న్యాయగ్రహం గ్రంథిలే,*
*తర్కేవా మయి సంవిధాతరి సమంలీలాయతే భారతీ!"*

(భట్టహర్షుడు) అనే రీతిగా అటు చతుశ్శాస్త్ర చర్చలలో ఇటు కావ్య నాటక స్తోత్ర వాఙ్మయ రచనలో సాటిలేని మేటి. ధిషణా ధిక్కృత గీష్పతులు "ఆకారో హ్రస్వః - బుద్ధిశ్చ మహతీ" అని తమను పరిహసించిన ప్రతిపక్షి నోటికి "అరే కథ మా కారస్య హ్రస్వత్వమ్" అని తాళం వేసిన సద్యః ప్రతిభా సంపన్నులు.

విశిష్టాద్వైత సిద్ధాన్త సంరక్షణంలో భగవద్రామానుజులు శ్రీ పరాశర భట్ట పాదుల పిమ్మట దేశికస్వామియే అగ్రగణ్యులు.

శతదూషణీ, తత్త్వముక్తాకలాపం, న్యాయసిద్ధాంజనం మొదలగు శాస్త్ర గ్రంథములు, హంస సందేశం, యాదవాభ్యుదయం, సంకల్ప సూర్యోదయాది

కావ్యనాటకాలు, హయగ్రీవస్తోత్రం మొదలు పాదుకాసహస్రం వరకు ఉండే స్తోత్రాలు వీరి ప్రౌఢలలిత రచనా చమత్కృతి విభూషితాలు.

ప్రస్తుతం శ్రీ దేశిక పాదుల స్తోత్ర వాఙ్మయ విశిష్టతను అనుభవిద్దాము. భగవానుడు స్తుతిప్రియుడు- "స్తవ్యః, స్తవప్రియః" (శ్రీ విష్ణు స. నా. స్తోత్రం) అనే నామాలకు శ్రీ పరాశర భట్టర్ ఇట్లు భాష్యాన్ని అనుగ్రహించారు. "స్తవ్యః-స్తవ మర్హతి- అనధ్యారోప్య మహామంగల నిత్య నిరవధిక నిరవద్య గుణో నామ సహస్ర వ్యపదేశ్యః పతిరేవస్తుతి మర్హతి".

"లేని గొప్పధర్మాన్ని ఆరోపించి పల్కుటగాక మహా మంగళకరాలు-నిత్యాలు-హద్దులేనివి-దోషస్పర్శ అంటనివి అగు వేలకొది కల్యాణ గుణాలుగల స్వామియే స్తోత్రానికి అర్హుడైనవాడు- వీనికి విరుద్ధగుణాలు కలిగిన, కర్మవశ్యులైన దేవతలు స్తుతింపబడుటకు తగిన వారు కారు" అని భావం.

'స్తవప్రియః' అంటే "ఏదో విధంగా ఏ భాషలోగాని ప్రేమతో, లేక అనాదర తిరస్కార పద్ధతులతో తుదకు ద్వేషంతోగాని తన గుణాలను పల్కితే స్వామి సంతోషిస్తాడు" అని భట్టర్ భాష్యభావం.

ద్వేషంతో భగవన్నామాలను పల్కిన శిశుపాలుణ్ణి, ప్రేమతో పల్కిన గోపికలను స్వామి అనుగ్రహించాడు కదా!

'స్తుతః'- దీనికి భాష్యంలో భావమిది- సహస్రఫణుడైన ఆదిశేషుడు, వేదాత్మయైన గరుత్మంతుడు, సృష్టికర్తయైన బ్రహ్మ, ఇతర దేవతలు- నిత్య సంసారులు తమ తమ వాంఛలను నెరవేర్చుకొనుటకు స్వామినే స్తోత్రం చేస్తారట. భగవదనుగ్రహం లేనిదే ఎంతటివారికైనా తమతమ కోరికలు సిద్ధింపవు.

పరమపదంలో శ్రియఃపతిని నిత్యులు, ముక్తులు "విపన్యవః-స్తుతిశీలాః" అన్నట్లు ఎల్లప్పుడు స్తుతించుచునే ఉందురు. విభవావతారాలలో భక్తులు "గుణవాన్, కశ్చవీర్యవాన్" అని కల్యాణ గుణానుభవాన్ని చేయుదురు. ఇక అర్చావతారంలో "పెరుమ్బులక్కడలై" (శ్రీకలియన్) అను రీతిలో 'ఇంతటిదని ఊహింపశక్యంగాని సముద్రం వంటివాడు' అని భగవానుని కల్యాణ గుణాలను అనుభవిస్తారు.

పరత్వదశలో వేదం "ఆనందో బ్రహ్మ" ఇత్యాదిగా స్వామి గుణాలను కీర్తించింది. విభవంలో శ్రీరామాయణ, భాగవతాదులు, అర్చలో దివ్య ప్రబంధాలు స్వామి కల్యాణ గుణాలను విస్తారంగా అనుభవించాయి. కాని, పూర్ణంగా తెలుపుటకు దేనికిని సాధ్యం కాలేదు. "యస్యామతం తస్యమతమ్" అని వేదమే పల్కింది కదా! స్వామి అనంత కల్యాణ గుణగణ విభూషితుడు. స్వరూప రూపగుణ విభూతులచే అపరిచ్ఛిన్నుడు. ఇట్టి సర్వేశ్వరుని వైభవాన్ని పూర్ణంగా తెలియుట– తెలిసి పల్కుట– ఎవ్వరికినీ సాధ్యం కాదు.

విశేష పద్ధతిలో స్తోత్ర ప్రక్రియకు శ్రీకారం చుట్టినవారు పరమాచార్యులైన శ్రీయామున మునులు (ఆళవందార్లు). కాంతాచతుఃశ్లోకి, స్తోత్రరత్నం వీరి అనర్ఘ స్తుతులు. వీరిని భగవద్రామానుజులు గద్యత్రయం ద్వారా అనుసరించారు. పిమ్మట శ్రీ కూరేశులు, శ్రీ పరాశరభట్టర్, వరుసగా పంచస్తవి, శ్రీ గుణ రత్నకోశ, శ్రీరంగ రాజస్తవముల ద్వారా భగవద్వైభవాన్ని అనుభవించారు.

ఇక దేశికుల వారిది పూర్వాచార్యుల అనుభవాలను కలబోసిన అనుభవం. శ్రీ నిగమాంత మహాగురువులు అర్చావతారంలో ప్రధాన మూర్తులైన శ్రీరంగనాథ, శ్రీ వేంకటేశ, శ్రీహస్తిగిరీశులను స్తుతించారు. దశావతార స్తోత్రం, భగవద్ధ్యాన సోపానం (దీనికి మూలం 'అమలనాది పిరాన్' అనే దివ్య ప్రబంధం), పాదుకా సహస్రం అనే స్తోత్ర రచనల ద్వారా దేశికులు శ్రీరంగని వైభవాన్ని అనుభవించారు. శ్రీ వేంకటేశ్వరుని కరుణా మహిమను స్తోత్ర వాఙ్మయంలోనే అత్యద్భుతమైన 'దయాశతకం' ద్వారా వివరించారు. కంచి వరదుని వైభవాన్ని 'వరదరాజ పంచాశత్' ద్వారా ఉగ్గడించారు.

కంచి వరదరాజ స్వామికి శ్రీరంగనాథునికి వలె కొన్ని విశేషాలు కలవు. కంచి శ్రీ వరదరాజస్వామికి గల ప్రత్యేకతలు:–

1. బ్రహ్మ చేసిన అశ్వమేధయాగంలో ఆవిర్భవించుట.
2. తిరుక్కచ్చినంబిగారితో నేరుగా మాటలాడుట.
3. శ్రీ నంబిగారి ద్వారా భగవద్రామానుజులకు సంప్రదాయ విషయంలో గల ఆఱు–సందేహాలను తొలగించుట– (వీటికే ఆఱు వార్తలని ప్రసిద్ధి).

4. ఆళవందార్ ద్వారా "ఆముదల్వన్" (మన సంప్రదాయ ప్రవర్తకు డీ యువకుడు) అని భగవద్రామానుజులకు మంగళా శాసనం చేయుట.

5. వాత్స్య వరదగురువులు శ్రీ భాష్యకాలక్షేపాన్ని "శ్రుతప్రకాశిక" పేరుతో శ్రీ సుదర్శన భట్టర్ ద్వారా అవతరింపజేయుట. శ్రుతప్రకాశికా వ్యాఖ్య సంస్కృత వేదాన్తంలోనూ, నంబిళ్ళైగారి తిరువాయిమొషి 'ఈడు' వ్యాఖ్య ద్రావిడ వేదాన్తంలోనూ తలమానికములు. వానిసాటికి రాగల వ్యాఖ్యలు "న భూతో న భవిష్యతి".

6. తమ కాలక్షేప గోష్ఠిలో, బాలుడుగా అన్వయించినపుడే శ్రీ దేశికుల మేధా ధారణా సంపత్తికి, వాత్స్యవరద గురువులు ఆశ్చర్యపడి-

*"ప్రతిష్ఠాపిత వేదాంతః ప్రతిక్షిప్త బహిర్మతః।*
*భూయా స్త్రైలోక్య మాన్యస్త్వం భూరికల్యాణ భాజనమ్॥"*

అని మంగళాశాసనం చేయుట.

వీని కన్నిటికిని పెరుందేవి త్తాయార్ పురుషకారం, పేరరళాళన్ కృపయే కదా! కారణం.

హస్తిగిరీశుని వైభవాన్ని శ్రీ కూరత్తాళ్వాన్ వరదరాజస్తవంలో అనుభవించారు. ఇట్లే శతాధిక గ్రంథకర్తయైన శ్రీ దేశికుల వాఙ్మయాన్ని జూచి ఆశ్చర్య చకితుడైన శ్రీ అప్పయ దీక్షితులు కూడా 'వరదరాజ శత'కాన్ని రచించి, వరదుని అనుగ్రహానికి పాత్రులయ్యారు.

శ్రీ దేశికుల వారిచే 5 మొదలు 1000 వరకు సంఖ్యాపరంగా స్తోత్రాలు కూర్చబడినవి. ఉదాహరణకు-

వైరాగ్య పంచకం, సుదర్శనాష్టకం, దశావతార స్తోత్రం, గోపాల వింశతి, గోదాస్తుతి, న్యాసత్రయి, దేవనాయక పంచాశత్, యతిరాజ సప్తతి, దయాశతకం, ప్రాకృత భాషలో, అచ్యుత శతకం, శ్రీరంగనాథ పాదుకా సహస్రం మొదలగునవి.

'వరదరాజ పంచాశత్' లోని కొన్ని ముఖ్య విశేషాలు:- ఈ స్తోత్రంలో మొదటి ఆఱు శ్లోకాలలో స్వనైచ్యానుసంధానం, తరువాతి శ్లోకాలలో కాంచీ క్షేత్రమందు

శ్రీమన్నారాయణుడు, వరదుడుగా అవతరించుట చేత, స్వయం వ్యక్తమైన అర్చామూర్తిగా కూర్చబడింది. ఆపైన, సత్-బ్రహ్మ-ఆత్మ-శబ్దాలు, శంభు-శివాది శబ్దాలు సామాన్య విశేష న్యాయంతో వరదుని వైభవాన్నే-శ్రీమన్నారాయణునే-తెల్పుతాయని దేశికులు పేర్కొన్నారు. ఇతర దేవతా పారమ్యాన్ని తొలగించారు. అనంతరం వటపత్రశాయి- నృసింహ, వామన, శ్రీరామ వైభవాన్ని అనుభవించారు. వరదుని సేవించిన భాగ్యవంతులకు బ్రహ్మ, ఇంద్రాది పదవులపైన ఆశ ఉండదని తెల్పినారు. తరువాత, సంసార సముద్రంలో పడి కొట్టు మిట్టాడే దాసునికి నీ దయయే సంతారకమని విన్నవించారు. అర్చామూర్తివైన నీ సన్నిధిలో ఉండి, భాగవతుల సహవాసం కలిగి, నీకు సకల విధ కైంకర్యములను చేసుకొనే భాగ్యం కలిగితే పరమ పదవాసం కూడా ఇష్టపడను. "వైకుంఠవాసేఽపి నమేఽభిలాషః" అని నుడివినారు. చివరగా "స్వామిన్! నీ సకలవిధ వాహన సేవలను నేత్రపర్వంగా సేవించాలి. ఇదియే నా చిరకాల వాంఛ" అని పల్కి స్తోత్రాన్ని ముగించినారు.

ఈ స్తుతిలోని పలు శ్లోకాలు పూర్వాచార్యుల శ్లోకాలను, దివ్య ప్రబంధ పాశురాలను అనుసరించి యుండుట గమనింపవచ్చును. మచ్చుకు- "మధ్యే విరించి శివయోః విహితావతారః" (11శ్లో).

బ్రహ్మశివులకు నడుమ విష్ణువుగా నీవు అవతరించావు. ఇది స్వామి యొక్క ప్రథమావతారం. ఈ భావానికి శ్రీ కూరేశుల "బ్రహ్మేశ మధ్యగణనా" అనే 'అతిమానుషస్తవ' శ్లోకమూ, వీరి పుత్రులైన శ్రీ పరాశర భట్టపాదుల "మధ్యేవిరించిగిరిశం ప్రథమావతారః" అనే శ్రీరంగరాజస్తవ శ్లోకమూ మూలములనుట స్పష్టం కదా!

"ఔదన్వతే మహతి సద్మనిభాసమానే" (21) గొప్పదియగు క్షీరకసాగరం సుఖస్థానమై యుండగా- అనే భావానికి "తనిక్కడలే-పనిక్కడలిల్" అనే పెరియాళ్వార్ పాశురాలు మూలము. ఇట్లే "సిద్ధాంజనేన భవతైవ విభూషితాక్షాః- అనపాయ మహానిధిం త్వాం ద్రక్ష్యంతి" (28) అనే శ్లోకానికి "తద్యథా హిరణ్య నిధిం" అనే శ్రుతియు "అన్తర్హితోనిధిరసిత్వమశేష పుంసామ్" అనే ఆళ్వాన్ శ్రీసూక్తి నిదానం.

ఈ విధాంగానే "నిరంతరం నిర్విశతః- త్వదీయమాభిరూప్యం" (49) అనే శ్లోక భావానికి "ఇచ్చువై తవిరయాన్‌పోయ్ అచ్చువై పెఱినుం వేండేన్" అనే తొండర

డిప్పొడి ఆళ్వార్ 'తిరుమాలై' శ్రీ సూక్తి, "భావో నాన్యత్ర గచ్ఛతి" అనే శ్రీమద్రామాయణ శ్లోకము మూలమనుట ప్రస్పష్టం. ఇట్లు ఈ స్తుతిలోని ప్రతి శ్లోకం పూర్వాచార్యుల, ఆళ్వారుల అనుభవ సంవలితంగానే యుండును. అప్పుడే కదా! ప్రపన్నులకు భోగ్యత సిద్ధించును. "పేశిత్తే పేశలల్లాల్ పెరుమై యొన్ఱు ఉణర లాగాదు" అని కదా! తొండరడిప్పొడిగళ్ శ్రీ సూక్తి. ఇక ఈ స్తోత్రంలోని భావగాంభీర్యానికి, రచనా చమత్కృతికి చెరియొక ఉదాహరణం:-

"మోహాన్ధకార వినివర్తన జాగరూకే... శ్లాఘ్యేత సంతమసపర్వ సహస్ర భానోః"- (18) అనే శ్లోకానికి భావమిది-

సూర్యుడు బాహ్యమైన అంధకారాన్ని పోగొట్టగలడు కాని, వ్యక్తులలోని అజ్ఞాన తిమిరాన్ని తొలగించలేడు. సూర్యకాంతి పగలే యుంటుంది. రాత్రి యుండదు. సూర్య చంద్రుల కాంతికి రాహుకేతు గ్రహణం ఉండును. కాని వరదుని వైభవానికి ఏ కొలతలు లేవు. వరదుని తేజస్సు చూపరుల దృష్టిని ఆకర్షించును. కావున వారికి అజ్ఞాన ప్రశంసయే లేదు. స్వామి ప్రకాశానికి సూర్యునికివలె దివారాత్ర విభాగం లేదు. రాహుకేతు గ్రహణ ప్రసక్తి బొత్తుగా లేదు. కావున భగవానుని తేజస్సుతో పోటీ పడిన సూర్యతేజస్సు ఓడిపోయినది.

"దివి సూర్య సహస్రస్య" అనే భగవద్గీతా శ్లోకం ప్రకారం శ్రీకృష్ణుని తేజస్సు ఒక్కసారి వేయి సూర్యులు ఉదయిస్తే వారి కాంతితో సదృశ యగును (అభూతోపమ).

వాదసభలో ఉద్దండ పండితునితో పోటీపడిన, సగం తెలిసిన పండితునకు భంగపాటుగాని నోరుమెదపని మందమతికి పరాజయం లేదు గదా! ఈ విధంగానే, వరదుని తేజస్సుతో పోటీపడిన సూర్యతేజస్సునకు ఓటమిగాని, అసలే పోటీకి దిగని అమావాస్య రాత్రికి అపజయ ప్రసక్తి ఏమి యుండును?

"శ్లాఘ్యేత సంతమసపర్వ (దోషా) సహస్ర భానోః" సర్వాతిశయ తేజస్సు భగవానునిదీ అని భావం.

ఇక రచనా చమత్కృతి:-

"కింవాకరీశ! కృపణే మయిరక్షణీయే... సంకల్ప ఏవ భవతో నిపుణః సహాయః" (37)

హే వరదరాజస్వామిన్! నిన్ను శరణుజొచ్చి నీ అనుగ్రహాన్నే నమ్ముకొన్న నాలో కర్మ, జ్ఞాన, భక్తి యోగములను ఏల వెదకెదవు? అవి బాహ్యసహకారులే కదా! "నిదానం తత్రాపి స్వయ మఖిల నిర్మాణ నిపుణః" (దేశిక శ్రీ సూక్తి).

"అదువుం అవనదిన్నరుళే" (నమ్మాళ్వార్ల శ్రీ సూక్తి) అనే ప్రకారం చేతనుడు భగవానుని ఆశ్రయించుట ఆయన సంకల్ప బలమే కదా!

"సృష్ట్యవతారాది ముఖత్తాలే పణ్ణిన కృషి ఫలమ్" (శ్రీ పిళ్ళైలోకాచార్యుల శ్రీ సూక్తి).

సంసారమునుండి చేతనుని విముక్తుని చేయుటకు గదా! శ్రియః పతి, కరుణ కళేబరాదులను అనుగ్రహిచుచున్నాడు. కావున, నన్ను అనుగ్రహింపుమని దేశికులు ప్రార్థించుచున్నారు.

ఇట్లు చక్కని చిక్కని రచనా వైభవంగల దేశికుల స్తోత్రాలను వివరించినచో పాఠకులకు అమితానందం కలుగును.

ఈ కృత్యం చేయుటకు వివిధ శాస్త్రపాండిత్యం, ఉభయవేదాన్తముల యందు చక్కని వైదుష్యం, కావ్యనిర్మాణ మార్మికత కావలెను. వీనికి తోడు సంస్కృతాంధ్ర తమిళ భాషలలో సిద్ధహస్తులై యుండవలెను. ఈ అధికారాలన్నీ పుష్కలంగా కలిగినవారు విద్వద్వరేణ్యులు ఉ.వే.శ్రీమాన్ కె.వి.రాఘవాచార్యస్వామివారు.

వీరు దేశికుల పాదుకాసహస్రం, దయాశతకం మున్నగు పెక్కు స్తోత్రాలకు, వాని లోతు పాతులు–స్వారస్య సౌందర్యాదులు– తమ వ్యాఖ్యలద్వారా లోకానికి అందించారు.

సంప్రదాయ స్తోత్ర వాఙ్మయానికి వీరి వ్యాఖ్యలు మల్లినాథసూరి వ్యాఖ్యలను తలపించుచుండును.

"యే శబ్దార్థ పరీక్షణ ప్రణయినః" (మాఘకావ్యం) అని, వ్యాఖ్యాతృ సార్వభౌముడైన మల్లినాథసూరి అవతారికలో 'ఈ కావ్యంలోని శబ్దార్థ పుష్టి, గుణాలంకారాదులు, ధ్వన్యర్థాలు ఇమిడిన రీతి– రస భావపరిపుష్టి తెలియుటకు నా సర్వంకష వ్యాఖ్యను అధికరించండి అని తెల్పినాడు. తన 'సర్వంకష వ్యాఖ్యను కావ్యమందలి

మెఱుపులను మెఱయించేది అని పేర్కొన్నాడు. శ్రీ రాఘవాచార్య స్వామి వారు తమ వ్యాఖ్యను సర్వంకష వ్యాఖ్యగా పేర్కొనుట సమంజసంగా ఉన్నది. ఆస్తికలోకం స్వామివారి కృషికి అధమర్ణము (స్వీకరించునది) కాగలదని భావించుచున్నాను.

శ్రీమాన్ రాఘవాచార్య స్వామివారి ఆదేశానుసారం, దేశికప్రబంధాలు- వానికి అవతరించిన స్వామివారి వ్యాఖ్యలను గూర్చి వ్రాసే యోగ్యత దాసునికి లేకున్నను "భాగవతాజ్ఞ అనుల్లంఘనీయం" అనే సూక్తి ననుసరించి ఈ నాలుగు మాటలను వ్రాసే సాహసం చేయుట జరిగింది.

"రామానుజార్య దివ్యాజ్ఞా వర్ధతామభివర్ధతామ్"

ఇట్లు
భాగవత వశంవదుడు
**కె. వెంకటాచార్యులు**

ది: 22-02-2012
స్థానాచార్యులు,
శ్రీ ఆదికేశ & ఎం.బెరుమానార్
స్వామి కోయిల్, 4-1-22/1, కోవెల వీధి
నర్సాపూర్- 534 275.ప.గో. జిల్లా
ఫోన్: 08814-275811

పండితరత్న, ఉ.వే.ప్ర.శ్రీమాన్
**డా॥ ఈ.ఏ.శింగరాచార్యులు**
తిరుపతి

శ్రీమతే రామానుజాయనమః

# ఏతదేవామృతం దృష్ట్వాతృప్యన్తి

*వాజిమేధే వపాహోమే ధాతురుత్తర వేదితః।*
*ఉదితాయ హుతాదగ్నే రుదారాంగాయ మంగళమ్।* (దేవరాజ మంగళమ్)

*శ్రీరంగ మంగళమణిం కరుణా నివాసం,*
*శ్రీ వేంకటాద్రి శిఖరాలయ కాలమేఘమ్।*
*శ్రీ హస్తిశైల శిఖరోజ్జ్వల పారిజాతం*
*శ్రీశం నమామి శిరసా యదుశైల దీపమ్॥*

అంటూ, ప్రపన్నులు నిత్యం అనుసంధించుకొనే శ్లోక రత్నంలో ప్రస్తావింపబడిన నాలుగు ప్రధానాలైన శ్రీ వైష్ణవ దివ్యక్షేత్రాలలో 'హస్తి గిరిక్షేత్రం' అనబడే పెరుమాళ్ కోయిల్ ఒకటి. ఇది లోక వ్యవహారంలో 'చిన్న కంచి'గా ప్రసిద్ధి చెందింది. శ్రీ వైష్ణవ సంప్రదాయంలో 'త్యాగమండపం'గా కీర్తింపబడుతున్నది.

"అయోధ్యా మధురా మాయా కాంచీ... సప్తైతే మోక్షదాయకాః" అని మోక్షాన్ని ప్రసాదించే ఏడు గొప్ప క్షేత్రాలలో కాంచీపురం ఒకటి.

*"క ఇతి బ్రహ్మణోనామ, తేన తత్రాంచితో హరిః।*
*తస్మాత్ కాంచీతి విఖ్యాతా పురీ పుణ్యవివర్ధినీ॥"*

అనే పౌరాణిక సూక్తి బ్రహ్మచే భగవానుడు ఆరాధింపబడిన పుణ్యభూమి కనుక దీనికీ పేరు వచ్చినదని తెలుస్తున్నది. హస్తిగిరిక్షేత్రంలో వేంచేసి ఉండే అర్చామూర్తి స్వయం వ్యక్తం. వరదరాజస్వామి అని, దేవరాజస్వామి అని, పేరరుళాళన్ అని, అర్థితార్థ పరిదాన దీక్షితుడు అని- పలు నామాలతో పిలువబడుతూ కొలువ బడుతున్నాడు.

ఈ స్వామి యొక్క అనుగ్రహ వైభవాన్ని శ్రీమద్యామున మునులు "యస్య ప్రసాదకలయా బధిరః శ్రుణోతి, పంగుః ప్రధావతి జనేన చ వక్తి మూకః। అంధః ప్రపశ్యతి సుతం లభతే చవంధ్యా, తం దేవ దేవ మనఘం శరణం గతోఽస్మి॥" అని స్తుతించిన ముక్తక శ్లోకం ప్రసిద్ధం. కూరేశులు 'వరదరాజస్తవం' అనే ఒక కమనీయ స్తుతి శతాధిక శ్లోకాలను రచించి, ఆ వరదరాజస్వామి యొక్క దివ్యానుగ్రహంతో తాము పూర్వం కోల్పోయిన దృష్టిని తిరిగి పొందినారని వారి చరిత్ర స్పష్టం చేస్తున్నది. శ్రీమద్వరవర మునులు 'దేవరాజ మంగళం' అనే మంగళాశాసన స్తుతిని ఈ అర్చామూర్తి విషయంలో రచించి సమర్పించారు. శ్రీ వేదాంత దేశికులు 'వరదరాజ పంచాశత్' అనే 50 శ్లోకాలు కలిగిన- ప్రస్తుత వ్యాఖ్యానంతో ముద్రింపబడుతున్న- ఒక అందమైన స్తుతిని వరదరాజస్వామిని కీర్తిస్తూ విరచించారు. 'సుప్రసిద్ధ అద్వైత విద్వాంసులు- అప్పయ దీక్షితులు- రచించిన 'వరదరాజస్తవం' కూడా సుప్రసిద్ధం. ఇంకా సంస్కృత భాషలో, తెలుగులో, పలు భాషలలోనూ వరదరాజస్వామిని స్తుతించే కృతులు ఎన్నో ఉన్నా, వాటిలో 'వరదరాజ పంచాశత్' విశిష్టమైనది.

కృతయుగంలో ఒకానొక సమయాన చతుర్ముఖ బ్రహ్మ భగవానుడైన శ్రీమన్నారాయణుని సాక్షాత్తుగా దర్శించాలని ఆశపడి చిరకాలం తపస్సు చేశాడు. అయినా, అతని కోరిక తీరలేదు. భూమండలంలోని సత్యవ్రత క్షేత్రంలో చేసిన ఏ వ్రతమైనా తప్పక సఫలం అవుతుంది కనుక, అక్కడకు పోయి అశ్వమేధ యాగాన్ని చేసి అభీష్ట సిద్ధిని పొందవలసినదిగా పల్కిన అశరీరవాణి ప్రకారం బ్రహ్మ సత్యవ్రత క్షేత్ర మనబడే కాంచీ పురానికి వచ్చి అక్కడ వసిష్ఠాది మునుల సహాయంతో అశ్వమేధ యాగం చేశాడు. యాగాంతంలో వపాహోమాన్ని చేసినప్పుడు హోమవేదిక ఉత్తర భాగం నుండి పుణ్యకోటి విమానం, అందులో దివ్యతేజోమయుడైన వరదరాజస్వామి ఉదయించారు. ఆ వరదరాజస్వామియే ఈనాటికీ హస్తిగిరి క్షేత్రమందు సాక్షాత్కరిస్తూ అందరికి కనువిందు చేస్తున్నారు. అందఱి కోరికలను నెరవేర్చుతున్నాడు.

బ్రహ్మాండ పురాణంలో వరదరాజస్వామి ఆవిర్భవించిన వృత్తాంతం వర్ణింపబడింది. విశేషమేమి? అంటే, వరదరాజస్వామి అర్చావిగ్రహం హోమవేదిక నుండి ఆవిర్భవించిన విషయాన్ని వ్యక్తం చేసే గుర్తులను ఆ అర్చామూర్తి తిరుముఖ మండలమందు స్పష్టంగా సేవించవచ్చు.

శ్రీ దేశికులు అనుగ్రహించిన స్తోత్ర వాఙ్మయం విశాలమైనది, విశిష్టమైనది. ఎన్నో ప్రక్రియలలో ఆ ఆచార్యవర్యుల రచన సాగింది. గద్య, దండక, శ్లోక రూపాది ఛందో వైవిధ్యంతో సంస్కృత, ప్రాకృతాది భాషా వైవిధ్యంతో, దశక-వింశతి-పంచాశత్-సప్తతి-శతకాది సంఖ్యా వైవిధ్యంతో, విషయ వైలక్షణ్యంతో, శబ్దార్థాలంకారాధ్వన్యర్థాది ఆలంకారిక వైవిధ్యంతో విలసిల్లే వీరి స్తోత్రవాఙ్మయమంతా వేదాంత తత్త్వాలను మధురంగా ఆవిష్కరిస్తున్నది. "వరదరాజ పంచాశత్"లో దేశికులు ప్రదర్శించిన చమత్కారాలు ఎన్నో, అవి అన్నీ అత్యంత హృదయంగమాలు. ఒకటి-రెండు అంశాలను మాత్రం విన్నవిస్తాను.

*"తత్త త్వదై రుప హితేఽపి తురంగ మేధే*
*శక్రాదయో వరద! పూర్వం మలబ్ధ భాగాః"* (వ.పం. 8వ శ్లోకం)

అని, ఆయా దేవతలతో కూడుకొన్నదే అయినా, అశ్వమేధయాగంలో ఇంద్రాది దేవతలు వారి వారి హవిర్భాగాలను పొందలేక పోయారనే పౌరాణిక వృత్తాంతాన్ని ప్రస్తావించారు. వరదరాజస్వామిని సాక్షాత్కరింపచేసుకోవడం కోసం బ్రహ్మ అశ్వమేధ యాగం చేసినప్పుడు అగ్నిలో ఆహుతి చేయబడిన హవిస్సులన్నీ భగవానుని ధ్యానిస్తూ, ఆ భగవానునికే సమర్పింపబడ్డాయి. అందువల్ల ఇంద్రాది దేవతలు ఆ యాగానికి వచ్చినా, "సోమాయస్వాహా, వరుణాయ స్వాహా, ఇంద్రాయ స్వాహా" అని ఆయా దేవతలను ఉద్దేశించి హవిస్సులు హోమం చేయబడినా- ఒక్క హవిస్సు కూడా ఏ దేవతకు చేరలేదు. వాటినన్నిటినీ భగవానుడు శ్రీమన్నారాయణుడే స్వీకరించాడు.

దేవతలు అప్పుడు చాలా బాధపడి బ్రహ్మతో "బ్రహ్మదేవా! నీవు ఈ విధంగా మమ్ములను అవమానం చేయవచ్చునా? అని మొర పెట్టారు. అప్పుడు బ్రహ్మ వారితో "దేవతలారా! ఆయుస్సు! ఆరోగ్యం, పశు పుత్రాది నశ్వర ఫలాలను ఆశించి యాగాలను చేసేవారు మిమ్ములను పూజిస్తారు. వారు అర్పించే హవిస్సులు మాత్రమే మీకు అందుతాయి.

"ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్, భూతిమిచ్ఛేద్ధుతాశనాత్‌ శంకరాత్ జ్ఞాన మన్విచ్ఛేత్" అని కదా సూక్తి. కాని "మోక్షమిచ్ఛేత్ జనార్దనాత్" కనుక, ముముక్షువులైన పరమై కాంతులు అర్పించే హవిస్సులను సాక్షాత్తు పరమ పురుషుడే వచ్చి స్వీకరిస్తాడు.

ఇప్పుడు నేను మోక్షం కోరువాడనై, పుండరీకాక్షుని సాక్షాత్కరింప జేసుకోవాలని ఆశించి, యాగాన్ని చేస్తున్న సంగతి మీకు తెలుసును కదా! ఈ యాగమందు సమర్పింపబడే హవిస్సులను శ్రీమన్నారాయణుడే సాక్షాత్తుగా అంగీకరించినందువల్ల మీరు వాటిని పొందే అవకాశమే లేదు" అన్నాడు. బ్రహ్మ చెప్పిన సమాధానంతో దేవతలు సమాహితు లయ్యారు– అనే పౌరాణికోదంతాన్ని దేశికులు ఈ శ్లోకంలో అద్భుతంగా ప్రస్తావిస్తూ, శ్రీమన్నారాయణుడు ఒక్కడే మోక్షాన్ని ఇవ్వగలిగినవాడని తెలిపారు.

ఆ విధంగానే "బ్రహ్మేతి శకంర ఇతీంద్ర ఇతి స్వరాడితి ఆత్మేతి సర్వమితి సర్వచరా చరాత్మన్! హస్తీశ! సర్వవచ సామవసాన సీమాం త్వాం సర్వకారణ ముశంత్యనపాయవాచః" (12వ శ్లోకం) అనే శ్లోకంలో "కారణంతు ధ్యేయః"– అంటూ, ఉపాస్యుడైన జగత్కారణుడెవడు? అని విచారించే శ్రుతులు ఆ జగత్కారణం హస్తిగిరి క్షేత్రమందు సాక్షాత్కరించే వరదరాజస్వామియే నని నిర్ధారించాయని అన్నారు. ఇక్కడ "సర్వచరాచరాత్మన్! హస్తీశ! అనే సంబోధనలను సాభిప్రాయాలుగా గ్రహించి "ఎన్నరంగనైక్కణ్ణ కణ్‌గళ్ మత్తొన్నినై క్కాణావే" అనే తిరుప్పాణాళ్వార్ల శ్రీసూక్తిని విశ్లేషించి, శ్రీరంగనాథుని పరంగా అన్వయించి, అర్థాన్ని, చెప్పేరీతిలోనే– వేదాలు అన్నీ కంచిలో వేంచేసి ఉండే వరదరాజస్వామినే జగత్కారణభూతునిగా నిర్ణయించి పలికాయి అనే విశేషార్థంలో తాత్పర్యం పర్యవసితమవుతున్నదని చెప్పడంలో అనౌచిత్యం ఏమీ ఉండదు. "యోజనా యోజనాంతరం న బాధతే" కదా!

ఈ వరదరాజ పంచాశత్‌లో దేశికులు మరి ఏ స్తుతిలోనూ ప్రస్తావించని కొన్ని విశేషాలను కూడా ప్రస్తుతించారు. కంచిలో జరిగే వరదరాజస్వామి యొక్క వివిధ వాహనోత్సవ సేవల వైభవాన్ని "తురగ విహగరాజ స్యందనాందోళికాది ష్వధిక మధిక మన్యా మాత్మ శోభాందధానమ్" –(48) అనే శ్లోకంలో కీర్తించారు. ఈ విధంగా ఈ స్తుతిలో సాక్షాత్కరించే విశేషాలు ఎన్నో ఉన్నాయి.

దేశిక స్తోత్ర వాఙ్మయ విశేషార్థాలను తమ రమణీయాలైన వ్యాఖ్యానాలలో అందరికి ఉదారంగా పంచిపెడుతున్న, మహానుభావులు వాచస్పతి, ఉ.వే.శ్రీమాన్ కె.వి.రాఘవాచార్యస్వామివారు. వీరు వెలయించిన పాదుకా సహస్ర వ్యాఖ్య సంప్రదాయార్థ కల్పతరువు. అభీతిస్తవం, శ్రీస్తుతి, దయాశతకం, భగవద్ధ్యాన సోపానం,

గోదాస్తుతి, యతిరాజ సప్తతి, న్యాసదశకం, న్యాస వింశతి, శ్రీయామనుల చతుః శ్లోకి, శ్రీ సుదర్శనాష్టకం, ద్రవిడోపనిషత్తాత్పర్య రత్నావళి– ఇంకా ఎన్నో దేశిక గ్రంథాలు వీరి విపులమైన వ్యాఖ్యలతో ప్రచురింపబడి సహృదయ పాఠకుల హృదయాలను అలరిస్తున్నాయి. ఇప్పుడు ప్రచురింపబడుతున్న "సర్వంకషా" అనే పేరుగల వరదరాజ పంచాశత్ వ్యాఖ్యానం వీరి పూర్వ వ్యాఖ్యల వలెనే సమగ్రమైనది, సర్వాంగ సుందరమైనది.

"నా మూలం లిఖ్యతే కించిత్ నానపేక్షిత ముచ్యతే" అనే మల్లినాథసూరి మార్గాన్ని వీరి వ్యాఖ్యలలో మనం దర్శించవచ్చు.

12వ శ్లోకంలో భగవానుని సర్వశబ్ద వాచ్యత్వాన్ని, 8వ శ్లోకంలో సర్వయజ్ఞ భోక్తృత్వాన్ని నిరూపిస్తూ లెస్సగా అర్థనిర్వహణను చేశారు. 14వ శ్లోకంలో వేదద్రుమాలకు ధారక, పోషక, సర్వాధార భూతుడు వరదుడే ననే విషయాన్ని సువిశదం చేసిన తీరు విద్వజ్జన హృద్యం. అదే విధంగా 16వ శ్లోకంలో భగవానుని శాంతోదిత నిత్యోదిత దశల వివరణం అత్యంతం సుందరం. ఈ రీతిలో లెక్కిస్తూ పోతే, పదే పదే ఎన్నో విశేష జ్ఞాతవ్యాంశాలు పాఠకులకు సర్వంకషా వ్యాఖ్యలో కనిపిస్తాయి. తెలుసుకో దగిన అర్థాలను అన్నిటినీ సమగ్రంగా నిరూపించే ఈ వ్యాఖ్యానానికి 'సర్వంకష' అనే పేరు అన్వర్థం కదా! ఇది ఉభయ వేదాంతార్థ కూలంకష అనడంలో సందేహం లేదు.

దాసుని మనస్సులో మెదిలే ఒక భావాన్ని మాత్రం విన్నవించి, విన్నపాన్ని ముగిస్తాను. భగవద్రామానుజులు బ్రహ్మ సూత్రాలకు శ్రీ భాష్యాన్ని అనుగ్రహించినా, శ్రీ విష్ణు సహస్ర నామ స్తోత్రానికి భాష్యాన్ని అనుగ్రహించలేదు. అందుకు కారణం– శ్రీ పరాశరభట్టర్ ద్వారా ఆ భాష్యం అవతరించాలనే దృష్టితోనే శ్రీ రామానుజులు విష్ణు సహస్ర నామస్తోత్రానికి వ్యాఖ్యానాన్ని రచించలేదని పెద్దల సూక్తి. అదే విధంగా, ఎన్నో పూర్వాచార్యుల స్తోత్రాలకు ఎందరో మహనీయులు తెలుగులో వ్యాఖ్యానాలను వ్రాసినా, దేశిక స్తోత్రాలకు మాత్రం విశద వ్యాఖ్యానాలు రచింపబడక పోవడం– ఆ స్తోత్రాలకు శ్రీమాన్ రాఘవాచార్యస్వామి వారి రసఘనాలైన వ్యాఖ్యానాలు అవతరించాలనే భగవానుని సంకల్పం వల్లనే అని తోస్తుంది. భగవానుని అనుగ్రహంతో, దేశికుల కరుణతో దేశిక స్తుతులకు అన్నిటికీ వీరి సమగ్రవ్యాఖ్యలు

ప్రచురింపబడాలి.

నా విషయంలో శ్రీమాన్ స్వామి వారు చూపించే పుత్ర నిర్విశేషమైన, అవ్యాజమైన అనుగ్రహాన్ని చూచి, పెద్దల ఆజ్ఞను కాదనే సాహసం లేక, వారి ఆజ్ఞకు కట్టుబడి ఈ రెండు మాటలను విన్నపించాను. ఈ గొప్ప అవకాశాన్ని అనుగ్రహించిన శ్రీమాన్ రాఘవాచార్యస్వామివారి సన్నిధిలో కార్తజ్ఞ్య పురస్సరంగా, వినయపూర్వకంగా సాష్టాంగ దండ ప్రణామాలను సమర్పిస్తున్నాను. షడ్రసోపేతమైన ఈ సర్వంకష వ్యాఖ్యను దర్శించిన గుణ గ్రహణ పారీణులైన సహృదయ పాఠకులు అందరు "ఏత దేవామృతం దృష్ట్వా తృప్యంతి" అనే శ్రుతి వాక్యార్థాన్ని తప్పక భావిస్తారని నమ్ముతున్నాను.

*రాఘవార్య హృదుత్తుంగ శైలోద్భూత సుధానదీ!*
*వ్యాఖ్యా సర్వంకషా నూనః రసజ్ఞానాం ముదావహా॥*

తిరుపతి

27-2-2012

ఇట్లు విన్నపించు

భాగవత విధేయుడు

**ఈ.ఏ. శింగరాచార్యులు**

కవికేసరి, శ్రీమాన్
**న.చ.వేదాన్తాచార్యులు**
సిద్ధిపేట.

శ్రీహయగ్రీవాయనమః

# "వరదరాజ పంచాశత్ ప్రశస్తి"

శ్రీమద్వరదరాజ శ్రీపాద సరసిజ
ద్వంద్వ సేవా పరీవాహమనగ
పర పూర్వకోత్తరోత్తర వికస్వర భక్తి
జ్ఞాన భక్తుల పరిణాహ మనగ
శాస్త్రీయ విషయ సత్సంగతి నలరు స
మన్వయ నిర్వాహ మహిత మనగ
పారస్పరిక దీప్తి బ్రకటించు శబ్దార్థ
హేవాక సుభగ సాహిత్య మనగ

వరదరాజ పంచాశత్తు శరదు దార
రమ్య బాలాతప ప్రభారంజనముగ
సుకవి తార్కిక కేసరి స్తోత్ర సమితి
నలరు సూరి జనాస్వాద లలిత మగుచు

తనదు నకించనత్వమును తాదృగనన్యగతిత్వమున్- దయా
ఘను నిరపేక్ష కత్వము నకారణకారుణికత్వమున్- మనం
బున గొని విశ్వసించి- గుణపూర్ణుని శ్రీశు సమాశ్రయించు చే
తనుడు శుభాశ్రయమ్ముగ పదమ్ముల బట్టియు స్వాత్మభార మ
ర్పణ మొనరించు సాంగము ప్రపత్తి నిరూపితమైన వైనమున్

జీవుని దీనస్థితియు ర
మావిభు శేషిత్వ మహిత మాంగల్య గుణ
స్తో మాతిశయము వాత్స
ల్యామల సౌశీల్య మధుర హార్దార్జవముల్

శరణ వరణ వేళ స్వామి సన్నిధి యందు
విన్నవించుకొనెడి విన్నపముల
సరణి నెత్తిచూపు స్వాదిష్ట వాగ్రీతి
అస్మదాదులకు సమాశ్రయణము.

తన సూనుండొక పంకపూర్ణమగు నూతన్ బడ్డ గావంగ దూ
కిన తండ్రిన్ బలె మాధవుండు- భవసంకృష్టంబు దేహంబు నొ
దిన జీవున్ దయ నుద్ధరింప హృదయాధిష్ఠాతయై- భూత సూ
క్ష్మ నివేశంబగు మేన జేర్చియు సుషుమ్నా నాడి వెల్గించి పొ
దిన మార్గమ్మున బ్రహ్మరంధ్రమును భేదింపంగ నర్చిర్గతిన్
జను ముక్తాత్మ వికుంఠనాథ పదవీ సాయుజ్యమున్ పొందుటన్

పరమాకాశమునన్ కనద్రుమముగా భాసించి వ్యూహస్థితిన్
బరిపూర్ణంబు ద్వికప్రయుక్త గుణమున్ పర్వంబులున్నాల్గు భా
స్వర జాగ్రద్దశ స్వప్న నిద్రలును మూర్ఛా సంజ్ఞలన్ బొల్చుచున్
బొరి మూర్తంబు లమూర్తముల్ గల వియూపోత్కృష్ట శాఖంబుగా
బరమాత్మస్థితి యోగిదృష్టమగు విభ్రాజత్సమాధి స్థితిన్

కవి తార్కిక కేసరి హృ
ద్భవ భక్తి ప్రచుర మధుర వాఙ్మయ పూర
మ్మవునన- “సర్వంకష” రా
ఘవ సూరి ప్రథిత వివృతి కదు సేవ్యంబున్

జయతు నిగమాన్త సూరి
ర్జయతు తదీయాద్భుతోజ్జ్వలా సూక్తిః।
జయతా దమృతస్యంది
న్యేషా బుధ రాఘవార్య వివృతిశ్చ॥

卐

# కృతజ్ఞతలు

*స్వరూప రూప విభవ గుణ కర్మాణి శార్ఙ్గిణః।*
*వ్యాచక్షీత నిబధ్నీయాత్ శ్రుణుయాత్ విలిఖేత్ పఠేత్॥*

అన్నట్లు, విశిష్టాద్వైత సంప్రదాయస్తోత్రాలలో శ్రీమన్నారాయణుని స్వరూప రూపగుణ విభవైశ్వర్యాదులు వర్ణితాలై, మోక్షప్రాప్తికోసం ప్రధానంగా ప్రపత్తి-శరణాగతి-యే ప్రతిపాదింపబడి యుంటుంది.

సర్వతంత్ర స్వతంత్రులు, కవితార్కిక కేసరీత్యాది బిరుదాంచితులు, శతాధిక గ్రంథకర్తలైన శ్రీ వేదాంతదేశికులవారు అనుగ్రహించిన 'వరదరాజ పంచాశత్' స్తోత్రం (కంచి వరదరాజావతార ప్రశస్తి, చిదచిదీశ్వర తత్త్వ ప్రభావం) భుక్తి భక్తి ముక్తి ప్రదం.

ఈ స్తోత్రానికి 'సర్వంకష' అను పేరుతో, ఆంధ్రభాషలో రచించిన వ్యాఖ్యానాన్ని వయోజ్ఞాన వృద్ధులైన మహానుభావులు పరిశీలించి, అవ్యాజ కృపతో మంగళాశాసనాలను వర్షించి దాసుణ్ని ధన్యునిగా చేశారు.

శ్రీమదహోబిలపీఠం, 45వ పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీవణ్ శఠకోప శ్రీమన్నారాయణ యతీంద్ర మహాదేశికస్వామి మరియు 46వ పట్టం శ్రీరంగనాథ యతీంద్ర మహాదేశికస్వామి వారల పాదకమల సన్నిధిలో శిరసాష్టాంగ ప్రణామముల నర్పిస్తున్నాను.

పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామి వారి చరణ సరోజ సన్నిధిలో దండవత్సర స్సహస్ర ప్రణామములను సమర్పిస్తున్నాను.

◇ శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి డా॥ సముద్రాల వేంకట రంగ రామానుజాచార్య స్వామి వారి పాద పద్మద్వయికి-

◇ మహా మహోపాధ్యాయ, కవి శాబ్దిక కేసరి, శాస్త్రరత్నాకర, ఉ.వే. శ్రీమాన్ డా॥ శ్రీ.న.చ. రఘునాథాచార్యస్వామి వారి పదాంబుజ యుగళికి-

◇ ఉభయ వేదాన్త వాచస్పతి, ద్రావిడ వేదాన్త విశిష్ట పండిత, పండితరత్న, నరసాపురం శ్రీ ఆదికేశవ & ఎంబెరుమానార్ కోయిల్ స్థానాచార్య, శ్రీమాన్ కె.వెంకటాచార్యస్వామి వారి అంఘ్రి సరోరుహద్వయికి-

◇ పండితరత్న, వ్యాఖ్యాతృ చక్రవర్తి, ఉ.వే.ప్ర.శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యస్వామివారి చరణ రాజీవయుగళికి-

◇ కవికేసరి, ఉ.వే.ప్ర.శ్రీమాన్ న.చ.వేదాన్తాచార్యస్వామి వారి పాద నీరేజ ద్వయికి-

కార్తజ్ఞ్య పురస్సరంగా సప్రశ్రయ ప్రణామముల నర్పిస్తున్నాను. నా అనువాద ప్రయత్నాన్ని సహృదయులైన పాఠకులు దయతో ఆదరిస్తారని దృఢంగా విశ్వసిస్తున్నాను.

ఈ గ్రంథమును ముద్రించుటకు తమ పవిత్రమైన ధనమును వినియోగించిన శ్రీమాన్ సర్దెన ఆనందరావుగారికి, వారి కుటుంబ సభ్యులకు శ్రియఃపతి ఇహ పరసౌఖ్యములను కృపజేయుగాక అని మంగళాశాసనములు.

అక్షరాలంకరణ ప్రభృతి ఇలాగా ప్రబంధ రూపకల్పన పర్యంతం శ్రద్ధతో తీర్చిదిద్దిన పుస్తక శిల్పి, ప్రముఖ కవి శ్రీ తాళ్ళపల్లి మురళీధరగౌడుగారికి అసంఖ్యాక ధన్యవాదములు.

ఓర్పు-నేర్పులతో డి.టి.పి. చేసిన శ్రీ కె.బి.టి. కొండయ్యగారికి-

అందమైన ముఖచిత్రమును రూపొందించిన శ్రీ అక్రమ్‌గారికి-

సకాలమున గ్రంథమును ముద్రించి యిచ్చిన 'కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్' అధినేత శ్రీ జగన్మోహనరెడ్డిగారికి హార్దిక కృతజ్ఞతలు.

ఇట్లు

బుధజన విధేయుడు

కె. వి. రాఘవాచార్యులు

**(కె.వి. రాఘవాచార్యులు)**

# గ్రంథ ముద్రణ దాత



సర్దైన ఆనందరావు సుభద్రాదేవి దంపతులు

సుమన్, పవన్ కుమారులు - అర్చన, ప్రణీత కోడండ్రు.

రోహన్, అఖిల్, ఆమన్‌కృష్ణ మనుమలు

శ్రీ పతిన్ పూజించు జీవన సరణిలో
ధన మదాదులులేని ధన్యులెవరు?
భాగవతాచార్య బంధుమిత్రులనెల్ల
ప్రేమ మీరగ సత్కరింతురెవరు?
సుమనః పవనులను సుతుల నిద్దఱితోడ
మనుమలతో గుల్కు మాన్యులెవరు?
మురియుచు సద్గ్రంథ ముద్రణకై శుద్ధ
ద్రవ్యము నిచ్చు వదాన్యులెవరు?

న్యాయ పథమున నడుచు ఆనందరావు
ధర్మచారిణి యౌ సుభద్రాఖ్య పుణ్య
దంపతులు దివ్యకైంకర్య ధనులు వారు
దేవరాట్కృపా వృష్టినొందెదరుగాత.

శ్రీ దేవాధిరాజాయనమః
శ్రీ వేదాంత దేశికులు అనుగ్రహించిన

# శ్రీ వరదరాజ పంచాశత్

## సర్వంకషా వ్యాఖ్య

1. ద్విరద శిఖరి సీమ్నా సద్మవాన్ పద్మయోనేః
తురగ సవన వేద్యాం శ్యామలో హవ్య వాహః।
కలశ జలధి కన్యా వల్లరీ కల్ప శాఖీ
కలయతు కుశలం నః కోఽపి కారుణ్య రాశిః॥

2. యస్యానుభావ మధిగంతు మశక్నువంతః
ముహ్యంత్య భంగుర ధియో మునిసార్వభౌమాః।
తస్యైవ తే స్తుతిషు సాహసమశ్నువానః
క్షంతవ్య ఏష భవతా కరిశైలనాథ॥

3. జానన్ననాది విహితా నపరాధవర్గాన్
స్వామిన్! భయాత్ కిమపి వక్తుమహం నశక్తః।
అవ్యాజ వత్సల! తథాఽపి నిరంకుశం మాం
వాత్సల్యమేవ భవతో ముఖరీకరోతి॥

4. కిం వ్యాహరామి వరదస్తుతయే కథం వా
ఖ ద్యోతవత్ ప్రలఘు సంకుచిత ప్రకాశః।
తన్మే సమర్పయ మతించ సరస్వతీంచ
త్వా మంజసా స్తుతి పదై ర్యదహంధినోమి॥

5. మచ్ఛక్తి మాత్రగణనే కిమిహాస్తి శక్యం
శక్యేన వా తవ కరీశ! కి మస్తి సాధ్యమ్!
యద్యస్తి సాధయ మయా తదపిత్వయావా
కిం వా భవేత్ భవతి కించి దనీహ మానే॥

6. స్తోత్రం మయా విరచితం త్వదధీన వాచా
త్వత్ ప్రీతయే వరద యత్ తదిదం న చిత్రమ్।
ఆవర్జయంతి హృదయం ఖలు శిక్షకాణాం
మంజూని పంజర శకుంత విజల్పితాని॥

7. యం చక్షుషా మవిషయం హయమేధ యజ్వా
ద్రా ఘీ యసా సుచరితేన దదర్శ వేధాః।
తం త్వాం కరీశ! కరుణా పరిణామత స్తే
భూతాని హన్త నిఖిలాని నిశామయంతి॥

8. తత్తత్పదైరుపహితేఽపి తురంగ మేధే
శక్రాదయో వరద! పూర్వమలబ్ధ భాగాః।
అధ్యక్షితే మఖపతౌ త్వయిచక్షుషైవ
హైరణ్య గర్భహవిషాం రస మన్వ భూవన్॥

9. సర్గస్థితి ప్రళయ విభ్రమ నాటికాయాం
శైలూషవ ద్వివిధ వేష పరిగ్రహంత్వామ్
సంభావ యంతి హృదయేన కరీశ! ధన్యాః
సంసార వారినిధి సంతరణైక పోతమ్॥

10. ప్రాప్తో దయేషు వరద! త్వదను ప్రవేశాత్
పద్మాసనాదిషు శివాదిషు కంచుకేషు
తన్మాత్రదర్శన విలోభిత శేముషీకాః
తాదాత్మ్య మూఢ మతయో నిపతంత్య ధీరాః॥

11. మధ్యే విరించ శివయోర్వి హితావతారః
ఖ్యాతోఽసి తత్సమతయా తదిదం న చిత్రమ్।
మాయావశేన మకరాది శరీరిణం త్వాం
తానేవ పశ్యతి కరీశ! యదేష లోకః॥

12. బ్రహ్మేతి శంకర ఇతీంద్ర ఇతి స్వరాడి
త్యాత్మేతి సర్వమితి సర్వ చరాచరాత్మన్।
హస్తీశ! సర్వవచసా మవసాన సీమాం
త్వాం సర్వకారణ ముశంత్య నపాయవాచః॥

13. ఆశాధిపేషు గిరిశేషు చతుర్ముఖేష్వ
ప్యవ్యాహతా విధినిషేధ మయీ తవాజ్ఞా।
హస్తీశ! నిత్యమనుపాలన లంఘనాభ్యాం
పుంసాం శుభాశుభమయాని ఫలాని సూతే॥"

14. త్రాతాఽఽపది స్థితి పదం భరణం ప్రరోహః
ఛాయా కరీశ! సరసాని ఫలాని చ త్వమ్।
శాఖాగత త్రిదశ బృంద శకుంతకానాం
కిం నామ నాసి మహతాం నిగమద్రుమాణామ్॥

15. సామాన్య బుద్ధి జనకాశ్చ సదాది శబ్దాః
తత్త్వాంతర భ్రమ కృతశ్చ శివాది వాచః
నారాయణేత్త్వయి కరీశ! వహంత్యనన్యం
అన్వర్థ వృత్తి పరికల్పితమైక కంఠ్యమ్॥

16. సంచితయంత్యఖిల హేయవిపక్ష భూతం
శాంతోదితం శమవతా హృదయేన ధన్యాః।
నిత్యం పరం వరద! సర్వగతం సుసూక్ష్మం
నిష్పంద నందథుమయం భవతః స్వరూపమ్॥

17. విశ్వాతిశాయి సుఖరూప! యదాత్మకస్త్వం
వ్యక్తిం కరీశ! కథ యంతి తదాత్మికాంతే।
యేనాధిరో హతి మతి స్త్వదుపాసకానాం
సాకిం త్వమేవ తపవేతి వితర్కడోలామ్॥

18. మోహాన్ధకార వినివర్తన జాగరూకే
దోషా దివాఽపి నిరవగ్రహ మేధమానే।
త్వత్తేజసి ద్విరదశైలపతే విమృష్టే
శ్లాఘ్యేత సంతమస పర్వ సహస్ర భానోః॥

19. రూఢస్య చిన్మయతయా హృదయే కరీశ!
స్తంబానుకారి పరిణామ విశేష భాజః।
స్థానేషు జాగ్రతి చతుర్ ష్వపి సత్త్వ వన్తః
శాఖా విభాగ చతురే తవ చాతురాత్మ్యే॥

20. నాగాచలేశ నిఖిలోపనిషన్మనీషా
మంజూషికా మరకతం పరిచిన్వతాం త్వామ్।
తన్వీ హృదిస్ఫురతి కాఽపి శిఖామునీనాం
సౌదామనీవ నిభృతా నవమేఘ గర్భా॥

21. ఔదన్వతే మహతి సద్మని భాసమానే
శ్లాఘ్యే చ దివ్య సదనే తమసః పర స్మిన్।
అంతః కళేబరమిదం సుషిరం సుసూక్ష్మం
జాతం కరీశ! కథమాదరణా స్పదంతే॥

22 బాలాకృతేర్వట పలాశమితస్యయస్య
బ్రహ్మాండ మండల మభూ దుదరైక దేశే।
తస్యైవ త ద్వరద! హన్త! కథం ప్రభూతం
వారాహ మాస్థితవతో వపుర ద్భుతం తే॥

23. భక్త స్య దానవశిశోః పరిపాలనాయ
భద్రాం నృసింహ కుహనా మధిజగ్ముషస్తే।
స్తం భైక వర్జ మధునాఽపి కరీశ! నూనం
త్రైలోక్య మేతదఖిలం నరసింహ గర్భమ్॥

24. క్రామన్ జగత్ కపట వామనతా ముపేతః
త్రేధా కరీశ! స భగవాన్ నిదధే పదాని।
అద్యాపి జన్తవ ఇమే విమలేన యస్య
పాదోదకేన విధృతేన శివా భవంతి॥

25. యేనా చల ప్రకృతినా రిపు సంక్షయార్థీ
వారాం నిధిం వరద! పూర్వ మలంఘయస్త్వమ్।
తం వీక్ష్య సేతు మధునాఽపి శరీర వంతః
సర్వే షడూర్మి బహుళం జలధింతరంతి॥

26. ఇత్థం కరీశ! దురపహ్నవదివ్య భవ్య
రూపాన్వితస్య విబుధాది విభూతి సామ్యాత్।
కేచి ద్విచిత్ర చరితాన్ భవతోఽ వ తారాన్
సత్యాన్ దయాపరవశస్య విదంతి సంతః॥

27. సౌశీల్య భావితధియా భవతా కథంచిత్
సంఛాదితాఽపి గుణాన్ వరద! త్వదీయాన్।
ప్రత్యక్ష యంత్య వికలం తవ సంనికృష్టాః
పత్యుస్త్విషామివ పయోదవృతాన్ మయూఖాన్॥

28. నిత్యం కరీశ! తిమిరావిల దృష్టయోఽ పి
సిద్ధాం జనేన భవతైవ విభూషితాక్షాః
పశ్యం త్యు పర్యుపరి సంచరతా మదృశ్యం
మాయా నిగూఢ మనపాయ మహానిధిం త్వామ్॥

29. సద్య స్సృజంతి వరద! త్వయిబద్ధ భావాః
పైతామహాదిషు పదేష్వపి భావ బంధమ్।
కస్మై స్వదేత సుఖ సంచరణోత్సుకాయ
కారాగృహే కనక శృంఖలయాఽపి బంధః॥

30. హస్తీశ! దుఃఖ విషదిగ్ధ ఫలాను బంధి
న్యా బ్రహ్మ కీట మపరాహత సంప్రయోగే।
దుష్కర్మ సంచయవశాత్ దురతిక్రమే నః
ప్రత్యస్త్ర మంజలి రసౌ తవ నిగ్రహాస్త్రే॥

31. త్వద్భక్తి పోత మవలంబితు మక్షమాణాం
పారం పరం వరద! గంతు మనీశ్వరాణామ్।
స్వైరం లిలంఘయిషతాం భవ వారి రాశిం
త్వా మేవ గంతు మసి సేతు రభంగురస్త్వమ్॥

32. అశ్రాంత సంసరణ ఘర్మ నిపీడితస్య
భ్రాంతస్యమే వరద! భోగమరీచికాసు।
జీవాతురస్తు నిరవగ్రహమేధ మానో
దేవ! త్వదీయ కరుణామృత దృష్టి పాతః॥

33. అంతః ప్రవిశ్య భగవన్నఖిలస్య జంతో
రాసేదుష స్తవ కరీశ! భృశం దవీయాన్।
సత్యం భవేయ మధునాఽపి స ఏ వ భూయః
స్వాభావికీ తవదయా యది నాన్తరాయః॥

34. అజ్ఞాత నిర్గమ మనాగమ వేదినం మాం
అంధం నకించి దవలంబన మశ్నువానమ్।
ఏతావతీం గమయితుః పదవీందయాళోః
శేషాధ్వలేశ నయనే క ఇవాతి భారః॥

35. భూయోఽపి హన్త వసతిర్యది మే భవిత్రీ
యామ్యాసు దుర్విషహవృత్తిషు యాతనాసు।
సమ్యక్ భవిష్యతి తతః శరణాగతానాం
సంరక్షితేతి బిరుదం వరద! త్వదీయమ్॥

36. పర్యాకులం మహతి దుఃఖపయోనిధౌ మాం
పశ్యన్ కరీశ! యది జోష మవస్థిత స్త్వమ్।
స్ఫారేక్షణేఽపి మిషతి త్వయి నిర్నిమేషం
పారే కరిష్యతి దయా తవ దుర్నివారా॥

37. కింవా కరీశ! కృపణే మయి రక్షణీయే
ధర్మాది బాహ్య సహకారి గవేషణేన।
నన్వస్తి విశ్వపరిపాలన జాగరూకః
సంకల్ప ఏవ భవతో నిపుణః సహాయః॥

38. నిర్యంత్రణం పరిణమంతి న యావదేతే
నీరంధ్ర దుష్కృత భవా దురిత ప్రరోహాః।
తావన్నచేత్ త్వముప గచ్ఛసి శార్‌ఙ్గధన్వా
శక్యం త్వయాఽపి నహివారయితుం కరీశ!॥

39. యావన్న పశ్యతి నికామ మమర్షణో మాం
భ్రూభంగ భీషణ కరాళముఖః కృతాంతః।
తావత్ పతంతుమయితే భగవన్! దయాళోః
ఉన్నిద్ర పద్మ కలికా మధురాః కటాక్షాః॥

40. సత్త్వం స ఏవ రభసో భవదౌపవాహ్యః
చక్రం తదేవ శితధార మహంచ పాల్యః।
సాధారణేత్వయి కరీశ! సమస్త జంతోః
మాతంగ మానుషభిదా నవిశేష హేతుః॥

41. నిర్వాపయిష్యతి కదా కరిశైల ధామన్!
దుర్వార కర్మపరిపాక మహాదవాగ్నిమ్।
ప్రాచీన దుఃఖమపి మే సుఖయన్నివ త్వ
త్పాదార విన్ద పరిచార రసప్రవాహః॥

42. ముక్తః స్వయం సుకృత దుష్కృత శృంఖలాభ్యాం
అర్చిర్ము ఖైరధి కృతై రతి వాహితాధ్వా।
స్వచ్ఛంద కింకరతయా భవతః కరీశ
స్వాభావికం ప్రతిలభేయ మహాధికారమ్॥

43. త్వం చేత్ ప్రసీదసి తవాస్మి సమీపతశ్చేత్
త్వయ్యస్తి భక్తి రనఘా కరిశైలనాథ।
సంసృజ్యతే యది చ దాస జనస్య దీయః
సంసార ఏష భగవన్న పవర్గ ఏవ॥

44. ఆహూయమాన మనపాయ విభూతి కామైః
ఆలోక లుప్త జగదాంధ్యమనుస్మరేయమ్।
ఆలోహితాంశుక మనాకుల హేతి జాలం
హైరణ్య గర్భ హయమేధ హవిర్భుజం త్వామ్॥

45. భూ యోభూయః పులకనిచితై రంగకైరేధ మానాః
స్థూల స్థూలాన్ నయన ముకుళై ర్బిభ్రతో బాష్ప బిందూన్।
ధన్యాః కేచి ద్వరద భవతః సంసదం భూషయంతః
స్వాంతై రంతర్వినయనిభృతైః స్వాదయంతే పదం తే॥

46. వరద తవ విలోకయంతి ధన్యాః
మరకత భూధర మాతృకాయ మాణమ్।
వ్యపగత పరికర్మ వారవాణం
మృగమదపంక విశేష నీలమంగమ్॥

47. అనిభృత పరిరంభై రాహితా మిందిరాయాః
కనక వలయ ముద్రాం కంఠదేశే దధా నః।
ఫణి పతిశయ నీ యాదుత్థిత స్త్వం ప్రభాతే
వరద సతత మంతర్మానసం సన్నిధేయాః॥

48. తురగ విహగరాజ స్యందనాందోళికాది
ష్వధిక మధిక మన్యామాత్మ శోభాం దధానమ్।
అనవధిక విభూతిం హస్తిశైలేశ్వరం త్వా
మనుదిన మని మేషై ర్లోచనై ర్నిర్వి శేయమ్॥

49. నిరంతరం నిర్విశత స్త్వదీయం
అస్పృష్ట చింతాపద మాభిరూప్యమ్।
సత్యం శపే వారణ శైలనాథ
వైకుంఠ వాసేఽ పి నమేఽ భిలాషః॥

50. వ్యాతన్వానా తరుణ తులసీదామభిః స్వామభిఖ్యాం
మాతంగా ద్రౌ మరకతరుచిం పుష్ణతీ మానసే నః।
భోగైశ్వర్య ప్రియ సహచరైః కాఽపి లక్ష్మీ కటాక్షైః
భూయః శ్యామా భువన జననీ దేవతా సంనిధత్తామ్॥

51. ఇతి విహిత ముదారం వేంకటేశేన భక్త్యా
శ్రుతి సుభగమిదం యః స్తోత్రమంగీకరోతి।
కరిశిఖరి విటంక స్థాయినః కల్పవృక్షాత్
భవతి ఫలమశేషం తస్య హస్తాప చేయమ్॥



శ్రీ దేవాధిరాజాయనమః

శ్రీ వేదాంత దేశికులు అనుగ్రహించిన

# శ్రీ వరదరాజ పంచాశత్

## సర్వంకషా వ్యాఖ్య

శ్రీమాన్ వేంకట నాథార్యః కవితార్కిక కేసరీ!
వేదాన్తా చార్య వర్యోమే సన్నిధత్తాం సదాహృది॥

రామానుజ దయా పాత్రం జ్ఞాన వైరాగ్య భూషణమ్।
శ్రీ మద్వేంకట నాథార్యం వందే వేదాన్త దేశికమ్॥

1. ద్విరద శిఖరి సీమ్నా సద్మవాన్ పద్మయోనేః
తురగ సవన వేద్యాం శ్యామలో హవ్య వాహః।
కలశ జలధి కన్యా వల్లరీ కల్ప శాఖీ
కలయతు కుశలం నః కోఽపి కారుణ్య రాశిః॥

**అర్థం:** ద్విరద శిఖరి సీమ్నా= హస్తిగిరియందలి అగ్రప్రదేశంచేత; సద్మవాన్= (తన) గృహంగా కలిగినట్టి; పద్మయోనేః= కమలమందు పుట్టిన బ్రహ్మయొక్క; తురగ సవన వేద్యాం= అశ్వమేధయాగ మందలి వేది యందు (ఉద్భవించిన); శ్యామలః= నీల వర్ణం కల్గిన; హవ్య వాహనః= అగ్నియై యున్నట్టి; కలశ జలధి కన్యావల్లరీ కల్పశాఖీ= క్షీర సముద్ర తనయయైన లక్ష్మీదేవి అను తీగతో కూడియున్న కల్పవృక్షం (అనదగిన); కారుణ్యారాశిః= దయారాశియైన; కః, అపి= ఒక అసాధారణ పరమ పురుషుడు; నః= దాసులమైన మనకందరికి; కుశలం= క్షేమాన్ని; కలయతు= ప్రసాదించుగాక.

**తా॥** కరి గిరియందు నివసించియున్న, చతుర్ముఖ బ్రహ్మచేసిన అశ్వమేధ యజ్ఞకుండమందు నీల వర్ణాగ్నియై వెలుగుతున్న, లక్ష్మీదేవి అనే లతతో కూడియున్న కల్పతరువుగా దయా రాశియైన ఒక పరమపురుషుడు మనకు క్షేమాన్ని కల్పించుగాక.

**వ్యాఖ్య:** దేశికులచేత 'వరదరాజ పంచాశత్' స్తోత్రారంభమందు ప్రార్థనా రూపమైన మంగళాచరణం సుశ్లోకితం.

భారతదేశమందు ఏడు నగరాలు ముక్తిని ప్రసాదించే దివ్యక్షేత్రాలుగ ప్రసిద్ధమైనవి. అందు 'కాంచీ' నగరం ముఖ్యమైనది.

*"అయోధ్యా మధురామాయా కాశీ కాంచీ హ్యవంతికా!*
*పురీ ద్వారవతీ చైవ సప్తైతా ముక్తిదా యికాః।*
*ఇతి ముక్తి ప్రదేశేషు కాంచీ ముఖ్యా న చేతరాః॥"*

అని కీర్తించారు ఋష్యాదులు.

ద్విరద శిఖరి సీమ్నా సద్మవాన్:- రెండు దంతాలు (కొమ్ములు) కలది. (ద్వౌరదౌ అస్యస్తః ఇతి= ద్విరదః) ఏనుగు అని అర్థం. 'శిఖరి' అంటే పర్వతం. 'సీమ' అంటే (పొలిమేర) ప్రదేశం. 'సద్మ' అంటే మందిరం. కాంచీ పట్టణానికి హస్తిగిరి, కరిగిరి అని నామాంతరాలు. కరిగిరి ప్రదేశమందున్న మందిరమందు విష్ణుమూర్తి అర్చారూపంతో వెలసి యున్నాడు.

*"దిఙ్నాగై రర్చిత స్తత్ర పురా విష్ణుః సనాతనః।*
*తతో హస్తిగిరిర్నామ ఖ్యాతిరా సీన్మహాగిరేః॥"*

పూర్వం అక్కడ వెలసి యున్న భగవానుణ్ని దిగ్గజాలు ఆరాధించడం వల్ల ద్విరద శిఖరి, హస్తిగిరి, కరిశైలం అనే పేర్లతో ప్రసిద్ధమైన పర్వతమది. కాబట్టి, హస్తి శైలేశుడు అని భగవంతుని అర్చావతారం యొక్క సౌలభ్యం సూచింపబడింది.

*పద్మయోనేః తురగ సవన వేద్యాం శ్యామలో హవ్యవాహః:-* ఆ ప్రాంతమందు ఒకప్పుడు విష్ణు భగవానుని నాభీకమలమందు ఉద్భవించిన

చతుర్ముఖ బ్రహ్మ అశ్వమేధ యాగం చేశాడు. ఆ యాగ కుండాగ్నియందు భగవానుడు ప్రాదుర్భవించాడు.

హవిస్సును గ్రహించే అగ్నిహోత్రుని రూపం తేజస్సును బట్టి ఎరుపు వన్నెకలది కదా! *"య దగ్నే రోహితం రూపం తేజసస్త ద్రూపమ్"* అనే ప్రమాణాన్ని బట్టి, అగ్నికి రోహిత (లోహిత) వర్ణమే స్వాభావికమని స్పష్టమవుతున్నది. 'వేది' అంటే *"వేదిః పరిష్కృతా భూమిః"* (అమరం) యాగం కోసం సంస్కరింపబడిన హోమకుండం. *"త్రివేదీ మధ్య దీప్తాయ త్రిధామ్నే పంచహేతయే! వరదాయ నమస్తుభ్యం బాహ్యాంతర హవిర్భుజే!!"* (యాదవాభ్యుదయం 1-43) మూడు వేదాల్లో దీపించునట్టి, పంచాయుధుడైన (విస్తారమైన జ్వాలలు కల్గినట్టి), చరు, పురోడాశాది బాహ్య హవిస్సులనూ, ప్రపన్నులు సమర్పించే ఆత్మాత్మీయ రూపాంతర్ హవిస్సులను స్వీకరించునట్టి, కోరిన వరాలనిచ్చునట్టి, పాలకడలియందు- రవిమండలమందు- వైకుంఠమందు నివసించునట్టి, లోహిత- శుక్ల-కృష్ణకాంతులతో ప్రకాశించే నారాయణునికీ, అగ్నిదేవునికీ ప్రణామమని అర్థం. శ్లేషాలంకృత శ్లోకమది.

శ్యామలో *హవ్యవాహః*:- నలువ తన పుత్రుడే కాబట్టి నిరతిశయ ప్రీతికలవాడై 'యజ్ఞోవైవిష్ణుః' అనే శ్రుతి పలికినట్లు, విష్ణు భగవానుడే- నీలమేఘశ్యాముడైనందునవల్ల- వచ్చి, విలక్షణమైన నీల వర్ణశోభితాగ్నిగా ప్రజ్వలిస్తూ హవిస్సును స్వీకరించాడు. నీలం వర్ణం చలువను, ఔదార్యాన్ని నిరూపిస్తుంది కదా! "అభితః పావకోపమః" అన్నట్లు భగవానుడు అగ్నిలాగా దీప్తి కలవాడే.

బ్రహ్మచేత ఆరాధింపబడినందువల్ల (ఈ మాటలో) పరత్వమూ అభివ్యక్తమవుతున్నది.

పరత్వం, సౌలభ్యం (రెండు) ఉన్నప్పటికీ కారుణ్యం లేకపోతే ఇష్టప్రాప్తినీ, అనిష్ట నివృత్తినీ కలిగించే ఆశ్రయణీయత్వం అసంభవం.

కలశ జలధి కన్యా వల్లరీ కల్పశాఖీ:- పాలకడలియందు ఉద్భవించిన కన్య లక్ష్మీదేవి. కన్య పతి సంయోగ సులభ కదా!

"భర్తారమవలంబ్యైవ భార్యాయాః స్థితి రిష్యతే।
అవలంబ్యోద్గమం వల్లీ త్యేధతే న వినా ద్రుమమ్॥"

తీగ తరువును ఆశ్రయించకుంటే ఏపుగా ఎదుగదు కదా! కాబట్టి, కన్య పతిని వరించి అతనితో సహచరిస్తే పత్నిగా శోభిస్తుంది. ప్రకృతి (ప్రజా) రంజకంగా రాణిస్తుంది.

దేవజాతికి సంబంధించింది కల్పతరువు. కోరిన వరాలను మాత్ర మిస్తుంది కల్పవృక్షం. తననిచ్చుకోజాలదు. "తన్నై తన్ద కఱ్పకమ్". భగవానుడనే కల్పతరువు తనను కూడా ఇచ్చుకొనే ఉదార స్వభావం కలిగియున్నట్లు ఆళ్వార్ల సూక్తి.

పాలకడలి పట్టియైన లక్ష్మి "పశ్యతాం సర్వదేవానాం యయౌ వక్షః స్థలం హరేః" (వి.పు. 1-9-105) దేవతలందరు చూస్తుండగా విష్ణుమూర్తి యొక్క వక్షః పీఠాన్ని అలంకరించింది. భగవంతునికి 'శ్రియఃపతి' యని స్వరూప నిరూపకంగా నిల్చియున్నది. "శ్రీ విష్ణుచిత్త కులనందన కల్పవల్లీం, శ్రీరంగరాజ హరిచందన యోగదృశ్యామ్" (గోదాస్తుతి-1) శ్రీ శ్రియః పతుల దాంపత్యయోగం నిత్యమైనదని వ్యంజితం.

కారుణ్యరాశిః:- విశ్వంలోని కారుణ్యమంతా ఒకటచోట చేరి యున్నట్లు కారుణ్యాతిశయం తెల్పబడింది.

'కోఽపి హవ్యవాహః'- అంటే "తస్యభాసా సర్వమిదం విభాతి" ఆయన కాంతిచేతనే ఇదంతా ప్రకాశిస్తుంది - అనే శ్రుతి రీతిగా, నిరతిశయ దీప్తియోగం "జ్యోతిశ్చరణాభిధానాత్" అధికరణమందలి 'కారణత్వ వ్యాప్తి' ప్రకటింపబడింది.

'కోఽపి కల్పశాఖీ'- అన్నందువల్ల, త్రివర్గ ఫలప్రదానాన్ని తెల్పుతూనే 'లక్ష్మ్యాసహ హృషీకేశః (ల.తం-2, 8-14) అన్నట్లు లక్ష్మీదేవితో కూడియున్న

వానికే 'ఫలమత ఉపపత్తేః' (బ్ర.సూ.) అన్న విధంగా మోక్షాంత సకలఫలప్రదత్వం విశదీకరింపబడింది.

'కోపి కారుణ్యరాశిః'- అనడంవల్ల 'ఏతా వానస్య మహిమా'- (పు.సూ) అన్న ప్రకారంగా, సర్వానిష్టాలను తొలగించే కారుణ్యాతిశయం చేత అనిర్వచనీయ మహిమగల పరమ పురుషుడని స్పష్ట పరచబడింది.

*కలయతు కుశలం నః:*- 'నః' అనే షష్ఠీ బహువచనం శిష్యులతో కూడిన ఆచార్యులకు అనీ, స్తోత్రాన్ని అనుసంధించే వారందరికీ, అనే అర్థాన్ని తెల్పుతుంది.

ఆ పరమ పురుషుడైన కరిగిరీశుడు మనకందరికీ భక్తితత్త్వ జ్ఞానాది రూపమైన క్షేమాన్ని కలిగించు గాక అని సంప్రార్థన. ఈ స్తోత్రారంభ శ్లోకం-

*"వరదం ద్విరదాద్రీశం శ్రీనిధిం కరుణా నిధిమ్।*
*శరణ్యం శరణం యామి ప్రణతార్తి హరం హరిమ్॥"*

'శ్రుత ప్రకాశిక' అనే శ్రీ భాష్య వ్యాఖ్యానమందలి మంగళ శ్లోకాన్ని స్మరింప జేస్తుంది. హవ్యవాహత్వాదులచే బహుధా ఉల్లేఖింపబడినందున, ఇందు, రూపక సంకీర్ణమైన ఉల్లేఖాలంకారం, పర్యాయోక్త్యలంకారం గమనీయం. మాలినీ వృత్తం. (నన మయయ యుతేయం మాలినీ భోగిలోకైః) ననమయయ- గణాలు కలది.

*2. యస్యానుభావ మధిగంతు మశక్నువంతః*
*ముహ్యం త్య భంగుర ధియో మునిసార్వభౌమాః।*
*తస్యైవ తే స్తుతిషు సాహసమశ్ను వానః*
*క్షంతవ్య ఏష భవతా కరిశైలనాథ॥*

**అర్థం:** హేకరిశైలనాథ= హస్తి గిరినాథా!; అభంగుర ధియః= అప్రతిహత జ్ఞానంగల; మునిసార్వభౌమాః= మహర్షులు, ఆళ్వార్లు; యస్య= ఏ వరద రాజస్వామి యొక్క; అనుభావం= మహిమను; అధిగంతుం= బాగా తెలుసుకోవడానికి;

అశక్నువంతః (సంతః)= శక్తిలేని వారవుతూ; ముహ్యంతి= మోహం చెందుతుంటారో; తస్య, ఏవ= అట్టి వాడవే యైన; తే= నీ యొక్క; స్తుతిషు= స్తోత్రాలను చేసే విషయంలో; సాహసం= తెగువను; అశ్నువానః= పొందుతున్నట్టి; ఏషః= ఈ దాసుడు; భవతా= నీ చేత; క్షంతవ్యః= క్షమింపదగినవాడు.

**తా॥** ఓ కరిగిరినాథా! తడబడని బుద్ధి వైభవంగల మునిశ్రేష్ఠులు ఏ వరదరాజ భగవానుని యొక్క మాహాత్మ్యాన్ని బాగా తెలుసుకోవడానికి సామర్థ్యం లేని వారవుతూ మోహం చెందుతుంటారో, అట్టి ప్రణతార్తి హరుడవైన నిన్ను స్తుతించడానికి సాహసంతో ప్రయత్నించే ఈ దాసుణ్ణి నీవే క్షమించాలి.

వ్యాఖ్య: మహాజ్ఞానులైన మునిసార్వభౌములు ప్రణతార్తి హరుని మహిమను వర్ణింప నశక్తులైనవారు కాగా, తాను ఆ భగవానుని స్తుతింపబూనుకొన్న అపరాధాన్ని క్షమింపుమని దేశికుల ప్రార్థన.

మహర్షులు, ఆళ్వార్లు సకల అర్చామూర్తుల వైభవాన్ని అనుసంధానం చేసి స్తుతిస్తున్న వారైనప్పటికీ, కంచి వరదరాజ భగవానుని గుణవర్ణనం అశక్యమని భావించి విమనస్కులైనారు.

అభంగుర ధియో మునిసార్వభౌమాః:- అప్రతిహతమైన, సర్వార్థ సాధకమైన ధిషణ గల వాల్మీకి వ్యాస పరాశరాది మహర్షులు భగవదవతారాల మహిమను వైభవంగా స్తుతించి, ప్రకటించారు. వాల్మీకి శ్రీమద్రామాయణాన్ని రచించాడు.

పరాశర మహర్షి విష్ణుపురాణాన్ని (పురాణరత్నం) రచించాడు. వేదవ్యాస భగవానుడు 'నారాయణ కథా మిమామ్' అని పంచమవేదమైన మహాభారతాన్నే కాక అనేక పురాణాలను రచించాడు. అయినను ఈ మహాజ్ఞానులైన ఋషులు కూడా కంచి తేవ ప్పెరుమాళ్ళ యొక్క కల్యాణగుణాలనే మహాసముద్రంలో అవగాహించి, ఒక్క గుణాన్నైనా పూర్తిగా వర్ణించడానికి శక్తి చాలదని మానుకొన్నారు.

*"ప్రాయోదయే! త్వదనుభావ మహాంబురాశౌ*

*ప్రాచేతస ప్రభృతయోఽపి పరంతటస్థాః"* (దయాశతకం-103)

ఓ దయాదేవీ! నీ వైభవాంభోధిలోకి వాల్మీక్యాది మహర్షులు దిగకుండా తీరమందే నిలిచారు (అంటే, భగవన్మహిమను, చరిత్రను వర్ణించారే కాని అపరిచ్ఛేద్యమైన దయాదేవి యొక్క మహిమను స్పృశించలేక పోయారని భావం).

అట్టి దురవగాహమైన నీ (దయా)స్తుతిని చేయడానికి అల్పబుద్ధితో సాహసించిన నన్ను కినుక పూనక, నీవే ఆదరించాలని దేశికులు ప్రార్థించారు (మత్కృత 'అమృతాస్వాదినీ' వ్యాఖ్యను చూడవచ్చును).

ఋషులేకాదు, ఆళ్వార్లు కూడా అనేక దివ్యక్షేత్రాలలో వేంచేసియున్న అర్చామూర్తులకు మంగళాశాసనం చేసినా, కంచి వరదరాజస్వామి యొక్క గుణగణాలను స్తుతించలేదు.

*"మయర్వఱ మదినల మరుళినన్"*- సర్వేశ్వరుడు నమ్మాళ్వార్లుకు అజ్ఞాన, అన్యథాజ్ఞాన, విపరీత జ్ఞానాలు నశించే రీతిగా తనయందు భక్తి రూపమైన అశేష శేముషిని కృపజేశాడు. కాబట్టి, ఆళ్వార్లు అభంగుర ధీమంతులు. గుణాలను బాగా తెలుసుకొన్న తర్వాత వర్ణింప వలసియుంటుంది. నమ్మాళ్వార్లు తనకు దర్శన భాగ్యమిచ్చిన సకల అర్చావతారుల గుణవిభూతులను వర్ణించారు. కాని కంచి దేవరాజు యొక్క దివ్యమంగళ విగ్రహ సౌందర్యాన్ని దర్శించిన వెంటనే *"ఓరి యల్వినరెన నిన్నైవరియవర్"*- ఇలాంటి స్వభావం కలవాడని తలచడానికి అశక్యమైయున్నవాడు, *"నారణన్ మాయయై యుఱిబవర్ యారే"*- శ్రీమన్నారాయణుని ఆశ్చర్యమైన అవతార రహస్యాలను తెలుసుకొనే వారెవ్వరు? ఎవరు లేరు అని పరవశులైనారు, మూర్ఛపోయారు, అనే విషయాన్ని *"యస్యానుభావ మధిగంతు మశక్నువంతః ముహ్యంతి"* అనే శ్లోక పూర్వార్ధమందు దేశికులు విశదపరచారు.

శ్రీ శుకమహర్షి "ముహ్యంతి యత్సూరయః" అని భాగవతాన్ని ఆరంభించినట్లే, దేశికులు "ముహ్యంత్య భంగుర ధియో ముని సార్వభౌమాః" అని ఈ స్తోత్రాన్ని ఉపక్రమించారు కదా!

తస్యైవ తేస్తుతిషు సాహసమశ్నువానః:- మహామేధావులైన ముని సార్వభౌములకే అశక్యమైన వరదరాజ స్వామిని స్తుతించే విషయంలో తనకు స్తుతించే శక్తి కలదనే బుద్ధితో ప్రయత్నించడం సాహసకృత్యమే. ఇట్టి తెగువకు పూనుకోవడం అపరాధమే అవుతుంది.

"స్వశైల శృంగాభిహతో విసంజ్ఞః పపాతభూమౌ యుధివానరేంద్రః"- వానర రాజైన సుగ్రీవుడు, కుంభకర్ణునితో యుద్ధం చేస్తుండగా అతడు ప్రయోగించిన పర్వత శిఖరం దెబ్బకు మూర్ఛ చెందాడు. "జహార సుగ్రీవ మభిప్రగృహ్య"- అప్పుడు కుంభకర్ణుడు సుగ్రీవుణ్ణి ఎత్తుకొని లంకలోకి తీసుకొని పోతుంటే, హనుమంతుడు "కింకర్తవ్యం మయాభవేత్"- ఇప్పుడు నేనేమి చేయాలి? "యద్ధిన్యాయ్యం మయాకర్తుం తత్కరిష్యామ్య సంశయమ్"- ఏది న్యాయ మో, దాన్నే సంశయించకుండా చేస్తాను' అని ఆలోచించి, ఒక నిర్ణయానికి వచ్చాడు హనుమంతుడు.

"మయాతు మోక్షితస్యాస్య సుగ్రీవస్య మహాత్మనః।
అప్రీతిశ్చ భవేత్కష్టా కీర్తినాశశ్చ శాశ్వతః॥" (రా.యు. 67-80)

మహాత్ముడైన సుగ్రీవుణ్ణి నేను విడిపిస్తే, అది అతనికి ఏ మాత్రమూ ప్రీతికరం కాకపోవచ్చు. అతనికి శాశ్వతమైన అపకీర్తి కూడా కలుగుతుంది. కాబట్టి నేను విడిపించడం అపరాధమే అవుతుందని హనుమంతుడు భావించాడు.

(అంతలో స్పృహ వచ్చిన సుగ్రీవుడు కుంభకర్ణుని నుంచి విడిపించుకొని వచ్చి తన సైన్యంలో చేరాడు).

సాహస మశ్నువానః క్షంతవ్య ఏష భవతా కరిశైలనాథ:- ఇట్టి అపరాధమే తనయందుండగా తన స్తోత్రమందు భగవదనుగ్రహం ఎట్లు కలుగుతుంది?

అనే శంకను, అట్టి అపరాధాన్ని క్షమింపుమని దేశికులు ప్రార్థనద్వారా పరిహరించే వాక్యమిది.

అట్టి అపరాధం ఉన్నప్పటికీ, అజ్ఞానంవల్ల చేయబడినదవడం చేత అది క్షమింపయోగ్యమైనదే. 'ఏషః' అని దేశికులు తన కార్పణ్యాన్నీ, దాస్యాన్ని విన్నపించాడు. బుద్ధిగల శక్తిమంతుని చేత చేయబడిన అపరాధంవలె అజ్ఞాన కృతాపరాధం విశేషంగా దండహేతువు కాదు కదా!

*"అవిజ్ఞాతం విజానతాం, విజ్ఞాత మవిజానతామ్"* తనకు దైవం తెలుసునని అనుకొంటే, అతనికి దైవం సుతరామూ తెలియదన్నమాట. దైవాన్ని తెలుసుకోలేననే వ్యక్తికి కొంత జ్ఞానమున్నదనవచ్చును; అన్నది వేదం.

భగవంతుణ్ణి స్తుతించకుంటే ఆత్మ నిల్వదు. శేషత్వమే ఆత్మయొక్క స్వరూపం. *"అమ్మా నా షిప్పిరా నవనెవ్విదత్తాన్? యాన్ యార్?"*– 'చక్రధారియైన స్వామి యెక్కడ? నేనెక్కడ' అని ఆశ్చర్యాన్ని వ్యక్తపరచిన నమ్మాళ్వార్లు *"పుకషోమ్, పశియోమ్"*– మనం స్తుతించలేము, స్తుతించకుండా ఉండనూలేము, అన్నారు.

ఆశ్రిత సత్తాధీన సత్తగల సర్వశేషిముఖ దివ్యాత్మ కూడా మనం స్తుతించకపోతే నిలవజాలదు. ఇట్లు ఇర్వురి ఆత్మోజ్జీవనార్థం భగవంతుణ్ణి స్తుతించడమే సమర్థనీయం. అపరాధాన్ని క్షమించడమే భగవంతుని ఔచిత్యం. జీవుని అపరాధాన్ని సహించకపోతే భగవానుని స్వస్వరూపానికే ప్రచ్యుతి కలుగుతుంది. తన దాసుడు నశిస్తాడనే భీతి చేతనూ, భగవానునిచే అపరాధి క్షంతవ్యుడు; అని భావం.

*గమనిక:–* ఆళ్వార్లు కంచి వరదరాజస్వామి విషయమై పాశురాలను పాడలేదని భావించి, హస్తిగిరీశుని దివ్య ప్రభావానికిగానీ, దివ్య క్షేత్రవైభవానికిగానీ కొంత కొరత ఉన్నదని తలచకూడదు. "శ్రీహస్తి శైల శిఖరోజ్జ్వల పారిజాతం" అని అత్యంత ప్రభావం కలది కరిగిరి దివ్యక్షేత్రం. వరదరాజస్వామి వరాలనిచ్చేవాడనీ, 'ఫలప్రదాత' యని ప్రసిద్ధిని పొందినవాడు (పాఠకులు గమనించాలి).

"పరత్వాద్యైరిత్థం పరిచరణ సక్తోగుణగణైః
ప్రభుం సేవాయోగ్యం ప్రథమ శతకే వీక్ష్య వరదమ్।
తమేవ స్వాత్మ్యర్థ ప్రియమథ చ భోక్తుం వ్యవసితః
వరేణ్యత్వం తస్య ప్రథమ వరణీయం ప్రథయతి॥"

అనే శ్లోకంలోని పూర్వార్ధం 'తిరువాయ్ మొషి' అనే దివ్య ప్రబంధంలోని మొదటి పత్తు (మొదటి శతకం) 'ఉపాయ పర'మనీ, రెండువ పత్తు 'ఉపేయ పర'మనీ స్పష్టపరచినదని గమనీయం.

వసంత తిలకా వృత్తం (ఉక్తావసంత తిలకా త, భ, జా జ, గౌ గః) తభజజగగ-గణాలు కలది.

3. జానన్ననాది విహితా నపరాధవర్గాన్
స్వామిన్! భయాత్ కిమపి వక్తుమహం నశక్తః।
అవ్యాజ వత్సల! తథాఽపి నిరంకుశం మాం
వాత్సల్యమేవ భవతో ముఖరీకరోతి॥

**అర్థం:** హే స్వామిన్= ఓ సర్వలోకనాథా! అనాది, విహితాన్= అనాది కాలం నుంచి- పలు జన్మలలో చేయబడిన; అపరాధ వర్గాన్= అపరాధ సమూహాలను; జానన్= తెలుసుకొంటున్న; అహం= నేను; భయాత్= భీతివల్ల; కిం, అపి= ఒక మాట కూడా (ఏమీ); వక్తుం= పల్కుటకు; న, శక్తః= శక్తి కలవాడనుకాను, హే అవ్యాజ వత్సల= ఏ వ్యాజం లేని వాత్సల్యాన్ని చూపే స్వభావం కల వరదా! తథా, అపి= అట్లు ఉన్నప్పటికీ; భవతః= నీ యొక్క వాత్సల్యం; ఏవ= వాత్సల్యగుణం ఒక్కటే; మాం= నన్ను; నిరంకుశం= (పాపాల రాశులున్నప్పటికి కూడా) ఆటంకం లేకుండా; ముఖరీకరోతి= ధ్వనింపజేస్తున్నది (నీ స్తోత్రం చేయునట్లు చేస్తున్నది).

**తా॥** ఓ జగన్నాథా! అనాది కాలంగా నేను చేసిన అపరాధాలు లెక్కకు మిక్కిలిగా ఉన్నాయని తెలుస్తున్న భయంవల్ల ఒక్కమాటనైనా పల్కడానికి శక్తిలేనివాడను. అయినా, అవ్యాజ వాత్సల్యంగల ఓ వరదరాజా! నీ వాత్సల్య గుణమే నా చేత నిరర్గళంగా నీ స్తోత్రం చేయిస్తున్నది.

వ్యాఖ్య:- భగవానుని వాత్సల్య గుణమే స్తోత్ర రచనకు శక్తిని జనింపచేస్తున్న దని సమర్థించే శ్లోకమిది.

ఈ స్తోత్రంలో మొదటి ఆరు ఉపోద్ఘాత శ్లోకాలు. ఈ శ్లోకమందు, రాజపత్నికి ద్రోహం చేసిన వ్యక్తి రాజు దగ్గరికి పోయి రాజును స్తోత్రం చేయడం అసంభవమెట్లో, అనాది కాలం నుంచి భగవదపచారమూ, భాగవతా పచారమూ, అసహ్యాపచారమూ చేస్తున్న తాను భగవంతుణ్ణి స్తోత్రం చేయడం అసంభవమనే శంకకు భగవంతుని అవ్యాజ వాత్సల్య గుణమే ఆయనను సోత్రం చేయడానికి సామర్థ్యాన్ని కలిగిస్తుందని దేశికులు సమాధాన మిస్తున్నారు.

జానన్ననాదివిహితాన్-నశక్తః:- అనాదిగా అంటే చరిత్రకందని కాలం నుంచి అనేక జన్మల పరంపరలో శాస్త్రనిషిద్ధ కార్యాలను- అపరాధాలను నేను చేస్తున్నాను. ఒక్క పాపం చేస్తే 'పాపం ప్రజ్ఞాం నాశయతి'- అన్నట్లు, అది నవనవోన్మేషశాలినియైన బుద్ధిని నశింపజేస్తుంది కదా! అట్టి అపరాధాలను అనేక జన్మలయందు చేయడంవల్ల, ఆ పాపరాశి అనంతమైనదని 'అపరాధవర్గాన్' అని బహువచనం ప్రయుక్తం. అట్టి పాపాల కుప్పవల్ల ఎంతో నష్టం సంభవిస్తుంధని వేరే చెప్పనక్కర్లేదు. చేసిన అపరాధాలను మరచిపోయే వ్యక్తికి భయమే ఉండదు. ఈ జన్మలో బుద్ధి పూర్వకంగా చేసిన దుష్కృతాలు స్మృతికి రాకమానవు కదా! ఇక పూర్వజన్మలలో చేసిన పాపాల విషయం, ఉత్తమ కులమందు పుట్టి, సత్పురుషుల సహవాసం కలిగిన వ్యక్తులకు సామాన్య జ్ఞానముండడం వల్ల, గుర్తుకు వస్తుందనడం కైముత్య న్యాయసిద్ధం. సీతాదేవి "మమైవ దుష్కృతంకించి న్మహదస్తిన సంశయః" (రా.సుం. 38-48) తన క్లేశానుభవాన్నిబట్టి, నేను కొంచెమో, గొప్పగనో చేసిన పాపమే ఇది, అనుమానమేమీ లేదు' అని జ్ఞాపకం చేసుకొన్నది కదా! తాను మాయలేడికోసం రాముణ్ణి పంపడం కొద్దిపాపమనీ, భాగవతోత్తముడైన లక్ష్మణుణ్ణి అనరాని మాటలను పల్కి తన నుంచి దూరం చేయడం గొప్ప పాపమని తెలుసుకొన్నది.

స్వామిన్:- నీవు సర్వశేషివి. నేను శేషభూతుడను. సర్వాపరాధినైన నేను, నిన్ను ఆరాధించక అపరాధాలనెన్నింటినో చేసినవాడనని తెలుసుకొన్న నేను, నిన్ను అభిముఖం చేసుకోవడానికి, నీ ముందు నిల్వడానికే భయపడుతున్నాను. నీవు లోక రక్షకుడవు. నేను నీ సొత్తునే అయినా పాపాల పుట్టను అని తెలిసి భయపడుతున్నాను.

"భీషాஉస్మాద్వాతః పవతే, భీషోదేతిసూర్యః"- శ్రుతి రీతిగా, నీ కుభయపడియే కదా వాయువు, సూర్యుడు తమ తమ పనులను చక్కగా, చక చకగా చేస్తున్నారు. వారు ఆధికారిక పురుషులు. దోషలేశమైన లేనివారు. మరి నేనో సర్వదోషభూయిష్ఠుడను. నా పాపాలను తలచుకుంటేనే నాకు కంపనం కలుగుతుంది. నీ అనుకంపను-దయను-పొందడానికి చాలా భయపడుతున్నాను. భయంవల్ల నిన్ను స్తుతించడానికి- ఒక్క వాక్యాన్నైననూ పల్కడానికి- ఏ మాత్రం శక్తిలేనివాడనయ్యాను.

నేను నీ సొమ్మునే. నీవు స్వామివి. "ఇఱైవా! ఉన్దన్నోడు ఉఱవేల్ నమక్కింగు ఒషిక్క ఒషియాదు" (తిరుప్పావై 28) ఓ నిరుపాధిక స్వామీ! నీతో మాకు-జీవాత్మలకున్న సంబంధం నిత్యమైనది కాబట్టి, అది మనకు ఏ విధంగానూ విడువ వీలు కానిది. ఈ విధంగా, "స్వామిన్" అనే పదం-సంబోధన- తనను 'అపరాధి' అనే నెపంతో స్వామి పరిత్యజించరాదనే కాకుండా, తాను స్తోత్రం చేయడం అసంభవం అనే శంకను పరిహరించడానికీ ఉపయోగపడుతున్నది.

అవ్యాజవత్సల:- ఏదో ప్రయోజనాన్ని ఉద్దేశించి, ఆ నెపంచేత వాత్సల్యాన్ని ప్రదర్శించే స్వభావంలేని ఓ వరదరాజా! అని సంబోధన. ఆవు తనకు పుట్టిన లే దూడమురికిని నాలుకతో నాకివేసి శుభ్రపరచి, దానికి పాలతో పుష్టిని కలిగించడం ప్రేమచేతనే తప్ప మరొక వ్యాజమేమీ ఆవుకు ఉండదు.

తాను మహాపరాధం కలవాడైనా, వాత్సల్యాన్ని స్వామి ప్రకటించడం వల్ల తనకు భయం పోతుంది, శక్తి కలుగుతుంది అని తనను స్వామి రక్షించే కర్తవ్యాన్ని జ్ఞప్తికి తెచ్చే సంబోధన ఇది.

ఆనుకూల్యమేమాత్రం లేనప్పుడు వాత్సల్యం ఎందుకుంటుంది? అనే శంకను పరిహరించడానికే, అనుకూల వ్యాపారాన్ని అపేక్షించక పోవడమే అవ్యాజత్వమని వివక్షింపబడింది.

"త్వమేవ మాతా పితా త్వమేవ" అన్నట్లు తల్లియు, తండ్రియు స్వామియే అని తెల్పబడుతున్నది.

*"వాత్సల్య నిర్భరతయా జననీ కుమారం*
*స్తన్యేనవర్ధయతి దష్ట పయోధరాஉపి॥"* (గోదాస్తుతి- 27)

కోరినా, కోరకున్నా కడుపార పాలిచ్చే తల్లి చంటిని కోరపంటితో గంటుపెట్టినా గడుగ్గాయి నిసుగును కసురుకోదూ, విసుగుపడదు. మీదు మిక్కిలి, పాలుకుడువడేమి? అంటూ ఆమె కడుపు కల్గిన తనం పెంపెరలాడుతుంది. నోరారినా, ఊరినా, పట్టిని చేరపట్టి, పట్టిపట్టి పాలిచ్చి నిమ్మకు నీరెత్తినట్లు పెంచడం తల్లికే తగుతుంది.

*"ఎమ్మాయ! నాయినేన్ శెయ్దకుత్తమ్ నత్తమాగవేకొళ్, జ్ఞాల నాదనే"* (తిరుచ్చంద విరుత్తం-111)

మా స్వామీ! లోక రక్షకా! నీచుడనైన నేను చేసిన అపరాధాలను గుణాలుగా స్వీకరించుము; అని తిరుమషిశైయాళ్వార్లు ప్రార్థించిన విషయాన్ని స్ఫురింపజేస్తున్నది, ఈ సంబోధనాంత పదం.

*తథాஉపి నిరంకుశం మాం వాత్సల్య మేవ భవతో ముఖరీ కరోతి:-* అపరాధి నైనప్పటికీ నీ వాత్సల్యమే నన్ను ధారాళంగా నిన్ను స్తోత్రం చేసే యోగ్యునిగా చేస్తున్నది.

*"సంతన్యమాన మపరాధగణం విచింత్య త్రస్యామి"*- (ద.శ. 96)

నిత్యం ఎడతెగకుండా మనో వాక్కాయాలచే చేసిన అపరాధాల సమూహాలను తలచి భయపడుతున్నాను. నిన్ను స్మరిస్తేనే భయం తొలగిపోతుంది, అన్నారు దేశికులు.

'తథాపి' అన్న మాట "న స్మరత్యపకారాణాం శతమప్యాత్మవ త్తయా"- (రా.అయో. 1) దోషాలెన్ని ఉన్నా వాటిని మరచి ఆదరించే ప్రీతి కలుగుతుందని, వాత్సల్యాన్ని సమర్థిస్తున్నది.

"దోషేషు గుణబుద్ధిః" అని శ్రుత ప్రకాశికాచార్యులు 'శరణాగతి గద్య వ్యాఖ్యానం'లో వాత్సల్యాన్ని నిర్వచించారు. అట్టి భగవానుని వాత్సల్య గుణమొక్కటే తనను ముఖరీకరిస్తున్నదన్నారు దేశికులు.

ముఖం రాతి ఇతి= ముఖరం-ముఖవ్యాపారమైన వాక్కును ప్రసాదిస్తున్నదని 'ముఖరీకరోతి' అనే క్రియాపదం తెల్పుతున్నది.

"మౌనద్రుహో ముఖరయంతి గుణాస్త్వదీయాః" (గోదాస్తుతి. 2) అమ్మా! నీ సౌశీల్య సౌందర్య వాత్సల్య గుణాలే నా మౌనాన్ని భంగపరచి నిన్ను స్తుతింప జేస్తున్నాయి అని దేశికులు గోదాదేవిపట్ల తమ నమ్రతను కమ్రంగా ప్రకటించు కొన్నారు.

"స్వాధ్మాతం రంగనాథః స్వయమితి ముఖరీకృత్య సమ్మోదితే స్మ"- శ్రీరంగనాథుడే తన పాంచజన్య ధ్వనిని పూరించినట్లే, తానే దేశికుల 'అధికరణ సారావళి'ని పూరించి హర్షించాడన్నాడు కవితార్కిక కేసరి.

ఈ మూడవ శ్లోకమందు హస్తిశైలనాథుడే ఈ స్తోత్ర కర్తృత్వాన్ని నిర్వహించాడని దేశికులు నిజధిషణాహంకారాన్ని నిరసించుకొన్నారు. దీనివల్ల భ్రమప్రమాదాదులు లేని ఈ ప్రబంధం ఉపాదేయమని ధ్వనితం. వరదరాజ పెరుమాళ్ల వాత్సల్యమే ఈ స్తోత్ర గ్రంథరచనకు ప్రేరకమనడం నిసర్గ రమణీయం కదా!

ప్రతి బంధకమున్నను కార్యోత్పత్తియైనదనడంవల్ల విభావనాలం కారసజ్జిత మీ శ్లోకం. వసన్త తిలక. త భ జ జ గ గ - గణాలు కలది.

4. కిం వ్యాహరామి వరదస్తుతయే కథం వా
ఖ ద్యోతవత్ ప్రలఘు సంకుచిత ప్రకాశః।
తన్మే సమర్పయ మతించ సరస్వతీంచ
త్వా మంజసా స్తుతి పదై ర్యదహంధినోమి॥

**అర్థం:** హే వరద= వరమిచ్చే ఓ దేవా!; ఖద్యోతవత్= మిణుగురు పురుగువలె; ప్రలఘు సంకుచిత ప్రకాశః= చాలా స్వల్పమైన, మిన్కు మిన్కుమనే తెలివిగల నేను; (భవతః= నీ యొక్క) స్తుతయే= స్తుతి చేయడం కోసం; కిం, వ్యాహరామి?= ఏమి వాగుతాను?; కథం, వా= ఏ విధంగా; వ్యాహరామి?= వ్యాహరిస్తాను?; తత్= అందువల్ల; మతిం, చ= బుద్ధినీ; సరస్వతీం, చ= వాక్ శక్తిని కూడా; మే= నాకు; నా కొరకు; సమర్పయ= అనుగ్రహింపుము; యత్= దేనివల్ల; అహం= నేను; స్తుతిపదైః = స్తోత్రం చేసే పదాల చేత; త్వాం= నిన్ను; అంజసా= శీఘ్రంగా; ధినోమి= సంతోషింప జేస్తానో (ఆ రీతిగా, కృప జేయుము).

**తా॥** ఓ వరద! సర్వేశ్వరా! మిణుగురు పురుగులాగా రాత్రిపూట స్వల్పంగా ఆగుతూ–సాగుతూ వెలిగే– నిండు తెలివిలేని– నేను నిన్ను స్తుతించడానికి ఏమి ఆలపిస్తాను? ఏ విధమైన శబ్ద ప్రయోగం చేస్తానో? నీవు సముచితమైన జ్ఞానాన్ని ప్రసాదించకుంటే నేను నీ స్తోత్రాన్ని ఎలా చేయగలను? కాబట్టి; నీవు నాకు బుద్ధినీ, వాక్ పాటవాన్ని అనుగ్రహించాలి సుమా! తత్ఫలితంగా, నేను స్వరూపాను గుణమైన శబ్దాలను ప్రయోగించి, నిన్ను స్తోత్రం చేసి శీఘ్రంగా సంతోషింప జేయగల శక్తిని అవశ్యంగా ప్రసాదించుమని ప్రార్థన.

**వ్యాఖ్య:**– భగవదనుగ్రహం లేనిచో స్తోత్రం చేయలేనని, భగవత్కృపోత్థం భనం కోసం కార్పణ్యానుసంధాన పూర్వక ప్రార్థన సుశ్లోకితం.

"అప్రార్థితో నగోపాయేత్"– ప్రార్థించకుంటే అనుగ్రహం కలుగదు. భగవదనుగ్రహం లేకుంటే తమకున్న మిడి మిడి జ్ఞానంతో భగవానుని గుణాలను సముచితంగా ప్రకాశింపజేసే స్తోత్రాన్ని నిర్వహించలేరు.

*కింవ్యాహరామి వరదస్తుతయే కథంవా:–* ఓ వరదా! నిన్ను స్తుతించడానికి అజ్ఞానినైన నేను ఏమని స్తుతించగలను? ఎలా స్తుతించగలను– అని 'వరద' శబ్దం సంబోధనగా ప్రయుక్తమైనది. అథవా, 'వరదస్తుతయే' అని సమస్త పదంగానూ గ్రహించవచ్చును. 'వరదుని స్తుతికోసం' అన్నదానికంటే 'వరమిచ్చే స్తుతికోసం' అన్న అర్థంలో స్వారస్యముంది. భగవద్గుణాను సంధానం సముచితంగా చేస్తే, ఆయన సంతోషించి స్తోతకు ఇష్టప్రాప్తినీ, అనిష్ట నివృత్తినీ కలిగించగలడు. అయితే, హేయగుణాలే లేనట్టి, అనంత కల్యాణ గుణమహార్ణవుడైన స్వామియొక్క ఒక్క గుణాన్ని కూడా యథార్థంగా స్తుతించలేక పోతున్నామని పూర్వాచార్యులు నివేదించారు. ముఖ్యంగా "యతోవాచో నివర్తంతే, అప్రాప్య మనసా సహ" అని శ్రుతులు కూడా భగవానుని నిరతిశయ జ్ఞానానంద స్వభావాలను మాటల చేతనూ, మనస్సు చేతనూ తెలుసుకోవడానికి ప్రయత్నించి, సాధ్యం కానందువల్ల వెనుదిరిగి వచ్చాయి. "సోఽన్వేష్టవ్యః, విజిజ్ఞాసితవ్యః" ఆయనను ఇంకా వెదకదగినదే, తెలుసుకోవలసినదే' అని ఇప్పటికీ ప్రయత్నిస్తూనే ఉన్నాయి కదా! కాబట్టి, భగవానుడు 'జ్ఞాన తిరోధానకరియైన ప్రకృతిలో పడవేసి బద్ధునిగా జేసినప్పటికీ, ఆయనను మమతాహంకృతులను వదలివేసి ప్రార్థిస్తే, ఆర్తుల పాలిట పారిజాతమైన భగవానుడు "ఉదారాః సర్వ ఏవైతే" అన్నట్లు 'నా సర్వస్వాన్ని యాచించి పొందే ఉదారులనే భావనతో కృపాప్రసన్నుడవుతాడు. వాంఛితార్థాలను ప్రసాదిస్తాడు, లేకపోతే మన తెలివియేపాటిది? అని దేశికులు తమ ధిషణను నిరసించుకొన్నారు.

*ఖద్యోత వత్ ప్రలఘు సంకుచిత ప్రకాశః–* రాత్రి సమయాన చాలా కొద్దిగానూ, కాలసంకోచాన్ని కలుగజేస్తూ on and off- గా మినుకు మినుకుమని మింట వెలిగే 'ఖద్యోత' కీటకంగా తమను పోల్చుకొన్నారు. తమ తెలివిని మిణుగురు పురుగు వెలుగుతో సమానంగా ఉన్నదని భావించారు.

*"అర్థం బుద్ధ్వా శబ్దరచనా"–* అర్థాన్ని చక్కగా వెలువరించే శబ్దాన్ని ప్రయోగించవలసి యుంటుంది. "అర్థో విష్ణురియం వాణీ" (వి.పు.) అర్థం

విష్ణురూపమైతే, వాగ్రూపం భగవతి లక్ష్మీదేవియే. విడిపోలేని దివ్యదంపతివంటి వాక్కు రసాత్మకం. ఇట్టి రమణీయ శబ్దార్థాలను ప్రతిపాదించేది కావ్య మనబడుతుంది. దేవతా లబ్ధమైన శక్తిలేకపోతే, స్వీయ కపోల కల్పితమైన స్తోత్ర కావ్యాన్ని రచించినట్లైతే, అందు గుణాలకంటెనూ దోషాలే అధికంగా దొర్లుతాయి. స్వదోషానుసంధానంవల్ల భయమూ, భగవద్గుణాను సంధానం వల్ల అభయమూ కలుగుతుంది కదా!

*తన్మే సమర్పయ మతించ సరస్వతీంచ:*- అందువల్ల, స్తోత్రం చేయదగిన బుద్ధిని ప్రసాదింపుమని ప్రార్థించడ మవసరమయింది. 'బుద్ధిః సర్వార్థ సాధికా', "బుద్ధిర్మేధా స్మృతిస్తథా"- సంగతమైన అనుభవాలను ధారణ చేసే మేధతో, తత్కాల స్ఫూర్తిని కలిగించే స్మృతితో కూడి, సమగ్రంగా వ్యవహారాలను పరిశీలించి, సాధించే బుద్ధి జ్ఞాన మనబడుతుంది. ఇట్టి నిర్దుష్టమైన జ్ఞానం భగవదనుగ్రహం వల్లనే కలుగుతుంది.

బుద్ధిని ప్రకాశింపజేసేది మాట. అభిలషితార్థాన్ని ప్రకటించే వాక్కు అని భావం. మాట పెదవి దాటి బయట పడితే, పృథివిలోనే ఉండదు, అది ఆకసానికి చేరుతుంది. *"శబ్దగుణకం ఆకాశం"* అన్నారు విజ్ఞులు. కాబట్టి, ధీశక్తిని, వాక్పాటవాన్ని అనుగ్రహించుమని దేశికులు ప్రార్థించారు.

*త్వా మంజసాస్తుతి పదైర్య దహంధినోమి*- తల్లి చెప్పిన మాటను పాటించి బాలుడైన ధ్రువుడు అడవిలోకి వెళ్ళి అచంచల విశ్వాసంతో భగవంతుణ్ణి నిరంతరం ధ్యానంచేశాడు. భగవానుడు ప్రసన్న హృదయుడై ధ్రువునికి ప్రత్యక్షమయ్యాడు.

నిజసౌందర్యాహృత అశేషమనో నయన కమల దళాయత లోచనుడు, అత్యుజ్జ్వల విద్రుమ సమాన వదనుడు, నీల రత్న సదృశ దివ్యరూపుడు, శ్రీ వత్స కౌస్తుభ పీతాంబర వనమాలాది విరాజితుడు, గరుడారూఢుడునూ అయిన భగవానుణ్ణి చూచాడు. అందరి హృదయాల్లో ప్రకాశించే పరమాత్ముడెట్లుంటాడో తెలియదు. తన ముందున్న స్వరూపాన్ని జూచి ఏదో మాటను పల్కాలని

అనుకొన్నాడు. కాని, పలికే విధం తెలియక అంజలి ఘటించి తహతహ పడుతున్నాడు బాలుడు. ఆకలితో చాలా బాధపడుతున్నవానికి వెంటనే భోజనం పెట్టకపోతే ప్రాణాలు నిల్వనట్లు ఉన్న బాలుని స్థితిని గమనించిన భగవానుడు వేదమయమైన తన శంఖంతో ధ్రువుని చెక్కిలిని స్పృశించాడు. ఈ భావమున్న శ్లోకం శ్రీమద్భాగవతంలో ఉంది.

*"సతం వివక్షం తమతద్విదం హరిః జ్ఞాత్వాఽస్వ సర్వస్య చ*
*హృద్య వస్థితః కృతాంజలిం బ్రహ్మమయేన కంబునా*
*పస్పర్శ బాలం కృపయా కపోలే" (భా.గ. 4-9-4)*

వెంటనే ధ్రువుడు ఆనందంతో- *"ఈ శానుగ్రహ సంప్రాప్త వాగత్యద్భుత వృత్తిభిః ద్వాదశాదిత్య సంకాశం శ్లోకై రస్తౌద్ధరింధ్రువః॥"* భగవంతుని అనుగ్రహం చేత పొందబడిన జ్ఞానంవల్ల, పంద్రెండుగురు సూర్యులు ఒకే సమయాన వెలుగుతున్నట్లు దివ్యతేజస్సుతో ప్రకాశిస్తున్న శ్రీహరిని అత్యద్భుతమైన వాక్ శక్తి గలిగిన అనేక శ్లోకాలచే ధ్రువుడు స్తుతించాడు కదా!

ఆ విధంగా నేను నిన్ను స్తుతించకుండా ఉంటే బొందిలో ప్రాణం నిలిచే స్థితి లేదు కాబట్టి, నీవు మతిని, సరస్వతినీ నాకు ప్రసాదిస్తే, స్తుతింపదగిన పదాలను ప్రయోగించి, అనేక శ్లోకాలతో నిన్ను శీఘ్రుంగా ఆనందింప జేయగలను అని స్వామి దేశికన్ ప్రార్థించడం గమనించ దగినది.

ఇక, ఈ శ్లోకమందలి శబ్దాల ప్రయోగం వల్ల స్ఫురించే విశేషార్థాలను తెలుసుకొందాం.

కథం వా, వ్యాహరామి- 'వ్యాహర' (వి-ఆ-హృ-) శబ్దం జ్ఞానార్థకం. ఆలాపనను తెల్పుతుంది.

వ్యాహార ఉక్తిర్లపితం (అమరం). ఎలాగైనా పలుకుతాను, అని అర్థం. ప్రణవం- ఓంకారం. ప్రణవాన్ని అనుసరించి భూః, భువః, సువః అనే మూడు

వ్యాహృతులు ఋగ్యజుస్సామవేద సారమని పిండితార్థం. గాయత్రీమంతమందు 'ఓం భూః తత్సవితుర్వరేణ్యం, ఓం భువః భర్గో దేవస్య ధీమహి; ఓగ్ం సువః ధియో యోనః ప్రచోదయాత్' అని మూడు పాదాలు మూడు వ్యాహృతుల పూర్వకంగా ఆచార్యుడు ఉపదేశిస్తాడు. 'సావిత్రీంభో అనుబ్రూహి' అని వటుడు కోరగా, ఉపదిష్టమైన ఈ సావిత్రీ మంత్రం వటువుచే జపింపబడుతుంది. వేద మాతయైన ఈ గాయత్రీ మంత్రాన్ని మొదట శ్రీమన్నారాయణుడు తన పుత్రుడైన బ్రహ్మదేవునికి ఉపదేశించాడు. "యో బ్రహ్మాణం విదధాతి పూర్వం, యోవై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై" అనే ఉపనిషద్వాక్యం ద్వారా ఈ విషయం ప్రకాశిస్తున్నది.

"తేనే బ్రహ్మ హృదా య ఆదికవయే"- యః- ఎవడు అంటే పరబ్రహ్మయే; హృదా= భక్తి లేదా శ్రద్ధతో; ఆదికవయే= ఆదికవియైన బ్రహ్మదేవునికోసం; బ్రహ్మ= వేదశబ్దరాశిని (వేదాన్ని); తేనే= విస్తరించెను. అని శ్రీమద్భాగవతంలో 'జన్మాద్యస్య' అనే శ్లోకమందు ఈ వాక్యమున్నది. తనను స్తుతించడానికి తన పుత్రునికి ఉపదేశించాడు.

*ఖద్యోతవత్ ప్రలఘు సంకుచిత ప్రకాశః*- 'ఖం' అంటే ఆకాశం. 'ద్యోత' శబ్దానికి ప్రకాశమని అర్థం. ఆకాశమందు ప్రకాశించేవాడు సూర్యుడు. సూర్యునివలె స్వల్పమైన, సంకుచితమైన- సహస్ర పరిమిత తేజస్సు కలవాడు కాడు భగవానుడు. అప్రమేయ తేజస్సంపన్నుడైన నారాయణుడు సూర్యమండల మధ్యవర్తియై యున్నాడు.

ఖద్యోత మంటే, మిణుగురు పురుగు, సూర్యుడు అని అర్థాలున్నాయి. అంతే కాదు; *"ఖం బ్రహ్మ; కంబ్రహ్మ"* అన్నది వేదం. ద్యోతమంటె ప్రకాశం.

*"అనుగత కథనే జ్ఞాన మర్థప్రకాశౌ"* (తత్త్వముక్తాకలాపం 11-5) అంతట ప్రకాశించే ప్రభవంటిది జ్ఞానమని అర్థం. కాబట్టి 'ఖద్యోత' మంటే బ్రహ్మజ్ఞానమని భావం.

నేను మిణుగురు పురుగువంటివాడను. దేవదేవా! నీవు మాత్రం ప్రకాశమే స్వరూపంగా కలవాడవని స్వామి దేశికన్ భావించడం గమనించదగినది. ప్రకాశమే స్వరూపంగా ఉన్న దేవదేవునికీ, మిణుగురు పురుగుల వంటి దేవతలకూ ఎంతో వాసి– భేదమున్నది అని 'తాత్పర్య చంద్రిక'లో సాధింపబడింది. అందుకు ప్రమాణం "కీటాః సమస్తాః సురాః" అని ముకుందమాల– (19)లో ఉదాహరింప బడింది. తన్మే సమర్పయ– ఈ వాక్యంలోని 'తత్' అనే పదం గాయత్రీ మంత్రంలోని సరస్వతి (వేదవాక్కు) ఆచార్యులదెందమందు స్పందించింది. 'ఖద్యోత' మనేది సవితృనామధేయమే. 'వరద' శబ్దమందు 'వరేణ్యం' సూచితం. 'ప్రకాశ'మనే పదంలో 'భర్గః' ఒదిగి యున్నది. దేవుని స్తుతించే విషయం కాబట్టి 'దేవస్య ధీమహి' అంతర్గతమైనది. 'మతిం' అనే పదం మంత్రమందలి 'ధియః' అనే పదానికి పర్యాయంగా ఉంది. 'మే, సమర్పయ'– అన్నచోట 'నః ప్రచోదయాత్' సరిపోయింది.

బ్రహ్మదేవునికి "ప్రచోదితా యేన ప్రచేతసే" అన్నట్లు వేద సరస్వతిని ప్రచోదనం చేసినట్లే, నాకు ధీశక్తినీ, వాక్పాటవాన్నీ ప్రసాదించు స్వామీ! అని నమ్రతతో క్రమంగా ప్రార్థింపబడింది. తత్ఫలితంగా 'పాత్యేగేయేచ మధురం' అన్నట్లు, సర్వశ్రుతి మనోహరమైన శ్లోకాలతో స్తుతిచేసి నిన్ను ఆనందింప జేయగలను. "అథవా కింను సమర్పయామితే" లేకుంటే, నేను నీకేమి సమర్పించ గలను? ఓ వరదరాజా! ఆళ్వార్లకు 'మదినలమ్' భక్తిరూపజ్ఞానాన్నీ "సారస్సార స్వతానాం శఠరిపుఫణితిః" సారస్వత సారమైన సరస్వతినీ కృప జేశావు. అందువల్ల ఆళ్వార్లు తమ దివ్య ప్రబంధంలో మొదటి శతకం నీ విషయమే మధుమయ ఫణితితో గానం చేశారు.

'తత్కురుష్వమదర్పణమ్'– అంటావు స్వామీ! నిజమే. నీవు నాకు బుద్ధినీ, అంతర్వాహినియైన సరస్వతినీ (వాగ్ఝరిని) దానం చేయవయ్యా! దాని ఫలాన్ని "త్వదీయం వస్తు గోవింద! తుభ్యమేవ సమర్పయే" అన్నట్లు, నాదేముంది? నీ

వస్తువును నీకే సమర్పిస్తాను- అని ఆకించన్యాన్ని ప్రకటించుకొన్నారు దేశికులు. వసంత తిలక- త భ జ జ గ గ.

5. *మచ్ఛక్తి మాత్రగణనే కిమిహాస్తి శక్యం*
*శక్యేన వా తవ కరీశ! కి మస్తి సాధ్యమ్!*
*యద్యస్తి సాధయ మయా తదపిత్వయావా*
*కిం వా భవేత్ భవతి కించి దనీహ మానే॥*

**అర్థం:** హే కరీశ!= ఓ కరిగిరినాథా!; మత్+శక్తి మాత్రగణనే= నా శక్తినంతటినీ పర్యాలోచన చేయడమందు; ఇహ= ఈ ప్రపంచమందు; శక్యం= చేయదగినది; కిం= ఏమి; అస్తి= ఉన్నది? (ఒక్కటి కూడా లేదు); శక్యేన, వా= చేయకూడిన దానిచేత నైననూ; తవ= నీకు; సాధ్యం= సాధింపదగిన వస్తువు; కిం= ఏది; అస్తి= ఉన్నది? యది; అస్తి= ఒకవేళ ఉన్నట్లైతే; మయా= నా చేత; సాధయ= సాధింపుము; తత్, అపి= అదికూడా; త్వయా, వా= నీ చేతనే (సుమా); భవతి= నీవు; కించిత్= కొంచెమైనా; అనీహమానే (సతి)= ఇచ్ఛ-సంకల్పించనప్పుడు; కిం, వా=ఏదైనను; భవేత్= అవుతుందా?

**తా॥** ఓ హస్తిగిరీశా! నీవు నా శక్తిని లెక్కిస్తే లోకంలో నేను చేయకూడిన దేముంది? శక్యంతో నీకు సాధింపదగినదేదైనా ఉందా? నాకు శక్యమైనది లేదు. నీకు సాధింపరానిది లేదు. నీవేమైనా ఉన్నదనుకొంటే, అట్టి వస్తువును కూడా నీవే నా చేత సాధింపజేసుకోవయ్యా! నీ సంకల్పం లేకుండా లోకంలో ఏదైనా జరుగుతుందా? జరుగదు కదా!

**వ్యాఖ్య:-** భగవంతుణ్ణి ప్రార్థిస్తే, ఆయన అనుగ్రహం చేతనే స్తోత్రం చేసే సామర్థ్యం కలుగుతుందని భగవదభిముఖుడై ప్రార్థించే శ్లోకమిది.

ఏమయ్యా! ఆచార్యా! మతిని, సరస్వతినీ నేను అనుగ్రహిస్తే- ధ్రువునికి వాక్ శక్తిని ప్రసాదించినట్లు సహకరిస్తే- స్తోత్రం చేసి నన్ను సంతోష పరచగల నంటావేమి? ధ్రువుడు ఐదేండ్ల బాలుడు. నీవు అతనివలె బాలుడవు కాదు

కదా! అతనికి పుట్టినప్పుడే ఇచ్చిన శక్తి బాల్యమందు ప్రబుద్ధం కానందువల్ల సహకరించవలసి వచ్చింది. అతడీ విషయాన్ని స్తోత్రారంభంలోనే విన్నపించాడు.

"యోఽన్తః ప్రవిశ్య మమవాచ మిమాం ప్రసుప్తామ్"- ప్రళయ కాలమందు చేష్టలుడిగి యున్న నావలె అతని వాక్కు కూడా ప్రలీనమై- ప్రసుప్తమై యున్న భావనను ధ్రువుడు ప్రకటించాడు కదా!

"శక్తిర్ని పుణతాలోక శాస్త్ర కావ్యాద్య వేక్షణాత్।
కావ్యజ్ఞ శిక్షయాభ్యాసః ఇతిహేతు స్తదుద్భవే॥"

దైవానుగ్రహ లబ్ధశక్తి, శాస్త్రకావ్యాదులను అవలోకన చేయడం వల్ల కలిగే నైపుణ్యం, గురువువద్ద సుశిక్షణతో చేసే కావ్యాభ్యాసం- ఈ మూడు కలిసి, కావ్య రచనోత్పత్తికి ఒక్క కారణమవుతుంది.

మునుపే కావ్య రచన కోసం కవికి కావలసిన సామగ్రి అంతా నీకు సిద్ధమైయున్నది. నీవు పుట్టిన సమయమందే కవితాశక్తి నీకు దైవదత్తమైనది. బాలుడైన ధ్రువునికి వలె నీకు ఆ వాక్ శక్తి ప్రసుప్తమై లేదు కదా! నీకు అది ఎప్పుడో అభివ్యక్తమై ప్రాప్తించింది. ఇదివరకే నీవు ఎన్నో స్తోత్రాలను, కావ్యాలను ఆ కవితా సామగ్రిని పొందియే కదా రచించావు. ఆ శక్తినే గ్రహించి స్తోత్ర నిర్మాణం చేయుమయ్యా! మళ్ళీ, శబ్దార్థ సహితమైన వాక్కును ఇప్పుడు యాచిస్తున్నావేమి?

ఇంతకు, ఈ స్తోత్రం చేయడమనే క్రియకు కర్తృత్వం ఎవరికి? నీకా? నాకా? లోకంలో కర్త నొక్కరినే ద్వారంగా చేసుకొని కారయిత నడిపిస్తుంటాడు. ఇక్కడ ద్వారమైన కర్తకే కర్తృత్వం ఉంటుంది. అలాగా, నీకు దీనియందు కర్తృత్వమా? నాకు కారయితృత్వం మట్టుకేనా? అథవా, నాకు కారయితృత్వంతో పాటు కర్తృత్వం కూడా ఉంటుందా?

ప్రయోజనాన్ని ఉద్దేశించకుండా మందమతికూడా ప్రవర్తించదు, అంటారు కదా! ఈ స్తోత్రం చేసే విషయంలోనూ నేను చేరితే, నాకేమి ప్రయోజనం? నేను ఆప్తకాముడను కాదా?

"ఆప్తకామస్య కా స్పృహా?"- అవాప్త సమస్తకామునికి ఏమి ఆశ ఉంటుంది?- అనే మాండుక్యోపనిషద్వాక్యం నీకు తెలిసే ఉంటుంది కదా! ఇక నాకు కొత్తగా కావలసియుండే స్వప్రయోజనం ఎందుకు ఉంటుంది? నేను నీవు చేసే స్తోత్ర విషయంలో ఎందుకు చొరవ చేసుకోవాలి?

ఈ విధంగా అనేక శంకలు ఉండగా, వీటినన్నిటినీ మొదలే తేటతెల్లంగా తీర్మానించుకొనే వ్యవస్థ నేర్పరుచుకొని, ఒక వ్యాపారానికి పూనుకోవాలి అని కరిగిరినాథుడు చెప్పగా విన్న వాటికన్నిటికీ సమాధానం దేశికులచే సుశ్లోకితం.

హే కరీశ! మచ్ఛక్తిమాత్ర గణనే కిమిహాస్తిశక్యమ్- ఓ కంచీపురాధీశ్వరా! నా శక్తి నంతటినీ విచారిస్తే ప్రపంచంలో శక్యమైన దేముంది? ఏ కార్యానికైననూ ఉపయోగపడునట్టి అపృథక్ సిద్ధమైన విశేషణమే 'శక్తి' అని లక్షణంగా చెబుతారు విజ్ఞులు. నా శక్తిని మొత్తం కూడదీసుకొన్నా ఒక్క కార్యం చేయనలవి కాదు. 'మాత్రం' అనేది సమస్తమని అర్థమిస్తుంది. దేవా! నీ శక్తి మాత్రం అనంతమైనది కదా! నాకున్న శక్తి విపరీత లక్షణం కలది. నీ ఇచ్ఛలేనిచో నా శక్తి ఏ పని చేయజాలదు ('శక్తి' అంటే ఇక్కడ జ్ఞాన శక్త్యాదులన్ని అనే అర్థాన్ని గ్రహించాలి).

*"అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్।*
*వివిధాచ పృథక్ చేష్టా దైవం చాత్ర పంచమమ్॥"*

శాస్త్ర సిద్ధమైనవిగానీ, నిషిద్ధమైనవిగానీ- కాయిక, వాచిక, మానసమైన సమస్త కర్మలకును- స్తుతించడానికి కూడా- ఐదు కారణాలుంటాయి. అవి 1) జీవాత్మకు స్థానమైన శరీరం, 2) జ్ఞాతృత్వ, కర్తృత్వంగల జీవాత్మ, 3) వేర్వేరు వ్యాపారాలు గల కర్మేంద్రియాలు, మనస్సు కూడా, 4) నానా విధమైన ప్రాణాపానాది పంచవాయువుల చేష్టయు, 5) ఐదవదియైన అంతర్యామి పరమాత్మయు కర్మహేతు సముదాయమందు కారణాలు- అని గీతాచార్యుడు (భ.గీత. 18-14) నరునికి ఉపదేశించినవి నిరంతరం స్మరణీయాలు. ఆ ఐదింటిలో ప్రధానమైనది దైవమే అని చెప్పబడింది కదా!

"*యా స్వయం పద్మ నాభస్య ముఖపద్మాద్విని సృతా*"- అని ఆర్షవాక్యం ప్రకారం, శబ్దం పుట్టుచోటు భగవానుని నాభికమలమే, శబ్దం వెలువడే ద్వారస్థానం భగవానుని ముఖపద్మమే, అని శ్రీమద్రామానుజుల వారి వ్యాఖ్యను గౌరవంగా, గీతను సుగీతగా పాటించవలసిందే కదా! అంతే కాదు

"*తత్రైవం సతికర్తారమాత్మానం కేవలంతుయః।*
*పశ్యత్య కృతబుద్ధిత్వాత్ నసపశ్యతి దుర్మతిః॥*" (భ.గీ. 18-16)

ఆయా కర్మ ప్రారంభహేతు విషయంలో జీవుని ప్రవృత్తి స్వబుద్ధి పూర్వకమైనందువల్ల విధి నిషేధాలకు అతడే పాత్రుడౌతాడు. తర్వాత అంతర్యామి యైన పరమాత్మ యొక్క అనుమతిచే సాగడంవల్ల జీవుని కర్తృత్వం పరమాత్మకు అధీనమై యుంటుంది. ఇలాగా, జీవుని కర్తృత్వం పరమాత్మానుమతి పూర్వకమైనదవుతుంటే, కేవలం తననే కర్తనుగా తలచేవాడు విపరీత బుద్ధి (మతి) కలవాడు. అట్టి దుర్మతి, వస్తువులను యథావస్థితంగా- ఉన్న రూపున తెలియని బుద్ధికలవాడే సుమా! కర్తను కూడా యథావస్థితంగా తెలుసుకోలేదు. ఇలా (గీతాచార్యుడు) తన గీతకు రామానుజ యతీంద్రులు భాష్యం రచించే భాగ్యం కల్పించిన శ్రీకృష్ణ భగవానుణ్ణి స్తుతించడం జీవలక్షణమే కదా! అని శ్రీ తాత్పర్య చంద్రిక.

ప్రబంధ నిర్మాణం కోసం చేతనుడనే జీవునికి శక్తిని ఆధానం చేసే వాడవు (భగవానుడవు) నీవే కదా! అని ఈ శ్లోకంలోని మొదటి చరణం సూచిస్తున్నది.

*శక్యేన వా తవకరీశ! కిమస్తి సాధ్యమ్*- ఎంత శక్తి నాకు కలదని నీవనుకుంటున్నావో అట్టి శక్తిచే చేయదగిన కార్యంచేత సర్వజ్ఞుడవైన నీకు కూడా సాధింపదగిన ప్రయోజన మేముంది? నాకు శక్యం కాదు; నీకు సాధ్యమైన లాభమేముంది? ఏ లాభమూ లేదు. ఇదొక రకమైన విచిత్రపద్ధతి. ఇందుకు పరిహారమేమి? అంటే, నీ సంకల్పంచేతనే నా శక్తి పనిచేస్తుంది. నా మనోరథాన్ని సంపూర్ణంగా నెరవేర్చినట్లైతే, నీ ఇచ్ఛ చేతనే, నా శక్తిచేత సాధింపదగిన

ప్రయోజనమే నీ ప్రయోజనమవుతుంది. చేయించేవాడవు- కారయితవు- నీవే. చేసేవాడను- కర్తను- నేను.

"స్వేచ్ఛాయాం సర్వసిద్ధిం వదతి భగవతోఽవాప్త కామత్వ వాదః"
(తత్త్వముక్తా కలాపం- నాయక సరం.శ్లో.-)

నీ యనుగ్రహం ప్రవహిస్తేనే అన్నీ సిద్ధిస్తాయి అని చెప్పబడింది. 'శక్య'మనే అర్థమందే 'సాధ్య' మనే అర్థం ఇమిడి ఉంది. శక్యం కాకపోతే సాధ్యముండదు. నీవు అవాప్త సమస్తకాముడవే అయినా, "సోకామయత-బహుస్యాంప్రజాయేయ"- నేను అనేక విధాలుగా అవుతాననే కామం-కోరిక-కలవాడవయినావు కదా! ఇలా నీవు ఆప్తకాముడవు, సత్యసంకల్పుడవని వేదనాదం వినపిస్తున్నది. నీవు కోరినదెల్ల సాధ్యమవడానికి ఆలస్యమే ఉండదు. కాబట్టి నీ సంకల్పమే చాలు. పరప్రయోజనాన్నే అభిమానించే నీకు సాధ్యమనేది స్వప్రయోజనమే అవుతుంది. నీవు సంకల్పించినప్పుడే నీకు అంతా సిద్ధించే పూర్ణకాముడవు అని పూర్వార్థం.

యద్యస్తి సాధయమయా- 'మయా' అనే పదం తృతీయావిభక్తి. కాబట్టి 'కరణం' అంటారు. సాధింపదగినదేదో అది నన్ను నీవు ఉపకరణంగా గ్రహించి సాధిస్తే నీకు లాభం- స్వప్రయోజనమవుతుంది.

నీవు ఇచ్చిన శక్తితో కూడి, నన్ను పరికరంగా గ్రహించి సాధింపదగినది- నీదే అని నీవు అభిమానించే నా ప్రయోజనమైన ఈ స్తోత్రమే నీకు ప్రయోజనంగా- లాభంగా ఉంటుంది.

తదపి త్వయావా- నన్ను ఉపకరణంగా- ఒక వస్తువుగా భావించడం కూడా సరిపోదు. నేను అనేది ఎవరు? నీ శక్తియే.

ప్రకృతి ఎట్లు నీకు శక్తియో, అట్లే చేతన- జీవ- వర్గమంతా నీ శక్తియే. "సకలం తద్ధితవైవ మాధవ"- (స్తోత్రరత్నం) సమస్తం నీదే సుమా! ముఖ్యంగా కర్తవు నీవే, కారయితవు నీవే.

ప్రతి ప్రాణికి అంతర్యామిగా ఉన్నవాడు 'దివ్య దేవ ఏకో నారాయణః' అని సుబాలోపనిషత్తు ఉద్ఘోషిస్తుంది. 'కరీశ' అనే పదప్రయోగం చేత, నీవు ఈశుడవని, నేను అనీశుడను (దాసుడను) అని ప్రార్థన చేస్తున్నాను. అంతే కాదు, నా వంటి చేతనుల (జీవుల) ఆర్తిని పోగొట్టి రక్షించేవాడవు నీవే అని ప్రార్థన కదా! కాబట్టి, నీకు నేను అనన్యుడనని భావిస్తూ, నీవే స్తోత్రాన్ని నిర్వర్తించాలి.

కింవా భవేత్ భవతి కించి దనీహ మానే- నీవు ఈ స్తోత్ర విషయంలో ఇచ్ఛయించవలెను. నీ ఇచ్ఛ లేకుండా ఏ కార్యమూ జరుగదు. 'నీవు చేసే స్తోత్ర మందు నేను ప్రవర్తించడమా?' అనే సంశయం నీకు కలుగ కూడదు స్వామీ! అంటున్నారు దేశికులు. భగవానుడు సృష్ట్యాది నిర్వాహకుడు కదా!

*"నా వేక్షసే యది తతో భువనాన్యమూని*
*నాలం ప్రభో! భవితు మేవ కుతః ప్రవృత్తిః"* (స్తో.ర. 10)

ప్రభో! నీవు శ్రియః పతివి. అవాప్త సమస్త కాముడవు. మూల ప్రకృతిలో లీనులై కరణకళేబరాలు లేక అసత్కల్పులైన చేతనుల దుఃఖాన్ని చూచి 'భృశంభవతి దుఃఖితః' అన్నట్లు వాళ్ళకంటె అధికంగా దుఃఖంగల వాడవై వాళ్ళ దుర్గతిని జూచి కృపాపరతంత్రుడవై ఈ లోకాలను సృష్టించడానికి కటాక్షించకుంటే, అవి ఉండడానికే సమర్థమైనవి కావు. ఇక ప్రవృత్తి నివృత్తులెట్లు కలుగుతాయి? ఇక్కడ ప్రవృత్తికి యోగ్యతను ప్రదర్శించడానికి కైముత్య న్యాయాన్ని ఉద్ఘాటించారు శ్రీయామునాచార్యులు అని దేశికులు స్తోత్రభాష్యమందు ప్రకటించారు.

ఇక్కడనే స్తోత్రానికి కావలసిన శక్తిని మొదలైనవాటిని సంపాదించడానికి ప్రార్థిస్తూ- శ్రీహరియందు కారణత్వం, నియంతృత్వం, సుహృత్త్వం, స్వామిత్వం, వాత్సల్యం అనే ఈ ఐదు (5) గుణాలు శ్రీయామున మునులచే కంఠోక్తమైనాయి అని దేశికులు భాష్యమందు చెప్పినట్లే, ఇక్కడ కూడా ఆ గుణాలను అనుసంధించారు.

'నావేక్షసే' (కటాక్షించకుంటే) అనే పదానికి 'భవతికించిత్ అనీ హమానే' (నీవు కొద్దిగ సంకల్పించకుంటే) అనీ; 'భవితుం, అలం' అనే పదానికి 'భవేత్' (కావడానికి సమర్థమయ్యేదా?) అన్నారు దేశికులు.

నా స్తోత్రాన్ని నేనే చేయడమూ, చేయించడమూ ఉంటుందా? అని బిడియ పడి నీవు ఉదాసీనుడవై యుండకూడదు స్వామీ! అలా ఉంటే ఏమి లాభం? నీవు ఈ హోహలు లేకుండా ఉంటే స్తోత్రం నిర్వర్తింపబడేదెట్లు? నీవే నిర్వర్తించి తీరాలి అని నేను ఆశ పడుతుంటే నా ఇష్టం వచ్చినట్లు ఉంటాను అనడంవల్ల నీకు 'భక్తచ్ఛందానువర్తి' అనే పేరు చెల్లుతుందా? నీ యిచ్ఛ లేకుంటే నా సత్తాస్థితులు లేకుండా పోతాయి. ఇక ఈ స్తోత్ర ప్రవృత్తి ఎలా సాధ్యమవుతుంది?

ఈ చివరి చరణమందు రెండు వాక్యాలుండడం వల్ల ఒక విధంగా యోజన చేయవచ్చు.

కిం వా భవేత్, భవతి- ఏది ఉండవలెనో అది ఉంటుంది.

కించిత్ అనీహమానే- అత్యంతం ఆకించన్యాన్ని అవలంబించి ఆయన ఇష్టపడినట్లే చేయుగాక అని నేను నిశ్చేష్టుడనై ఉంటే- ఆయనే గతి యని అనిశ్చలుడనై యుంటే- ఆయన మనసు రీతిగా నా మనస్సునూ, ఇంద్రియాలను కూడా నిల్పి కార్యాన్ని సాధించి విడుస్తాను. ఏది కావలసి ఉందో అది అవుతుంది.

'ఈహ' అంటే చేష్టయందు పట్టిన పట్టు. 'ఈహ-చేష్టాయాం' భగవానుని అనుమతి చేతనే స్తోత్రం చేయ శక్యమవుతుందని సారార్థం. వసంత తిలక.

6. *స్తోత్రం మయా విరచితం త్వదధీన వాచా*
*త్వత్ ప్రీతయే వరద యత్ తదిదం న చిత్రమ్।*
*ఆవర్జయంతి హృదయం ఖలు శిక్షకాణాం*
*మంజూని పంజర శకుంత విజల్పితాని॥*

**అర్థం:** హే వరద= ఓ వరదా!; త్వత్+అధీన వాచా= నీకు వశమైయున్న వాక్కును కలిగియున్న; మయా= నా చేత; విరచితం= రచింపబడిన; స్తోత్రం= (ఈ)స్తోత్ర మనేది; (మంజు సత్= మనోజ్ఞమైనదవుతూ) త్వత్ ప్రీతయే= నీ సంతోషం కోసమే; (భవతి= అవుతుంది) (ఇతి= అని) యత్= ఏదైతే ఉన్నదో; తత్= ఆ; ఇదం= ఈ విషయం; న, చిత్రం= ఆశ్చర్యం కాదు; (ఎలా? అంటే). మంజూని= మనోహరమైన; పంజర శకుంత విజల్పితాని= పంజరమందున్న చిలుక (పక్షి) యొక్క అర్థం లేని చిన్న చిన్న మాటలు; శిక్షకాణాం= పక్షులకు మాటలను నేర్పిన వాళ్ళ యొక్క; హృదయం= మనస్సును; ఆవర్జయంతి, ఖలు= సంతోషపరచి ఆకట్టుకొంటాయి కదా!

**తా॥** ఓ దేవరాజా! నీ యధీనమైన వాక్కుగల నేను రచించిన స్తోత్రమనేది నీ సంతోషం కోసమే సుమా! మనోజ్ఞంగా ఉండే పంజరంలోని చిలుక పల్కులు, మాటలను నేర్పిన శిక్షకులకు హృదయావర్జకంగా ఉంటాయి కదా!

**వ్యాఖ్య:-** ఈ స్తోత్ర రచన భగవత్ప్రీత్యర్థమే అని దృష్టాంతంగా చెప్పే శ్లోకం.

ప్రకృతి సంబంధమైన వాసనలేని, సర్వజ్ఞులైన నిత్యసూరులచేతనూ, ముక్త పురుషుల చేతనూ, చతుర్ముఖ పంచముఖ, షణ్ముఖ శతమఖాది బర్హిర్ముఖుల చేతనూ, నాకు సంతోషాన్ని కలిగించే దివ్యమైన స్తోత్రం చేయబడుతుండగా, ప్రకృతిబద్ధుడవై, స్వల్ప జ్ఞానంగల నీవు స్తోత్రం చేసి నన్ను సంతోష పెడుతానంటావు. నీ మాట చిత్రంగా ఉంది కదా! ఆచార్య! అని దేవరాజు అనగా దేశికులీ శ్లోకంతో సమాధానమిస్తున్నారు.

హే వరద! త్వదధీన వాచా మయా విరచితం స్తోత్రం- అభిలషితార్థ ప్రదుడవైన ఓ సర్వేశ్వరా! నీవే నన్ను శరీరంలో బంధించినావు. 'య ఆత్మదా బలదా', అన్నట్లు జ్ఞాన శక్త్యాదులను కలిగించే, నీ యధీనంలోనే ఉన్న వాక్కునే నాకు సంథ చెప్పావు. శిక్షకుడవు నీవే కదా! నీవు బోధించిన వాక్కు చేతనే కదా నేను స్తోత్రం చేసేది.

త్వత్ ప్రీతయే యత్తదిదం నచిత్రమ్– నీర జాక్షా! నీవు చెప్పిన విద్యయే మనోజ్ఞమైనదని భావించి, అది నీకు సంతోషం కలిగిస్తుందనే స్తోత్రం చేస్తే, చిత్ర మంటావేమి? స్వామీ!

ప్రసన్న జనకూటస్థులైన శ్రీపరాంకుశుల సంప్రదాయస్థుడనే నేను.

*"ఎన్ శొల్లాల్ యాన్ శొన్న ఇన్ కవియెన్బిత్తు*
*తన్ శొల్లాల్ తాన్ తన్నై క్కీర్తిత్త మాయన్,*
*ఎన్ మున్ శొల్లుమ్ మూవురు వాముదల్వనే॥ (తి.వా.మొ. 7-9-2)*

బ్రహ్మరుద్రాదులకు అంతర్యామియై యుండి సృష్ట్యాదులను చేసి, ఆ వ్యాపారాలన్నీ వారే చేసినారని ప్రసిద్ధిని చేయించాడు ఆ జగత్కారణుడు. అట్లే, నాకు ముందే సంథను జెప్పిన వాడై, నా వాక్కుచే చెప్పిన (ఈ తిరువాయిమొషి) మధురమైన కృతియని ప్రసిద్ధి జేయించి, తన వాక్కుచే తానే తనను ప్రతిపాదించే స్తోత్రం చేసుకొన్న ఆశ్చర్య భూతుడు. అని ఆళ్వార్లు చెప్పిన విషయం వింతకాదు కదా! ప్రభూ!

ప్రకృతి బద్ధుడనై గుణసహితంగానో రహితంగానో, నేను అల్పజ్ఞతతోనే స్తోత్రం చేయవచ్చు. ఉపాధ్యాయుడు సంథ చెప్పిననూ, శిష్యులందరు నిర్దుష్టంగా పల్కలేరు కదా!

*"వితరతి గురుః ప్రాజ్ఞే విద్యాం యథైవ తథాజడే*
*నతుఖలుతయోర్జ్ఞానే శక్తిం కరోత్యపహంతివా।*
*భవతి హి పునర్భూయాన్ భేదః ఫలం ప్రతి తద్యథా*
*ప్రభవతి శుచి ర్బింబగ్రాహే మణిర్నమృదాదయః॥ (ఉ.రా.చ. 2-4)*

గురువు శిష్యులలో ప్రాజ్ఞునికీ, జడునికీ ఒకే విధంగా బోధిస్తాడు. ఒకనికి ఎక్కువ శక్తిని ఇవ్వలేదు, ఒకనికున్న శక్తిని అపహరించనూ లేదు. అయినా ఫలితంలో చాలా భేదముంటుంది. వస్తువు మణిలో– అద్దమందు– ప్రతిఫలిస్తుంది. కానీ, మట్టి ముద్దలోనో, కట్టె పలకయందో ప్రతిఫలించదు

కదా! ఆ విధంగా నీవు చెప్పిన మాటయే అయినా నేను అర్థంలేని మాటగా విశేషమైన జల్పన చేసి యుండవచ్చు.

నాది విజల్పిత స్తోత్రమైననూ- వదరిన మాటలతో కూడిన స్తోత్రమైనప్పటికీ- బోధకుండవైన నీకు మనోజ్ఞంగానే ఉంటుందనడంలో విచిత్రమేమీ లేదు, అన్నారు దేశికులు. ఇందుకు దృష్టాంతముంటే చెప్పుమన్నారు దేవరాజు. చెబుతాను స్వామీ! అవధరించి అంగీకరించండి.

*ఆవర్జయంతి హృదయంఖలు శిక్షకాణాం*
*మంజూని పంజర శకుంత విజల్పితాని-*

లోకంలో సంపన్నులు- స్త్రీలు పురుషులు శుకశారికాది పక్షులను పంజరాల్లో బంధిస్తారు. ఆహారపానీయాలతో వాటిని పోషించి పెంచుతారు. విష్ణుపదంలో స్వేచ్ఛగా విహరించే శుకశారికాది శకుంతాలను పంజరాల్లో పెట్టి, విలాసంగా మాటలను, పాటలను నేర్పుతారు. శిక్షకులు నేర్పిన మాటలను జ్ఞానంలేని ఆ చిలుక, గోరువంక పక్షులు అర్థం తెలియక అసంబద్ధ ప్రలాపాలుగా ఉచ్చరిస్తాయి. అయినా, ఆ పక్షులచే జల్పితమైన వాక్కులను విని శిక్షకులు- మాలను నేర్పినవారు ఎంతో సంతోషపడుతారు.

మంజూని పంజరశకుంత విజల్పితాని- పంజరంలో బంధింపబడి యున్ననూ, నేర్పిన వారి మాటలను అవ్యక్తంగా పల్కిననూ, ఆ చిలుక పలుకులు మనోజ్ఞంగా, శ్రవణ సుభగంగా ఉంటాయని ప్రసిద్ధి.

"*మంజుగిరః శుకాః*" అని 'దండి' యనే కవి 'తేనెసొనల వలె మధుర వాక్కులను ఆలపించునట్టివి చిలుకలు' అన్నాడు.

"*శెవ్వాయ్క్కిళి నాన్మఱై ప్పాడుమ్*"- (తిరుచ్చిత్ర కూటత్తిల్) 'కెంపువంటి అరుణముఖం గల చిలుక చతుర్వేదాలను గానం చేస్తుంది' అన్నాడు తిరుమంగై మన్నన్.

గోదాదేవి పంజర శకుంతం పల్కినట్లు *"గోవిందా! గోవిందా!"* అనే పదమెత్తి పాడింది కదా!

*"ముని పరిషదిగీతం గౌతమీ రక్షణం తే*
*ముహురను కలయంతో మంజువాచః శకున్తాః।*
*ఉషసి నిజకులా యాదుత్థితా దండకేషు*
*స్వయమపి పదరక్షే! స్వైర మా(మ్రేడ యంతి॥"*

ఓ పాదుకాదేవీ! అహల్యా శాపవిమోచనం కోసం ఆమె పతితగా ఉన్న చోటికి శ్రీరామచంద్రమూర్తిని నడిపించి, పావనత్వాన్ని కలిగించి రక్షించిన నీ చరిత్రను దండకారణ్యంలో మునులు తమగోష్ఠిలో పాడినారు. వారి ఆశ్రమ వాటికలోని చెట్లపైన ఉన్న మంజు వాక్కుగల శుకశారికాది పక్షులు ఆ మునుల గీతాన్ని అనుకరించి అవ్యక్తమధురంగా పాడినాయి. అంతేకాదు, ప్రతిదినం ఉదయాన తమగూటినుంచి లేస్తూనే ఆ పక్షులు సుప్రభాతంగా స్వేచ్ఛతో ఆ గీతాన్ని మధురంగా అనేక పర్యాయాలు ఆలపిస్తుంటాయి అన్నారు శ్రీ వేదాన్త దేశికులు (పా.స.సంచార పద్ధతి-46).

*"తద్వ్యపదేశోఽ భాక్తస్తద్భావ భావిత్వాత్"*- (బ్ర.సూ. 2-3-17). స్థావర జంగమ పదార్థాలను తెలిపే శబ్దం, వాటిలో అంతర్యామిగా ఉన్నందువల్లనే, బ్రహ్మను ముఖ్యార్థంగా కలది అని సూత్రార్థం.

నా దేహమే పంజరం. ఆత్మయే చిలుక. అంతర్యామిగా ఉన్న శ్రియః పతియైన వరదుడే శిక్షకుడు.

శిక్షకుడవై నీవు ప్రసాదించిన వాక్కునే అనుకరించి, చిలుక జల్పించిన మధుర వాక్కులాగా ఉన్న ఈ నా స్తోత్రాన్ని మీరు విన్న వెంటనే, అది మీ హృదయాన్ని ప్రహ్లాద పరుస్తుంది- అని నైచ్యానుసంధానానికి పరాకాష్ఠయైన దృష్టాంతాన్ని చెప్పినారు దేశికులు. (చిలుక పల్కులు ప్రజ్ఞగలవి కావు. కాని

ఇంపుగా ఉంటాయని తాత్పర్యం) శ్రీ శుకముఖోద్గళితమైన అమృత ఫలరసమే భాగవతం కదా!

శిక్షకాణాం– మంజూని– ఆవర్జయంతి– వరద! అని సంబోధించి, తన 'స్తోత్రం' అని ఏక వచనప్రయోగం చేశారు. శిక్షకులకు శుకమధురాలాపాలు హృదయావర్జకంగా ఉంటాయని బహువచనాన్ని ప్రయోగించారు. లోకంలో శిక్షకులెందరో ఉంటారనేది దృష్టాంతం సామాన్యం. "స ఏకాకీ నర మేత"– ఒంటరిగా ఎవడు రమించ జాలడు. అని శ్రుతి పల్కుతుంది కదా! అంతే కాదు, 'ఏకః స్వాదు న భుంజీత'– మధుర పదార్థాన్ని ఒక్కడే అనుభవించ కూడదు అని కూడా ప్రకటిస్తుంది.

దేవరాజా! నీకూ, శ్రీభూనీళాది దేవి మారులకూ, ఇంపైన చిలుక పలుకుల్లాగా ఉన్న నా ఈ స్తోత్రాన్ని విన్నప్పుడు, అది లీలారసం– భోగరసం కల్పించకుంటుందా?

"*జిహ్వా మే మధు మత్తమా,– అమృతస్య దేవ! ధారణో భూయాసం*"– (శిక్షావల్లి) ప్రణవ స్వరూపా! నా వాక్కు చాలా మధుమతిగా ఉండాలి, దేవా! బ్రహ్మజ్ఞానాన్ని ధారణ చేసే వాడనై యుందును గాక! అని జీవుడు ప్రార్థిస్తుంటాడు.

"*మధుర వచనాం శారికాం పంజరస్థాం*"– అన్నట్లు, ప్రభూ! షడ్రసోపేతమైన మృష్టాన్నాన్ని నీవు నాకు ప్రసాదించగా 'అహమన్నాద' ఆ ప్రసాదాన్ని నేను అనుభవించి 'హా ఉ, హాఉ, హాఉ' అనే అవ్యక్త మధురమైన 'ముక్త గీతాన్ని' ఆలపిస్తే, నీ అంతరంగం అవశ్యంగా రసతరంగితమవుతుంది. ఆ రసఘనమైన బ్రహ్మానందభోగ భాగ్యాన్ని కృపజేయండి అని పిండితార్థం.

పంజరమందున్న చిలుక జల్పితానికీ, శరీరమందున్న జీవుని స్తోత్రానికీ బింబప్రతిబింబ భావమేర్పడినందువల్ల ఇది దృష్టాంతాలంకారం. వసన్త తిలక.

7. *యం చక్షుషా మవిషయం హయమేధ యజ్వా*
*ద్రా ఘీ యసా సుచరితేన దదర్శ వేధాః।*
*తం త్వాం కరీశ! కరుణా పరిణామత స్తే*
*భూతాని హన్త నిఖిలాని నిశామయంతి॥*

**అర్థం:** హే కరీశ!= ఓ హస్తిగిరినాథా!; హయమేధయజ్వా= అశ్వమేధ యాగం చేసిన; వేధాః= బ్రహ్మ; చక్షుషాం= కన్నులకు; అవిషయం= కనరానట్టి; యం= ఎవనిని; ద్రాఘీయసా= అతి చిరకాలార్జితమైన; సుచరితేన= సుకృతం చేత; దదర్శ= చూచెనో; తం= అటువంటి; త్వాం= నిన్ను; తే= నీ యొక్క; కరుణా పరిణామతః= దయ యొక్క పరిణామంవల్ల; నిఖిలాని= సమస్తమైన; భూతాని= ప్రాణులు; నిశామయంతి= కన్నులతో చూడగల్గుతున్నాయి; హంత= ఆశ్చర్యమే.

**తా॥** ఓ కరిగిరీశా! అశ్వమేధయాగం చేసిన చతుర్ముఖ బ్రహ్మ చక్షువులచే చూడరానట్టి నిన్ను చాలాకాలం చేసిన తపస్సు చేత చూచాడు. మాంసపు కన్నులతో చూడశక్యం కానట్టి నిన్ను నీ కృపా విశేషం వల్ల సమస్త జంతువులు తమ కన్నులతో చూడగలుగుతున్నాయంటే ఆశ్చర్యం కదా!

**వ్యాఖ్య:-** హస్తిగిరినాథుని అవతార వర్ణన సుశ్లోకితం.

శ్రీ వైకుంఠనాథుడు ఉభయ విభూతి నాయకుడు. నిత్య సూరి నిర్వాహకుడు. *"సదా పశ్యంతి సూరయఃతద్విపన్యవః'* నిరంతరం స్తోత్రం చేసే నిత్యసూరులచేత, ముక్త పురుషులచేత సేవింపబడేవాడు. అప్రాకృత దివ్యమంగళ విగ్రహం కలవాడు. *"నసంధృశే తిష్ఠతి రూపమస్య"*- (కఠ.ఉప. 6-9).

*"నచక్షుషాగృహ్యతే"*- (ముం. ఉప. 3-1-8) ప్రాకృత చక్షువులకు కనబడని వాడని ఉపనిషత్తులు నినదిస్తున్నాయి.

*"కణ్గళ్ కాణ్డర్కు అరివన్"*- మాంసపు కన్నులకు కానరాని దివ్య అవయవ సౌందర్య విశిష్టుడు పరమ పదనాథుడు. దయా సముద్రుడైన శ్రియఃపతి లోక

కల్యాణార్థం, ధర్మసంరక్షణం కోసం భారత భూమియందు అవతరించడం భగవానుని కృపా పరిణామమే కదా!

మర్త్యలోకంలో జన్మించడం సుఖకరం కాదనేది స్పష్టం. కపిలావతార మందు భగవానుడు తన తల్లియైన దేవహూతికి ఉపదేశంచేసిన విషయం విస్మరించరానిది.

*"అకల్పః స్వాంగ చేష్టాయాం శకున్త ఇవ పంజరే*
*తత్ర లబ్ధ స్మృతి ర్దైవాత్ కర్మ జన్మ శతోద్భవమ్*
*స్మరన్ దీర్ఘ మనుచ్ఛ్వాసం శర్మకిం నామ విందతే॥"*

(శ్రీవ్యాస భాగ. 3-31-9)

శిశువు తల్లి కడుపులో తలదూర్చి కాలు సేతులను ముడుచుకొని, తన అవయవాలను కదలించడానికి అసమర్థుడై పంజరంలో చిక్కిన పక్షిలాగా బంధితుడై యుంటాడు. దైవదత్తమైన జ్ఞానంతో పూర్వజన్మలలోని పాపాలను తలచుకొంటూ, నిట్టూర్పులు విడుస్తూ, ఏ మాత్రం సుఖాన్ని పొందలేకుంటాడని కపిల భగవానుడు గర్భవాస దుఃఖాన్ని దేవహూతికి వివరించాడు.

*యంచక్షుషామ విషయం హయమేధ యజ్వా*
*ద్రాఘీయసా సుచరితేన దదర్శ వేధాః*

ప్రాకృత నేత్ర గోచరుడు కానట్టి పరంధాముణ్ణి అశ్వమేధయాగం చేసిన చతుర్ముఖ బ్రహ్మదీర్ఘకాలం దాకా చేసిన పుణ్యకార్యం చేత చూచాడు.

'దీర్ఘ' శబ్దానికి అతిశయార్థంగా 'ఈ యస్' ప్రత్యయం చేరినందువల్ల 'ద్రాఘీయ' శ్శబ్దం నిష్పన్నమైనది.

సుయజోః జ్వనిష్ (వన్) అనే సూత్రం చేత 'యజ్' ధాతువుపై 'వన్' ప్రత్యయం చేరగా 'యజ్వన్' రూపమయింది.

"గరీయసే బ్రహ్మణోఽ ప్యాది కర్త్రే" అన్నట్లు సమస్త సృష్టి కార్యం చేసే చతుర్ముఖ బ్రహ్మకు కూడా కారణభూతుడు శ్రీమన్నారాయణుడు. "అహంహి సర్వయజ్ఞానాం భోక్తాచ ప్రభురేవచ" (గీత.9-24) సమస్త యజ్ఞాలను అనుభవించేవాడు, తత్ఫలప్రదాత కూడా శ్రీమహావిష్ణువే కదా!

"*అగ్న ఆయాహి వీతయే గృణానోహవ్య దాతయే! నిహోతా సత్సి బర్హిషి*"- (సామవేదం ఆగ్నేయ ఖండం. ప్ర.అ-1) హే అగ్నే= అగ్నిదేవా!; అగ్నికి అంతర్యామివైన ఓ పరబ్రహ్మా!; హోతా= యజ్ఞమందు ఋత్విక్కువై; వీతయే= హవిస్సును స్వీకరించడానికీ; హవ్య దాతయే= దేవతలకు హవిర్భాగాల నందించడానికినీ; గృణానః= మా స్తుతిని స్వీకరించడానికి కూడా; ఆయాహి= రమ్ము; బర్హిషి= దర్భాసనం మీద; ని సత్సి= సుఖాసీనుడవగుము.

"*అగ్రం నయతి, అగ్రణీర్భవతి*"- (నిరుక్తం) "*అగ్నే! నయసుపథా*" (శ్రుతి) అగ్నిదేవా! మంచి మార్గాన తీసికొనిపొమ్ము అని అగ్నిని ప్రార్థిస్తాం. అర్చిరాది మార్గమందు గొనిపోయి మోక్షమిచ్చే విష్ణుమూర్తియే అగ్ని దేవుడని శ్రుతి స్మృతులు ఘోషిస్తున్నాయి.

దశరథ చక్రవర్తి పుత్రార్థమై అశ్వమేధయాగం చేసి పుత్రకామేష్టి నాచరించాడు. చతుర్ముఖ బ్రహ్మ నాలుగు వేదాలను నాలుగు ముఖాలతో అధ్యయనం చేసినాడు. గృహ్యసూత్ర ప్రకారంగా, గృహస్థుడు కాబట్టి వైదిక ధర్మాలను ఆచరించాడు. పుత్రుడైన బ్రహ్మదేవుడు తన పితృదేవుని ప్రీత్యర్థం అశ్వమేధయాగం చేశాడు.

*"భోక్తారం యజ్ఞ తపసాం సర్వలోక మహేశ్వరమ్।*
*సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతి మృచ్ఛతి॥"*

*(భ.గీ. 5-29)*

"తమీశ్వరాణాం పరమం మహేశ్వరం" (శ్వే. ఉప.6-7) సమస్త లోకాలకు, లోకులకు, లోకేశ్వరులకూ ఈశ్వరుడనీ, యజ్ఞ తపస్సులను

అనుభవించేవాడనీ, సకల ప్రాణులకు సన్నిహితుడు (స్నేహితుడు) అనీ చాలా కాలం ఉపాయోపేయాలు- ప్రాప్యుడూ, ప్రాపకుడూ- సర్వశేషియైన శ్రియః పతియే అన్న అధ్యవసాయంతో అశ్వమేధయాగాన్ని నిర్వహించాడు. ముముక్షువు చేసే కర్మ- స్రుక్ స్రువాది సాధనాలు, హవిస్సు, హోత- సమస్తం పరబ్రహ్మాత్మకమే అని గీతాభాష్యంలో భగవద్రామానుజులు అనుగ్రహించారు (భ.గీ. 4-24).

*"తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి*
*యజ్ఞేన దానేన తపసాఽ నాశికేన॥"*

అనే శ్రుతిరీత్యా 'యజ్వా' అంటే యజ్ఞంతోపాటు దానమూ, తరుగని తపస్సూ అంగాలుగా, ఫలాపేక్షలేకుండా చేయడం విహితమైనది. ఇట్టి అనంత పుణ్యమహిమ వల్లనే, నలువచేసిన యజ్ఞకుండమందు "యజ్ఞోవైవిష్ణుః" అన్నట్లు శ్రీ విష్ణు భగవానుడు కరిగిరినాథుడై ఆవిర్భవించాడు. అట్టి ప్రణతార్తిహరుని దివ్యమంగళ విగ్రహాన్ని నలువ ఎనిమిది కన్నులతో తనివిదీర దర్శించాడు అని పూర్వార్ధం విశదీకరిస్తున్నది.

*"తం త్వాం కరీశ! కరుణా పరిణామతస్తే*
*భూతాని హన్త! నిఖిలాని నిశామయంతి*

హంత! అయ్యో! నలువ ఒక్కడు పుణ్యం చేస్తే, భగవదనుగ్రహ ఫలాన్ని ఎందరో అనుభవిస్తున్నారేమి? 'హంత' అంటే 'అయ్యో, ఆశ్చర్యం' అనే రెండర్థా లున్నాయి. 'పరిణామం' అంటే పక్వదశ, పరిపాకమని అర్థం. 'నిశమనం' అంటే వినడమని అర్థం ('శ'కు దీర్ఘముంటే) 'నిశామనం' అంటే చూడడమనే అర్థం ఉంటుంది.

నిఖిలాని భూతాని నిశామయంతి- బ్రహ్మాది దేవమనుష్యులకు ధ్యానారాధనలచే గోచరించనివాడైనప్పటికీ అపార కారుణ్య సౌశీల్య వాత్సల్యౌదార్య మహోదధియైన ఆ పరంధాముడు తన స్వభావాన్ని వదలక,

భూభారాన్ని తగ్గించడమనే నెపంతో భూమియందవతరించి, సకల మనుజ నయన గోచరుడయ్యాడు అని భగవద్రామానుజులు తమ గీతాభాష్య ప్రవేశమందు ప్రవచించారు. హన్త! భగవత్కారుణ్యమెంత అద్భుతమో కదా!

అట్లే, దీర్ఘకాలం విధాత సుకృతం ఆచరిస్తే, నిత్య నిరతి శయ కృపను ప్రసరింపజేసినవాడు కరిగిరినాథుడు. కమలాసనుని సుచరితం చేతనూ, కరీశుని కరుణా పరిణామం వల్లనూ ప్రపంచంలోని సకల ప్రాణులు- భగవత్ప్రసాద లబ్ధ సత్తాకులైన పురుషులే కాదు, సామాన్యులు, ధీమాన్యులు- కంచి పురాధీశ్వరుడైన దేవప్పెరుమాళ్ళ దివ్యమంగళ విగ్రహ సౌందర్యాన్ని దర్శిస్తున్నారు. బ్రహ్మానంద భరితులవుతున్నారు. ఆశ్చర్యమనిపించదా?

స్రష్టయైన పితామహుడు మనకు తాతయే కదా! తాత తన తండ్రి యొక్క ప్రాభవవైభవాలను మనకు ప్రదర్శించకుంటే అయ్యో! మనకు ఎలా తెలిసేది?

పితామహుడు మనకు పైతామహమైన ధనాన్ని అందించి, ఆనందింప జేస్తున్నాడంటే ఆశ్చర్యమే కదా! ఇప్పుడు అర్చారూపమే పరావర నిఖిల భూతాలు సమాశ్రయించడానికి యోగ్యమైనది. వసన్త తిలక.

*8. తత్తత్పదైరుపహితేఽపి తురంగ మేధే*
*శక్రాదయో వరద! పూర్వమలబ్ధ భాగాః*
*అధ్యక్షితే మఖపతౌ త్వయిచక్షుషైవ*
*హైరణ్య గర్భహవిషాం రస మన్వ భూవన్॥*

**అర్థం:** హే వరద!= వాంచితార్థ ప్రదుడవైన ఓ దేవా!; తురంగమేధే= అశ్వమేధ యాగం; తత్+తత్+పదైః= ఆయా ఇంద్రాది దేవతల యొక్క శబ్దాలతో; ఉపహితే (సతి), అపి= కూడుకొన్నదే, అయినప్పటికీ; పూర్వం= (భగవదవతారం కంటె) ముందు; అలబ్ధ భాగాః= పొందనట్టి యజ్ఞ హవిర్భాగం కలవారైన; శక్ర+ఆదయః= ఇంద్రుడు మొదలైన దేవతలు; మఖపతౌ= యజ్ఞాన్నిపాలించే-సంరక్షించే; త్వయి= నీవు; అధ్యక్షితే

(సతి)= కన్నులకు కనబడుతుండగా; హైరణ్యగర్భ హవిషాం= హిరణ్యగర్భుడు (బ్రహ్మ) ఇచ్చిన హవిస్సుల యొక్క; రసం= రసాన్ని; చక్షుషా, ఏవ= కంటి చూపుతో; అన్వభూవన్= అనుభవించారు.

**తా॥** ఓ వరదా! అశ్వమేధయాగమందు ఆయా దేవతలను పేరు పేరున ఉద్దేశించి ఆహుతులను సమంత్రకంగా ఇవ్వడం వైదికవిధి. అయినప్పటికీ, భగవానుడు అవతరించడానికి మునుపు ఇంద్రాది దేవతలు, ఇవ్వబడిన హవిర్భాగాలను పొందలేదు. ఎప్పుడు యజ్ఞపతియైన భగవానుడు నయన గోచరుడయ్యాడో, అప్పుడు ఇంద్రాది దేవతలు బ్రహ్మ ఇచ్చిన హవిస్సుల రసాన్ని నయనేంద్రియం చేతనే పానం చేశారు.

**వ్యాఖ్య:-** సర్వశబ్ద వాచ్యుడైన భగవానున్ని దర్శించిన దేవతలు బ్రహ్మ ఇచ్చిన హవిస్సుల రసాన్ని కన్నులతో ఆస్వాదించారు.

చతుర్ముఖ బ్రహ్మ భగవత్ప్రీత్యర్థం అశ్వమేధ యాగం చేశాడు. ఆ యాగమందు భగవానుడు అవతరించాడు.

తత్తత్పదైరుపహితేఽపి తురంగ మేధే- అశ్వమేధ యాగమందు ఇంద్రాది దేవతలను ఆహ్వానించి, 'ఇంద్రాయస్వాహా, వరుణాయస్వాహా, రుద్రాయస్వాహా' అని ఆయా దేవతలను ఉద్దేశించి ఆహుతులను అగ్నిహోత్రునియందు సమర్పించడం యాగ నిర్వహణ విధి, దేవతలు "అగ్నిముఖావై దేవాః" అన్నట్లు, అగ్ని ద్వారా ఆ హవిస్సులను భుజించి తృప్తిపడుతారు. కాని బ్రహ్మ యజ్ఞపతియైన శ్రీ విష్ణు భగవానుని ప్రీత్యర్థం యాగం చేసినందువల్ల అగ్ని, ఇంద్ర, వరుణ, రుద్రాది పదాలన్ని కూడా విష్ణుభగవానునికే అన్వయిస్తాయి. కాబట్టి, భగవానుడు కృపతో సాక్షాత్కరించాడు.

అపి, శక్రాదయః పూర్వమలబ్ధ భాగాః- ఇంద్రాది దేవతల పదాలతో వారికి ఆహుతుల నర్పించిననూ భగవాను డావిర్భవించక పూర్వం దేవతలకు హవిస్సులు లభించలేదు. ఆయా దేవతలకు అంతర్యామిగా ఉన్నవాడు అంటే,

భగవానునికి శరీరాలుగా ఉన్న దేవతలకు ఆత్మగా– అంతర్హితుడై యున్న భగవానుడే బ్రహ్మ ఆయా దేవతల నుద్దేశించి త్యాగం చేసిన హవిస్సులన్ని స్వీకరించాడు.

*అధ్యక్షితే మఖపతౌ త్వయి చక్షుషైవ*
*హైరణ్య గర్భహవిషాం రసమన్వ భూవన్*

'మఖ' శబ్దానికి యజ్ఞమని అర్థం. మఖంతిదేవాః అత్ర ఇతి= మఖః 'మఖిగతౌ' అనే ధాత్వర్థాన్ని బట్టి, దేవతలు వచ్చే స్థలం యజ్ఞమని అర్థం. "*యజ్ఞః సవోఽ ధ్వరో యాగః సప్తతంతుర్మఖః క్రతుః*" (అమరం).

మఖస్యపతిః= మఖపతిః. తనను గురించి చేసే ఆరాధన రూపమైన మఖా (యజ్ఞా)నికి ఫలప్రదాత విష్ణు భగవానుడే కాబట్టి, మఖపతి యాగమందు ఆవిర్భవించాడు. యాగశాలలో మఖపతి అధ్యక్షితే– సాక్షాత్కరించినప్పుడు అని అర్థం. "*ప్రత్యక్షేఽ ధి కృతేఽ ధ్యక్షః*"– (అమరం) 'అక్షూ–వ్యాప్తౌ' అనే ధాత్వర్థాన్ని బట్టి అధ్యక్ష్ణోతి ఇతి= అధ్యక్షః. ఇంద్రియాలను పొందేది లేదా బాగా వ్యాపించేది కాబట్టి అధ్యక్ష మనబడుతుంది. "*యజ్ఞో యజ్ఞపతి ర్యజ్వా*" (వి.స.) అన్ని పేర్లు విష్ణుభగవానునికే వర్తిస్తాయి.

*యేత్వన్యదేవతా భక్తాః యజన్తే శ్రద్ధయాన్వితాః।*
*తేఽ పి మామేవ కౌంతేయ! యజన్త్య విధి పూర్వకమ్॥ (భ.గీ. 9–23)*

వేదాంత విధుల నెరుగనివారు, ఇంద్రాది దేవతలయందు శ్రద్ధాభక్తులు కలవారై వారిని పూజించినప్పటికీ, వారికి ఆత్మగానున్న నన్నే పూజించిన వారవుతున్నారు. అంటే సకలారాధ్యుడను నేనే. వారికి తెల్వకున్నా వారు చేసే పూజ నాకే చెందుతుంది అని పార్థునికి గీతాచార్యుడు బోధించాడు కదా!

అట్టి యజ్ఞపతియైన భగవానుని దివ్యమంగళ విగ్రహం యొక్క సౌందర్యం సాక్షాత్తుగా ఇంద్రియ గోచరమైనది.

గత శ్లోకంలో "చక్షుషా మవిషయం" అనబడింది. ఎవరి కన్నులకు

కూడా కనబడని వాడు భగవానుడు అని అర్థం.

*"అదర్శనే దర్శన మాత్రకామాః, దృష్టే పరిష్వంగరసైకలోలాః।*
*ఆలింగితాయాం పునరాయతాక్ష్యాం, ఆశాస్మహే విగ్రహయో రభేదమ్॥"*

కనబడనప్పుడు చూడాలనే కోరిక కలవారవుతారు. చూచిన వెంటనే కౌగిలించుకోవాలనే అభిరుచి కలవారవుతారు. ఆలింగనమే సంభవిస్తే రెండు శరీరాలు ఒక్కటైతే బాగుంటుందని ఆశించడం లోక పరిపాటి.

అట్లే కంటికి కనబడని భగవానుడు సాక్షాత్తుగా కనబడగానే నిఖిల భూతాలకు-ప్రాణులకు-రసస్పృహ కలిగింది. ఇంద్రియాలకు తృప్తి కలుగలేదు. హవిర్భాగమందక ఉపవాసమున్న దేవతలు యాగశాలలో భగవద్దివ్యమంగళ విగ్రహ సౌందర్యాన్ని చూచారు.

*"న తతర్ప సమాయాంతం పశ్యమానో నరాధిపః"*- దశరథుడు మేడమీద ఉండి బాలరాముడు రథంమీద వీధులలో వస్తుండగా చూస్తున్నప్పటికీ ఆ రాజుకు తృప్తి కలుగలేదని రామాయణంలో వాల్మీకి చెప్పినాడు.

శ్రీకృష్ణుడు వీధుల్లో సంచరిస్తుంటే చూస్తున్న జనులకు అమృతానుభవం లాగా తృప్తి కలుగలేదు- అనే విషయాన్ని శ్రీ శుకమహర్షి *"అమృత స్యైవనా తృప్యన్ ప్రేక్షమాణా జనార్దనమ్"*- (భాగ.) చెప్పినాడు.

భగవానుని సౌందర్యం అమృతంలాగా ఎంత అనుభవించినా తృప్తి కలుగని విధంగా ఉందని సారాంశం. అయితే, హిరణ్యగర్భుడు బ్రహ్మ ఇచ్చిన హవిస్సులన్ని వరదుడనే భగవానుడే స్వీకరించాడు.

శక్రాదయః హవిషాం రసం చక్షుషైవ అన్వభూవన్- ఇంద్రాది దేవతలు బ్రహ్మ ఇచ్చిన హవిస్సు రసాన్ని కన్నుతోనే త్రాగినారు అని అర్థం.

ఉపవాసంతో ఖిన్నులైన దేవతలకు హవిస్సుల అంశాన్ని అందించి తృప్తి

పరచాలనుకొన్నాడు భగవానుడు. ఎప్పుడైతే దేవతలు తన సౌందర్యాన్ని సేవించారో అప్పుడే భగవానుడు వారికి రసస్పృహను కలిగించాడు.

భగవానుడు స్వయంగా 'సర్వగంధః, సర్వ రసః' అని ఛాందోగ్యోపనిషత్తు (3-14) చెప్పినట్లు; "తస్యాననం పద్మ సమానగంధి" అన్నట్లు, సర్వేంద్రియాలకు తృప్తి కలిగించే విధంగా తన దివ్యమంగళ విగ్రహమందు రసానుభవాన్ని చేతనులు పొందునట్లు విరాజమానుడై యున్నాడు.

'చక్షుషా, ఏవ' అని ఏకవచనం. కన్నుతోనే రసాన్ని పానం చేశారు. కన్ను త్రాగుతుందా? అంటే "లోచనాభ్యాం పిబన్నివ" (రామాయణం) రెండు కన్నులతో త్రాగుతున్నట్లే దివ్య సౌందర్యాన్ని చూచారని అర్థం. కవిత్వమహిమ ఇది. ఇలా ఉంటేనే ఉత్తమ కవిత్వమనబడుతుంది. నయనేంద్రియం చేత రసపానం చేశారు దేవతలు అని అర్థం.

జిహ్వ- నాలుకతో ఆస్వాదించదగినది కదా రసమాధుర్యం. అయినా కంటితో పానం చేయడం- అంటే ఒక ఇంద్రియం చేసే పనిని మరొక ఇంద్రియం చేయాలని ఆశపడుతున్నట్లు భగవద్విగ్రహ సౌందర్యమున్నదని అర్థం.

"ఉన్నై మెయ్ కొళ్ళక్కాణ విరుంబుమెన్ కణ్ గళే"- 'నిన్ను ప్రత్యక్షంగా సేవించాలని నా కన్నులాశపడుతున్నాయి అన్నారు నమ్మాళ్వార్లు. "ముడియానే" అనే దశకం (తి.వామొ. 3-8) లో ఒక్కొక్క ఇంద్రియం తన వ్యాపారంతో పాటు ఇతరేంద్రియాల వ్యాపారాన్ని కూడా ఆశపడుతున్నట్లు కృప జేశారాళ్వార్లు.

*"త్వక్చ దృక్చ నిపిపాసతి జిహ్వా*
*విహ్వలా శ్రవణ వత్పర వృత్తౌ*
*నాసికా త్వయి కరీశ! తథేతి ప్రాప్నుయాం*
*కథమిమాం స్వి దవస్థామ్" (24)*

ఓ కరిగిరీశా! నా చర్మేంద్రియం (త్వక్) నేత్రేంద్రియం కూడా బాగా

పానం చేయాలని కోరుతున్నది. రసనేంద్రియం (నాలుక) శ్రవణేంద్రియంతో సమానంగా ఇతరేంద్రియాల వ్యాపారంలో చపలత కలిగినదవుతున్నది. (ముక్కు) ఘ్రాణేంద్రియమూ ఆ విధంగానే వేరే ఇంద్రియాల వ్యాపారాన్ని ఆశపడుతున్నది. మోక్ష దశలో పొందే ఈ అవస్థను ఈ లోకంలోనే నీ విషయంలో నేనెలా పొందగలను స్వామీ?" అని శ్రీ కూరేశులు వరదరాజస్తవం చేశారు.

దేవరాజ విగ్రహసౌందర్యం హవిస్సుల రసమయింది. దేవతలలో ఒక్కొక్కరికి చెందవలసిన హవిర్భాగాన్ని ఇతర దేవతలు కూడా పొందాలని ఆశపడుతున్నట్లున్నది. 'దివ్యందదామితే చక్షుః' అని దివ్యమైన కన్నును నీకు ఇస్తున్నాను. "పశ్యమే యోగ మైశ్వరమ్"- నా విశ్వరూపాన్ని చూడవయ్యా అని అర్జునునికి శ్రీకృష్ణుడు దివ్యనేత్రాన్ని ప్రసాదించాడు.

అప్రాకృతమైన ఇంద్రియాలకు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు అనే విషయాల నియమం లేదు. అట్లే, భగవానుడు ఇంద్రాది దేవతలకు అప్రాకృత నేత్రాన్ని ప్రసాదించినందువల్ల జ్ఞానాది యోగం, అనంత విభూతి యోగం కూడా చూచే అవకాశం కలిగింది. హవిస్సులన్ని రసంగా పరిణమించాయి. ఆ రసమాధుర్యాన్ని దేవతలు ఆస్వాదించారు.

రసం అన్వభూవన్- అను+అభూవన్= దేవాది దేవుడు అనుభవించిన తర్వాతనే శేష భూతులైన దేవతలు అనుభవించారని అర్థం.

"సంత మేనం తతో విదుః" అని ఉపనిషద్వాక్య ప్రకారం, ఆనంద మయుడైన పరబ్రహ్మను సేవించి దేవతలు బ్రహ్మానందాన్ని పొందినారని పిండితార్థం.

కారణం లేకుండా కార్యం జరుగడం వల్ల విభావనాలంకార సజ్జిత మీ శ్లోకం. వసంత తిలక.

9. *సర్గస్థితి ప్రళయ విభ్రమ నాటికాయాం*
*శైలూషవ ద్వివిధ వేష పరిగ్రహంత్వామ్*
*సంభావ యంతి హృదయేన కరీశ! ధన్యాః*
*సంసార వారినిధి సంతరణైక పోతమ్॥*

**అర్థం:** హే కరీశ!= హస్తిగిరినాథా!; ధన్యాః= భాగ్యవంతులైన పురుషులు; సర్గస్థితి ప్రళయ విభ్రమ నాటికాయాం= సృష్టి, స్థితి, ప్రళయాలు అనే విలాస నాటిక యందు; శైలూషవత్= నటీనటులవలె; వివిధ వేషపరిగ్రహం= అనేక వేషాలను ధరించే; సంసార వారినిధి సంతరణ+ఏక పోతం= సంసారమనే సముద్రాన్ని దాటించే ఒక (ముఖ్యమైన) నావ యైన; త్వాం= నిన్ను; హృదయేన= మనస్సు చేత; సంభావయంతి= బాగా ధ్యానం చేస్తూ అనుభవిస్తున్నారు.

**తా॥** ఓ కరిగిరినాథా! ధన్యాత్ములు సృష్టి స్థితి లయాలు అనే విభ్రమమైన నాటకమందు నటీనటుల లాగా చాలా వేషాలను వేసేవాడవూ, సంసార సాగరాన్ని దాటించే ఒక నౌకగా ఉన్న వాడవూ అయిన నిన్ను మనస్సున ఏకాగ్రతతో ధ్యానం చేస్తున్నారు.

**వ్యాఖ్య:-** జగత్కారణుడైన సర్వేశ్వరుడు లీలారసభోగంతో పాటు, సంసారం నుంచి కడతేర్చే ఉపాయ భూతుడని ధన్యాత్ములు ధ్యానం చేస్తుంటారు అని వర్ణించే శ్లోకం.

సర్గ స్థితి ప్రళయ విభ్రమ నాటికాయాం-

"కారణంతు ధ్యేయః" (అధర్వ శిఖోప-3) విశ్వ సృష్టి చేయడం, దాన్ని రక్షించడం, లయం చేయడం అనే జగద్వ్యాపారానికి కారణమైనవాడు శ్రీమన్నారాయణుడు.

*"యతో వా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని*
*జీవంతి, యత్ప్రయం త్యభిసంవిశంతి" (తై.ఉప)*

"జన్మాద్యస్య" అని (శ్రీమద్భాగవతం) శ్రుతి స్మృతీతిహాసాలు ఇదే విషయాన్ని బోధిస్తున్నాయి. ఈ జగద్వ్యాపారం వల్ల భగవానుడు ఆనందాన్ని అనుభవిస్తుంటాడు. ఆయన యొక్క లీలయే ఈ జగన్నాటకం. నాటకం అంటే చాక్షుష క్రతువన్నాడు కవికుల గురువు కాళిదాసు. అది ఒక దృశ్యకావ్యం. ఇందు నాట్య నాటక, సంగీతాది విషయాలను కన్నార జూచి, మనసార ఆనందించేవారు రసజ్ఞులు. రసానుభవాన్ని పొందినవారు, ధన్యాత్ములు.

శైలూషవత్ వివిధ వేష పరిగ్రహం- బ్రహ్మచేసిన యాగంలో మఖపతియైన నారాయణుడే అధ్యక్షుడై హవిర్భాగాన్ని స్వీకరింపవచ్చాడు. ఈ మఖ పతియే నటరాజు.

'శైలూష' శబ్దం నాటకరంగమందు సరసంగా నటించే నటీ నటులని అర్థమిస్తుంది.

శిలూషుడనే ఋషి కుమారుడు నాట్యమాడే వాడు. శిలూషుడు నట సూత్రాలను రచించాడు. శిలూషుని నటసూత్రాలను అధ్యయనం చేసి వివిధ వేషాలను పరిగ్రహించి నటించేవారు 'శైలూష' శబ్ద వాచ్యులు. స్త్రీలు పురుషులు- నటీ నటులు అనబడుతారు. 'వేష' మంటే స్త్రీగా, పురుషునిగా, కృత్రిమ శరీరావయవాది సంవిధానం. 'పరిగ్రహ' శబ్దానికి 'పత్ని- భార్య అని అర్థం.

ఇక్కడ జగత్కారణుడైన శ్రీహరియే- లక్ష్మీదేవి సహకారంచేత పలు వేషాలను పరిగ్రహించాడు. స్రష్టగా బ్రహ్మవేషధారణ చేశాడు. లోకాలను సృష్టించాడు. సృజింపబడిన జగత్తును (స్థితి) నిలకడగా నుండునట్లు తానే విష్ణుమూర్తిగా వ్యవహరింపబడినాడు. కల్పాంతమందు ప్రకృతి- సమస్త చరాచర వస్తు సముదాయం తనలోనే లీనం కావడానికి కర్తృత్వం వహించే రుద్రునిగా వేషాన్ని ధరించాడు. ఈ ముగ్గురిలో మధ్యనున్న విష్ణువే దశావతారాలనే కాక అనేక అవతారాలను- వేషాలను పరిగ్రహించి, లోకంలో ధర్మాన్ని సంస్థాపన చేశాడు, చేస్తున్నాడు.

బహుస్యాం ప్రజాయేయ- నేను అనేక విధాలుగా అవుతాను అని, అవాప్త సమస్తకాముడైనందువల్ల, స్వేచ్ఛగా భగవానుడు *"తత్సృష్ట్వా, తదేవానుప్రావిశత్"* అనే శ్రుతి రీత్యా సృష్టి జేసి, సృజింపబడిన బ్రహ్మా, రుద్రులలోనే కాక, చేతనా చేతన వస్తువులన్నిటిలోనూ అంతర్యామిగా అనుప్రవేశం చేశాడు. *"అంతః ప్రవిష్టః శాన్తా జానానాం సర్వాత్మా"*- చరాచర వస్తుజాతం- జగత్తు- తనకు శరీరం కాగా, తానే ఆత్మగా వెలసియున్నాడు అని శ్రుతిపలుకుతున్నది. చేతనా చేతన వస్తువుల లోపల- అంతర్హితుడై నడిపించడం వల్ల, జగన్నాటకం రసాత్మకంగా సాగుతున్నది. సృష్టి స్థితి లయాలకు కర్తగా ఉన్నందువల్ల భగవానుడే నటరాజుగా ప్రసిద్ధిని పొందినాడు.

'శైలూషవత్ వివిధ వేష పరిగ్రహం' అంటే నటీనటుల వివిధ వేషధారణ కదా! నాయకునికి అనురూపమైన నాయికా వేష పరిగ్రహం- లక్ష్మీదేవితో కూడ జగన్నాటకరంగమందు నటించడమనే ధర్మం శబ్దమూలధ్వనిచేత రసంగా పరిఢవిల్లుతుంది.

'శైలూష' శబ్దానికి 'శ్రీ ఫలం' అనే అర్థమూ ఉంది.

*"బిల్వః శాండిల్య శైలూషౌ మాలూర శ్రీఫలావపి"*- 'శ్రీ ఫలం' అంటే లక్ష్మీదేవికి ప్రియమైన ఫలం కలది అని అర్థం. నాయికా నాయకుల విహార వ్యవహారాలు రసమయంగా ఉంటాయి. "లబ్ధ నిర్భర రసైః'- అశ్వమేధయాగంలో దేవతలకు హవిర్భాగం ఇవ్వకున్ననూ, దర్శనమాత్రం చేతనే పూర్ణ రసానుభవం కలిగినదని (గత శ్లోకం) తెలిసింది కదా!

*"సర్వే గంధాః, సర్వే రసాః యస్మిన్సః= సర్వగంధః, సర్వరసః"* అనీ 'రసోవైసః' అనీ శ్రుతి స్పష్టపరచింది.

యజ్ఞంలో చివరకు, దేవతలు- భూదేవతలు-మహర్షులు సంతోష పడునట్లు నాటకమాడడం- చాక్షుషక్రతువును జరపడంకూడా వైదిక విధియే. నాట్య-నృత్య- నృత్తమనే ప్రక్రియలను, తౌర్యత్రికాన్ని సదస్యులు సేవించి

రంజిల్లునట్లు చేయడం ఆచారమే. ఇదంతా భగవదిచ్ఛ లేదా సంకల్పం వల్లనే జరుగుతుంది.

"స్వేచ్ఛాయాం సర్వసిద్ధింవదతి భగవతోఽ వాప్త కామత్వవాదః" ఆప్తకాముడైనందువల్ల తన సంకల్పం- ఇచ్ఛచేతనే అన్నీ సిద్ధిస్తాయని 'తత్త్వముక్తా కలాపం'లో 'నాయక సర' మందు దేశికులు చెప్పినారు.

సంసార వారినిధి సంతరణైక పోతమ్-

స్థూల సూక్ష్మ రూపంతో అనాదికాలం నుంచి అనువర్తించినదై, విపరీత, భ్రమ, జ్ఞాన సంకోచాదులకు కారణమైన ప్రకృతి సంబంధమే సంసారం. కామక్రోధాది దుష్ట సత్త్వాలకు ఆకరమైనందువల్ల దుస్తరమైనది సంసారమనే సముద్రం.

"తృష్ణాతోయే మదన పవనోద్ధూత మోహోర్మిమాలే" అని కులశేఖరాళ్వార్లు ముకుంద మాలలో 'భవజలధి' ని వర్ణించిన శ్లోకం ఇక్కడ స్మరణీయం. సంసారమే సముద్రమని అర్థం.

అట్టి సంసారాన్ని 'సంతరణం' అంటే ఆవలి తీరాన్ని- గట్టును లేదా దరిని- చేరుకోవడమని అర్థం.

దుస్తరమైన సంసార సముద్రాన్ని దాటడానికి ముఖ్య సాధనం విష్ణువనే నావయే సుమా! 'విష్ణుపోతమే' విష్ణు భగవానుడే నౌకగా ఉపయోగ పడడం గమనీయం.

పరిపూర్ణ బ్రహ్మానుభవానికి ఉపాసన, ధ్యానం లేదా భక్తియే కారణమని స్పష్టమవుతున్నది. జగత్కారణుడే ధ్యానింపదగినవాడు. మోక్షోపాయం భగవంతుడు అని సారార్థం. నౌక సముద్రంలో పయనించినప్పుడు పర్వతాలకు తాకి భగ్నం కాకుండా, ఆవలి ఒడ్డుకు సుఖంగా చేర్చాలి అనుకొంటే ఇతర దేవతలను పూజించక "దేవ ఏకో నారాయణః, నద్వితీయోఽస్తి కశ్చిత్",

శ్రీమన్నారాయణుడే శరణ్యుడు, రక్షకుడు అనే మహావిశ్వాసంతో ఆచార్యులను ఆశ్రయించి, తప్పులు దొరలితే సంస్కరించే, 'స్ఖలితే శాసితారం' అన్నట్లు, ఆచార్యుల ద్వారా ప్రపత్తిని అనుష్ఠించాలి అని విశదమవుతున్నది.

త్వాం సంభావయంతి హృదయేన ధన్యాః- జగన్నాటక సూత్రధారి సర్వేశ్వరుడని తెలుసుకొని సంసార తాపపీడుతలైన వారు నాటకాన్ని లేదా సినీమాను జూచినందువల్ల తాపశాంతి కలిగి తాత్కాలికమైన ఆహ్లాదాన్ని పొందినట్లు- భగవంతుని చరిత్రను, కథలను చదివి లేదా విని, భగవల్లీలా రసానందానుభవాన్ని పొందాలి.

ప్రకృతిబంధాన్ని తొలగించి సర్వేశ్వరుడైన శ్రియఃపతి తన సాన్నిధ్యాన్ని కృపజేసి కైంకర్యం చేయించుకొనవలెనని ఆశించే సహృదయులు నిరంతరం భగవద్ధ్యానం చేయాలి.

*"సంసారార్ణవ మగ్నానాం విషయాక్రాంత చేతసామ్।*
*విష్ణు పోతం వినా నాన్యత్ కించిదస్తి పరాయణమ్॥"*

ఇంద్రియలోలులైన వారికి, సంసార సముద్రంలో మునిగి కొట్టు మిట్టాడుతున్న వారికి, విష్ణు భగవానుడు అనే నౌక తప్ప వేరొక గతి లేనే లేదు కదా! (విష్ణుధర్మం).

*"మోక్షదో భగవాన్విష్ణుః", "పశవః పాశితాః పూర్వం*
*పరమేణ స్వలీలయా। తే నైవ మోచనీయాస్తే*
*నాన్యై ర్మో చయితుం క్షమాః॥" (విష్ణు తత్త్వం)*

విష్ణుభగవానుడే ముక్తి నొసగేవాడు. భగవానుని లీలచేత పూర్వం పశువులు- జీవులు- బంధింపబడినాయి. ఆ బంధాన్ని జీవులు భగవంతుని చేతనే విడిపించుకోవాలి. ఇతర దేవతలెవ్వరు కూడా బంధాన్ని తొలగించే సమర్థులు కారు అని ఈ శ్లోకార్థం.

హృదయేన ధన్యాః- ధనం లబ్ధారః= ధన్యాః. ధనాన్ని పొందినవారు ధన్యులు అని వ్యుత్పత్త్యర్థం.

"హృదామనీషా మనసాఽ భిక్లప్తో య ఏనం విదుర మృతాస్తే భవంతి"- (ఉపని.) 'హృదా' అంటే భక్తిచేత- అన్నది భాష్యం. భగవంతుణ్ణి శ్రద్ధాభక్తులతో, పరిశుద్ధమైన మనస్సు చేతనూ ధ్యానించినవారు ముక్తులవుతారు.

ఓ భగవన్! నీవు నటశిఖామణివనీ, సంసార సింధువును తరింప జేసే పెద్ద పడవ వని శుద్ధ మనస్కులై ధ్యానించే వారు ధన్యులలో మూర్ధన్యులు.

శ్లేష రూపక సంకీర్ణమైన ఉపమాలంకృత శ్లోకమిది. వసంత తిలక- త భ జ జ గ గ - గణాలు కలది.

*10. ప్రాప్తో దయేషు వరద! త్వదను ప్రవేశాత్*
*పద్మాసనాదిషు శివాదిషు కంచుకేషు*
*తన్మాత్రదర్శన విలోభిత శేముషీకాః*
*తాదాత్మ్య మూఢ మతయో నిపతంత్య ధీరాః॥*

**అర్థం:** హే వరద!= కామితార్థ ప్రదుడవైన దేవా!; త్వత్+అనుప్రవేశాత్= నీవు అనుప్రవేశం చేయడం వల్ల; ప్రాప్త+ఉదయేషు= పొందబడిన ఉదయమూ, అభ్యుదయాది ప్రకారాలు కలిగినట్టి; కంచుకేషు= చొక్కాలైనట్టి; పద్మ+ఆసన+ఆదిషు= బ్రహ్మ మొదలైన వారియందు; శివ+ఆదిషు= రుద్రుడు మొదలైన వారియందు; తన్మాత్ర దర్శన విలోభిత శేముషీకాః= (తత్+మాత్ర) కంచుక స్థానీయులైన (బ్రహ్మ, శివుడు) వారిని మాత్రమే దర్శించడం చేత వంచింపబడిన బుద్ధిగలవారు; తాదాత్మ్య మూఢమతయః= ఫలదాతయైన విష్ణువు, బ్రహ్మ, శివుడు ఈ ముగ్గురి ఆత్మ ఒక్కటే- భేదంలేదు అనే మోహం చెందిన బుద్ధిని కలిగినట్టి; అధీరాః= ధైర్యం లేనట్టి/ బుద్ధిలేనట్టి వారు; నిపతంతి= (అధో లోకమందు) పడతారు.

**తా॥** ఓ వరదా! బ్రహ్మ రుద్రాది దేవతలను మాత్రం దర్శించగనే వంచిత బుద్ధులైనవారు; బ్రహ్మాదులకూ సర్వేశ్వరునికీ భేదం లేదని, హరిహరబ్రహ్మలు

ముగ్గురు సమానులే- ఒకటే అని, బ్రహ్మాదులకు శ్రియః పతి అంతర్యామిగా నున్నాడని తెల్యక మూఢమతులైనారు, నీవు అనుప్రవేశం చేయడం వల్లనే తమ తమ కార్యాలను చేయ సమర్థులై కంచుకం వంటి వారైన బ్రహ్మరుద్రులను ఉపాసించే అజ్ఞానులు అథోలోకంలో పడుతారు.

వ్యాఖ్య:- బ్రహ్మ విష్ణ మహేశ్వరులు ఒక్కటే అని, అంతర్యామియైన పరమాత్మకు కంచుకం లాంటి దేవతలను ఉపాసించి చెడిపోతారనే శ్లోకం.

జగత్కారణుడైన పరమాత్మ చరాచర పదార్థాలను సృజించి, "*తత్సృష్ట్వా, తదేవాను ప్రావిశత్*" అనే ఉపనిషద్వాక్యం రీతిగా, తాను సృజించిన ప్రతి వస్తువులో వెంటనే తాను అనుప్రవేశించాడు.

"*య ఆత్మని తిష్ఠన్, ఆత్మనో అంతరో య మాత్మా న వేద యస్యాత్మా శరీరం య ఆత్మాన మంతరో యమయతి స త ఆత్మా అంతర్యామ్యమృతః*" (బృహత్. ఉప. 5-7-22) ఎవడాత్మయందున్నవాడై, ఆత్మ లోపలనుండి, ఆత్మచే తెలుసుకోబడక, తనకు శరీరమైన ఆత్మను లోపలనుండి నియమిస్తున్నాడో అతడే అంతర్యామి, జనన మరణాలు లేని నారాయణుడని శ్రుతిబోధిస్తున్నది. అంతేకాదు;

"*సర్వం ఖల్విదంబ్రహ్మ, తజ్జలానితి శాన్త ఉపాసీత*" (ఛాం. 3-14-1) సమస్తం పరబ్రహ్మం నుంచి పుట్టింది, పరబ్రహ్మంచే రక్షింప బడుతున్నది, పరబ్రహ్మ మందే లయమవుతున్నది. కాబట్టి, ఈ పరబ్రహ్మ మొక్కటే అంతరాత్మగా కలదైనందున శాంతచిత్తుడై ఉపాసింప వలెను అని కూడా బోధిస్తున్నది.

"*అంతః ప్రవిష్టః శాస్తా జనానాం సర్వాత్మా*". పరమాత్మ జనులలోపల ప్రవేశించి నియమిస్తున్నాడు కాబట్టి ఇతడే సర్వులకు ఆత్మ- అంటే, చిత్తు, అచిత్తు అనబడే పదార్థాలకూ, పరమాత్మకూ ఉన్న శరీరాత్మభావాన్ని బట్టియే తాదాత్మ్యం చెప్పబడింది. ఇదంతా శబ్ద ప్రమాణం వల్ల విశదమవుతున్నది.

*ప్రాప్తోదయేషు వరద! త్వదను ప్రవేశాత్-*

ఓ వరదా! బ్రహ్మ రుద్రాదులు పుట్టినది మొదలు వారు తమ తమ పదవులలో ఉండి, నియమింపబడిన కార్యాలను నిర్వహిస్తూ ప్రకాశించడానికి హేతువు నీవు వారిలో అనుప్రవేశించడమే కదా! అన్నారు.

"నారాయణాత్ బ్రహ్మాజాయతే, నారాయణా ద్రుద్రోజాయతే" అన్నది ఉపనిషత్తు. "నారాయణాత్ విధిర్జాతో, జాతో నారాయణాద్భవః" అన్నది స్మృతి. నారాయణుని నుండి బ్రహ్మారుద్రులు ఉదయించారని శ్రుతిస్మృతులు బోధిస్తున్నాయి.

*"సంక్షిప్యచ పురా లోకాన్ మాయయా స్వయమేవహి।*
*మహార్ణవే శయానో ప్సు మాంత్వం పూర్వ మజీజనః॥*

పూర్వం లోకాలనన్నిటినీ తనశక్తివల్ల తన కుక్షిలో నుంచుకొని మహార్ణవంలో పవళించియున్నప్పుడు నన్ను పుట్టించావు అని చతుర్ముఖ బ్రహ్మ స్వయంగా పరబ్రహ్మతో విన్నపించుకొన్నాడు.

*"క ఇతి బ్రహ్మణో నామ ఈశోఽ హం సర్వదేహినామ్।*
*ఆవాం తవాంగే సంభూతౌ తస్మాత్ కేశవ నామవాన్॥"*

కకారానికి బ్రహ్మ అని అర్థం. నేను సర్వజీవులకు ఈశుడను. మేమిద్దరం నీలో నుంచి పుట్టినందువల్ల నీవు కేశవుడవని పేరును పొందినావు అని శివుడు పరమాత్మతో మనవి చేసుకొన్నాడు.

అంతరాత్మగా నున్న పరమాత్ముడు నియమించిన తమ పదవులలో ఉండి తమ విధులను సక్రమంగా నెరవేర్చుతున్నారని తెలుస్తున్నది.

కంచుకేషు– 'కంచుకం' అంటే దేహానికి తొడుగుకొన్న అంగి. చొక్కా-దుస్తు-ల వంటి వారు బ్రహ్మారుద్రులు అని అర్థం. చొక్కా లోపల శరీరం, శరీరం లోపల ఆత్మ, ఆత్మలో ఉన్నవాడు– అంతర్యామి– పరమాత్ముడు.

*'ఆత్మా గుహాయాం నిహితోఽస్యజంతోః'* అన్నది వేదవాణి.

*"విష్ణురాత్మాభగవతో భవస్యామిత తేజసః"* (భారతం-కర్ణపర్వం-24-85) శివుని యొక్క మాహాత్మ్యం పరమాత్మయైన విష్ణుమూర్తి యొక్క అనుగ్రహం వల్లనే ప్రకాశిస్తున్నది అని అర్థం.

*"తవాంతరాత్మా మమచ యే చా న్యే దేహి సంజ్ఞికాః।*
*సర్వేషాం సాక్షిభూతోఽసౌ న గ్రాహ్యః కేనచిత్ క్వచిత్॥ (భా.శా.339)*

సర్వేశ్వరుడు నీకూ, నాకూ అంతరాత్మయై జీవులందరిలోనూ సాక్షీభూతుడై యున్నాడు. ఎవ్వనిచేతనూ ఎక్కడనూ ఇంతటి వాడని గ్రహింప శక్యం కానివాడు- అని బ్రహ్మ రుద్రునితో చెప్పినాడు. దీనివల్ల, ఇతర వస్తువులవలె బ్రహ్మరుద్రులు కూడా సర్వశరీరియైన సర్వేశ్వరునికి శరీర భూతులనీ, సర్వేశ్వరుడే వీరికి ఆత్మయని తెలుస్తున్నది కదా!

బ్రహ్మరుద్రులు అందఱిలాగా శేషభూతులనీ, సర్వేశ్వరుడే శేషియన్న విషయం ''*దాస భూతాః స్వతః సర్వే హ్యాత్మానః పరమాత్మనః। అతోఽహ మపితే దాసః, ఇతి మత్వా నమామ్యహం॥"* (మంత్రరాజస్తోత్రం) సకలాత్మలు పరమాత్మకు దాసభూతులు, కాబట్టి నేను కూడా నీకు దాసుడనైనందువల్ల నీకు దండం సమర్పిస్తున్నాను (దండ కఱ్ఱవలె నేలమీద పడి సాష్టాంగ నమస్కారం చేస్తున్నాను)- అని సర్వజ్ఞుడైన రుద్రుడే స్వయంగా భగవంతునితో విజ్ఞాపన చేసుకొన్నాడని ప్రస్పష్టం.

పద్మాసనాదిషు శివాదిషు నిపతంతి- విష్ణుమూర్తి యొక్క నాభియందలి పద్మం నుంచి జన్మించినవాడు చతుర్ముఖ బ్రహ్మ. ఆ పద్మ పుష్పాన్నే పీఠంగా అమర్చుకొని యున్నవాడు. కాబట్టి పద్మాసనుడని బ్రహ్మకు పేరు.

*"పద్మే దివ్యేఽర్క సంకాశేనాభ్యా ముత్పాద్యమామపి।*
*ప్రాజాపత్యం త్వయాకర్మ సర్వం మయినివేశితమ్॥"*

దివ్యమైన, సూర్యునిలాగా దేదీప్యమానమైన నీ నాభికమల మందునన్ను జన్మింపజేసి ప్రాజాపత్య కర్మను నా యధీనంలో ఉంచావు అని బ్రహ్మ వాక్కు

*"అస్య చైవానుజో రుద్రో లలాటాత్ యః సముత్థితః।*
*బ్రహ్మేను శిష్టో భవితా సర్వసత్త్వ పరప్రదః॥"*

బ్రహ్మదేవుని తర్వాత పుట్టిన రుద్రుడు లలాటం– నొసటి– నుంచి పుట్టిన వాడు. ఇతడు కూడా పరబ్రహ్మచేత నియమింపబడి సర్వభూతాలకు వరాలను ఇచ్చేవాడైనాడు.

*"నాన్ముగనై నా రణన్ పడైత్తాన్, నాన్ముకనుం తాన్ముకమాయ్*
*శంకరనై త్తా న్పడైత్తాన్"*

శ్రీమన్నారాయణుడు చతుర్ముఖ బ్రహ్మను సృజించాడు. ఆ చతుర్ముఖ బ్రహ్మ తనకు అంతరాత్మయైన నారాయణుని మూలంగా రుద్రుణ్ణి సృజించాడు. కాబట్టి పరమాత్మునికి అధీనులే అని అర్థం. రుద్ర శబ్దాన్ని కాక శివ శబ్ద ప్రయోగంచేత అమంగళుడైన రుద్రుడు పవిత్రుడై 'శివ' శబ్దవాచ్యుడయ్యాడని విశదమవుతున్నది.

*"తీర్థేన మూర్ధ్ని విధృతేన శివః శివోఽభూత్"* (భారతే ఉద్యోగ పర్వణి) త్రివిక్రమావతార సమయమందు బ్రహ్మ తన తండ్రి యొక్క వామపాదాంగుష్ఠం నుంచి ఉద్గమించిన గంగోదకం చేత, పాద ప్రక్షాళన చేసిన తర్వాత, ఆ సర్వేశ్వరుని పాదోదకాన్ని రుద్రుడు తన శిరస్సున ధరించినందువల్ల పవిత్రుడై 'శివ' శబ్ద వాచ్యుడయ్యాడన్నదే ప్రమాణం.

అయితే, ఈ శ్లోకమందు "పద్మాసనాది షు– శివాదిషు"– ఆది శబ్దంచేత రెండు వర్గాలుగా చెప్పబడినారేమి? అంటే– బ్రహ్మ కర్తృత్వం వేరు, శివుని కర్తృత్వం వేరు కదా!

*"ఏ తౌద్వౌ విబుధ శ్రేష్ఠౌ ప్రసాద క్రోధజౌ స్మృతౌ।*
*తదా దర్శిత పంథానౌ సృష్టి సంహార కారకౌ॥"*

చతుర్ముఖ బ్రహ్మ, శివుడును, వీరు ఉభయులు- పరబ్రహ్మ యొక్క అనుగ్రహం నుంచి పుట్టినవాడు ఒకడు- బ్రహ్మ; కోపంనుంచి పుట్టినవాడు మరొొక్కడు- శివుడు; సృష్టి సంహారాలను చేయడానికి పరబ్రహ్మచేత నియమింప బడిన వేర్వేరు కార్యపద్ధతులను కలవారు.

*"బ్రహ్మాదక్షాదయః కాలః; రుద్రః కాలాన్త కాద్యశ్చ"*- చతుర్ముఖ బ్రహ్మ, దక్షప్రజాపతి మొదలైన ప్రజాపతులు సృష్టికర్తలుగా నియమింపబడినవారు. శివుడు, యముడు, ఇత్యాది వర్గం ప్రళయకాల కర్తృత్వ నిర్వహణకై నియమింప బడింది. కాబట్టి, వీరు ఉభయ విభూతి నాయకుడైన సర్వేశ్వరుని విభూతిలో చేరి యుండినందువల్ల బ్రహ్మకు, శివునికి సర్వేశ్వరునితో తాదాత్మ్యం- ఐక్యం చెప్పబడింది. కాబట్టి కొందరు తాదాత్మ్యమనే బుద్ధితో బ్రహ్మను, అలాగే శివుణ్ణి ఉపాసిస్తున్నారు- ధ్యానం చేయడమందు మగ్నులవుతున్నారు.

తన్మాత్ర దర్శన విలోభిత శేముషీకాః- 'శేః' అంటే మోహం. 'ముషస్తేయే' అని ముషధాతువుకు దొంగిలించడమని అర్థం. 'శేముషి' అంటే మోహాన్ని- విపరీత జ్ఞానాన్ని నివారించేది- 'మంచి బుద్ధి'- అని అర్థం.

బ్రహ్మగానీ, శివుడుగానీ విష్ణువుతో సమానులు కారు.

*"ఆత్మైక్యం దేవతైక్యం త్రిక సమధిగతా తుల్య తైక్యం త్రయాణాం*
*అన్య త్రైశ్వర్య మిత్యాద్య పుణఫణితీ రాద్రియంతే న సంతః।*
*త్రయ్యంతై రేక కంఠై స్తదనుగుణ మనువ్యాస ముఖ్యోక్తి భిశ్చ*
*శ్రీమన్నారాయణో నః పతిరఖిలతను ర్ముక్తిదో ముక్త భోగ్యః"*

అన్ని దేహాలలో ఉండే జీవుడు ఒక్కడే అనీ, బ్రహ్మాది దేవతలందరు కలిసి ఒక్కటే దేవత అనీ, హరి హర బ్రహ్మలు- త్రిమూర్తులు సమానులనీ, ఐక్యాన్ని సాధిస్తూ, కొందరు త్రిమూర్తుల కంటే వేరుగా వీరికి మించిన ఒక ఈశ్వరత్వం కలవాడున్నాడనీ, ఈ విధంగా శాస్త్రపరిచయంలేనివారి వాదాలను ప్రమాణ పరతంత్రులైనవారు అంగీకరింపరు. ఎందుకంటే, ఉపనిషత్తులు, వాటికి

తగినట్లు మనువు, వ్యాసాది మహర్షులు రచించిన గ్రంథాలు లక్ష్మీ విశిష్టుడైన నారాయణుడొక్కడే పరదేవత యని, సర్వరక్షకుడు, చరాచర పదార్థాలను– జగత్తును– శరీరంగా కలవాడు, మోక్షమిచ్చేవాడు, నిత్యముక్తులచేత అనుభవింప బడువాడని తేటతెల్లంగా వెల్లడిస్తున్నాయి అని దేశికులు 'శ్రీమద్రహస్యత్రయ సారం' అనే ఉద్గ్రంథంలో, పరదేవతా పారమార్థ్యాధికారమందు, వివరించారు.

తన్మాత్ర దర్శనం– బ్రహ్మగానీ, శివుడుగానీ కర్మవశ్యులే. అంతర్యామియైన సర్వేశ్వరునికి కంచుక స్థానీయులే. బ్రహ్మాది దేవతలను మాత్రం చూడడం, అంతర్యామి వరకు దృష్టిని సారించక, దుస్తులను చూచి పరదేవత యని భావించే బహిర్దర్శనమన్న మాట. ఇట్టి వారిని చూచి ఉపాసించే వారు, పురుషుడు స్త్రీవేషధారణతో నటిస్తుంటే, ఆ రూపానికీ, హావభావాలకు ముగ్ధులై, వంచితులైన వారితో సమానులే అని ఈ శ్లోకంలోని మూడవ పాదం తెల్పుతున్నది.

బ్రహ్మ శివాది మాహాత్మ్యాన్ని ప్రతిపాదించే శాస్త్రం పాశుపతం. ఆ శాస్త్రాన్ని అనుసరించి తాదాత్మ్యం చేత ఉపాసన చేసేవారు పరమాత్ముణ్ణి లక్ష్యపెట్టక భగవంతునికి విముఖంగా చేయబడిన బుద్ధికలవారు.

సాత్త్విక శాస్త్రాలను అభ్యసించినవారు కూడా బ్రహ్మ శివుల పట్లనే సర్వేశ్వరునితో సమాన– తాదాత్మ్య– భ్రమ కలవారున్నారు. కొందరు తాదాత్మ్య భ్రమలేనివారు కూడా ప్రాకృత విషయాలను పరిత్యజించడానికి అసమర్థులై, ఆ విషయానుభవ రూపమైన క్షుద్ర పురుషార్థాలకు లాలసులైన వారున్నారు. ఇట్టివారే పరమాత్మను కాక ఇతర దేవతలను ఉపాసిస్తారు.

ఇలా రజస్తమోగుణాలు కలవారిచేతనే సృష్టి సంహార ప్రక్రియలు జరుపబడుతాయి అనే శాస్త్ర ప్రమాణాన్ని తెల్పడానికే పద్మాసనాదయః– బ్రహ్మదక్షాదులు, శివాదయః– శివుడు యముడు మొదలైన కాలాన్తకులు విభిన్న జాతులను – రెండు రాశులుగా చెప్పబడిన మాట గమనించదగినది కదా!

అంతమాత్రాన భగవద్రూపులని బ్రహ్మాదులను ఆరాధించడం వల్ల ఉపాసించడం వల్ల వంచింపబడుతారని- విలోభిత శేముషీకులని చెప్పబడింది.

*తాదాత్మ్య మూఢ మతయో నిపతంత్య ధీరాః*- 'తాదాత్మ్యం' అంటే భేదం లేదన్నమాట. ఒక్కటే అని అర్థం.

శ్రియః పతి రూపం బ్రహ్మ శివుల రూపం ఒక్కటే అని భావించడం మూఢమతి లక్షణం. విపరీత జ్ఞానం కలవారు అధీరులు. పరదేవత నారాయణుడే కాని బ్రహ్మ శివులు కారని తెలుసుకొని శాశ్వతానందాన్ని పొందే మార్గంలో ప్రవర్తించే ధైర్యంలేని వారు అని భావం.

అధీరులు= బుద్ధిలేనివారనే అర్థమూ ఉంది. వేదాంత శాస్త్రార్థం గహనమైనది కదా!

*పరాచః కామానను యంతి బాలాః*
*తే మృత్యోర్యంతి వితతస్య పాశమ్*
*అథ ధీరా అమృతత్వం విదిత్వా*
*ధ్రువ మధ్రువేష్విహ నప్రార్థయంతే॥ (కఠోపనిషత్. 4-2)*

'బాలాః'= అధీరులని అర్థం లేదా మూర్ఖులనవచ్చు- జ్ఞానం లేనివారు- అజ్ఞానులు ఐహికాముష్మిక సుఖాలను కోరి పయనిస్తారు. అట్టి మూర్ఖులు యమపాశంలో చిక్కుకొంటారు. ధీరులు మాత్రం నిత్యం- శాశ్వతమైన అమృతత్వాన్ని అంటే మోక్షోపాయాన్ని తెలుసుకొని ఈ లోకమందలి అనిత్యమైన విషయాలను కోరరు- అని స్పష్టపరచింది ఉపనిషత్తు (నిపతంతి= నితరాం పతంతి). బ్రహ్మ, శివుడు మొదలైన దేవతలను పరదేవతాబుద్ధితో ఆరాధించే అజ్ఞానులు నరకంలో పడతారు అని ఈ పదవ శ్లోక సారార్థం. "*అవరవరిరైయవర్ కుఱైవిల రిరైయవర్, అవరవర్ విది వషి యడైయ నిన్ఱనరే*" (తి.వా.మొ. 1-1-5). కొందరు తమ జ్ఞానభేదం చేత బ్రహ్మాది దేవతలను పరదేవతా భావంతో ఆశ్రయిస్తుంటారు. భక్తులకు కోరిన ఫలమిచ్చే శక్తి ఆ బ్రహ్మాది దేవతలకు లేదు.

అయినా వారిని ఆశ్రయించిన వారి అభీష్టఫలాన్ని ఆ బ్రహ్మాది దేవతలకు అంతర్యామిగా ఉన్న శ్రియః పతియే వారి ద్వారా ప్రసాదిస్తుంటాడు అని నమ్మాళ్వార్ల శ్రీసూక్తి.

"ఫలమత ఉపపత్తేః" (3-2-37) అనే బ్రహ్మసూత్రం ఫలప్రదాత నారాయణుడే అని స్పష్టంగా తెల్పుతుంది. ఇలాగా, భగవద్గీతలో ఏడవ అధ్యాయమందు 22. 23 శ్లోకాలు తెల్పుతున్నాయి.

*"సతయా శ్రద్ధయా యుక్తః తస్యారాధన మీహతే।*
*లభతేచ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్॥"*

బ్రహ్మాది దేవతలు నాకు శరీరం వంటివారు. నేను అనుగ్రహించిన శ్రద్ధతో భక్తుడు ఆ బ్రహ్మాది దేవతలను ఆరాధింప గోరుతాడు. వాస్తవంగా, వారికి అంతర్యామిగా ఉన్న నాకే ఆ యారాధన చెందుతుంది. కాబట్టి, ఆయా దేవతల నారాధించినవారు కోరిన వస్తువులను, ఆ దేవతల చేత నేనే ఇప్పిస్తుంటా నన్నాడు శ్రీకృష్ణ భగవానుడు. అయితే, ఇతర దేవతలను ఆరాధించడం కూడా వ్యర్థం కాకుండా, ఫలపర్యవసాయి అగునట్లు చేసే దయగలవాడు పరమాత్ముడని స్పష్టపరచాడు.

*"అంతవత్తు ఫలంతేషాం తద్భవత్యల్ప మేధసామ్।*
*దేవాన్ దేవయజో యాంతి మద్భక్తా యాంతిమామపి॥"*

పరిమితమైన భోగాలను అనుభవించే దేవతలను ఆరాధించే అల్ప బుద్ధిగల వారికి అల్పమైన- నశ్వరమైన ఫలమే లభిస్తుంది. నా భక్తులు మాత్రం శాశ్వతమైన, అపారమైన నా భోగాలతో సమాన భోగాలనే అనుభవిస్తారు అని భగవదుపాసకులకూ, తదితర దేవతోపాసకులకూ తారతమ్యం తెల్పబడింది కదా!

కంచుకేషు- పులి చర్మంలోని దూది, గడ్డి, సారంలేని ద్రవ్యాన్ని చూడక, కేవలం బయటనున్న పులి చర్మాన్ని చూచి పులి యనే తాదాత్మ్య మోహంతో

భయపడే జంతువుల పతనాన్ని స్ఫురింపజేయడం వల్ల ఈ (10వ) శ్లోకం ప్రస్తుతమందు అప్రస్తుతాన్ని స్ఫురింపజేసే 'సమాసోక్తి' అలంకారంచే భూషితం. వసంత తిలక.

*11. మధ్యే విరించ శివయోర్వి హితావతారః*
*ఖ్యాతోఽసి తత్సమతయా తదిదం న చిత్రమ్।*
*మాయావశేన మకరాది శరీరిణం త్వాం*
*తానేవ పశ్యతి కరీశ! యదేష లోకః॥*

**అర్థం:** హే కరీశ!= ఏనుగులచే స్తోత్రం చేయబడిన దేవా!; విరించ శివయోః = బ్రహ్మ శివుల యొక్క; మధ్యే= నడుమ; విహిత+అవతారః= అవతారాన్ని ధరించినవాడవై; తత్+సమతయా= ఆ బ్రహ్మ శివులతో సముడు అనే భావం చేత; ఖ్యాతః= ప్రసిద్ధుడవై; అసి= ఉన్నావు; తత్= వారి మధ్యనుండడమనే; ఇదం= ఈ విషయం; న, చిత్రం= ఆశ్చర్యం కాదు; యత్= ఎందువలన? అంటే; మాయా వశేన= సంకల్ప వశంచేత; మకర+ఆది శరీరిణం= మకరం (చేప) మొదలైన శరీరం కలవాడవైన; త్వాం= నిన్ను; ఏషః= ఈ; లోకః= లోకం; తాన్, ఏవ= అమకరాదులనే; పశ్యతి= చూస్తుంది.

**తా॥** ఓ కరీశా! త్రిమూర్తులలో- బ్రహ్మ, శివుడు అనే వీరి మధ్యన అవతరించిన నీవు వారితో సమానుడవని పేరు పొందినావు. అది ఆశ్చర్యం కాదు. నీ సంకల్పానుసారంగానే మత్స్య కూర్మ వరాహాది రూపాలను ధరించిన నిన్ను ఈ లోకం (నిజం తెల్యక) ఆ చేప, తాబేటి రూపాల (గలవానిగ)నే చూస్తున్నది.

**వ్యాఖ్య:-** బ్రహ్మ విష్ణు శివులు- త్రిమూర్తులు సమానులే అనే భావనను నిరాకరించే శ్లోకం.

ప్రపంచానికి సృష్టి స్థితి సంహారాలు అనే మూడు ప్రక్రియలు వరుసగా ఉంటాయి. ప్రపంచాన్ని సృష్టించడానికి పరమాత్మ తన నాభికమలం నుంచి

ఉద్భవించిన చతుర్ముఖ బ్రహ్మయందు అనుప్రవేశం చేశాడు. ప్రపంచాన్ని లయం చేయడానికి రుద్రుణ్ణి ఉద్భవింపజేసి, అతనియందు కూడా అనుప్రవేశం చేశాడు. అంటే, పరమాత్మ బ్రహ్మ, శివులలో అంతర్యామిగా ఉండి, సృష్టి సంహార కార్యాలను వారి ద్వారా చేయిస్తున్నాడు. పుట్టిన చేతనా చేతన వస్తువులకు కాలక్రమేణ గిట్టడం- నశించడం ఆజానజం. సృష్టి సంహారక్రియలకు మధ్యనున్న కాలాన స్థితి- ఉనికి అనేది చాలా సారమైనది. ఈ స్థితియే స్థేమం-రక్షణ వ్యాపారమన బడుతుంది.

'ప్రాప్తోద యేషు- అనుప్రవేశాత్' అని పూర్వశ్లోకంలో చెప్పిన విషయం గమనీయం కదా! అనుప్రవేశం చేసిన పరమాత్మచే నియమితమైన సృష్టి సంహార కర్తృత్వాన్ని వహించిన బ్రహ్మ శివులకు ఉదయమున్న దన్నప్పుడు వారికి అస్తమించడం కూడా ఉన్నదన్నమాటే కదా!

"న తస్యేశే కశ్చన"- పరబ్రహ్మ సమానాధిక దరిద్రుడే కదా! ఇక ఆయనను నియమించే వాడెవడూ లేడు. స్వతంత్రుడు కాబట్టి, తన ఇచ్ఛచేత సృష్టి ప్రళయ కాలాలకు మధ్యనున్న జగద్రక్షణ వ్యాపారాన్ని తానే స్వీకరించి, నలువకు శివునికి మధ్యన ఉన్నాడు.

*"రుద్రం సమాశ్రితాదేవాః, రుద్రో బ్రహ్మాణమాశ్రితః।*
*బ్రహ్మా మామాశ్రితో రాజన్! నాహం కంచిదు పాశ్రితః।*
*మమాశ్రయోన కశ్చిత్తు, సర్వేషా మాశ్రయోహ్యహమ్॥"*

దేవతలు రుద్రుణ్ని ఆశ్రయిస్తారు. రుద్రుడు బ్రహ్మను ఆశ్రయిస్తాడు. ఆ బ్రహ్మ నన్ను ఆశ్రయిస్తాడు. నాకు వేరే ఒక్క ఆధారం అక్కర లేదు. అయితే, నేను అందరికిని ఆధారమైన వాడను- అని పరమాత్ముడే ప్రకటించాడు.

మధ్యే విరించ శివయోర్విహితావతారః- జగత్తును పాలించే సామర్థ్యం సర్వేశ్వరుడైన శ్రీహరికి తప్ప మరెవ్వరికీ లేదు.

"రక్షార్థం సర్వభూతానాం విష్ణుత్వ ముపజగ్మివాన్"-(రా) సమస్త ప్రాణులను కాపాడడం కోసమే నీవు విష్ణువుగా వెలసినావు అని ఆదికవి వాల్మీకి వాక్యం.

విహితావతారః- రామకృష్ణావతారాలవలె, సృష్టి సంహారకులైన విరించ శివులకు నడుమ రక్షణార్థమే విష్ణువుగా మొదట అవతరించాడు శ్రీమన్నారాయణుడు.

*"బ్రహ్మేశ మధ్యగణనా గణనార్క పంక్తౌ*
*ఇంద్రాను జత్వ మదితే స్తనయ త్వయోగాత్।*
*ఇక్ష్వాకు వంశ యదువంశ జనిశ్చ హస్త*
*శ్లాఘ్యాన్య మూన్యనుపమస్య పరస్య ధామ్నః॥" (అతిమానుషస్తవం 15)*

నిరుపమాన పరంజ్యోతియైన సర్వేశ్వరుడు బ్రహ్మకు శివునికి నడుమ విష్ణువుగా పరిగణించబడడమూ; 'ఆదిత్యానా మహం విష్ణుః' (భ.గీ.) ద్వాదశాదిత్యులలో విష్ణువు ఒక్కడుగా లెక్కింపబడడమూ, అదితికి కుమారుడుగా జన్మించి ఉపేంద్రుడవడమూ, ఇక్ష్వాకు వంశంలో శ్రీరాముడుగానూ, యదువంశంలో శ్రీకృష్ణుడుగానూ అవతరించడం- ఆహా! ఈ అవతారాలన్నీ కొనియాడ దగినవే కదా! అని శ్రీ కూరేశులు స్తోత్రం చేశారు.

వీరి తనయుడైన శ్రీ పరాశరభట్టర్ *"మధ్యే విరించి గిరిశం ప్రథమావ తారః"* (ఉత్తర శతకం-51) బ్రహ్మరుద్రులకు నడుమ విష్ణువుగా ఉండడమే భగవానుని మొదటి అవతారమని శ్రీరంగరాజస్తవం చేశారు.

*ఖ్యాతోఽసి తత్సమతయా తదిదం న చిత్రమ్*- మొదట సృష్టి, తర్వాత స్థితి- రక్షణ, ఆ తర్వాత ప్రళయం, ఈ కార్యక్రమాన్ని బట్టి సృష్టి సంహారాల మధ్య కాలాన రక్షణ కార్యమున్నది. ఈ జగద్రక్షణ కార్యాన్ని నిర్వహించడానికి సర్వేశ్వరుడు బ్రహ్మేశానుల మధ్య విష్ణురూపంగా వెలసి వారితో సమానుడని పరిగణింప బడినాడు.

బ్రహ్మరుద్రులకు నడుమ విష్ణురూపంగా అవతరించి రక్షణ ప్రక్రియ నాచరించే పురుషోత్తముని యందు శాస్త్రజ్ఞానంలేని ఆ సురప్రకృతిగల వ్యక్తులకు బ్రహ్మరుద్రులతో సమానుడనే భ్రాంతి కలుగడం ఆశ్చర్యం కాదని తాత్పర్యం.

*మాయా వశేన మకరాది శరీరిణం త్వాం*
*తానేవ పశ్యతి- యదేషలోకః*

"మాయాతు వయునం జ్ఞానమ్" అని నిఘంటువు. 'మాయ' అంటే భగవానుని సంకల్ప రూపమైన జ్ఞానం అని అర్థం. "*అజోఽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్। ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవా మ్యాత్మ మాయ యా॥*" (భ.గీ. 4-6).

'ప్రకృతిం స్వాం' అంటే అపహత పాప్మత్వాది తన స్వభావమని అర్థం. జీవులవలె కర్మ వశం చేత కలిగే పుట్టుక లేనివాడనై, నాశం లేని స్వభావం కలవాడనై, భూతాలకీశ్వరుడనైన నా స్వభావాన్ని అధిష్ఠించి, (నా స్వభావ సిద్ధ సిద్ధమైన అపహత పాప్మత్వాది గుణాలను విడువకుండా శుద్ధ సత్త్వ రూపంతో) నా మాయ- సత్యసంకల్పం చేతనే పుట్టుతున్నాను అని శ్రీకృష్ణ భగవానుడు చెప్పినాడు.

"*జగతా ముపకారాయ న సాకర్మనిమిత్త జా*"- (భారతం) సకల శక్తులతో కూడియున్న శరీరాలను తన లీల చేత- స్వేచ్ఛచేత నిర్మించుకొన్న తన పుట్టుక జగదుపకారానికి అయినదే కాని కర్మవశాన కలిగేది కాదని తెల్పబడినది.

"*దేవతిర్యఙ్మనుష్యాఖ్యా చేష్టావంతి స్వలీలయా*" (వి.పు. 6-7-71) అట్టి పరబ్రహ్మయొక్క అవతారం తన లీలచేత నేర్పరచబడిన, దేవ మనుష్య పశు పక్ష్యాది రూపాలైన చేష్టలతో కూడినదని శ్రీ పరాశర మహర్షి 'పురాణరత్న'మందు విశదీకరించాడు.

ఈ విషయమంతా శ్రీ భాష్యమందు '*అంతరధికరణం*'లో (1-1-7) "*అంతస్తద్ధర్మోపదేశాత్*" (బ్ర.సూ. 1-1-21) అన్నచోట వ్యాఖ్యానింపబడింది.

భగవానుడు తన సంకల్ప జ్ఞానంచేతనే మత్స్య, కూర్మ, వరాహాది అప్రాకృత శరీరాలను ధరించాడు. ఈ అవతారాలు కూడా జగదుపకారం కోసమే- సాధురక్షణ, దుష్టశిక్షణ చేసి విశ్వాన్ని పాలించడం కోసమే దాల్చినాడని నిరూపించబడ్డాయి కదా!

*"ఒత్తార్ మిక్కారై ఇల యాయ మామాయా"* (2-3-2) నిస్సమాభ్యధికుడైన భగవానుడు ఆశ్చర్యభూతుడన్నారు ఆళ్వార్లు.

*"యత్ ప్రపత్తిం వినా సర్వైర్యస్య మాయాదురత్యయా।*
*ధనం జయరథోత్తంసం తత్ ప్రపద్యే పరం మహః"*

(శతదూషణి) ఎవరికైనా, ప్రపత్తిని అనుష్ఠించకుండా ఉంటే ఎవని మాయ దాటరానిదో, అట్టి ధనంజయుని రథ భూషణమైన చల్లని పరంజ్యోతియే శరణమని ప్రార్థిస్తున్నా నన్నారు దేశికులు.

లోక దృష్టి, శాస్త్ర దృష్టి వేర్వేరుగా ఉంటాయి. యదేషలోకః- ఎందుకంటే, ఈ లోకం- జనం, భగవానుడు జగద్రక్షణార్థం మత్స్య కూర్మ వరాహ సింహాది అప్రాకృత రూపాలతో అవతరిస్తే, ఆ యవతారాలను ప్రకృతిలో ఉండే చేప, తాబేలు, పంది, సింగం లాంటి సజాతీయ రూపాలు అనే భ్రాంతితో చూస్తున్నది కదా! కాబట్టి, లోక దృష్టి ఎంత దోషభూయిష్ఠమో తెలుస్తున్నది. పామర జనుల దృష్టిలో తన సంకల్పంతో అవతరించిన భగవంతుని యొక్క మీన కమఠ వరాహ సింహాద్యప్రాకృత రూపాల విషయమై ప్రాకృత మకరాది జంతువులతో సాజాత్య భావన ఉన్నదన్నప్పుడు, ఇక సర్వ చరాచరాత్మకుడైన సర్వేశ్వరుడు విష్ణురూపంతో విరించి శివుల మధ్య రక్షాదక్షుడై యుండగా, ఆ ఉభయులతో పాటు విష్ణుమూర్తి యందు సమత్వ భావన ఉండడం ఆశ్చర్యం కాదు. ఇది కైముత్యన్యాయ సిద్ధమే. ఇచ్ఛాగృహీతాభిమతమైన భగవదవతార రహస్యం చాలా సూక్ష్మమైనది కదా!

శ్రుతిస్మృతుల ప్రమాణాలను బట్టి తత్త్వం తెలుసుకో దగినది. భగవానుని మత్స్యాది కృష్ణాంతం వరకు ఉన్న అనేకావతారాలు ఎవరికీ సజాతీయాలు కావు.

"అజాయ మానో బహుధా విజాయతే" (శ్రుతి). పరత్వం కలవాడూ, పుట్టుక లేనివాడు పరమాత్ముడొక్కడే. అయినా, "పతిం విశ్వస్యాత్మా" సర్వాంతర్యామియై విశ్వాన్ని సంరక్షించడానికి అవతరించడం ఆయనకే తగినది.

"తస్య ధీరాః పరిజానంతి యోనిమ్" ఆ భగవత్తత్త్వం భక్తి రూపాపన్న శేముషీకులే తెలుసుకోవడానికి యోగ్యమైనది. అందుకే-

"తత్త్వం జిజ్ఞాసమానానాం హేతుభిః సర్వతో ముఖైః।
తత్త్వ మేకో మహా యోగీ హరి ర్నా రాయణః ప్రభుః॥"

అని వ్యాస మహర్షి సర్వశాస్త్రార్థంగా శ్రీమన్నారాయణుడే పరదైవమని ఉద్ఘోషించాడు.

వసంత తిలక- త భ జ జ గ గ- గణాలు కలది.

12. బ్రహ్మేతి శంకర ఇతీంద్ర ఇతి స్వరాడి
త్యాత్మేతి సర్వమితి సర్వ చరాచరాత్మన్।
హస్తీశ! సర్వవచసా మవసాన సీమాం
త్వాం సర్వకారణ ముశంత్య నపాయవాచః॥

**అర్థం:** హే హస్తీశ!= ఓ కరిశైలేశా!; హే సర్వచర+అచర+ఆత్మన్= సమస్త చేతనా చేతన వస్తువులకు ఆత్మయైన ఓ దేవా!; అనపాయ వాచః= దోషంలేని వాక్కులుగల వేదాలు; సర్వ వచసాం= సమస్త శబ్దాలకు; అవసాన సీమాం= పర్యవసాన భూమియైన; సర్వకారణం= అన్నిటికీ కారణభూతుడవైన; త్వాం= నిన్ను; బ్రహ్మా+ఇతి= బ్రహ్మవనీ; శంకరః, ఇతి= శంకరుడవు అనీ, ఇంద్రః.ఇతి= ఇంద్రుడవు అనీ; స్వరాట్+ఇతి= స్వరాట్టు అనీ; ఆత్మా+ఇతి= ఆత్మవు అనీ; సర్వం, ఇతి= సర్వమని; ఉశంతి= ప్రతిపాదిస్తున్నాయి.

**తా॥** సమస్త చరాచర పదార్థాలను శరీరంగా కలిగియున్న ఓ వరదా! ఏ విధమైన దోషంలేని వేదాలు అన్నింటికి కారణమైన, సమస్త పదాలకు

ముఖ్యవిషయ భూతుడవైన నీవే బ్రహ్మవనీ, శివుడవనీ, ఇంద్రుడవనీ, స్వరాట్ అనీ, ఆత్మవనీ, సర్వమని చెబుతున్నాయని తాత్పర్యం.

**వ్యాఖ్య:-** వేదాలు భగవానుడు సర్వకార్య కారణభూతుడని ప్రతిపాదిస్తున్నాయని వివరించే శ్లోకం.

బ్రహ్మరుద్రులతో సర్వేశ్వరునికి తాదాత్మ్యం లేదు- అభేదం లేదు- అన్నప్పుడు కేవలం ఆయా శబ్దాలచేతనే భగవానునికి పరమకారణుడని నిర్దేశించడం ఎలా ఉపపాదింపబడుతుంది? అనే శంకను పరిహరిస్తున్నది ఈ శ్లోకం.

'ఏషలోకః' అని గత శ్లోకం చెప్పింది. ఈ లోకం కూడా తానే అని ఈ శ్లోకం సమర్థిస్తున్నది.

అనపాయవాచః- తత్త్వజ్ఞానమెరుగని లోకం- జనం చెప్పే మాటల్లో భ్రమ విప్రలంభాది దోషాలు ఉంటాయి. అట్టి ఏ దోషమూ లేని అపౌరుషేయాలైన, ఆప్తవాక్కులు కలవి వేదాలు. *"వేదైశ్చ సర్వైర హమేవ వేద్యః"*- వేదాలన్నీ నన్నే తెల్పుతాయని గీతాచార్యుని సూక్తి (15-15).

*"సర్వే వేదా యత్పద మామనంతి"* (కఠోప- 2-15).

సకల వేదాలు ప్రణవ స్వరూప పదాన్ని లక్ష్యస్థానంగా చెబుతున్నాయి.

*బ్రహ్మేతి శంకర ఇతీంద్ర ఇతి స్వరాడిత్యాత్మేతి సర్వమితి*- బ్రహ్మ, శివుడు ఇంద్రుడు, స్వరాట్టు, ఆత్మా; సర్వ శబ్దాలన్నీ భగవానునికే వర్తిస్తాయని అర్థం.

*"బ్రహ్మో నారాయణః, శివశ్చ నారాయణః, శక్రశ్చ నారాయణః, ద్యావా పృథివ్యోచ నారాయణః, నద్వితీయోఽస్తి కశ్చిత్, స విష్ణు రేవ భవతి"*- శ్రుతి రీతిగా బ్రహ్మ శివాది నామాలన్ని విష్ణుమూర్తి యందే అన్వయిస్తాయని భావం.

దోషాలు లేనివే ప్రమాణాలు కదా!

"వచసాం వాచ్యముత్తమమ్" (జితంతే స్తోత్రం) సర్వశబ్దాలచే ప్రతిపాదింప బడే ఉత్తముడు భగవానుడు.

*"(న+అ) నా వేద విన్మనుతే తంబృహంతమ్"*- వేదాధ్యయనం చేయని వ్యక్తి బ్రహ్మమును తెలుసుకోలేడు.

"శాస్త్రయోనిత్వాత్" (బ్ర.సూ.) శాస్త్రం చేతనే బ్రహ్మము తెలుసుకోదగినదని స్పష్టంగా చెప్పబడింది.

*"బ్రహ్మా శివః శతమఖః పరమస్వరాడిత్యేతేఽపి యస్య మహిమార్ణవ విప్రుషస్తే"*- అన్న (ఆళవందార్ స్తోత్రం-11) చోట, బ్రహ్మాదులందరు భగవానుని మహిమ అనే మహాసముద్రంలోని తుంపురులే. భగవానుడైన నారాయణుని ఈశత్వం అనవధికాతిశయమైనది. బ్రహ్మశివాదుల మహిమ స్వాభావికం కాదు. నారాయణుడు అనుగ్రహించినదే. కాబట్టి "బ్రహ్మ సశివః సేంద్రః సోఽక్షరః పరమస్వరాట్" అనే శ్రుతి రీత్యా సః అంటే ఆ నారాయణుడే అన్ని- అంటే బ్రహ్మాదులకు నారాయణునికి శరీర శరీరి భావమని అర్థం (స్వరూపైక్యం కాదు). ఉభయ విభూతి నాయకుడైన నారాయణుడే నిస్సమాభ్యధిక పరత్వం కలవాడని స్వామి దేశికన్ స్తోత్రభాష్యంలో విశదపరచారు.

సర్వం- 'సృ-గతౌ' అనే ధాతువుమీద 'వన్' ప్రత్యయం చేరడం వల్ల 'సర్వః' అనే పదం సిద్ధించింది. 'సృ' అనే ధాతువు గమనార్థకం. "గత్యర్థాః ధాతవః బుద్ధ్యర్థాశ్చ" అనే శబ్ద శాస్త్రమందలి సూత్రం చేత గమనార్థక ధాతువులు జ్ఞానార్థకాలే.

"సరతి అవయవాన్ ఇతి సర్వః"- జీవాత్మ తన శరీరమందు సర్వావయవాల్లో వ్యాపించియున్నట్లే సర్వేశ్వరుడు సర్వ వస్తువులలో వ్యాపించియున్నందువల్ల, ఇట్టి వ్యాప్తియే సర్వపదార్థాలతో అభిన్నునిగా సామానాధికరణ్యం చేత భావించడానికి హేతువైనది.

*"అయః పిండే యథా వహ్నిః భిన్న స్తిష్ఠత్య భిన్నవత్।*
*తథా విశ్వమిదం దేవో హ్యావృత్య పరితిష్ఠతి॥"*

అగ్ని వేరైనదైనా, మండుతున్న ఇనుప గుండులో వేరుగా లేక లోపల బయట అంతటా వ్యాపించియున్నట్లే, ప్రపంచంలో సర్వవ్యాపకుడైయున్నాడు అన్నది ప్రస్పష్టం.

*"యేన సర్వమిదం ప్రోతం"*– *"సవై సర్వమిదం"*– అని నారాయణోపనిషత్తు నందు; *"సర్వం సమాప్నోషితతోసి సర్వః"*– అని (వి.పు.) అంతఃస్యూతమైనందున 'సర్వ' శబ్దవాచ్యుడు సర్వేశ్వరుడే నిరూపింపబడింది.

రెండు పదాలకు సమాన విభక్తి ప్రత్యయాన్నిబట్టి 'సామానాధికరణ్యం' అనబడే శాస్త్ర పద్ధతిలో అభేదాన్ని (ఐక్యాన్ని) చెప్పడం గమనించ దగింది (ఒకే స్వతంత్ర పదమైతే అభేదం చెప్పడం కుదరదు).

ఉదా:– నీలో ఘటః– నీల రూపంతో కూడిన ఘటరూపాన్ని 'నీలఘటం' అని ఏకార్థాన్ని ప్రతిపాదించడమే 'సామానాధికరణ్యం' అనబడుతుంది. అలాగే, *"దేవదత్తోజ్ఞాతా"*– అన్నచోట దేవదత్త శబ్దంతో జ్ఞానాశ్రయ రూప జీవుణ్ణి బోధించే 'జ్ఞాతా' అనే పదానికి ఏకార్థం సంభవించడం సామానాధికరణ్యం. దేవదత్త శరీరియైన జీవునికీ జ్ఞాతృత్వ విశిష్టు)కీ 'దేవదత్తుడు జ్ఞాత' అని ఏకార్థాన్ని ప్రతిపాదించినందువల్ల 'రూప సామానాధికరణ్యం' ఏర్పడింది. శరీర వాచక శబ్దాలకు శరీరిపర్యం తార్థకత్వం లోకంలో వ్యవహరింపబడుతున్నదే కదా!

సర్వ చరాచరాత్మన్– 'చర' శబ్దం జీవపదార్థాలను, 'అచర' శబ్దం జడపదార్థాలను చెబుతున్నది.

'ఆత్మన్' శబ్దానికి *"ఆత్మాయత్నో ధృతిర్బుద్ధిః స్వభావో బ్రహ్మ వర్ష్మచ"* (అమరం) యత్నం, ధైర్యం, బుద్ధి, స్వభావం, పరమాత్మ, దేహం, (చకారం వల్ల) జీవుడు అని నానార్థాలున్నాయి.

సర్వ చరాచరాణి ఆత్మా (శరీరం) యస్యసః= సర్వ చరాచరాత్మా. సర్వ చరాచరాలు శరీరంగా కల పరమాత్మ అని బహువ్రీహి సమాసం.

సర్వ చరాచరాణాం ఆత్మా= సర్వ చరాచరాత్మా. చరాచర వస్తువులన్నిటికి ఆత్మయైన పరమాత్మ, అని షష్ఠీ తత్పురుష సమాసం. ఇది హేతుగర్భం. ఇలా రెండు విధాలుగా చెప్పవచ్చును.

శరీర వాచక పదాలకు శరీరి పర్యంతం పర్యవసిస్తుందని సామానాధి కరణ్యం చేత సూచింపబడుతున్నది.

"చరాచర వ్యపాశ్రయస్తు స్యాత్ తద్వ్యపదేశో భాక్తః తద్భావ భావిత్వాత్"- (బ్ర.సూ. 2-3-17) ఈ సూత్రమందు 'అభాక్తః' అనీ, 'భాక్తః' అనీ రెండు రకాలుగా పద విభాగం చేయబడింది. 'అభాక్తః' అంటే గౌణార్థం కానిది, ముఖ్యార్థం కలది అని అర్థం.

స్థావర జంగమాత్మక వస్తువులను తెలియజేసే శబ్దాలు వాటిలో అంతరాత్మయైన పరబ్రహ్మను తెలియజేయడంలో ఔపచారికం కానివి, అంటే ముఖ్యార్థం కలవి అని భావం.

"అనేన జీవేన ఆత్మనా అనుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి"- అనే శ్రుతి వాక్యం చేతనూ, సర్వపదార్థాలు పరమాత్మ వాటిలో అంతర్యామిగా ఉండడం వల్లనే కదా పదార్థాలుగా తెల్పబడుతున్నవి. శబ్దాలు పరబ్రహ్మను తెల్పడం వల్లనే అవి వాచకశక్తి కలిగి యున్నాయని సారార్థం.

'భాక్తః స్యాత్'- ఆయా పదార్థాలను తెలిపే శబ్దం (భాక్తః) ఆయా శబ్దవాచ్యుడైన పరమాత్మయొక్క ఏకదేశాన్ని మాత్రమే తెలియజేస్తుంది.

పరమాత్మ ఆయా వస్తువులను శరీరంగా కలవాడు అనే జ్ఞానం కలిగిన తర్వాతనే లోకంలో ఆయా వస్తువులకు వాచకాలుగా తెలియబడే శబ్దాలు వాస్తవంగా సర్వేశ్వరుణ్ణి తెలియజేస్తాయని లోకులు తెలుసుకొంటారు అని

పిండితార్థం. శ్రీ భాష్యంలో చెప్పిన ఈ రెండర్థాలూ సర్వపదార్థాలకు భగవత్పరత్వమే అని స్వారస్యం.

సర్వవచసాం అవసాన సీమాం- చరాచరాలనే ఉభయపదాలకు పర్యవసాన సీమాభూమి అంటే ముఖ్యంగా భగవత్పర్యంతం అనే అర్థాన్ని సూచిస్తున్నది:

"సర్వం ఖల్విదం బ్రహ్మ"- ఈ ప్రపంచమంతా పరబ్రహ్మ స్వరూపమే.

"అయమాత్మా బ్రహ్మ"- "మాం ఉపాస్వ"- ఇత్యాది వాక్యాలు నాలో ఉన్న అంతర్యామియైన పరమాత్మను శ్రద్ధతో ఉపాసించుమనే అర్థాన్ని సూచిస్తున్నాయి.

సర్వకారణం- "కార్యాణాంకారణం పూర్వం" (జితంతా స్తోత్రం).

ఈనాడు కనబడుతున్న ఘటానికి (కుండకు) ఉపాదాన కారణం నిన్న చూచిన మట్టియే అన్నట్లు, సర్వ పదార్థాల ఉత్పత్తికి కారణం పరమాత్మయే అని అర్థం.

పరబ్రహ్మ చేతనాచేతన విశిష్టమైనది. కారణావస్థయందు చేతనా చేతనాలు నామరూప విభాగానికి అనర్హంగా ఉంటాయి. కార్యావస్థయందు చిద చిత్పదార్థాలు నామరూప విభాగార్హంగా ఉంటాయని భావం. అవస్థాంతరం పొందడమని సారార్థం.

కారణావస్థలోని ఒక్క పరబ్రహ్మయే కార్యావస్థలో అనేకమైనా డనడం వల్ల, జగచ్ఛరీరుడు పరబ్రహ్మ యనడం వేదాన్త సారార్థం.

*'తిడ విశుం బెరి వళినీర్ నిలమి వైమిశై*
*పడర్ పొరుళ్ ముఘవదు మాయనై యవైదొఱుమ్।*
*ఉడన్మిశై యుయిరె నక్కరన్దెం గుంపరందుళన్*
*శుడర్మిగు శురుదియు ళివై యుండ శురనే॥ (తి.వా.మొ. -1-1-7)*

పృథివ్యాది పంచభూతాలనూ, వాటివల్ల చరాచర వస్తువులనూ సృజించి,

సమస్త వస్తువులందు వాటికి గోచరించనివాడై శరీరంలో వ్యాపించిన జీవుని లాగా తాను వ్యాపించి యున్నాడు భగవానుడు. నిర్దుష్టమై ప్రకాశించే వేదం చేత ప్రతిపాదితుడైన శ్రియఃపతియే ప్రళయకాలాన తన కుక్షిలోనే సమస్త వస్తువుల నుంచుకొని రక్షించిన దేవుడు. కాబట్టి, పరమాత్మకు జగత్తు శరీరం, పరమాత్మ శరీరి, అని ఆళ్వార్ల శ్రీసూక్తి.

అనపాయవాచః ఉశంతి– నిర్దుష్టంగా ప్రకాశిస్తున్న వేదాలు– "అహమేకః ప్రథమ మాసమ్"– నేను మొదట ఒక్కడనే ఉంటిని అని శ్రీమన్నారాయణుడే ఆదికారణమని– ఉశంతి (ఇచ్ఛార్థక ధాతువు) ప్రతిపాదిస్తున్నాయి.

*"అథో పకరణం దివ్యం పంచశక్త్యుప లక్షితమ్।*
*కాలజ్ఞాన క్రియేచ్ఛాఖ్య ప్రాణసంజ్ఞం మహామతే॥" (పౌష్కర సంహిత).*

కాలం, జ్ఞానం, క్రియ, ఇచ్ఛ, ప్రాణం (జ్ఞానశక్తి బలైశ్వర్య వీర్య తేజస్సులు అనే షాడ్గుణ్యమే ప్రాణశక్తి) అనబడే దివ్య శక్తులు ఉపకరణాలుగా కలవాడు శ్రియఃపతి. కాబట్టి, పంచశక్తి మయ విగ్రహుడు పరమాత్ముడు.

*"అథైనమేతే దేవాః ప్రాణాః అమృతాః ఆ విశంతి"* అనే వేదవాణి ఈ బ్రహ్మ రుద్రేంద్రాది దేవతలు పరమాత్మవల్ల ఉజ్జీవిస్తున్నారు. చాలాకాలం మరణాదులు లేని వారై యున్నారు అని బోధిస్తున్నది.

"య ఆత్మదా బలదాః" అనే శ్రుతివాక్యం ఆయా జీవులకు శక్తిని ఇచ్చి, ఫలాలనూ ప్రసాదించేవాడు పరమాత్మయే, కేవల జీవనాన్నే కాక మహానంద రూపమైన మోక్ష మనే ఉజ్జీవనానికి కూడా కారణమైనవాడని విశదీకరిస్తున్నది.

"కో హ్యేవాన్యాత్ కః ప్రాణ్యాత్, యదేష ఆకాశ ఆనందో నస్యాత్" (తై- ఆనందవల్లి) ఆనంద స్వరూపుడైన పరమాత్మ సంకల్పించకపోతే, ఎవడు జీవించగలడు? ఉజ్జీవించగలడు? అని స్పష్టంగా తెల్పుతున్నది.

స్వామి దేశికన్ మరొకచోట చెప్పిన శ్లోకం ఇక్కడ స్మరింపదగిన ఆవశ్యకత లేకపోలేదు.

*"దహర కుహరే దేవస్తిష్ఠన్, నిషద్వర దీర్ఘికా*
*నిపతిత నిజాప త్యాదిత్సావతీర్ణ పితృక్రమాత్।*
*ధమని మిహ నస్తస్మిన్ కాలే స ఏవ శతాధికాం*
*అకృతక పురప్రస్థానార్థం ప్రవేశయతి ప్రభుః॥"*

పరమాత్మ రక్తమాంసముల భూయిష్ఠమైన జీవుని శరీరంలోని దహర హృదయకోశంలో ఎందుకు ఉన్నట్లు? సమాధానమిది–

నిషద్వర దీర్ఘిక– బురదతో నిండిన దిగుడు బావిలో ఒక చిన్న బాలుడు పడి బురదలో కూరుకుపోయాడు. ఆ పిల్ల వానిమీదగల అపార ప్రేమతో వాణ్ణి పైకి తీసుకొని రావడానికి శక్తి యున్న తండ్రి కూడా ఆ బావిలోకి దిగినాడు. ప్రేమగల తండ్రి చూస్తూ ఊరుకోలేడు గదా!

ఆ విధంగానే మాలిన్యంగల ఈ ప్రాకృత శరీరంలోపడి కొట్టుమిట్టాడుతున్న ఈ జీవుణ్ణి ఉద్ధరించడానికి అపారవాత్సల్యం గల జగత్పితయైన పరమాత్మ, మలినమనియైనా లెక్కచేయక, ఇరుకైన చిన్న గది వంటి ఈ దహర హృదయకోశంలో ప్రవేశించాడు.

మనకోసమే ఈ బురదలోకి దిగిన పరమాత్ముని పాదాలను విడువకుండా మనం పట్టుకొన్నట్లైతే, ఆయన మనకు జ్ఞానదీపాన్ని చూపుతూ, మూర్ధన్య నాడి అనే చక్కని మార్గంలో హృదయ గృహం నుంచి ఊర్ధ్వగతిని ప్రసాదించి వెలుపలికి తీసుకొని వెళ్ళగలడు. మన హృదయ గుహలోకి ఆయన ప్రవేశించింది అందుకే.

సర్వేశ్వరుడెంత దయాళుడో కదా! ఈ (12వ) శ్లోకం సాభిప్రాయ విశేషణాల వల్ల పరికరాలంకార సజ్జితం. బ్రహ్మేతి శంకరే తీత్యాది పదాలవల్ల ఉల్లేఖాలంకారమూ వ్యంజితం. వసంత తిలక.

*13. ఆశాధిపేషు గిరిశేషు చతుర్ముఖేష్వ*
*ప్యవ్యాహతా విధినిషేధ మయీ తవాజ్ఞా।*
*హస్తీశ! నిత్యమనుపాలన లంఘనాభ్యాం*
*పుంసాం శుభాశుభమయాని ఫలాని సూతే॥"*

**అర్థం:** హే హస్తీశ!= ఓ హస్తిగిరినాథా!; ఆశా+అధిపేషు= దిక్పాలకుల యందు; గిరిశేషు= రుద్రులయందు; చతుర్ముఖేషు+అపి= బ్రహ్మల విషయంలో కూడా; అవ్యాహతా= ఆలస్యం లేకుండా పాటింపబడే; విధి నిషేధమయీ= చేయాలి, చేయకూడదు అనే విషయాలతో కూడిన; తవ= నీ యొక్క; ఆజ్ఞా= కట్టడి; నిత్యం= ఎల్లకాలం; అనుపాలన, లంఘనాభ్యాం= కాపాడడమో, మీరడమో అనే క్రియాభేదాల చేత; పుంసాం= జీవులకు; శుభ+అశుభమయాని= పుణ్యపాపాలతో కూడిన; ఫలాని= ఫలాలను; సూతే= జనింప జేస్తుంది.

**తా॥** ఓ కరిశైలేశా! అష్టదిక్పాలకులూ, ప్రతికల్పమందు ఒక్కొక్కడుగా ఉండే రుద్రులూ, బ్రహ్మలూ– వీరి విషయమై తడబడకుండా సిద్ధిని పొందే విధి నిషేధ రూపాలతో కూడిన నీ యాజ్ఞ, ఎల్లప్పుడు పాటించడం చేత మరియు మీరడం చేతనూ జీవులకు ఏర్పడే శుభ, అశుభ ఫలాలను కలిగిస్తుంది.

**వ్యాఖ్య:–** దేవాది జీవులు భగవదాజ్ఞను పాటిస్తే శుభఫలాన్ని ఉల్లంఘిస్తే అశుభఫలాన్ని పొందుతారని స్పష్టీకరించే శ్లోకం.

బ్రహ్మరుద్రాదులు భగవంతునితో సమానులే అని తాదాత్మ్యాన్ని చెప్పడంలో ఏ బాధ ఉండదనే శంకను తొలగిస్తున్న శ్లోకమిది. సర్వజీవులకు బ్రహ్మ రుద్రాది దేవతలకు కూడా భగవదాజ్ఞ సాధారణమే. సమస్త జీవులు భగవంతుని ఆజ్ఞాపరతంత్రులే. అందరు కర్మవశ్యులే. భగవదాజ్ఞను పాలించే బ్రహ్మాది సకల ప్రాణులకు పుణ్యకర్మ ఫలమూ, మీరిన వారికి పాపకర్మ ఫలమూ సంభవించక తప్పదు అని వివరించే శ్లోకం.

ఆశాధిపేషు గిరిశేషు చతుర్ముఖేష్వప్య వ్యాహతా విధి నిషేధ మయీత వాజ్ఞా-

'ఆశా' శబ్దానికి దిక్కు అని అర్థం. "దిశస్తుకకుభః కాష్ఠా ఆశాశ్చ హరితశ్చతాః" (అమరం). 'అశూ-వ్యాప్తౌ' అనే ధాత్వర్థంవల్ల అంతట వ్యాపించి యుండేవి దిక్కులు. 'ఆశాః' బహువచనం. ఆశలకు అధిపులు అని షష్ఠీతత్పురుష సమాసం.

నాలుగు దిక్కులకు, నాలుగు దిజ్మాలాలకు అధిపతులున్నారు. తూర్పు దిక్కు ఇంద్రుడు అధిపతి, ఆగ్నేయ దిజ్‌మూలకు అగ్ని, దక్షిణదిశకు యముడు; నైర్ ఋతిదిజ్‌మూలకు నిర్ఋతి అనే పూర్వదేవుడు, అంటే రాక్షసుడు, పడమర వరుణుడు, వాయవ్య దిజ్‌మూలకు వాయుదేవుడు; ఉత్తర దిక్కు కుబేరుడు అనే యక్షరాజు; ఈశాన్య దిజ్‌మూలకు అధిపతి శివుడు.

శివదేవుడు అష్టదిక్పాలకులలో ఒకడు. అయినప్పటికీ, పరమాత్మతో సమానుడే అన్న భ్రమతో ప్రత్యేకంగా *'గో బలీవర్దన్యాయం'* చేత ఎన్నబడు తుంటాడు శివుడు. బ్రహ్మ సృష్టి కారకుడనీ, శివుడు సంహార (ప్రళయ) కారకుడనీ విశేషంగా వీరిరువురికి ఉత్కర్ష ఆపాదింపబడింది.

*గో బలీవర్దన్యాయం:-* (బలీవర్దం= ఎద్దు). (గాం ఆనయ) గోవును తెమ్ము అన్నాడు ఒకడు. ('గో' శబ్దం ఆవుకు, ఎద్దుకు (ఆడ మగ గోవులకు) రెంటికి అన్వయిస్తుంది). ఆవునా? ఎద్దునా? దేన్ని తేవాలి అని సందేహం కలిగింది. సంశయం కలుగకుండా విశేషవాచక పదాన్ని పక్కన నిర్దేశింపక తప్పదు. *'గాం ఆనయ బలీవర్దమ్'* అన్నట్లైతే, బలీవర్దమనే విశేషవాచక పదంతో 'ఎద్దును తెమ్ము' అన్నాడని 'గాం ఆనయ' అనే పదానికి అర్థం నిర్ణయించుకోవాలి.

సామాన్య, విశేషపదాలను రెండింటిని ప్రయోగించేచోట విరోధం లేకుండడానికోసం విశేష పదాన్నిబట్టి తద్భిన్నవాచకంగా, సామాన్య వాచక పదానికి అర్థాన్ని సంకోచించుకోవాలి అని విశేష విధిని సామాన్య వాక్యం

బాధించదని తెల్పుతుందీ న్యాయం. దీన్నే 'సామాన్య విశేషన్యాయ'మంటారు.

'ఆశాధిపేషు' అని సామాన్యంగా (ఇంద్రాదులతో సమానునిగా) చెప్పినప్పటికీ, విశేషంగా "గిరిశేషు" అని (పశుపతిత్వం లేదా భూతనాథత్వం) ప్రయోగింపబడింది. *"గిరీశో గిరిశోమృడః"* (అమరం) శివులు, బ్రహ్మలు అని ఇక్కడ బహువచనం వాడబడింది.

ఒక్కొక్క కల్పంలో ఒక్కొక్కడు శివ పదవిని, బ్రహ్మపదవిని పొందుతుంటాడు. కల్పభేదాన్ని బట్టి అనేక గిరీశులు, అనేక చతుర్ముఖులు అని బహువచనం యొక్క ప్రయోజనం గమనీయం. భగవానుడు ఆయా పదవులందు అధికారులను నియమిస్తాడు.

భూత భవిష్యద్వర్తమాన కాలాల్లో నుండే శివ, బ్రహ్మలెందరో అని అనంతత్వం తెల్పబడిందన్నమాట.

*"శక్యా గణయితుంలోకే నవ్యతీతాః పితామహాః"*- (విష్ణుస్మృతి-20-2) లోకమందు ఎందరు బ్రహ్మలు గడచిపోయారో లెక్కించడం శక్యం కాదు. లెక్కించరానందరు బ్రహ్మలు అనడం వల్ల అనంత్యమే కదా తెలుస్తున్నది.

*"శ్రుతిః స్మృతిర్మమైవాజ్ఞా"*- భగవానుని ఆజ్ఞ శ్రుతి స్మృతుల రూపంగా ఉంది. భగవానుని శాసనం- కట్టడి- విధి రూపంగానూ, నిషేధ రూపంగానూ ఉంటుంది.

*"భూతస్య జాతః పతిరేక ఆసీత్"*- కార్యమైన ఈ ప్రపంచానికి స్వామి ఒక్కడే. 'పతింపతీనాం' - దిక్పాలకులు, బ్రహ్మరుద్రేంద్రాదుల వంటి ప్రభువులకే ప్రభువు కదా పరమాత్మ.

పరః, మా, యస్మాత్ సః= పరమః- అని విగ్రహవాక్యం. ఎవనికంటె పెద్ద వాడు ఉండడో అతడు పరముడు. తర్వాత 'పరమశ్చ అసౌ ఆత్మాచ= పరమాత్మా' అని కర్మధారయ సమాసంవల్ల తనకు వేరొక అంతరాత్మలేని సర్వ

స్వతంత్రుడు అనీ, సర్వేశ్వరుడని స్పష్టమవుతున్నది. కాబట్టి 'జగద్వశే వర్తతేదం' అన్నట్లు సమస్త జగత్తు పరమాత్మ వశమందున్నది. ఆయన శాసనం విధిరూపంగానూ ఉంటుంది. 'విధి' అంటే కర్తవ్యాన్ని- ఇదంకురు= ఇది చేయుము అని శాసించి, లోకహితాన్ని చేకూర్చే మాట.

'నిషేధం' అంటే లోకానికి అనర్థాన్ని కలిగించే,పనిని (ఇదం మాకార్షీః= ఇది చేయకు) చేయకూడదని ఆజ్ఞాపించే వాక్యమని అర్థం. కాబట్టి, నిషేధ రూపంగానూ ఉంటుంది. ఈ భగవదాజ్ఞ అవ్యాహతమైనది, అంటే అడ్డుచెప్పక ఆలస్యం చేయక, అవశ్యంగా అందరు శిరసావహించి, ఆచరించ తగినదన్న మాట.

'విధినిషేధమయీ ఆజ్ఞా'- అని 'మయట్' ప్రత్యయం ప్రాచుర్యమనే అర్థాన్ని తెల్పుతుంది. విధినిషేధాల యొక్క ప్రాచుర్యం. వాటిని అతిక్రమించడం వల్ల ప్రయోగించబడే ఫలం- దండన- వల్ల తెలుసుకోవడానికి అవకాశ ముంటుంది. బ్రహ్మశివాదుల యందు ఆజ్ఞ యొక్క అవ్యాహతత్త్వం అంటే- నియమంగా పాటిస్తే విషయం సిద్ధిస్తుంది. పాటించకుంటే విషయం సిద్ధించక అనర్థం కలుగుతుందనే అభిప్రాయం ఉంది.

బ్రహ్మ శివదేవులు పూర్వజన్మలో భగవంతుణ్ణి ఆరాధించి ఆయా పదవులు పొందినారనే విషయం శాస్త్రంవల్ల తెలుస్తున్నది.

*"యుగకోటి సహస్రేణ విష్ణు మారాధ్య పద్మభూః।*
*పునస్త్రైలోక్య ధాతృత్వం ప్రాప్తవానితి శుశ్రుమ॥"*

చతుర్ముఖ బ్రహ్మ వేలకోట్ల కొలది యుగాలు విష్ణువును ఆరాధించి, మళ్ళీ త్రైలోక్య సృష్టియందు నియమింప బడుతున్నాడని విన్నాము అని ఈ శ్లోకార్థం.

అట్లే శివుడు కూడ ఆ భగవదనుగ్రహాన్ని పొందినాడు.

"మహాదేవః సర్వ మేథే మహాత్మాహుత్వా ఆత్మానం దేవ దేవో బభూవ।
విశ్వాన్ లోకాన్ వ్యాప్య విష్టభ్య కీర్త్యా విరాజతే ద్యుతిమాన్ కృత్తి వాసాః"॥

మహాత్ముడైన మహాదేవుడు సర్వమేధమనే గొప్ప యజ్ఞమందు తనను హోమం చేసి, తత్ఫలితంగా దేవదేవుడయ్యాడు. అతడు అన్ని లోకాలను వ్యాపించి, ప్రసిద్ధుడై చర్మధరుడుగా విరాజిల్లుతున్నాడు.

"విశ్వరూపో మహాదేవః సర్వమేథే మహాక్రతౌ।
జుహావ సర్వభూతాని స్వయ మాత్మాన మాత్మనా॥"

విశ్వరూపుడైన మహాదేవుడు సర్వమేధమనే మహా యాగమందు సర్వభూతాలను హోమం చేశాడు. తనను కూడా తానే స్వయంగా అందులో హోమం చేశాడు అనే ప్రమాణాలున్నాయి.

"బ్రహ్మాద్యాః సకలాదేవాః మనుష్యాః పశవస్త థా।
విష్ణు మాయా మహావర్త మోహాంధ తమసా కృతా॥"

బ్రహ్మ మొదల్కొని సకల దేవతలు, మనుష్యులూ,పశువులూ విష్ణుమాయ అనే అంధకారంలో మునిగిపోయినవారే! అంటే, భగవన్మాయా పరతంత్రులై, సత్త్వరజస్తమోగుణాలకు వశ్యులై జ్ఞానమందు సంకోచ వికాసాలను పొందునట్టి వారే కదా!

"వేదా పహార గురు పాతక దైత్య పీడాద్యా పద్విమోచన మహిష్ఠ ఫల ప్రదానైః కోన్యః ప్రజాపశుపతీ పరిపాతి? (స్తో. ర. 13)

రజస్తమోగుణ రూపులైన మధుకైటభులనే రాక్షసులు బ్రహ్మ వద్ద ఉండిన వేదాలను అపహరించగా లోకాలు చీకటైనప్పుడు బ్రహ్మ శోకంలో మునిగిపోయాడు. భగవానుడు హయగ్రీవ రూపంతో రసాతలంలోకి వెళ్ళి ఆ రాక్షసులను సంహరించి, వేదాలను తెచ్చి ఇచ్చి, బ్రహ్మశోకాన్ని తీర్చాడు కదా!

రుద్రుడు తండ్రియైన బ్రహ్మకు ఐదు తలలున్నాయని తన చేతి వ్రేలిగోరుతో ఒక తలను తీసి గొప్ప పాపం చేశాడు. బ్రహ్మ 'కపాలివి కమ్ము' అని శాపమిస్తే రుద్రుని చేతికి ఆ కపాలం అంటుకొన్నది. తిరిగీ తిరిగీ చివరకు రుద్రుడు నారాయణుని దగ్గరకుపోయి భిక్షమడిగాడు. నారాయణుడు తన వక్షఃస్థలాన్ని రాపిడి చేసినందువల్ల ఏర్పడిన గుళికను స్వేదాన్ని (ఆ చోట నున్నది లక్ష్మికదా! మాతృభిక్ష) కపాలంలో వేశాడు. వెంటనే 'కపాలం' శతథా భిన్నమైనది. శాపవిమోచనమయింది.

*'అరచేతిని నెత్తిమీద పెట్టితే బూడిద కావాలి'* అని అడిగిన వృకాసురునికి రుద్రుడు వరమిచ్చాడు. వాడు వరాన్ని పరీక్షింపదలచినవాడై రుద్రుని తలమీదనే చేతిని పెట్టబోయాడు. రుద్రుణ్ణి తరుముకొని వస్తున్న ఆ రాక్షసుణ్ణి విష్ణుమూర్తి అడ్డుకొని, యుక్తితో వానిచేతిని వానినెత్తిమీద పెట్టుకొనజేయగా వాడు భస్మమయ్యాడు. రుద్రుణ్ణి భస్మాసురుని చేతినుంచి రక్షించినవాడు విష్ణుమూర్తియే కదా!

ఇంద్రునికి దుర్వాస మహర్షి పూల మాలికను గౌరవంగా సమర్పించగా, ఆయన దాన్ని ఐరావతం యొక్క కుంభస్థలాన వేశాడు. ఆ యేనుగు ఆ మాలిక పరిమళాన్ని భరించలేక మదమెక్కి మాలికను తన ముందరి కాళ్ళక్రింద వేసి తొక్కింది. ఈ దృశ్యాన్ని జూచిన మహర్షి ఆగ్రహోదగ్రుడై 'ఇంద్రా! నీ రాజ్యం నశించు గాక!' అని శపించాడు. ఇంద్రుడు చెట్లు గుట్టల వెంట తిరిగాడు.

ప్రజాపతినిగానీ, పశుపతినిగానీ, సురపతినిగానీ వారికి, వారికి కలిగిన ఆపదలనుంచి రక్షించినవాడు శ్రియఃపతిగాక మరొకడెవడున్నాడు?

ఆపదలనుబాపినవాడే కాదు. మహిష్ఠ ఫలప్రదాతకూడా నారాయణుడే కదా!

*"తత స్తస్మైవరాన్ ప్రీతో దత్తవానస్త్యనుత్తమాన్!*
*మత్పుత్రత్వంచ కల్పాదౌ లోకాధ్యక్షత్వ మేవచ॥"*

(భారతం– నారాయణీయం)

పూర్వం యజ్ఞం చేసి నన్ను సంతుష్టపరచిన బ్రహ్మకు నాకు పుత్రుడుగా అయ్యేదశనూ, లోకాధ్యక్షత్వం పొందే వరాలను నేనే ఇచ్చాను అని దేవతలకు ఉపదేశించిన భగవద్వాక్యం.

అలాగే రుద్రునికి సంహారశక్తి, భూతగణాధ్యక్షత్వాది వరాలను ఇచ్చానన్నాడు భగవానుడు.

శ్రీకృష్ణుడు శివదేవుణ్ణి ఆరాధించి పుత్రార్థం వరం పొందాడన్న కథను బట్టి వరమిచ్చిన శివుడే శ్రీకృష్ణుని కంటె శ్రేష్ఠుడనీ, శివుడే పరమాత్మ యని భావించడం సమంజసమే కదా!

రుద్రగీతలో ఆ వర స్వరూపం ఇలా నిరూపింపబడింది.

*"మర్త్యో భూత్వా భవాన్ దేవ! మా మారాధయ కేశవ!*
*మాం సహస్వచదేవేశ! వరం మత్తో గృహాణ చ।*
*యేనాహం సర్వదేవానాం పూజ్యాత్ పూజ్యతమో భవే॥"*

దేవా! నీవు మానవుడవై అవతరించినప్పుడు నన్ను ఆరాధించి, నా చేతనే వరాలను పొందవయ్యా! అందువల్ల దేవతలలో నాకు గొప్ప పేరు ప్రతిష్ఠ కలుగుతుంది. నాకీ వరం కూడా ప్రసాదించుమని శివుడు కేశవుణ్ణి అడిగాడు.

*"దేవకార్యావతారేషు మానుషత్వము పాగతః।*
*త్వా మే వారాధయిష్యామి త్వమేవ వరదో భవ॥"*

దేవ కార్యార్థమై నేను మానవావతారమెత్తినప్పుడు నీవు కోరినట్లు నిన్ను పూజిస్తాను, నీ వల్లనే వరాలనూ పొందుతానన్నాడు శివునితో సర్వేశ్వరుడు.

శ్రీకృష్ణునితో 'సర్వేశ్వరుడవైన నీకు ఈ శివుణ్ణి వరమడుగడం ఎలా సంభవించింది?' అని అర్జునుడడిగితే "మయాప్రమాణం హికృతం లోకః సమనువర్తతే!" అతడిచ్చిన వరం నేను అతనికిచ్చిన వరప్రభావ ఫలితమే. నా ఆచరణమే లోకానికి ఆదర్శమవుతుందని, నేను శివుణ్ణి పూజిస్తే, సర్వాత్ముడనైన

నన్ను నేను సంభావించు కొనడమే కదా! అనీ, తత్ఫలితంగా లోకులు శివుణ్ణి పూజిస్తారన్నాడు శ్రీకృష్ణుడు. ఇలాగా శ్రీకృష్ణుడు పుత్రార్థియై శివుణ్ణి వరమడగడం లోని రహస్యమని భారతం స్పష్టీకరించింది. అస్తు-

నిత్య మనుపాలన లంఘనాభ్యాం
పుంసాం శుభాశుభ మయాని ఫలాని సూతే-

'అనుపాలన' మంటే శాస్త్ర విహితమైన కార్యాలను చేయడం, నిషిద్ధ కార్యాలను వదలివేయడమని అర్థం.

'లంఘన' మంటే శాస్త్రమందు చెప్పబడిన పనులను చేయకుండడం, నిషేధించిన కృత్యాలను చేయడమని అర్థం.

బ్రహ్మ రుద్రేంద్రాదులు ఆజ్ఞారూపాలైన శ్రుతిస్మృతుల యందలి విధి నిషేధ విషయాలను చక్కగా తెలుసుకొని నిరంతరం తమ తమ అధికార కృత్యాలను జాగ్రత్తగా నిర్వర్తిస్తున్నారు.

విధి- "స్నాత్వాభుంజీత"- స్నానం చేసిన తర్వాత భోజనం చేయవలెను.

నిషేధం- "నసురాంపిబేత్"- మద్యపానం చేయకూడదు.

విధి నిషేధాలను పాటించి ప్రవర్తిస్తే, ఆరోగ్యం కలుగుతుంది. భగవదను గ్రహం లభిస్తుంది.

"కరుమముమ్ కరుమఫలమాగియ కారణన్తన్నై"-(తి.వా.మొ. 3-5-7)

పుణ్య పాపకర్మలు, ఈ కర్మలఫలమైన స్వర్గ నరకాలు- సుఖదుఃఖాలు వీటికన్నింటికి కారణమైనవాడు సర్వశక్తుడైన భగవానుడే.

"మహద్భయం వజ్రముద్యతం"- (కఠోప- 6వల్లి-2.) ఎత్తబడిన వజ్రాయుధం కలిగిన వానిలాగా గొప్ప భయాన్ని కలిగించే నియంత భగవానుడు.

లోకంలో రాజు వలని భయంచేత అధికారులు, సర్వప్రజలు వారి విధ్యుక్త ధర్మాలను ఆచరిస్తుంటారు కదా! అట్లే-

*భయాదస్యాగ్నిస్తపతి భయాత్తపతి సూర్యః*
*భయాదింద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతి పంచమః (కఠ. 6-3)*

విశ్వ నియామకుడైన భగవానుని ఆజ్ఞను అతిక్రమించక, భయం వల్ల అగ్ని మండుతున్నది. సూర్యుడు వెలుతురు నిస్తున్నాడు. ఇంద్రుడు లోకత్రయ పాలన చేస్తున్నాడు. వాయువు వీచుతున్నది. ఐదవవాడైన మృత్యువు భగవదాజ్ఞాతి క్రమణ భీతివల్లనే జీవరాశులను సంహరింపడానికి పరుగెత్తుతున్నాడని విశదమవుతుంది.

*"త్వం హి రుద్ర మహాబాహో! మోహశాస్త్రాణి కారయ"*

మహా బాహువైన ఓ రుద్రుడా! నీవు మోహశాస్త్ర ప్రవర్తకుడవు అగుము' అనే వరాహ పురాణ వచనం వల్ల, భగవదాజ్ఞా ప్రకారం రుద్రుడు పాశుపతాది శాస్త్రకర్తగా భాసించాడు.

కాబట్టి భగవదాజ్ఞను ఉల్లంఘిస్తే అనర్థం సంభవిస్తుందనే భయం చేత తమ నియత ధర్మాలను నిర్వర్తిస్తున్నాడు కదా!

భగవద్భక్తులూ, ద్వారకా వాసులూ అయిన జనుల పట్ల చేసిన అపరాధం వల్ల శివునికి కాశీనగరాన్ని విడిచిపోయే అనర్థం సంభవించిన విషయం 'హరివంశం' అనే గ్రంథం వల్ల తెల్లమవుతున్నది. కాబట్టి బ్రహ్మాది దేవతలెల్ల కర్మ వశ్యులని స్పష్టం కదా! బ్రహ్మాది దేవతలెవ్వరూ స్వతంత్రులు కారు. భగవదాయత్తజ్ఞానాధీనులే.

*"భవిష్యతాం వర్తతాంచ భూతానాం చైవ భారత*
*సర్వేషా మగ్రణీర్విష్ణుః సేవ్యః పూజ్యశ్చ నిత్యశః॥" (భారతం)*

భూత భవిష్యద్వర్తమాన కాలాల్లోనూ పూజ్యుడూ, అగ్రేసరుడూ అయినవాడు శ్రీమహావిష్ణువే యని వ్యాసోక్తి.

సురపతులుగానీ నరపతులుగానీ సర్వచేతనులకు మనోవాక్కాయాలనే కరణత్రయం చేత చేయబడిన కర్మలవల్ల శుభాశభ ఫలాలు కలుగుతాయి. "ఫలమత ఉపపత్తేః" అనే బ్రహ్మ సూత్రం పరమాత్మయే ఫలప్రదాత అన్నది. భగవదాజ్ఞా ప్రకారం శాస్త్ర విహితమైన విధులను నిర్వర్తించే వారికి ఐహికాముష్మిక భోగాలు లభిస్తాయి. భగవదనుగ్రహం కలుగుతుంది. తర్వాత మోక్షమూ లభిస్తుంది.

ఆజ్ఞను మీరి నిషిద్ధకర్మల నాచరించేవారికి భగవానుని అనుగ్రహం లభించదు, పైగా భగవంతునికి నిగ్రహమే కలుగుతుంది. దాని మూలంగా దుఃఖం- నరకమే అనుభవించవలసి వస్తుంది. భగవంతుని అనుగ్రహమే పుణ్యమని, నిగ్రహమే పాపమని తేట తెల్లమవుతున్నది.

*"యత్త్వత్ప్రియం తదిహపుణ్య మపుణ్య మన్యత్"*- (అతిమానుషస్తవం)

భగవత్ప్రీతిని కలిగించే కార్యం పుణ్యం, కోపాన్ని కలిగించే కర్మ పాపమని శ్రీ కూరేశుల సూక్తి.

ఆజ్ఞాపించే భగవంతునితో ఆజ్ఞాబద్ధులైన తదితర బ్రహ్మరుద్రేంద్రాది దేవతలకు అభేదకల్పన అశాస్త్రీయం. ఏ విధంగా జూచినా తాదాత్మ్యం అసంభవమని సుశ్లోకితం.

'ఆజ్ఞా' శబ్దం స్త్రీలింగపదం. 'సూతే' అనే క్రియాపదానికి ప్రసవిస్తుంది అని అర్థం. కాబట్టి భగవంతుని ఆజ్ఞ అనే కాంత అనుపాలన లంఘనల చేత శుభాశుభఫలాలనే పుత్రులను ప్రసవిస్తుందని వ్యంజితం. వసంత తిలక.

*14.* *త్రాతాఽఽపది స్థితి పదం భరణం ప్రరోహః*
*ఛాయా కరీశ! సరసాని ఫలాని చ త్వమ్।*
*శాఖాగత త్రిదశ బృంద శకుంతకానాం*
*కిం నామ నాసి మహతాం నిగమద్రుమాణామ్॥*

**అర్థం:** హే కరీశ!= ఓ కరిశైలనాథా!; శాఖాగత త్రిదశ బృంద శకుంతకానాం= కొమ్మలయందున్న దేవతల సమూహం అనే అల్ప పక్షులు కలిగియున్నట్టి; మహతాం= గొప్పవైన; నిగమ ద్రుమాణాం= వేదాలు అనే వృక్షాలకు; త్వం= నీవు; ఆపది= ఆపత్కాలమందు; త్రాతా= రక్షకుడవు; స్థితిపదం= మూలస్థానం; భరణం= పోషకుడవు; ప్రరోహః= అంకురం; ఛాయా= నీడవు; సరసాని= రసంతో కూడిన; ఫలాని, చ= ఫలాలు కూడా; అసి= అయి ఉన్నావు; నిగమద్రుమాణాం= వేద తరువులకు; కిం, నామ= ఏదైనా; న, అసి= (నీవు) కాకుండా ఉన్నావా? (అన్నీ నీవే అయి ఉన్నావు).

**తా॥** ఓ హస్తిగిరినాథా! శాఖలయందు ఆశ్రయించి యున్న దేవతల సమూహం అనే పక్షులు కలిగినట్టి గొప్ప వేదాలు అనే వృక్షాలకు నీవు ఆపత్కాలమందు రక్షకుడవు. ఆ వేద వృక్షాలకు మూలస్థానమూ, పోషకుడవూ, అంకురమూ, నీడ, సరస ఫలాలు కూడా నీవే. వేద వృక్షాలకు ఏది నీవు కాకున్నావు? అన్నీ నీవే కదా! ఈ శ్లోక రచన కవితాచాతుర్యం కలది.

**వ్యాఖ్య:**– వేద తరువులకు ధారక, పోషక, సర్వాధార భూతుడు వరదుడైన శ్రీమన్నారాయణుడే అని నిష్కర్షించే శ్లోకమిది.

1) 'సర్వ శబ్దవాచ్యుడు పరబ్రహ్మ' అని (12వ శ్లోకం) ప్రతిపాదించి నప్పటికీ, సర్వవేద తాత్పర్య విషయత్వం నారాయణునికి సిద్ధించదు.

2) వేదాంగాలైన వ్యాకరణాదులయందు స్ఫోటవాదమే బ్రహ్మగా చెప్పబడింది కదా!

('స్ఫోట' అనేది చిచ్ఛక్తి. వర్ణాలు (అక్షరాలు) నాదం చేత స్ఫుటిస్తాయని వైయాకరణులు చెప్పే లక్షణం. *"తురీయం వాచో మనుష్యా వదంతి!"*

(శ్రుతి) స్ఫుటించే వర్ణాలు పదక్రమాన్ని చెంది వాక్కు అవుతుంది. మూడు వాక్కులు శరీర గుహలోనే ఉండి గోచరించవు. నాల్గవదైన వాక్కునే మనుష్యులు ఉచ్చరిస్తారు. దీన్నే 'వైఖరి' అంటారు (వై= నిశ్చయంగా, ఖం= ఆకాశం–

శ్రవణేంద్రియం- రాతి= గ్రహించును. పైకి వినబడే మాట- అని 'వైఖరి' యొక్క వ్యుత్పత్తి).

"అకారో వై సర్వావా గ్వైషా స్పర్శాంత స్థోష్మభి ర్వ్యజ్య మానా బహ్వీ, నానా రూపా భవతి" (శ్రుతి).

ఒక్క అకారమే సమస్త వాక్కులవుతుంది. అది శరీరంలోని ఉష్ణతచేత స్పర్శమవుతూ వ్యక్తమై నానా వర్ణాలుగా పరిణమిస్తుందని అర్థం.

*"మూలాధారా దకారఃస్ఫురతి లఘు పథం నాభిరంధ్రాదుకారో*
*మధ్యస్థానే మకారః శశికిరణవశాత్ కంఠతో బిందు రస్మాత్।*
*నాదో మధ్యాచ్చ శక్తిః శిరసి చ గతిశ్చాంతిమ ద్వాదశాంతే*
*ఓంకారో ధ్యానరూపో రవి రివ జగతాం నాయకో విశ్వమూర్తిః॥"*

మూలాధార చక్రంనుంచి 'అ'కారం స్వల్పంగా స్ఫురిస్తుంది (ఇది 'పర' అనబడుతుంది). అది నాభివరకు లేచి మణిపూరక చక్రమందలి ఉష్ణంతో కలిసి 'ఉ' కారంగా స్ఫుటిస్తుంది (పశ్యంతి).

అదే ప్రాణవాయువుతో కలిసి హృదయమందున్న అనాహత చక్రమందు చేరి, అక్కడ ఉన్న ఉష్ణంతో కలిసినప్పుడు 'మ'కార వర్ణం ఉత్పత్తి అవుతుంది (మధ్యమ).

అది కంఠమందున్న విశుద్ధ చక్రమందు చేరగా అక్కడి శశికిరణాలు (అంటే శ్లేష్మం) అంటి బిందువు ఉత్పత్తి అవుతుంది.

బిందుముఖమందు నాదం, దాని నడుమ చిచ్ఛక్తి అగ్రమందు చలనం కల్గగా అది వాక్కు అవుతుంది. ఇదే వైఖరి. వైఖరి ముఖం నుంచి బయటపడి, పంద్రెండు అంగుళాల దూరం పోయి బాహ్య వాయువులో లీనమవుతుంది. సూర్యునిలాగా జగత్తున వ్యాపిస్తుంది. ధ్యాన రూపమైన ఓంకారం విశ్వరూపమైనది. ఈ స్ఫోటచిచ్ఛక్తియే 'బ్రహ్మ'గా ప్రతిపాదితం).

3) పురాణాలు ఇతర దేవతలను సంభావించడమూ, అందుకు వేదాలు కూడా సమర్థించడం వల్ల నారాయణుని యందు మాత్రమే సర్వశబ్ద వాచ్యత్వం అసంభావితం.

4) "శ్యేనేన అభిచరన్ యజేత"- 'శ్యేనం' అనే పేరుగల యాగం శత్రువధ కోసం చేయవలెను అని పూర్వ మీమాంసా శాస్త్రవాక్యమిది. 'శ్యేనం' అంటే డేగ. శ్యేన మనే పక్షి జలచరాలను (చేపలను) ఎలా పట్టుకొంటుందో అలాగా శ్యేన యాగం చేసే యజమాని యాగఫలం చేత తన పగతురను పట్టి వధిస్తాడని యాగ కర్మను స్తుతించే వాక్యమిది. ఇట్లు కొన్ని శబ్దాలు- వాక్యాలు- అనిష్ట నివారణ రూపమైన ఫలాన్ని సాధించే కర్మనుగానీ, ఆయాకర్మ దేవతలనుగానీ ప్రతిపాదిస్తున్నాయి. అన్ని శబ్దాలు భగవంతుడైన నారాయణున్నీ ప్రతిపాదిస్తు లేవు కదా!

5) వేదాలు ప్రళయకాలమందు ప్రమృష్టమైతే మళ్ళీ వాటిని ప్రవర్తింపజేసి రక్షించిన భగవానుడు పరమశివుడని కొన్ని పురాణాలు వెల్లడించగా, నారాయణుడే సర్వవేద వేద్యుడు, పరమ కారణుడు అని నిశ్చయించడానికి ఎలా శక్యమవుతుంది?

ఇన్ని విధాల కలిగిన శంకనుపరిహరించే శ్లోకమిది.

అఖిల ధర్మాలకు మూలం వేదం. వ్యాకరణాది శాస్త్రాలు వేదాంగాలు. వేర్వేరు అర్థాలను ప్రవచించే అంగాలకు, ఇతిహాస పురాణాదులకు మూలమైన వేదాలలో- ఆప్తవాక్యాలలో- సర్వకర్మ సమారాధ్యుడు, సర్వవేద వేద్యుడు నారాయణుడే, జగత్కారణుడైన భగవానుడు అతడే యని స్పష్టంగా తెల్పబడుతున్నది.

ముఖ్యంగా 'శ్రీ పాంచరాత్ర రక్ష' అనే గ్రంథమందు ఉదాహరింపబడిన శ్లోక మొకటి ప్రమాణంగా సూచింపబడింది-

*యో వేద వృక్షం బహు మూలశాఖం*
*నానా ఫలార్థి ద్విజసంఘ సేవ్యమ్।*
*పూర్వ్రశ వానుశ్రవ భేద భిన్నం*
*ఆరోపయత్ తం పురుషం ప్రపద్యే॥*

కర్మకాండయని, జ్ఞానకాండయనే భేదం చేత వేర్వేరుగా ఉన్నట్టిది, వివిధ ఫలాలను కోరే విప్రులచేతనూ-పక్షులచేతనూ సేవింపదగినట్టిది, అనేక మూలశాఖలు- ప్రధాన భాగాలు కలిగినట్టిది యైన వేదమనే వృక్షాన్ని ఎవడు రూపరంజనం చేశాడో, అట్టి పురుషుణ్ణి- కోరినవన్నీ ఇచ్చేదాతను- శరణు వేడుతున్నాను అని, ప్రాచీనులైన అభియుక్తులచే నిబద్ధమైయున్న ప్రమాణాన్ని ప్రకటించడానికి వృక్ష రూపమైన వేదాలకు మూలాధార భూతుడు శ్రీమన్నారాయణుడే యని స్వామి దేశికన్ సుశ్లోకించారు.

*హే కరీశ! శాఖగత త్రిదశ బృంద శకుంతకానాం మహతాం*
*నిగమద్రుమాణాం ఆపది త్వం త్రాతా అసి-*

ఓ హస్తిశైలేశా! వేదాలయందున్న తైత్తిరీయాది రూప భాగాలను ఆశ్రయించి యున్నవారు దేవతా బృందాలు.

వృక్ష శాఖలయందు అనేక పక్షులు ఆశ్రయించి, గూళ్ళు కట్టుకొని నివసిస్తాయి. వేదాలు మహా వృక్షంగా రూపింపబడినాయి. ఒక్కొక్క వేదం అనేక శాఖలు కలిగియుంది. వేదశాఖలే చెట్టుకొమ్మలు. దేవ బృందాలే పక్షులు (అల్పార్థేక ప్రత్యయః). శకుంతకానాం- అని కప్రత్యయం చేత స్వల్పమైనవి పక్షులు అని అర్థం. పెద్ద పక్షులు మాత్రమే గాక మశకాలూ మక్షికాలు కూడా చెట్ల కొమ్మలయందు అమరియుంటాయనే అర్థమూ ఉంది.

దేవతల పక్షంగా తాత్పర్యమేమిటంటే, వేదశాఖాగతులైన దేవతలు- ఒక్కొక్క కర్మకలాపమందు అనేక యాగాలు చేయబడుతాయి. ఆ యాగాలలో ఉద్దేశింపబడి యుంటారు. వివిధ బృందాలకు విధింపబడిన వేదమంత్రాలచేత

ఉద్దేశింపబడిన యాగద్రవ్యం త్యాగం చేయబడుతుంది. అందువల్ల 'త్రిదశ శకుంత బృందానాం' అనక 'త్రిదశ బృందశకుంతకానాం' అనబడింది. ఒక్కొక్క దేవతా బృందమే ఒక్కొక్క పక్షిగా రూపింపబడిందన్నమాట (రూపకాలంకారం).

వృక్ష శాఖలయందున్న పక్షులు ఆ చెట్టు ఫలాలను భుజించినట్లే, దేవ బృందాలు కర్మ ఫలభోక్తలని తాత్పర్యం. ఇంద్రాది దేవతలందరు కర్మ వశ్యులే అని చెప్పబడింది.

*"తయో రన్యః పిప్పలం స్వాద్వత్తి, అనశ్నన్నన్యో అభిచాకశీతి"* (శ్రుతి).

ఒక్కచెట్టు కొమ్మలో రెండు పక్షులున్నాయి. ఒక్క శరీరంలోనే జీవుడు, దేవుడున్నాడని అర్థం. ఒక పక్షి- జీవుడు- ఆ చెట్టు ఫలాన్ని- కర్మ ఫలాన్ని- తింటున్నాడు, మరో క పక్షి- దేవుడు (అంతర్యామి)- ఫలాన్ని తినే పక్షిని చూస్తూ (సాక్షిగా ఉన్నాడే కాని) తాను మాత్రం ఫలాన్ని తినకుండా ఉన్నది. అంటే జీవులు కర్మఫలభోక్తలు. భగవానుడు కర్మఫల భోక్తకాదు. తాను శరీరంలో ఉన్ననూ భగవానునికి *"నమాంలింపంతి కర్మాణి"*- గీతా చార్యుడు చెప్పినట్లు, కర్మలు అంటుకోవు కదా!

*"నకర్మణా లిప్యతే పాపకేన; నకర్మణా వర్ధతే నో కనీయాన్"*- (శ్రుతి).

భగవంతునికి పుణ్యపాపకర్మలు అంటుకోవు. కర్మచేత ఆయన పెరుగడు, తరుగడు అని వేదవాణి.

"ఇంద్రాయ స్వరాజ్ఞే" అనే వేదవాక్కుకు 'కర్మ వశ్యుడు కాని ఇంద్రుని కోసం' అని అర్థం. ('స్వరాట్'- అంటే 'కర్మవశ్యత లేని వ్యక్తి' అని అర్థం). ఈ మాట కేవలం అర్థవాదం- ప్రశంసా వాక్యమే కదా! అని ఆక్షేపించవచ్చు. *"శాఖాగత త్రిదశ బృంద శకుంతకానాం"* అనే మాట చేత ఈ 'ఆక్షేపం' ఆవిర్భవిస్తున్నది. *"పయః పిబ, శిఖాతే వర్ధిష్యతే"*-

పాలు త్రాగితే నీ జుట్టు పెరుగుతుంది- అని ఆశ పెట్టే తల్లిమాటలాగా- అర్థవాద మందు వాస్తవికత లేనందువల్ల- అప్రామాణ్యం అని ఆక్షేపించవచ్చు.

భగవానుడొక్కడే కర్మవశ్యుడు కాదన్నట్లైతే, "ఇంద్రాయ స్వరాజ్ఞే" అన్నమాట అప్రామాణ్యమే కదా!

అయితే, శాఖాగత- పూర్వ మీమాంసా శాఖాభాగమందు ప్రధాన వాక్యానికి అర్థవాద వాక్యం స్తుతిపరంగా అన్వయిస్తుందని చెప్పబడింది. ఒక ఉదాహరణం గమనీయం.

"వాయవ్యం శ్వేత మాలభేత భూతికామః"- ఇది యాగ విధివాక్యం. ఐశ్వర్యాన్ని కోరే వ్యక్తి వాయుదేవతాకమైన యాగాన్ని తెల్లని మేకతో- యజ్ఞ పశుద్రవ్యంతో- చేయవలెనని విధిస్తున్నది. ఈ విధివాక్యానికి "వాయుర్వైక్షేపిష్ఠా దేవతా"- (వాయువు అతివేగం కలవాడు) అనే అర్థవాద వాక్యం శేషం (అంగం) గా ఉన్నది. విధివాక్యం ఈ విధి శేషవాక్యంతో కూడి సార్థకమవుతుంది. వాయువెట్లు శీఘ్రగామి దేవతయో, అట్లే యాగఫలం కూడా శీఘ్రంగా యజమానునికి చెందుతుందని యాగస్తుతి చేస్తున్నది. విధి వాక్యంతో కూడి శేషం- అర్థవాద వాక్యం అర్థవంతమవుతుంది. కాబట్టి, వేరే ప్రమాణాలతో విరోధం లేని, వేదంలోని వాక్యాలన్ని ప్రమాణాలే అని సిద్ధాంతం.

'కర్మవశ్యుడు కాని ఇంద్రుడు' అన్నమాటలో 'ఇందతి ఇతి ఇంద్రః. ఇది- పరమైశ్వర్యే'- అనే ధాత్వర్థం వల్ల, గొప్ప ఐశ్వర్యంతో కూడిన వాడు భగవానుడు, అని అర్థం. అపహతపాప్ముడు, సర్వశబ్దవాచ్యుడు పరమాత్మయైన నారాయణుడే కాబట్టి, సకల వేదాలకు తాత్పర్య విషయభూతుడని సిద్ధిస్తున్నది. ఇందు అసత్యం లేదు అని ప్రస్పష్టం.

మహతాం- పరత్వాన్ని నిర్ణయించే నారాయణోపనిషత్తు మహానారాయణో పనిషత్తు అని ప్రసిద్ధిని పొందింది.

"బ్రహ్మేశాదేర్మహత్యాముపనిషది లయాత్"- (తత్త్వముక్తా కలాపం-15) 'మహతీ ఉపనిషత్' అని వ్యస్తమైన ప్రయోగం వల్ల జగత్కారణత్వాన్ని ప్రకటించి మహోపనిషత్తు అయింది. సకల వేదాలు భగవంతుణ్ని ప్రతిపాదించడం వల్ల

మహచ్ఛబ్దం- అన్ని విద్యలకు ఆధారమైనవని- ప్రయుక్తం. కాండలు, కొమ్మలు పెరిగి చాలా విస్తరించడం వల్ల వృక్షాలకు మహత్వం చెప్పబడింది. గొప్పవి, పెద్దవి, నిగమద్రుమాణాం- వేదాలే వృక్షాలు. 'అనంతా వైవేదాః' లెక్కించరానన్ని ఉన్నాయి వేదాలు, వృక్షాలు కూడా.

'నిగమ కల్పతరోః' అని శ్రీ భాగవతం వర్ణితం. స్వామి దేశికన్ "మూలేని విశ్య మహతాం నిగమద్రుమాణాం" యతిరాజ సప్తతి (22)లో వర్ణించారు.

ఆపదిత్రాతా- వేద వృక్షాలను ఆపత్కాలంలో రక్షించిన వాడు భగవానుడే. శ్వేతాశ్వతరోపనిషత్ ప్రకారం "యోబ్రహ్మాణం విదధాతి పూర్వం, యోవై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై" (16-18) ప్రళయ కాలంలో మరుగుపడిన వేదాలను మళ్ళీ తన నాభి కమలమందు చతుర్ముఖ బ్రహ్మను ఉద్భవింప జేసి, అతనికి వేదాలను బోధించి ప్రవర్తింపజేశాడు పద్మనాభుడైన భగవానుడు. అంతే కాదు, స్థితి కాలంలోనూ -

"కాణాదశాక్య పాషండై స్త్రయీధర్మో విలోపితః।
త్రిదండ ధారిణా పూర్వం విష్ణునా రక్షితాత్రయీ॥"

(అత్రిస్మృతి) కాణాదులు (వైశేషిక మతస్థులు) శాక్యులు (బౌద్ధులు) మొదలైన పాషండులచేత వైదిక ధర్మం లోపించింది. అప్పుడు విష్ణుమూర్తి త్రిదండాన్ని ధరించిన దత్తాత్రేయుడుగా అవతరించి, విరోధులను నిరసింపజేసి, వైదిక ధర్మాన్ని పునః ప్రవర్తింపజేసి, వేదార్థాలను బోధించి, అనుష్ఠింపజేయడం వల్ల 'త్రాత'- వేద రక్షకుడయ్యాడు.

వృక్షాలు "కుఠార హస్తం పురుషంధృష్ట్వా వృక్షోఽపికంపతే" అన్నట్లు, గొడ్డలితో నరకడానికి వచ్చిన వ్యక్తిని జూచినప్పుడు (ఏ చెట్టైనా) కంపించకుండడం అసంభవం. అలాగా, ఒక కొమ్మ నరకబడినప్పుడు ఆ చోట మళ్ళీ చాలా కొమ్మలుగా వెలసి ఒక మహావృక్షంగా విస్తరించునట్లు రక్షించేవాడు భగవానుడే కదా! (వృక్షశ్ఛేదనాత్)

'త్రాతా పతిః' అనే పాఠం ఉండడం వల్ల 'పతిః' అంటే శేషి, ప్రభువు, పాలించేవాడని అర్థం. పాలించే సామర్థ్యం శ్రీహరికి తప్ప మరెవ్వరికీ లేదు కదా!

"అహంహి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవచ"- (భ.గీత) అని భగవద్వాక్యం. స్థితిపదం- వేదాల మూల భాగమైన ఓంకారం అని అర్థం.

"తస్యవాచకః ప్రణవః" ఓంకార శబ్దవాచ్యుడు
"యో వేదాదౌ స్వరః ప్రోక్తః వేదాన్తే చ ప్రతిష్ఠితః"
తస్య ప్రకృతి లీనస్య యః పరః స మహేశ్వరః" (శ్రుతి).

ఓంకారంలో నున్న 'అ ఉమ' అనే త్రికమందలి అకారం సర్వేశ్వరార్థకమే. 'అకారార్థో విష్ణుః' అన్నట్లు వాఙ్మయానికి మూలం అకారమే కదా! వేదమే కాక, వేదమూల ప్రతిపాద్యుడు పరమాత్మయే.

వృక్షాలు మహావాతప్రకంపనాలకు చలించకుండడానికి వాటి మూల భాగాలకు ఆధార భూమియై- వాటి స్థిరమైన ఉనికికి కారణభూతుడు పరమాత్ముడే.

భరణం- వేద వృక్షాలను భరించేవాడు- పోషకుడు కూడా వరదుడే. వృక్షాలకు పోషక హేతువు నీరు. అట్లే వేద శబ్దాలను ఉచ్చరించునప్పుడు లోప, ఆగమ వికారాల వల్ల వాటి స్వరూపం చెడిపోకుండా శబ్దాలకు స్వరవర్ణ వ్యవస్థ చేత అర్థావబోధనం చేసి, పోషించే వ్యాకరణశాస్త్రం కూడా వరదుడైన నారాయణుడే పరమ తాత్పర్య విషయభూతుడు.

"తో యేన జీవాన్ వ్యససర్జ భూమ్యాం"- (శ్రుతి).

సామానాధికరణ్యం ప్రతిపాద్య ప్రతిపాదక భావ నిబంధనమైన వ్యాకరణానికి ముఖ్యంగా భగవానుడే తాత్పర్యం.

ప్రరోహః- అంకురమని అర్థం. మొక్కలచే వృక్షజాతి విస్తరిస్తుంది. "బిభేత్యల్ప శ్రుతాద్వేదః మామయం ప్రతరిష్యతి"-

కొద్దిపాటి శాస్త్ర జ్ఞానంగల వ్యక్తులు నన్ను వంచన చేస్తారని వేదం భయపడుతుందట. అందుకే వేదార్థాలకు భంగం కలుగకుండా "ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్" (భారతం ఆదిపర్వం 1-293) వేద సారమైన ఇతిహాస పురాణాలను విస్తరింపజేయవలసి వచ్చిందని ప్రామాణిక వాక్యం. శ్రుతులే ఇతిహాస పురాణ వాఙ్మయానికి మూలమని తాత్పర్యం.

"శుతి స్మృతులందు విరోధమున్నప్పుడు శ్రుతియే ప్రబల ప్రమాణం. స్మృతులలో పరస్పర విరోధమేర్పడితే శ్రుతికి అనుకూలమైన స్మృతియే సప్రమాణమని ధర్మశాస్త్రం చెబుతుంది.

స్మృతి, ఇతిహాస, పురాణాలచేత శ్రుత్యర్థం నిర్ణయింపబడుతుంది. వేదమూలకమైన స్మృతి పురాణాదులు ప్రరోహ శబ్దం చేత మరుగుపరచి అధ్యవసింపబడినాయి. కాబట్టి, తత్త్వారోపం చేత భగవానుడే తాత్పర్య విషయభూతుడు.

ఛాయా- తెరువరులు ఆతప (ఎండు చేత) తప్తులై చెట్టునీడకు వస్తే తాపం తీరుతుంది, సుఖం కలుగుతుంది. అట్లే, శ్రుత్యంశమైన ప్రాయశ్చిత్త కాండననుసరించి సర్వకర్మ సమారాధ్యుడైన భగవానుణ్ణి 'కృష్ణానుస్మరణం' అన్నట్లు ఆశ్రయిస్తే సంసారులకు అనిష్ట నివృత్తి, ఇష్టప్రాప్తి కలుగుతుంది.

ఇక్కడ, ఛాయా శబ్దం చేత విషయ నిగరణం చేయబడింది.

సరసాని ఫలాని చ త్వమ్- చెట్లు మధురతరమైన మామిడి, పనస ఫలాలను ఇస్తాయి. వేద శాఖలలో ఇష్టప్రాప్తి కోసం కర్మ విధాయకమైన వాక్యాలను ప్రతిపాదించడం వల్లనూ, అట్టి కర్మల చేత ఆరాధింపబడే భగవానుడు త్రివర్గ ఫలాలను- ధర్మార్థ కామ పురుషార్థాలను ప్రసాదిస్తాడు.

*"లభతే చ తతః కామాన్ మ య్యైవ విహితాన్ హి తాన్" (గీత).*

దేవతాంతరులను ఉద్దేశించి యాగాది కర్మల నాచరించిన వారికి కూడా భగవానుడు అంతర్యామి కాబట్టి, తనను ఆరాధించినట్లే భావించి, ఆయా కర్మిష్ఠులకు ఆయా దేవతల ద్వారానే ఆయా ఫలాలను ప్రసాదిస్తాడు. నేరుగా తననే శ్రద్ధాభక్తులతో పూజించేవారికి జీవించినంత కాలం ఆరోగ్యైశ్వర్యాలను ప్రసాదించి, దేహావసాన కాలాన మోక్ష ఫలాన్ని కూడా ప్రసాదించే పరమ దయాళుడు శ్రీమన్నారాయణుడు.

*నిగమ ద్రుమాణాం కిం నామ నాసి*- ఓ హస్తిగిరినాథా! వేదాలు అనే వృక్షాలు అనడం వల్ల రూపక సమాస పదం.

నిగమ శబ్దానికి పొందదగినదనే వ్యుత్పత్తి; 'ద్రుమ' శబ్దానికి వృక్షావయవం-శాఖ- కలది, అనే వ్యుత్పత్తి కలదు. కాబట్టి ఈ రెండు శబ్దాలకు- అవయవాలు- శాఖలు కలిగియున్నందున- 'జనులచే పొంద దగినవి' అనే అర్థం వర్తిస్తున్నది. కాబట్టి అవధారణా పూర్వపద కర్మధారయ సమాస పదమిది. (వేదాలే వృక్షాలు. 'ద్రుమాల వంటివి నిగమాలు' అని ఉపమానోత్తర పదకర్మధారయ సమాస పదమని భావించరాదు).

'నిగమద్రుమాలలో నీవేది కావు?' అని అర్థం. అంటే- సాంగోపాంగమైన సకల వేదాలకు, కోరిన వరాలను ఇచ్చి ఆశ్రితులను అనుగ్రహించే నారాయణుడే తాత్పర్య విషయభూతుడు అని పిండితార్థం.

రూపకాలంకారంచే సంకీర్ణమైన ఉల్లేఖాలంకారం. వసంత తిలకా వృత్తం.

*15.* *సామాన్య బుద్ధి జనకాశ్చ సదాది శబ్దాః*
*తత్త్వాంతర భ్రమ కృతశ్చ శివాది వాచః*
*నారాయణేత్త్వయి కరీశ! వహంత్యనన్యం*
*అన్వర్థ వృత్తి పరికల్పితమైక కంఠ్యమ్॥*

**అర్థం:** హే కరీశ!= ఓ హస్తిగిరినాథా!; సామాన్య బుద్ధి జనకాః, చ= సామాన్య ధర్మం యొక్క బుద్ధిని కలిగించేవి కూడా అయినట్టి; సత్+ఆది శబ్దాః= 'సత్' మొదలైన శబ్దాలు; తత్త్వ+అంతర, భ్రమకృతః, చ= భగవంతుని కంటే వ్యతిరేక వస్తువునందు పారమ్య భ్రమను కలిగించేవియూ అయినట్టి; శివ+ఆది వాచః= 'శివ' మొదలైన శబ్దాలు; నారాయణే= నారాయణుడు అనే పేరు కలిగిన; త్వయి= నీ యందు; అనన్యం= వేరొకరికి చెందనట్టి; అన్వర్థ వృత్తి పరికల్పితం= అర్థాన్ని అనుసరించి బోధించే శబ్ద శక్తిచేత నిశ్చయింపబడినట్టి; ఐక కంఠ్యం= ఒకే అర్థ పరత్వాన్ని; వహంతి= వహిస్తున్నాయి.

**తా॥** ఓ కరిశైలేశా! 'సత్' మొదలైన శబ్దాలు విశేష ధర్మపరమైనవీ అయినా, సామాన్య ధర్మబుద్ధిని కలిగిస్తుంటాయి. 'శివ' మొదలైన శబ్దాలు పరమాత్మను బోధించేవే అయినా, వేరే దేవతలయందు పరత్వ భ్రమను కలిగిస్తుంటాయి. అట్టి సదాది పదాలు, శివాది శబ్దాలు నారాయణాభిధానుడవైన నీయందే ఇతరులకు సంబంధించనట్టి, సార్థక శబ్దశక్తిచేత ప్రామాణికంగా నిర్ణయింపబడిన ఒక్క (పరత్వం) అర్థాన్ని వహిస్తున్నాయి.

వ్యాఖ్య:- సత్, శివాది శబ్దాలు సామాన్య విశేషన్యాయ పరిశీలన చేత నారాయణుడే పరదైవమని బోధిస్తాయని సుశ్లోకితం.

బ్రహ్మ విష్ణు మహేశ్వరులనే పేర్లుగల ముగ్గురు మూర్తులలో నడుమ ఉన్న విష్ణుమూర్తి తక్కిన ఇద్దరియందు అంతర్యామిగా ఉండి సర్వం నిర్వహిస్తుంటా డని చెప్పినప్పటికీ, విష్ణు భగవానుడే పరమకారణుడని నిశ్చయింప శక్యం కాదు. ఎందుకంటే, సత్, ఆత్మ మొదలైన శబ్దాలు వేదాలలోని కారణ వాక్యాలలో ఉన్నందువల్ల వాటి యందు అంతర్యామిత్వం సంభవించదు కదా! అనే శంకను, (అట్టి శబ్దాలకు కూడా భగవానుని యందే అన్వయించే విశేషధర్మం గల శక్తి కలదని ప్రదర్శిస్తూ), పరిహరిస్తున్న శ్లోకమిది-

1. *సామాన్యబుద్ధి జనకాశ్చ సదాది శబ్దాః–*

శ్రియఃపతి రూపంగా ఉండే విశేష ధర్మంగల వ్యక్తియందు పరమ కారణత్వాన్ని నిశ్చయించడానికి ముందు, అతనికన్న వేరే వ్యక్తియందు సామాన్య ధర్మబుద్ధిని– సత్ప్రకారక బుద్ధిని కలిగించేవి 'సత్' మొదలైన శబ్దాలు. ఈ 'సత్' ఆది శబ్దాలకు సామాన్య ధర్మబుద్ధిని జనింపచేసే రూపం ఉన్నట్లే, విశేష ధర్మబుద్ధిని కూడా జనింప చేసే రూపం– బోధకశక్తి కలదనడానికే– రెండు ఆకారాలు ఉన్నాయని– సముచ్చయార్థకమైన 'చ' కారం ప్రయోగింపబడిందని గ్రహించాలి.

2. *తత్త్వాం తర భ్రమకృతశ్చ శివాది వాచః–*

'శివ' మొదలైన శబ్దాలు పరబ్రహ్మయందున్న అసాధారణమైన వృత్తినే బోధించినప్పటికీ, అవి శివుడు మొదలైన ఇతర దేవతలయందు పరమ కారణత్వాన్ని (పారమ్యాన్ని) ఊహించే భ్రమను కలిగిస్తాయి, అని ఈ మాటలోనూ 'చ' కారం ప్రయుక్తమైనది.

ఈ రెండు మాటలలో ఒక్క 'చ' కారం ప్రయోగిస్తే సరిపోయేది. రెండు సార్లు ప్రయోగించడం నిరర్థకమనిపిస్తుంది కదా! అంటే, ఆ రెండు 'చ' కారాల వల్ల వేర్వేరు అర్థాలు బోధింపబడుతున్నాయి.

'సదాది శబ్దాలు' సామాన్యంతోపాటు విశేషధర్మ బుద్ధిని జనింపజేస్తాయి.

శివాది శబ్దాలు జగత్కారణ శక్తిగల పరమాత్మను బోధిస్తున్నవే అయినా, అవి ఇతర దేవతలయందు కూడా ఆ శక్తి కలదనే భ్రమను కలిగిస్తాయి.

ఈ విషయాలు వేద ప్రమాణ వాక్యాలను ఉదాహరిస్తేనే వివరంగా తెలుస్తాయి.

*సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయం,*
*తదైక్షత బహుస్యాం ప్రజాయేయ" (చాం. ఉప- 2-1)*

"ఓ సౌమ్యుడా! కనబడుతున్న ఈ జగత్తు సృష్టికి పూర్వం నామరూప విభాగం లేని కారణ వస్తువుగా (సచ్ఛబ్ద వాచ్యంగా) ఒక్కటే ఉండింది. రెండవది

లేదు. ఆ వస్తువు తాను అనేక మవుతానని ఈక్షించింది. సంకల్పించింది అని వాక్యార్థం. 'సత్' అని సామాన్యార్థం కలదైనా, సచ్ఛబ్ద వాచ్యుడు, సంకల్పింప సమర్థుడు, సర్వజ్ఞుడు, జగత్కారణుడైన పరమ పురుషుడే అని సిద్ధాంతం (ఇది విశేషార్థం).

"ఆత్మావా ఇద మగ్ర ఆసీత్, నాన్యత్కించ నమిషత్" (ఐతరేయోపనిషత్. 1-1-1) 'ఆత్మన్' శబ్దం శరీరం, మనస్సు, జీవాది అనేకార్థాలు కలది. సామాన్య శబ్దమే, అయినా ఆప్నోతి ఇతి= ఆత్మా' అనే శాబ్దోత్పత్తిని బట్టి, నియామకుడై అన్నింటిలోనూ వ్యాపించి ఉండే పరమాత్మ అని అర్థం. మరొకటి లేదు. వ్యాస భగవానుని "ద్యుభ్వాద్యాయతనం స్వ శబ్దాత్" అనే బ్రహ్మసూత్రం (1-3-1) విశదీకరించిన అర్థం ఇలా ఉంది.

ద్యుః= అంతరిక్షానికి; భూ= భూమి; ఆది= మొదలైన వాటికి; ఆయతనం= ఆధారం; స్వ శబ్దాత్= తనకు సహజమైన ఆత్మ అనే శబ్దం వల్ల పరమాత్మ. భూమ్యంతరిక్షాలకు ఆధారమైనవాడు, తనకు అసాధారణ నామమైన 'ఆత్మ' శబ్దంచేత జీవుడు కాదు, పరమాత్మయే.

"పశునాయజేత" (పూర్వమీమాంస) "చతుష్పాదః పశవః" అని పశువుతో యాగం చేయవలెననేది విధి. ఇక్కడ పశు శబ్దానికి (ఛాగ పశువు) 'మేక' అని అర్థమున్నట్లే 'సత్' అనే కారణ వస్తువు 'పరబ్రహ్మ' అనియే అర్థం.

"బ్రహ్మవా ఇదమగ్ర ఆసీ దేకమేవ"- (బృహ-ఉ.3-4-11) చిద చిద్వి భాగం లేని కారణావస్థయందు బ్రహ్మమొక్కటే ఉండెను (ఇక్కడ చతుర్ముఖుడైన ప్రజాపతియని అర్థం కాదు).

"యదా తమస్తన్నదివా నరాత్రిర్న సన్నచా సచ్ఛివ ఏవ కేవలః" (శ్వేతా. ఉ.4-18) (తమస్సు= చీకటి, శోకం, రాహువు). (అంధకారమున్న) ప్రళయ కాలమందు పగలు లేదు, రాత్రి లేదు, సత్తులేదు, అసత్తు లేదు, ముఖ్యంగా శివుడే ఉన్నాడు. ఇక్కడ శివశబ్దం నారాయణుని కంటె వ్యతిరిక్తమైన శివదేవుడనే

భ్రమను కలిగిస్తుంది. 'శివ' శబ్దానికి 'రుద్ర, మంగళ, మృగ విశేష, నారాయణాది నానార్థాలున్నాయి.

తమః శరీరకమైన కారణభూత వస్తువుకు తమః శరీరత్వ ప్రయోగం చేత అమాంగల్యమేర్పడగా, 'శివ ఏవ కేవలః' అంటే మంగళమూర్తిగా చెప్పబడింది.

"శాశ్వతం శివ మచ్యుతమ్" (నారాయణోపనిషత్తు). "నవానుదేవాత్పర మస్తిమంగళమ్" అనీ 'మంగళానాంచ మంగళమ్' అనీ నిరుపాధిక మంగళత్వం చేతనే విష్ణుమూర్తికి 'సర్వః శర్వః శివః స్థాణుః' అనే నామాలు యోగరూఢిగా ప్రసిద్ధిని పొందినాయి కదా!

"ఏకో హవై నారాయణ ఆసీత్ నబ్రహ్మేనేశానో నేమేద్యావా పృథివీ ననక్షత్రాణి నా పోనాగ్ని ర్నసోమో న సూర్యః స ఏకాకీ నరమేత తస్య ధ్యానస్థస్య" (మహోపనిషత్1-1).

సృష్టికి ముందు నారాయణుడొక్కడే ఉన్నాడు. బ్రహ్మలేదు, శివుడు లేదు, భూమ్యంతరిక్షాలు లేవు. చుక్కలు లేవు, నీరు లేదు, నిప్పులేదు, చంద్రుడు లేడు, సూర్యుడు లేడు, ఒక్కడే అయ్యి ఆనందంతో ఉండక ధ్యానమగ్నుడయ్యాడు.

"అసద్వా ఇదమగ్ర ఆసీత్, తతో వై సదజాయత"- (తై.ఉప.)

'సత్' అంటే నామరూపాలు గల జగత్తు. 'సత్తు' కంటె ఆకార భేదం కలది, అంటే నామరూపాలతో ఉండడానికి విరుద్ధమైన సూక్ష్మావస్థగల జగత్తు 'అసత్' అనబడుతుంది. 'నిరవయవం' అన్నమాట; బొత్తుగా లేనిదని అర్థం కాదు. ఇది 'అగ్నినాసించేత్' అగ్నిచే తడుపవలెను, అనే అసంగతమైన మాట వంటిది కాదు. బ్రహ్మం నిరవయవమంటె అసంగతం కాదు.

'అసత్తు' మొదట ఉండింది. తర్వాత 'సత్తు' అయింది. "తదసదేవ సన్మనోకురుత స్యామితి"- సూక్ష్మావస్థలో ఉన్నదే (అసత్) స్థూలావస్థలో ఉండే

జగత్తుగా అవుతానని సంకల్పించుకొన్నది, తలచింది. నిరవయవమైన బ్రహ్మం నుంచే విచిత్రమైన జగత్తు కలుగుతున్నదని శ్రుతి తెల్పుతున్నది.

*"సర్వంఖల్విదం బ్రహ్మ తజ్జలానితి"*- (ఛాం. 3-14-1).

కారణావస్థలోనూ, కార్యావస్థలోనూ ఉండే బ్రహ్మయే సృష్టి స్థితి లయకారకుడని స్పష్టీకరింపబడింది.

*"ఓమ్ తత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రి విధః స్మృతః"*- (భ.గీ. 17-23)

"ఓమ్, తత్, సత్" అనే మూడు సంజ్ఞలు పరబ్రహ్మనే తెల్పుతాయి. 'బ్రహ్మ' శబ్దం కూడా *"వేదే భూరి ప్రయోగాచ్చ గుణయోగాచ్చ శార్ఙ్గిణి! తస్మిన్నేవ బ్రహ్మశబ్దో ముఖ్యవృత్తో మహామునే"* (గరుడ పురాణం) వేదమందు బాగా ప్రయోగించడం వల్లనూ, గుణయోగం వల్లనూ, బ్రహ్మశబ్దం నారాయణున్నే బోధిస్తుంది.

*"బృహత్వంచ స్వరూపేణ గుణైశ్చ యత్రా నవధికాతిశయం సోఽస్య ముఖ్యార్థః, స చ సర్వేశ్వర ఏవ"* (శ్రీ భాష్యం) బ్రహ్మ శబ్దం స్వరూపాన్ని బట్టి, గుణాలనుబట్టి ఇంతటిది అని పరిచ్ఛేదింపరాని భగవంతుని స్వరూపాన్ని బోధిస్తున్నది. సర్వేశ్వరుడు అతడే కదా! అంతే కాక 'బృహతి-బృంహయతి' అని నిరుక్తమందు చెప్పబడిన వ్యుత్పత్త్యర్థాన్ని బట్టి, నిరవధిక బృహత్వం తాను కలిగి యుండడమే కాక, తనను ఆశ్రయించిన వారిని కూడా తనంతటి మహత్త్వం కలవారినిగా చేసే ప్రభావం కలది పరబ్రహ్మం.

*నారాయణే త్వయి కరీశ! వహంత్యనన్యం-*

సత్, ఆత్మ, బ్రహ్మ, శివాదిశబ్దాలు సామాన్య ధర్మం, విశేష ధర్మం అనే రెండు ఆకారాలను కలిగియున్నందువల్ల తత్త్వాంతర భ్రమను నివృత్తి జేస్తూ, యోగ వృత్తిచేత నారాయణుని యందే అన్వయిస్తున్నాయి.

"పూర్వపదాత్ సంజ్ఞాయామగః"- అనే వ్యాకరణ సూత్ర ప్రకారం 'నార+అయన' అనే పదాలకు సమాసం వచ్చినప్పుడు, పూర్వ పదంలోని రేఫ (ర)ను బట్టి, ఉత్తర పదంలోని నకారానికి 'ణ' కారం (ణత్వం) వస్తుంది. ఈ సమాస పదం సంజ్ఞా (నామ) వాచకమైనప్పుడే ణత్వం వస్తుందని నిర్ణయింపబడింది.

'నారాయణ'శబ్దం విష్ణువుకే సంజ్ఞా వాచకం. కాబట్టి (అనన్యం) ఈ సంజ్ఞావాచకం ఇతరులకు వర్తించదు (ఇది పైన చెప్పిన సూత్రానికి అర్థం).

*"నరా జ్జాతాని తత్వాని నారాణీతి తతో విదుః।*
*తాన్యేవ చాయనం తస్య తేన నారాయణః స్మృతః॥"*

'నరాత్ జాతాని' అంటే, నరుడు అనే భగవానుని వల్ల కల్గిన పృథివ్యాది భూతాలు. 'నారాలు' అనబడుతాయి. నారాలు భగవంతునికి వాసస్థానమైనందు వల్ల నారాయణుడు అనబడుతున్నాడు. దీనివల్ల దేవతాంతర విలక్షణుడని ప్రతిపాదితం.

*"నర సంబంధినో నారాః నరః సపురుషోత్తమః"*- 'నృ-నయే' అనే ధాతువు చేత ఏర్పడిన 'నర' శబ్దానికి సర్వ నియంతయైన పురుషోత్తముడని, నరునితో సంబంధం కలవి నారములు అని అర్థం. *"ఆపో నారాయణోద్భూతాః తా ఏవా స్యాయనం పునః"*-*"ఆపోవై నారాః"*- నారాలంటే నీరు. *"ఆపోవై నరసూనవః"* ఉదకం నారాయణుని నుంచి పుట్టింది. అదే ఆతనికి నివాస స్థానం.

"రీఙ్-క్షయే" అనే ధాతు నిష్పన్నమైనది. 'ర'. ఇది స్వరూప వికారం చేత నశించే అచేతన వస్తువును తెల్పుతుంది.

'నగ, నైక' అన్నట్లే 'ర'- 'న'తో కూడి 'నర' అని నిష్పన్నమై, స్వరూప వికారం లేని చేతన వస్తువును తెల్పుతుంది. 'నర' శబ్దమే 'నార' అనే రూపాంతరం చేత నర-జీవ-సమూహమని అర్థం కలది.

1) నారాణాం అయనం= నారాయణః (షష్ఠీ తత్పురుష సమాసం. అయినా, నిర్వచన బలంవల్ల అయన శబ్దం పుంలింగం) నారములనే జీవరాశులన్నిటికీ ఆశ్రయమైనవాడు నారాయణుడు. "నారాణా మయనత్వాచ్చ నారాయణ ఇతిస్మృతః"- అన్నది ఇదే అర్థం.

2) నారాః అయనం యస్యసః= నారాయణః. (బహువ్రీహి సమాసం). నారములు వాసస్థానంగా కలవాడు నారాయణుడు అని అర్థం. 'అయనం' అంటే వాసస్థానం.

1) "ఇణ్-గతౌ" అనే ధాతువు నుంచి ఉత్పన్నమైన రూపం 'అయనం'. ఈయతే అనేన= అయనం. కర్మణి వ్యుత్పత్తి వల్ల 'నారాయణుడు ఉపాయ'మని తెలుస్తున్నది.

2) ఈయతే అసౌ= అయనం. కర్తరి వ్యుత్పత్తి వల్ల 'నారాయణుడు ఉపేయ'మని అర్థం.

3) ఈయతే అస్మిన్= అయనం. అధికరణ వ్యుత్పత్తి వల్ల ఆధార భూతుడన్నది స్పష్టం.

'అయ పయ *గతౌ*' అనే ధాతువు నుంచి కూడా 'అయన' శబ్దం ఉత్పన్నమవుతుంది. దీనివల్ల ఉపాయోపేయత్వాదులకు ఉపయుక్తమైన సౌలభ్యమూ, పరత్వమూ తెలుస్తాయి.

తత్పురుష సమాసం చేత బహిర్వ్యాప్తి, బహువ్రీహి సమాసం చేత అంతర్వ్యాప్తి తెల్పబడుతున్నది.

"అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః" అని శ్రుతి ప్రతిపాదితం.

"ఎణ్ పెరుక్కన్నలత్తాణ్ పొరులీరి లవణ్ పుగష్ నారణన్"- (1-2-10) జ్ఞానానంద స్వరూపులైన జీవులూ, అనంత జ్ఞానానందాది కల్యాణ గుణాలు కలవాడు.

"నారణన్ ముషు వేషుల కుక్కుమ్ నాతన్"- (తి.వా.మొ. 2.7.2)

నారాయణుడు సమస్త లోకాలకు నాథుడు అని ఆ రెండు సమాసాల అర్థాన్ని శ్రీ శఠకోపదివ్యసూరి తెల్పినారు.

'నారాయణ' శబ్దంలోని ఒక్కొక్క అక్షరానికి గల అర్థం తెల్యదగినదే.

(నా) *"నాస్తిక్యహానిర్నిత్యత్వం నేతృత్వంచ హరేః పదే।*
*నాకారసేవినాం నృణాం మంత్ర విద్భిః ప్రకీర్తితః॥"*

'నా' కారాన్ని సేవించిన వారికి నాస్తిక్య బుద్ధి తొలగిపోతుంది. నిత్యత్వ మేర్పడుతుంది. పరమ పదానికి తీసికోపోబడే స్థితి కలుగుతుందని మంత్రజ్ఞులు తెల్పుతున్నారు.

(రా) *"రంజనం భగవత్యాశు రాగహానిస్తతోఽన్యతః।*
*రాష్ట్ర త్రాణాదికం చాపి ప్రాప్యతే రేఫసేవయా॥"*

రేఫను సేవిస్తే భగవత్ప్రీతినీ, వైరాగ్యాన్ని రాష్ట్ర రక్షణనూ పొందుతాడు.

(య) *"యోగోద్యోగ ఫలం చాశు యకారాత్ప్రాప్యతే బుధైః।*

యకారం వల్ల యోగానుష్ఠాన ఫలాన్ని పొందుతాడు.

(ణ) *"వర్ణనంచ తథా విష్ణోర్వాణీ సిద్ధిర్ణకారతః॥"*

ణ కారంవల్ల విష్ణుమూర్తిని వర్ణించే వాక్శుద్ధి కలవాడవుతాడు.

పరదైవమని వేదశాస్త్రాలచే నిర్ణయింపబడిన నారాయణుడే కరీశుడు.

"నారాయణాఖిల *గురో భగవన్ నమస్తే*"- అని గజేంద్రుడు ఆర్తితో స్తుతించాడు. ఇందులో మొదటి ఆది మూల వస్తువైన నారాయణ పదం. రెండవది జ్ఞానదాతయై సకల జగత్కారణుడైన గురుపదం. తర్వాత షాడ్గుణ్య పూర్తి మహిమ గలది భగవచ్ఛబ్దం. ఇలా మూడు పదాలతో స్తుతించి, హస్తమస్తక ఘటనతో నమ్రతను ప్రకటించడం గజేంద్రుని చాతుర్యం.

పోతనామాత్యుని కరీంద్రుడు కూడా మూడు పదాలతో- "రావే ఈశ్వర! కావవే వరద! సంరక్షించు భద్రాత్మకా!" అని మొరపెట్టుకొన్నాడు. ఆ వరదుడు కరీంద్రుని కుయ్యాలించి సంరంభియై 'సిరికిం జెప్పక శంక చక్రయుగమున్ జేదోయి సంధింపక'యే పోయి కరీంద్రుని రక్షించిన ఆ త్వరకొక నమస్కారం. అప్పటినుంచి లోకులు, లోకేశులు 'కరీశ' నామంతో స్తుతించడం వల్ల ఆ వాచకం మహనీయమైనది.

అన్వర్థ వృత్తి పరికల్పితమైక కంఠ్యమ్-

సదాది శబ్దాలు, శివాది వాచకాలు గతిసామాన్య న్యాయం చేత ఇతరులకు వర్తించేవి యైనా యోగ వృత్తిచే నారాయణుని యందే వర్తిస్తాయి. కాని నారాయణ శబ్దం ఇతరులకు ఏ విధంగానూ వర్తించే అవకాశం లేని గొప్ప ప్రభావం కలది.

అనన్యం-దానికదే సాటి. నారాయణ శబ్దం నారాయణునికే అన్వయిస్తుంది.

అర్థాన్ని అనుసరించి బోధించే శక్తిగల శబ్దశక్తియే అన్వర్థవృత్తి. ఇట్టి బోధకత్వ శక్తిచేత నానావిధ ప్రమాణాలను పరిశీలించి నిర్ణయింపబడినట్టి సచ్ఛబ్దాదులు ఏక కంఠంగా నారాయణుని యందే ఆవహిస్తున్నాయి.

"సాక్షాదప్య విరోధం జైమినిః" (బ్ర.సూ. 1-2-29).

అగ్ని శబ్దం సాధారణంగా జ్వలించే ఇతర పదార్థాలను తెల్పునదే యైనా, పరమాత్మకు ఉండే అగ్రనయనాది గుణం చేత- శ్రీ వైకుంఠానికి ముందు ఉండి తీసికొని పోయే నిరుపాధికంగా అసాధారణ గుణాలను తెల్పే శబ్దాలచే విశేషింపబడడం చేత- అది సాక్షాత్తుగా పరమాత్మనే తెల్పుతున్నదని, పూర్వ మీమాంసా శాస్త్రకర్తయైన 'జైమిని' అనే మహర్షి విరోధమేమి లేదన్నాడని వ్యాస భగవానుడు తెల్పినాడు.

అట్లే సత్, ఆత్మ, బ్రహ్మ, శివాది శబ్దాలు అన్యాధీనమైన సత్తగల వాచకాలైనప్పటికీ, విశేష ధర్మాన్నిబట్టి సాక్షాత్తుగా భగవద్వాచకాలే. ఇది ఛాగ పశున్యాయం చేత ఐక కంఠ్యం సంభవమే అని విశదీకరింప బడింది.

వసన్త తిలక. త భ జ జ గ గ - గణాలు కలది.

*16.* *సంచితయంత్యఖిల హేయవిపక్ష భూతం*
*శాంతోదితం శమవతా హృదయేన ధన్యాః।*
*నిత్యం పరం వరద! సర్వగతం సుసూక్ష్మం*
*నిష్పంద నందథుమయం భవతః స్వరూపమ్॥*

**అర్థం:** హే వరద= కామితార్థ ప్రదుడవైన ఓ దేవరాజా!; శమవతా= శమ మనే గుణంతో కూడిన; హృదయేన= మనస్సుతో; ధన్యాః= భాగ్యవంతులు; భవతః = నీ యొక్క; అఖిల హేయ విపక్షభూతం= హేయ గుణాలు ఏవీ లేనట్టి; శాంతోదితం= శాంతోదితం అనే దశయందున్నట్టి; నిత్యం= శాశ్వతమైనట్టి; పరం= సర్వోత్కృష్టమైనట్టి; సర్వగతం= వస్తువులన్నిటి యందు వ్యాపించి యున్నట్టి; సుసూక్ష్మం= మిక్కిలి సూక్ష్మమై యున్నట్టి; నిష్పంద నందథు మయం= మార్పులేని ఆనంద మయమై యున్నట్టి; స్వరూపం= (నీ దివ్యమైన) స్వరూపాన్ని; సంచింతయంతి= బాగా ధ్యానిస్తుంటారు.

**తా॥** ఓ దేవరాజా! నీ దివ్యస్వరూపం సమస్త హేయగుణాలకు ప్రతిభటమై యున్నట్టిది. శాంతోదితమైన స్థితియందున్నట్టిది, శాశ్వతమైనట్టిది, అన్నిటికంటె శ్రేష్ఠమైనట్టిది. స్థావర జంగమ వస్తువులన్నిటి యందు వ్యాపించి యున్నట్టిది. మిక్కిలి సూక్ష్మమై యున్నట్టిది. నిర్వికారమైన ఆనంద సమృద్ధిని పొందియున్నట్టిది. ఇట్టి నీ దివ్య మంగళ విగ్రహాన్ని అంతరింద్రియ నిగ్రహంతో కూడి యున్న హృదయంతో ధన్యులైనవారు ధ్యానిస్తుంటారు. నాకు అట్టి భాగ్యాన్ని ప్రసాదింపుమని దేశికులు ప్రార్థిస్తున్నారు.

**వ్యాఖ్య:-** పరదైవమైన నారాయణుని దివ్యస్వరూపాన్ని వర్ణిస్తున్న శ్లోకమిది.

ఇతర దేవతలకు భగవంతునితో తాదాత్మ్యం చెప్పడానికి జగత్కారణత్వం లేనందువల్లనూ, సర్వశబ్దాలు నారాయణుని యందే పర్యవసించడం వల్లనూ, 'నారాయణ' సంజ్ఞ మాత్రం దేవతాంతరులకు వర్తించనందువల్లనూ, నారాయణుడే పరదైవమని వేదశాస్త్ర ప్రమాణాలను ప్రదర్శించి నిర్ణయింపబడింది కదా!

ఇప్పుడు దివ్యాత్మ స్వరూపాన్ని నిరూపించే ధర్మాలను ప్రామాణికంగా ప్రదర్శిస్తూ, భగవద్దివ్య మంగళ విగ్రహం వర్ణింప బడుతున్నది.

1) *హే వరద! భవతః స్వరూపం అఖిల హేయ విపక్షభూతమ్*- వరదుడవైన ఓ దేవరాజా! నీ స్వరూపం సమస్త హేయ గుణాలకు ప్రత్యనీకమైనది.

హేయ గుణాలు ఏవగింపు కలిగించే చెడ్డగుణాలన్నమాట. అట్టి హేయగుణాలకు శత్రువైనది, అంటే ఎదిరించే సత్తా కలది అనే అర్థమే కాక హేయ గుణాలే లేనట్టి స్వరూపమని అర్థం. ఉన్నవన్నీ కల్యాణ గుణాలే. వాటికి అంతం లేదు. హేయగుణాలు (అసలే) బొత్తుగా లేనే లేవు. కాబట్టి, అనంతమైన దివ్య స్వరూపమది.

జీవాత్మలు హేయగుణాలు లేనివైననూ హేయగుణాలు ఉండే యోగ్యత కలవి. అది ప్రపంచంలో సామాన్యధర్మం.

*"అక్షరధియాంత్వవ రోధః"*- (బ్ర.సూ. 3-3-33) అనే సూత్రమందు హేయ విపక్ష భూతం- హేయ ప్రత్యనీకం- అంటే, చేతనా చేతనాత్మకమైన ఈ ప్రపంచం యొక్క ధర్మాలైన సూక్ష్మత్వ అణుత్వాది దోషాలు అంటని, అసాధారణమైనది 'పరమాత్మ స్వరూపం' అనే భావం ముఖ్యంగా చెప్పబడింది. సర్వోపాసనలలో అనుసంధింపదగిన ఆనందాది అసంఖ్యాకమైన గుణాలు కల దివ్య స్వరూపమని పిండితార్థం.

ఇక్కడ 'హేయ విపక్షీభూతం' అన లేదు. అలాగా అన్నట్లైతే ఒకప్పుడు హేయ గుణాలు కలిగియుండి, ఏదో కారణంచేత, తర్వాత లేనివి అయినట్లు విపక్షీభూతం- గుడిదీర్ఘం (చ్విప్రత్యయం) వల్ల అర్థమవుతుంది.

సారభూతం- సారమైనదని అర్థం. 'సారీభూతం' అంటే మొదట సారంలేని వస్తువు ఏ కారణం వల్లనో తర్వాత సారంకలదిగా అయిందని అర్థం. ఏదో కారణం ఉన్నందు వల్ల 'సోపాధికం' అనబడుతుంది. "యత్ సారభూతం తత్ ఉపాదదీత"- అనేచోట, ఏది సారమైనదో దానినే గ్రహించాలి అని అర్థం. అందుకే 'హేయ విపక్ష భూతం' అనబడింది. అంటే దివ్యాత్మ స్వరూపం హేయగుణాలు లేనిది, అనడానికి కారణమేదీ లేదు కాబట్టి, అది 'నిరుపాధికం' అనబడుతుంది.

ముక్తాత్మలకు ఒకప్పుడు సంసార బంధం ఉండి, తర్వాత అవి బంధం లేనివయినందువల్ల, పరమాత్మ ముక్తాత్మలకంటే విలక్షణుడు కదా! 'నిత్యాత్మలు హేయగుణాలు లేనివే' అంటే భగవంతుని సంకల్పానికి అధీనమైనవన్న విషయం స్పష్టం కదా! హేయగుణాలు లేని స్వరూపం అనన్యాధీనం. అంటే భగవంతునికి తప్ప ఇతరులకెవ్వరికీ అట్టి స్వరూపం ఉండే యోగ్యత లేదు అని ప్రామాణికంగా నిర్ణయింప బడినది.

'హేయ విపక్షభూతం' అనడం వల్ల హేయగుణ రాహిత్యం చెప్పబడింది. కాబట్టి, దివ్యాత్మ స్వరూపం 'అమల'మైనది అని విశదమవుతున్నది. అట్లే 'సత్యపదం నిరుపాధిక సత్తాయోగి బ్రహ్మ'- నిరుపాధికమైన సత్త (ఉనికి) కలది బ్రహ్మ- అని సత్యం అనే పదం చెబుతున్నందువల్ల దివ్యాత్మ స్వరూపం 'సత్య'మని స్పష్టమవుతున్నది. ఇట్లు, ఇక్కడ, భగవత్స్వరూపానికి అమలత్వమూ, సత్యత్వమూ వివక్షితం.

2) శాంతోదితం- శాంతోదిత దశ, నిత్యోదిత దశ అనే రెండు దశలు- అవస్థలు ఉన్నాయని యోగశాస్త్రమందు 'ధ్యాన' విషయంలో ప్రయోగింప బడినాయి.

'శాంతోదితావస్థ' అంటే 'విభూత్యనంతర్భావేన స్వస్వరూపాను భవ దశా' అని 'నిత్యోదితా వస్థ' అంటే 'సర్వ విభూత్యనుభవదశా' అని పారిభాషికం. 'నిరూఢ లక్షణ' యని సంప్రదాయం.

శాంతోదిత దశ– 'శాంతి సమృద్ధ మమృతమ్'– (శిక్షావల్లి) శాంతి అనే స్వభావంతో సంపన్నమైనది, జనన మరణాలకు అతీతమైన స్వరూపం. ప్రకృతి వశంచేత జీవులలో కలిగే ఊర్మిషట్క మనబడే– కామ, క్రోధ, లోభ, మోహ, మద మాత్సర్యాలు అనే చెడ్డ లక్షణాలు లేనిది. జ్ఞాన శక్తి బలైశ్వర్య వీర్య తేజస్సులు అనే షడ్గుణాలు ఉపలక్షణంగా ఉండే అనంత (మితిలేని) కల్యాణ గుణాలు కల స్వరూపం.

*"ప్రశాంతానంతాత్మాఽనుభవజ మహానంద మహిమ*
*ప్రసక్త స్తైమిత్యాను కృత వితరంగార్ణవ దశమ్" (13)*

అని కూరత్తాళ్వాన్ వరదరాజస్తవం చేశారు. ప్రశాంతమైన, అనంతమైన, స్వయం ప్రకాశమైన తన స్వరూపాన్ని అనుభవించడం చేత కలిగిన మహానంద పరిపూర్ణమైన పరబ్రహ్మం తరంగాలు లేనిదై నిశ్చలమైన ప్రశాంత గంభీర మహాసముద్రాన్ని పోలియున్న దశ, అని అర్థం.

నిత్యోదిత దశ– పరబ్రహ్మం ఉభయ విభూతి నాయకత్వం కలది. లీలా విభూతి, నిత్య విభూతి అని రెండు విభూతులున్నాయి. ఈ లీలా విభూతి ($^1/_4$ భాగం)లోనే అనంతకోటి బ్రహ్మాండాలున్నాయి. ఇక నిత్య విభూతి "త్రిపాదస్యామృతందివి" (పు. సూక్తం) అనే శ్రుతిరీత్యా, లీలా విభూతి కన్న ($^3/_4$ భాగం) మూడు రెట్లు అధికమైన వైశాల్యమూ, ప్రభావమూ కలిగి శాశ్వతమైనది (నిత్య విభూతి అంటే శ్రీ వైకుంఠం).

*"అతి పతితావధి స్వమహిమానుభవ ప్రభవత్సుఖ*
*కృత నిస్తరంగ జలధీయిత నిత్యదశమ్" (23)*

అపరిమితమైన తన ఉభయ విభూతుల వైభవాన్ని అనుభవించడం చేత కలిగిన ఆనందంతో ప్రకాశించే పరబ్రహ్మం నిస్తరంగ మహార్ణవాన్ని అనుకరించి యున్నదశ అని శ్రీకూరేశులు సుందరబాహుస్తవం చేశారు.

"స ఏకో బ్రహ్మణ ఆనందః" (ఆనందవల్లి) అన్నట్లు అద్వితీయానంద భరితమైన దివ్యాత్మ స్వరూపమే ధ్యాన యోగ్యమైనది.

నిత్యం- శాశ్వతమైనది. స్వరూపతః నిత్యమైనది. ప్రవాహతః నిత్యమైనది దివ్యాత్మ స్వరూపం.

కాలం చేత పరిచ్ఛేదింపరానిది. భూత భవిష్యద్వర్తమాన మనే మూడు కాలాల్లోనూ ఉండేది. దేశం చేత పరిచ్ఛేదింపరానిది. అంటే, ఇక్కడ ఉన్నది, అక్కడ ఉండదు అని చెప్పరానిది. వస్తు పరిచ్ఛేద్యం కానిది. ఈ విధంగా ఉంటుంది, అలాగా ఉండదు అని భావించరానిది అని అర్థం.

సృష్టి తర్వాత ప్రళయం. ప్రళయం తర్వాత సృష్టి- ఇట్లు నిరంతరం సాగించే నియమం కలది కాబట్టి ప్రవాహరూపంగా నిత్యమైనది. విశ్రాంతి నొందని స్వరూపమని భావం.

పరం- ఇంతకంటె ఉత్కృష్టమైన వస్తువు మర్కొటి లేదు. "మహతో మహీయాన్" అన్నట్లు సర్వశ్రేష్ఠమైనది. ఉజ్జ్వల స్వరూపంగా ధ్యేయమైనది.

సర్వగతం- పాలలోని చమురులాగా అంతట వ్యాపించి యుండేది. అన్ని వస్తువులలోనూ- చరాచర పదార్థాలలోనూ పొందియుండేది. సర్వవస్తువులందు వ్యాపించి, అవి తనకు శరీరంగానూ, వాటికి తాను ఆత్మగానూ భాసించే స్వరూపమది. 'విభువు' అనదగినది.

బహిరంతర్వ్యాప్తి కలిగియున్న స్వరూపమంటే ఎట్లు ఉంటుంది?

*"అయః పిండే యథావహ్నిః భిన్నస్తిష్ఠత్య భిన్నవత్।*
*తథా విశ్వమిదం దేవో హ్యావృత్య పరితిష్ఠతి॥"*

అగ్నివేరే, ఇనుపగుండు వేరే కదా! అగ్నిలో బాగా కాలిన గుండును చూస్తే, ఇనుపగుండులో అగ్ని వేరుగా లేక లోపల, బయట, అన్నివైపుల వ్యాపించి యున్నదని తెలుస్తుంది. "అతతీతి ఆత్మా"- అని వ్యుత్పత్తి చేతనూ, "సర్వం సమాప్నోషి" అన్నట్లు అంతటా వ్యాపించి యుండేది దివ్యాత్మ స్వరూపం.

సుసూక్ష్మం- చాలా చిన్నది అని అర్థం.

"అణో రణీయాన్" అనే శ్రుతినిబట్టి, అణువుకంటె కూడా మిక్కిలి సూక్ష్మమైన పరమాణువు రీతిగా గుర్తింపరాకుండా ఉండే స్వరూపమని అర్థం.

*నిష్పంద నందథుమయం-*

స్పందించని అంటే వికారం లేని ఆనందం కలది. వాక్కులకూ, మనస్సుకూ అందనట్టి అనంతమైన మహానందం కలది దివ్యాత్మ స్వరూపం. ఆనంద గుణం పరమాత్మకు స్వరూప నిరూపకమైనది. జీవాత్మకు ఆనంద గుణమున్ననూ ప్రకృతి చేత తిరోహితమై యున్నది. 'ఆనందో బ్రహ్మ' ఆనంద గుణం కలది, ఆనంద స్వరూపం కలది దివ్యాత్మ. అంతే కాదు, తనను ఉపాసించే వారిని కూడా ఆనందింపజేస్తుంది. "*ఏష హ్యేవానందయాతి*" అనే ఉపనిష ద్వాక్యం ఈ భావాన్నే తెలుపుతున్నది.

"*ఆనందాదయః ప్రధానస్య*"- (బ్ర.సూ. 3.3.11)

ఆనందాదులు ఉపాస్య వస్తువైన పరబ్రహ్మ స్వరూపాన్ని నిరూపించే ధర్మాలవడం వల్ల, పరబ్రహ్మను విడిచి యుండనివి కాబట్టి, పరవిద్యలయందు ఆ బ్రహ్మస్వరూపం అనువర్తించే రీతిగా ఆనందాది గుణాలూ పరవిద్యలయందు అనువర్తిస్తాయని చెప్పబడింది.

'ఆనందాదులు' అన్నచోట 'భావ ప్రధానో నిర్దేశః' అన్నది శ్రుతప్రకాశిక. "అనుకూలం జ్ఞానం హి ఆనందః"- అనుకూల జ్ఞానమే ఆనందం అవడం చేత ఇక్కడ జ్ఞానత్వమూ చెప్పబడింది. అందువల్ల, సత్యత్వ, జ్ఞానత్వ, అనంతత్వ,

ఆనందత్వ, అమలత్వ రూపాలైన ఐదు (5) ధర్మాలు (గుణాలు) చెప్పబడినాయి.

భవతః స్వరూపం- ఈ విధంగా స్వరూప నిరూపక ధర్మ పంచకంతో కూడియున్నట్టిది భగవంతుని స్వరూపం.

*శమవతా హృదయేన ధన్యాః సంచింతయంతి*- 'శమం' అంటే అంతరింద్రియ నిగ్రహం. శాంతి రసానికి స్థాయి భావం శమం. శాంతరసమంటే, రస స్వరూపుడు పరమాత్మయే. పరమాత్మ స్వరూపమే దీనికి ఆలంబనమని '*సాహిత్య దర్పణ*' మందు భావింపబడింది కదా!

శాండిల్య విద్యయందు "శాంతః ఉపాసీత" ప్రశాంతమైన దివ్యాత్మ స్వరూపాన్ని అంతరింద్రియ నిగ్రహం కలిగిన, ఏకాగ్రమైన మనస్సుతోనే "తొషుదు ఎషు" అన్నట్లు, ధ్యానం చేయాలి, ఉజ్జీవించాలి. పుణ్యాత్ములు చూస్తారు ధ్యానిస్తారు. ధనం లబ్ధారః= ధన్యాః ధనాన్ని పొందేవారు ధన్యులు.

*"ధన్యాః పశ్యంతి మేనాథం కృతజ్ఞం ప్రియవాదినమ్"* (రా.సుం. కాం. 25-16). రాక్షస స్త్రీల వశమందుండి రాముణ్ణి చూడజాలని సీతమ్మ, కృతజ్ఞుడూ, ప్రియంగా మాటలాడే తన భర్తను ధన్యాత్ములే చూస్తారు, అని చింతిస్తుంది.

శమదమాలు కలిగియున్న ఏకాగ్రమైన మనస్సుతో ధన్యాత్ములు భగవంతుని స్వరూపాన్ని బాగా ధ్యానంచేస్తుంటారు. ఈ విధంగా ధ్యానం చేసే వారు భాగ్యశాలురు కదా! అని ఈ శ్లోకం విశదీకరించింది.

నేను ఆ రీతిగా ధ్యానించి ధన్యుడను కాలేకపోతినే, అని దేశికుల హార్దాభిప్రాయం. స్వభావోక్త్యలంకారం. వసంత తిలక.

*17. విశ్వాతిశాయి సుఖరూప! యదాత్మకస్త్వం*
*వ్యక్తిం కరీశ! కథ యంతి తదాత్మికాంతే।*
*యేనాధిరో హతి మతి స్త్వదుపాసకానాం*
*సాకిం త్వమేవ తవవేతి వితర్కడోలామ్॥*

**అర్థం:** హే కరీశ!= ఓ హస్తిశైలనాథా!; హే విశ్వ+అతిశాయి సుఖరూప= సమస్త వస్తువులకంటె మించిన సుఖ (ఆనంద)మయమైన విగ్రహం కలిగిన ఓ దేవా!; త్వం= నీవు; యత్+ఆత్మకః= ఏ స్వరూపం కలవాడవో; తే= నీ యొక్క; వ్యక్తిం= (ఆకారాన్ని) దివ్యమంగళ విగ్రహాన్ని; తత్+ఆత్మికాం= ఆ స్వరూపాన్ని కలిగి యున్నదిగా; కథయంతి= (శ్రుతులు) చెబుతున్నాయి; యేన= ఏదో ఒక కారణం చేత; త్వత్+ఉపాసకానాం= నీ ధ్యానం చేస్తున్న వారి యొక్క; మతిః= బుద్ధి; సా= ఆ దివ్యమంగళ విగ్రహం; కిం, త్వం, ఏవ= నీవేనా?; తవవా= లేక నీదా? (నీకంటె వేరైనదా?); ఇతి= ఇట్లు (రెండు మాటల యందు); వితర్క దోలాం= ఊహ అనబడే ఉయ్యాలను; అధిరోహతి= ఎక్కియున్నది. సంశయగ్రస్తమైనది అని అర్థం.

**తా॥** లోకంలోని సమస్త వస్తువులకంటె అతిశయించిన జ్ఞానానంద మయమైన దివ్యాత్మ స్వరూపం కలిగియున్న దివ్యమంగళ విగ్రహా! ఓ హస్తిగిరినాథా! శ్రుతులు, ఋషులు, ఆళ్వార్లు నీవు ఎట్టి స్వరూపం కలవాడవో, నీ దివ్యమంగళ విగ్రహం కూడా అట్లే. జ్ఞానానందమయమైనదే అని చెబుతున్నారు. ఏ కారణంచేతనో నిన్ను ఉపాసించే ధ్యానించే వారి బుద్ధి ఆ దివ్యమంగళ విగ్రహమే నీవా? లేక నీ కంటె భిన్నమైనదా? జడమా? అజడమా? అని ఊయెల ఆట ఆడుతున్నది. చాంచల్యంతో ఉన్నదని తాత్పర్యం.

వ్యాఖ్య:- భగవద్దివ్య మంగళ విగ్రహాన్ని వర్ణించే శ్లోకం. ఇంతవరకు దివ్యాత్మ స్వరూపం వర్ణితం. ఇది మొదల్కొని 26వ శ్లోకం వరకు శుభాశ్రయమైన భగవద్విగ్రహానుభవం వర్ణింపబడుతున్నది (ఇందు తెలియదగిన అంశములు ఇవ్వి)

విశ్వాతిశాయి సుఖరూప- ఇది సంబోధనాంత పదం. "అనుకూలతయా వేదనీయం సుఖమ్" అని తర్కశాస్త్ర నిర్వచనం. అందరికి అనుకూలమైనది, అపేక్షింపదగినది సుఖం, ఆనందమని అర్థం.

పరమాత్మ జ్ఞానానంద స్వరూపుడు, జ్ఞానానందాది గుణాలు కలవాడు. "తద్గుణ సారత్వాత్ తద్వ్యపదేశః ప్రాజ్ఞవత్" అనేది బ్రహ్మసూత్రం. జ్ఞానగుణమే

జీవాత్మకుగానీ పరమాత్మకుగానీ అన్ని గుణాలలో ముఖ్యమైనది. కాబట్టి జ్ఞానపదంతోనే జీవాత్మనుగానీ పరమాత్మనుగానీ వ్యవహరింపవచ్చును అని సూత్రానికి అర్థం.

జీవాత్మ జ్ఞానానందమయమైనదే. జీవాత్మ దేహంతో కూడి 'నేను' అనగలుగుతున్నదని స్పష్టమే కదా! దేహాత్మవాదమందు దేహం వేరు, జీవాత్మవేరు. జీవుని జ్ఞానం ప్రకృతిచేత– దేహంచేత ఆచ్ఛాదింపబడి సంకుచితమై యున్నది. పరమాత్మ రూపం అప్రాకృతమైనది. అపరిమితమైన జ్ఞానానందాది గుణాలు పరమాత్మను అంటిపెట్టుకొని విడువకుండా ఉన్నాయి. పైగా ఆ గుణాలు దోషగంధ లేశమైనా లేనివి. కాబట్టి పరమాత్మ హేయగుణ ప్రతిభటుడు. సత్య జ్ఞానానందానంతామలత్వ గుణాలు పరమాత్మ స్వరూప నిరూపకాలు అని ఇంతకుముందే చెప్పబడింది కదా!

'భగవత్స్వరూపం' అంటే– దివ్యాత్మ స్వరూపం, స్వభావం, జ్ఞానత్వం, అనంతత్వం, ఆనందత్వం మొదలైనవి ఆయన స్వరూపాన్ని నిర్ణయిస్తాయి.

'భగవంతుని రూపం' అంటే– దివ్య అవయవ సౌష్ఠవం కలిగిన సుందర విగ్రహం. మూర్తి, శరీరం అని అర్థం. 'వ్యక్తి' అనదగినది.

దివ్యాత్మ స్వరూపం 'శుద్ధేన మనసాఽగ్రాహ్యం' పరిశుద్ధమైన మనస్సు చేత అనుభవింపదగినదని కొద్ది భేదముంది. దివ్యరూపం ఇంద్రియ గోచరమైనది. కంటికి కనబడేది అని భావం. లోకమందు ఆనందమయ వస్తువులెన్ని ఉన్నాయో, వాటికంటెను విలక్షణమైన, సుఖమయమైన రూపం కలిగిన అర్చామూర్తియే కరిగిరి నాథుడు.

'ఉయర్వఱ ఉయర్నలముడైయవన్' అనే నమ్మాళ్వార్ల శ్రీసూక్తికి 'విశ్వాతిశాయి సుఖరూప' అనేది సంస్కృత పదమనవచ్చును.

'శుదరడి తొషుదుఎషు'– తేజోమయమైన పాదాలను ఆశ్రయించి ఉజ్జీవించుము– అన్న మాటలో స్వరూపంవలె సత్యరూపం కూడా అనుభవింప

దగినదే అని సంప్రదాయం. త్వం యదాత్మకః తే వ్యక్తిం తదాత్మికాం కథయంతి– నీ దివ్యాత్మ స్వరూపం వంటిదే నీ దివ్య రూపమని శ్రుతులు చెబుతున్నాయి.

"స్వరూపాత్ స్వామినో రూపము పాదేయతమం విదుః" స్వరూపం కంటె రూపమే మిక్కిలి అనుభవింప యోగ్యమైనదంటారు. ఎందుకంటే "పాతకాన్యాశు నశ్యంతి కింపునస్తూప పాతకమ్"– పాతకాలన్నిటిని నశింపజేయడం వల్లనూ, శుభాశ్రయణమైనందువల్లనూ స్వరూపం కంటె కూడా ఉత్కృష్టమైనది దివ్యమంగళ విగ్రహమనడం గమనీయం.

ఈ శ్లోకమందు విగ్రహానికి స్వరూపం వలె జ్ఞానానందాత్మకత్వం స్థాపింప బడుతున్నది. దివ్యమంగళ విగ్రహం జ్ఞానానందాత్మకమో? జడమో? జ్ఞానానందాత్మకమైతే స్వరూపం కంటె భిన్నమో? అభిన్నమో? భిన్నమన్నట్లైతే మా దేహం వలె జడత్వమనరాదా? అభిన్నమే అయితే, భేదాన్ని చెప్పునట్టి ప్రమాణాలకు విరోధమేర్పడుతుంది కదా! ఎట్లా? అంటే–

"*యదాత్మకో భగవాన్ తదాత్మికావ్యక్తిః*"– భగవానుడు ఎట్లు జ్ఞానానందాత్మకుడో, అట్లా ఆయన విగ్రహం కూడా జ్ఞానానందాత్మకమే అని ఏకాయనశాఖ– భగవచ్ఛాస్త్రం– మూలవేదం చెబుతున్నది. కాబట్టి, శ్రుతి ప్రతిపన్నమైన అర్థమందు యుక్తి విరోధం చెప్పకూడదు అనబడింది.

ఋషులు కూడా భగవద్ధ్యాన విషయంలో 'నతస్య ప్రాకృతామూర్తిః' (వరాహ పురాణం. 75–44) భగవద్విగ్రహం ప్రాకృతం కాదు అని భావించారు. 'శుదరడితొషుదు' అని ఆళ్వార్లు స్మరించారు.

భిన్నమో? అభిన్నమో? అనే శంక కలుగుతుందని, దాన్ని పరిహరించ డానికే జ్ఞానానందాత్మకత్వ రూప సాదృశ్యమున్నదని నిర్ణయింప బడుతున్నది.

'యేనాధిరోహతి మతిస్త్వదు పాసకానాం
సాకిం త్వమేవ తవవేతి వితర్కడోలామ్–

ఆ కారణంచేతనే భగవద్ధ్యానం చేసేవారి బుద్ధి భగవంతునికంటె ఆయన రూపం అభిన్నమో? భిన్నమైనదో? అని డోలాయమాన మవుతున్నది. కాబట్టి, చాంచల్యం కలుగకుండా స్వరూపమూ, రూపమూ రెండు జ్ఞానానందాత్మకమైనవే అని సాదృశ్యం నిర్ణయింప బడినదని పరమ తాత్పర్యం.

*"స్థిరధారణాస్త్వాం ధ్యాత్వా సమాధి యుగళేన విలోకయన్తి"*- (శరణాగతి దీపిక. 21).

యోగులు ధ్యాన సమాధి దశలో- స వికల్పక సమాధి, నిర్వికల్పక సమాధి అనే రెండు దశల్లోనూ, భగవానుని సాక్షాత్కారాన్ని అనుభవిస్తారు.

'సవికల్పక సమాధి' అంటే భగవన్మూర్తిని మనస్సులో సాక్షాత్కరించేంత వరకు నిరంతరం ధ్యానం చేసే యోగం. దివ్యమంగళ విగ్రహం ఈ దశలో సాలంబనం- ఆధారం గా ధ్యానింపబడుతుంది. 'నిర్వికల్ప సమాధి' అంటే, ఎడతెగకుండా ధ్యానం చేయగా చేయగా భగవానుని దివ్యాత్మ స్వరూపం హృదయంలో సాక్షాత్కరించి స్థిరంగా నిల్చియుండే యోగం.

మొదట సౌలభ్యాన్ని తర్వాత పరత్వాన్ని సాక్షాత్తుగా దర్శించే యోగులు శ్రీ వైకుంఠనాథుడే శ్రీహస్తిశైలేశుడని అట్టి సాక్షాత్కారం 'అపర్యాప్తామృతం' అని భావిస్తారు. కాబట్టి, యోగులకు భగవద్దివ్యస్వరూప, రూపాలు అనే రెండింటి యందు సమాన ప్రతిపత్తియే ఉంటుంది.

*18. మోహాన్ధకార వినివర్తన జాగరూకే*
*దోషా దివాఽపి నిరవగ్రహ మేధమానే।*
*త్వత్తేజసి ద్విరదశైలపతే విమృష్టే*
*శ్లాఘ్యేత సంతమస పర్వ సహస్ర భానోః॥*

**అర్థం:** హే ద్విరద శైలపతే!= హస్తిగిరినాథా!; మోహ+అంధకార వినివర్తన జాగరూకే= మోహమనే చీకటిని పూర్తిగా పోగొట్టడమందు మిక్కిలి సామర్థ్యం కలిగినట్టి;

దోషా= రాత్రి; దివా, అపి= పగలు కూడా; నిరవగ్రహం= అడ్డులేకుండా; ఏధమానే= వృద్ధి బొందుతున్నట్టి; త్వత్+తేజసి= నీ తేజస్సు; విమృష్టే, (సతి)= విమర్శింప బడుతున్నప్పుడు; సహస్ర భానోః= వేయి కిరణాలు గల సూర్యునికి; సంతమస పర్వ= గాడాంధకార స్థానమందు ఉంచడం; శ్లాఘ్యేత= కొనియాడబడదగినది.

**తా॥** ఓ కరిశైలాధిపతీ! మోహం అనబడే చీకటిని నిశ్శేషంగా పోగొట్టే సామర్థ్యం కల్గినట్టి, రేయింబవలు ప్రతిబంధకం లేకుండా వృద్ధిని జెందుతున్న నీ తేజస్సు బాగా నిరూపింపబడుతుండగా, సహస్ర కిరణుడైన సూర్యునికి అమావాస్య రాత్రియందలి కటిక చీకటియే శ్లాఘింపదగినది.

**వ్యాఖ్య:–** సూర్యమండలంలోనూ, ఇంక కొన్నిటిలోనూ ప్రకాశించే భగవానుణ్ణి దివ్యతేజో నిధిగా స్తుతిస్తున్న శ్లోకం.

"తస్మిన్ దృష్టే పరావరే"– పరావరతత్వాన్ని దర్శించగనే సర్వసంశయాలు తొలగిపోతాయి అని ఉపనిషత్తు బోధిస్తున్నది. భగవానుణ్ణి దర్శన సమానాకారంగా సాక్షాత్కారాన్ని పొందే ఉపాసకుల బుద్ధి సంశయగ్రస్తమవుతున్నది– వితర్కడోలను అధిరోహిస్తున్నది– ఊయెల ఆట ఆడుతున్నది అని చెప్పబడింది.

'దేహమే ఆత్మ' యనే భ్రమ, 'నేను స్వతంత్రుడను' అనే భ్రమ కలగడం నాస్తికత అనబడుతుంది. ఇది వేదశాస్త్ర జ్ఞానంలేని వారికి కలిగిన 'మోహం' అన్న మాట. అజ్ఞానమని అర్థం.

భగవద్దివ్యమంగళ విగ్రహం మనవలె ప్రాకృతమైనదికాదు. అంటే, మనదేహం జడమైనది. దీనిలోనున్న జీవాత్మ జ్ఞానానందామలమైనది. దేహం– ప్రకృతిచేత ఆచ్ఛాదింపబడినందువల్ల జీవుని జ్ఞానాదులు సంకుచింపబడి యున్నాయి.

ప్రాకృత శరీరమందు జీవాత్మ బద్ధమైయున్నది. తత్ఫలితంగా, మన శరీరం వేరు, జీవాత్మవేరని నిర్ణయం. అప్రాకృతమైనందువల్ల, భగవద్దివ్యమంగళ

విగ్రహమందే సత్యజ్ఞానానంతానందామలత్వం కలిగిన దివ్యాత్మ స్వరూపత్వం కలదని గత శ్లోకంలో చెప్పబడింది.

ఈ శ్లోకమందు పరవాసుదేవాది విగ్రహానికి నిరతిశయదీప్తి యోగం చెప్పబడింది.

స్వరూపమూ, విగ్రహమూ రెండు ఒకే ఆనందం, ఒకే ప్రకాశం కలిగియున్నాయి. రెండు దీపాలు ఒకే సమయాన వెలుగుతుంటే ఆ వెలుగులు విడదీయరానివైనందువల్ల, వాటి భేదం తెలియదు.

"ముడిచ్చోదియాయ్ ఉనదుముగచ్చోది మలర్న్దదువో"- (తి.వాయె. 3-1-1) ఓ తిరుమాలే- శ్రియఃపతీ! నీ ముఖతేజస్సు ముఖమందే అణగియుండక పైకి లేచి కిరీట కాంతిరూపంగా వ్యాపించిందో అని నమ్మాళ్వార్లు ఆశ్చర్యపడినారు కదా! అలాగా, భగవత్స్వరూప రూప ప్రకాశ భేదాన్ని తీర్మానింపశక్యం కాదు. సూర్యుని సంతమసావస్థను తెల్పే సంబోధన ఈ శ్లోకమందున్నది.

ద్విరదశైలపతే- కరిశైల ప్రభూ! అని సంబోధన, ఇది కరుల- ఏనుగుల శరీరకాంతి నల్లని దవడంచేత, సూర్యుణ్ణి కూడా మాసిపోవునట్లు- మరుగుపరుచునట్లు చేసే తేజస్సు కలవాడని సూచిస్తున్న పదమిది. వరదుడు నీలమేఘశ్యాముడే కదా! ఆయన తేజస్సు ముందు అన్ని నిస్తేజమవడం సాధారణమే.

మోహాన్ధకార వినివర్తన జాగరూకే-

'నివర్తన'మంటే తొలగించడం, 'వినివర్తనం' అంటే సమూలంగా తొలగించడమని అర్థం. మోహం అనేదే కటిక చీకటి. సూర్యుడు బయటనున్న చీకటిని పోగొట్టునే కాని హృదయంలోని మోహాన్ని- గుహలలోని చీకటిని- తొలగించలేదు కదా!

ఒకప్పుడు క్షీరసాగరశాయియైన సర్వేశ్వరుడు యోగనిద్రలో ఉన్నప్పటికీ, ఆయన దివ్య తేజస్సు సర్వకాల సర్వావస్థలయందు వీడిపోకుండా, అధికంగా ప్రకాశిస్తూనే యుంటుంది. ఆ దివ్యమంగళ విగ్రహ సౌందర్యమెట్లో, అట్లే దివ్య తేజస్సు కూడా నిరతిశయమైనదే కాబట్టి ఆశ్రితుల హృదయంలోని మోహాంధకారాన్ని సంపూర్ణంగా తొలగించడంలో సమర్థమైనది భగవద్విగ్రహ తేజస్సు. ఉజ్జ్వలంగా ప్రకాశించే దివ్యమైన, శుభాశ్రయమైన భగవద్రూపాన్ని దర్శించే భాగ్యం కలుగుతున్నదనుకొంటుండగానే భక్తుల మనస్సులోని అంధకారం పాపరాశి తనంత తానే భయపడుతూ ప్రిదిలి పోతుంది. ఇంత జాగృతి దివ్యమూర్తియందున్నదన్న మాట ఇది.

దోషా, దివాஉపి- "దోషాచ నక్తంచ రజనా వితి"- "దివాஉహ్నేతి" 'దోషా' అనే పదం అవ్యయం. 'రాత్రియందు' అనే అర్థమందు అనువర్తిస్తుంది. 'దివా' అనే అవ్యయం 'పగటి యందు' అనువర్తిస్తుంది. ఉభయత్ర అమర నిఘంటువు. ఈ మాటతో, సంసారముక్తి కాలాలు కూడా సూచింప బడుతున్నాయి.

రాత్రిపూట లోకం నిద్రిస్తుంది. పగలు చైతన్యంతో వ్యవహరిస్తుంది. దీప ప్రకాశం చీకటి రాత్రి-యందే బాగా ఉంటుంది. 'సూర్యుడు తన తేజస్సును రాత్రిపూట అగ్నియందు నిక్షేపిస్తాడు' అని శ్రుతి పల్కుతుంది. దీప ప్రకాశాన్ని పోలియున్న తేజస్సు రాత్రి యందే కాక పగటియందు కూడా బాగా ప్రకాశిస్తుందని ప్రదర్శించడానికే 'దివాஉపి' అని ప్రయోగింపబడింది.

శ్రియఃపతి యొక్క చిత్తమేదీపకళిక. వృద్ధిలోనే ఉంటుంది. దివ్య తేజస్సు రేయింబవలు ఒకే రీతిగా ప్రకాశిస్తుందనడం వల్ల, రాత్రి ప్రకాశించక పగలు ప్రకాశించే సూర్యుడు రాత్రి స్థానీయుడుగానే భావింపబడుతున్నాడు.

"సకృద్దివా భవతి"- పరమపదం ఒకే పగలుగా ఉంటుంది. అక్కడ పగలే తప్ప రాత్రి- చీకటి- అనేది వ్యవహరింపబడదనే అర్థం కలది ఈ శ్రుతివాక్యం. పరమపద జ్ఞాన ప్రభావమిట్టిది కదా!

దివ్యమంగళ విగ్రహ తేజస్సుకు అస్తమయం, ఉదయం రెండూ ఉండవు. "నాస్తమేతా న చోదేతా"- అన్నది వేదవాణి.

నిరవగ్రహం- ప్రతిబంధకం లేనిది తేజస్సు అని అర్థం. అవగ్రహమంటే, గ్రహవిరోధంచేత ఏర్పడే వర్ష ప్రతిబంధకం, అనావృష్టి-కరువు అని అర్థం. సూర్యుడు ప్రకాశిస్తున్న కాలాన మేఘాలు ఆకసమందు ఆవరించి ప్రకాశానికి ప్రతిబంధకమై, చీకటిని ఆవరింపజేస్తాయి.

కరిగిరియందు నల్లని, చల్లని వరదుడు కాలమేఘంగా ప్రకాశిస్తున్నప్పుడు ఇక అవగ్రహం-అనావృష్టి ఎక్కడుంటుంది?

రాహుకేతుగ్రహోపరాగాలచేత- గ్రహణాలచేత సూర్యుని ప్రకాశం అచ్ఛాదింపబడుతుంది. అట్లే, చంద్రప్రకాశమూ ఛాయాగ్రహాలచే ఆవరింపబడి లోకాన్ని చీకటిగా చేయడం మనకు కనబడుతున్న విషయమే కదా? దివ్యమంగళ విగ్రహ తేజస్సు ఎట్టి ఛాయ- గ్రహణం- ప్రతిబంధకం లేకుండా ఎల్లప్పుడు ఒకే విధంగా ప్రకాశిస్తూ ఉంటుంది. జ్యోతిస్సులకు జ్యోతిస్సు అది. "తమసః పరం" పెంజీకటి కవ్వలిది పరంధామ మని వ్యవహృతం.

"జ్యోతిషాం జ్యోతిః" (బృహ.) "పరంజ్యోతి రుపసంపద్య"- (ఛాం) అని ఉపనిషత్తులు బోధిస్తున్నాయి. "జ్యోతిర్దర్శనాత్" (బ్ర.సూ. 1-3-4) 'పరంజ్యోతి' యని శ్రీభాష్యం సిద్ధాంత పరచింది.

ఏధమానే- ఇతర తేజస్సులన్నిటిని స్పర్ధతో ఎదిరిస్తూ వృద్ధిని పొందుతూ ఉండడం తప్ప, దివ్య తేజస్సుకు హ్రాసం- తరుగడం- ఎప్పుడూ ఉండదని నిర్ధారణ.

త్వత్తేజసి విమృష్టేసతి సహస్ర భానోః సంతమస పర్వశ్లాఘ్యేత-

అంధకారాన్ని తొలగించడం, పగలు ప్రకాశించడం సూర్యుని తేజస్సుకు, భగవద్దివ్య తేజస్సుకు సాధారణమే అని ఏదో విధంగా సామ్యాన్ని చెప్పినప్పటికీ,

భగవద్దివ్యతేజస్సు యొక్క, సహస్రభానుని తేజస్సు యొక్క స్వభావాన్ని పర్యాలోచించగా, దివ్యతేజస్సు నిరతిశయమైనదని, సహస్ర భానుని తేజస్సు చాలా స్వల్పమైనదనియే తోచుతుంది.

'సహస్రభాను' శబ్దం వల్ల వేయి కిరణాలు గల సూర్యుడని అర్థం. 'భానుః ' అంటేనే సూర్యుడని అర్థం కదా! 'ఆనందవల్లి' ఆనందాన్ని వందలను వందతో గుణించి – 'తేయే శతం, తేయేశతం' అంటూ, బ్రహ్మానందం అద్వితీయమని తేల్చి చెప్పింది. అట్లే వేల సంఖ్యను వేయితో గుణిస్తే – సహస్ర గుణితోత్తర క్రమంగా– 'సహస్ర భానుడు' అంటే, కోటి సూర్యులతో సమానమైన తేజస్సు కలవాడు నారాయణుడని అర్థం.

భగవద్దివ్యమంగళ విగ్రహ తేజస్సు సమస్త తేజస్సులను కప్పివేస్తుంది. కాబట్టి, దివ్యతేజస్సు ముందు సహస్ర భానుడైన సూర్యుని ప్రకాశం రాత్రి– చీకటిలో ఆకసాన ప్రకాశించే 'ఖద్యోతం'– మిణుగురు పురుగు వెలుతురు వలెనే ఉంటుంది.

*"ఏకీకృతద్యుమణిబింబ సహస్ర దీప్తిః"*– (దేవనాయక పంచాశత్ స్తోత్రం) అని దేశికుల సూక్తి. వేల సూర్యమండలాల తేజస్సుతో సమంగా భాసించేది భగవద్దివ్య విగ్రహతేజస్సు. భగవత్సన్నిధిలో సూర్యుని తేజస్సు సంతమసం– గాఢాంధకారంగానే ఉంటుంది.

దుస్సహమైన ప్రతాపంగల సూర్యుణ్ణి 'సంతమస పర్వ'– అమావాస్యనాడు కటిక చీకటిగా ఉంచడమనే మాటచే పరాభవించడమే అవుతుంది కదా! అయితే 'శ్లాఘ్యేత'– శ్లాఘా విషయమంటారేమిటి? అంటే– సూర్యుడు, చంద్రాగ్ని నక్షత్రాల కంటె అధికంగా ప్రకాశించే వాడైనప్పటికీ, తేజస్సులన్నిటికి శేషి– కారణతేజస్సు అయిన భగవంతుని దివ్య తేజస్సును స్వీకరించి ప్రకాశించే సూర్యునికి– శేషభూతునికి కీర్తి ఆధిక్యమే చెప్పబడింది.

"యస్యాదిత్యో భాముపయుజ్య భాతి"- సూర్యుడు భగవంతుని తేజస్సును గ్రహించి ప్రకాశిస్తున్నాడు అనే శ్రుత్యర్థం వల్ల శ్లాఘా విషయమే అవుతుందని సారార్థం.

భగవానుడు స్వయం ప్రకాశమానుడు. అతని నిరతిశయ ప్రకాశానికి కారణమేదీ లేదు. తానే తేజః కారణభూతుడు.

*"న తత్ర సూర్యోభాతి న చంద్ర తారకం*
*నే మా విద్యుతో భాంతి కుతోఽయ మగ్నిః।*
*తమేవ భాన్త మనుభాతి సర్వం*
*తస్య భాసా సర్వమిదం విభాతి॥" (కఠోపనిషత్. 5-15)*

పరమాత్మ సన్నిధిలో సూర్యుడు ప్రకాశింపడు. చంద్రుడుగానీ, నక్షత్రాలుగానీ ప్రకాశింపవు. విద్యుత్తులు- మెరుపులు మెరువవు. ఇక అగ్ని విషయం చెప్పవలసిందేముంది? ప్రకాశించేవానిని అనుసరించి అంత ప్రకాశిస్తున్నది. పరంధాముని చేతనే ఈ లోకమంతా ప్రకాశిస్తున్నదని మంత్రార్థం. (ఈ మంత్రం ముండకోపనిషత్తులోనూ ఉంది).

*"య దాదిత్యగతం తేజో జగద్భాసయతేఽ ఖిలమ్।*
*యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్॥"*

(భ.గీత. 15-12) సమస్త జగత్తును ప్రకాశింపజేస్తున్న సూర్యుని యందలి తేజస్సు, చంద్రాగ్నుల తేజస్సు నేనిచ్చినదే, నాదే యని తెలుసుకొమ్ము అని శ్రీకృష్ణ భగవానుని శ్రీసూక్తి.

అచిద్వస్తువుల పరిణామమైన సూర్యాదుల కాంతి భగవంతుని అధీనమైనదే అని ప్రపంచింపబడింది. వసంత తిలక.

*19. రూఢస్య చిన్మయతయా హృదయే కరీశ!*
*స్తంబానుకారి పరిణామ విశేష భాజః।*
*స్థానేషు జాగ్రతి చతుర్ ష్వపి సత్త్వ వన్తః*
*శాఖా విభాగ చతురే తవ చాతురాత్మ్యే॥*

**అర్థం:** హే కరీశ!= ఓ హస్తిశైలేశా!; హృదయే= మనస్సునందు; చిన్మయ తయా= జ్ఞాన పూర్ణమైనదవడం చేత; రూఢస్య= మొలచినట్టి; స్తమ్బ+అనుకారి, పరిణామ విశేషభాజః= స్తంబ= గంట్ల గడ్డి మొక్కను అనుకరించిన పరిణతి భేదాన్ని పొందినట్టి; చతుర్ష= నాలుగైన; స్థానేషు, అపి= స్థలాలయందు కూడా; శాఖా విభాగ చతురే= శాఖలయొక్క విభజించడమందు, సమర్థమైన; తవ= నీ యొక్క; చాతురాత్మ్యే= నాలుగు మూర్తులయందు; సత్వవంతః= శుద్ధ సత్త్వగుణం గల ఉపాసకులు; జాగ్రతి= అవహిత చిత్తులై యుంటారు.

**తా॥** ఓ కరిగిరినాథా! ఉపాసకుల హృదయగుహలో జ్ఞానమయమై దృఢంగా మొలచిన స్తంబం (గంట్లతో-గుచ్ఛంగా ఉండే) అనే గడ్డి పరకను అనుకరించిన విశాఖ యూపం అనే నీ రూపాన్ని పొంది యున్నావు. ఆ స్తంబానికి నాలుగు కొమ్మలు నాలుగు స్థానాలలో ఉన్నాయి. నీ యిచ్ఛాసామర్థ్యం చేత నాలుగు శాఖలుగా విభజించుకొని, నాలుగు రూపాలుగా వెలసియున్న నీ దివ్యమంగళ విగ్రహాన్ని ఆలంబనం చేసుకొని, సమాధియోగమందు జాగ్రత్స్వప్న సుషుప్తి తురీయావస్థలను పొందుతూ, సత్త్వగుణ శాలురైన ఉపాసకులు సమాహిత చిత్తులై ధ్యానిస్తుంటారు.

**వ్యాఖ్య:-** పాంచరాత్రమనే ఆగమశాస్త్రమందు ప్రసిద్ధమైన విశాఖయూపం అనే భగవద్రూపాన్ని నిరూపిస్తున్న శ్లోకమిది.

జ్ఞానానందాదులు కలిగినట్టి దివ్యాత్మ స్వరూపమూ, దివ్యమంగళ విగ్రహమూ రెండు వేరేనా? ఒకటేనా? అని ఒకచోట సంశయం ప్రకటితం. తర్వాత అట్టి మోహాంధకారాన్ని పూర్తిగ తొలగించే కోటి సూర్య సమప్రభ కలది

దివ్యావయవ సౌందర్యం కలిగినట్టి భగవద్రూపమని గతశ్లోకం వివరించింది. ఈ శ్లోకంలో భగవంతుడు ఎన్ని రూపాలు- మూర్తులుగా వెలసి యున్ననూ, అన్నీ చిన్మయాలే- సంపూర్ణంగా జ్ఞానాత్మకమైనవే అని ప్రకటింప బడింది.

*"కుషుమిత్తేవర్ కుషాంగళ్ కైతొషచ్చోది వెళ్ళత్తి నుళ్ళే ఎషువ దోరురువు"* (తి. వా.మొ. 5-5-10) నిత్యసూరులు ముక్తులు సంఘాలుగా చేరి అంజలి ఘటిస్తుంటే జ్యోతి ప్రవాహంగా ప్రకాశించే ఒక విలక్షణ రూపమే పరవాసుదేవ రూపం. ఇదే పరరూపం.

పరవాసుదేవుడు శ్రీవైకుంఠంలో ఉన్న మూలమూర్తి సృష్టి స్థితి లయాలు అనే కార్యాలను సమర్థవంతంగా నిర్వహించడానికి తనను (4) వ్యూహమూర్తులుగా విభజించుకొని ఆవిర్భవించిన విషయాన్ని భగవచ్ఛాస్త్రం విశదీకరించింది. ఇది వ్యూహావతారం. వ్యూహమూర్తులు నాలుగు షాడ్గుణ్య పూర్తి కలవే అయినా, వాసుదేవుడనే వ్యూహ మూర్తినుంచి దీపం నుంచి పుట్టిన ప్రదీపాలవలె, ఆవిర్భవించిన సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ మూర్తులయందు, ఆరు గుణాలలో రెండేసి గుణాలు స్ఫుటంగా ప్రకాశిస్తూ, వారి వారి ప్రత్యేక కార్యాలను నిర్వహించడం వల్ల 'త్రియుగం' అని వ్యవహరింపబడింది. సంకర్షణుడు జ్ఞాన బలాలు అనే గుణాలు కలిగి సంహార కర్తగా వ్యవహరింప బడుతున్నాడు. ప్రద్యుమ్నమూర్తి ఐశ్వర్య వీర్యగుణాలను కలిగి సృష్టిని చేస్తాడు. అనిరుద్ధమూర్తి శక్తి, తేజస్సు అనే గుణాల జంటను కలిగి రక్షణ చేస్తాడు. ఇదే రీతిగా సంకర్షణునికి లోక సంహారం, శాస్త్రప్రవర్తన అనే రెండు కార్యాలు; ప్రద్యుమ్నునికి లోక సృష్టి, ధర్మ ప్రవర్తకత్వం; అనిరుద్ధునికి లోక రక్షణం, తత్త్వజ్ఞాన ప్రదానం; అని ఈ ముగ్గురికి రెండేసి కార్యాలున్నాయి. ఇట్లు షాడ్గుణ్య విభాగమూ చేయబడియున్నది. ఉపాసించే వారికి ముక్తికి సాధనమైనది వ్యూహావతారమని చెప్పబడింది.

'ఉత్పత్త్యసంభవాధికరణ' మందు "విజ్ఞానాది భావేవా తద ప్రతిషేధః"- (బ్ర.సూత్రం). వ్యూహమూర్తుల యందు బ్రహ్మభావం యుక్తమే, కాబట్టి దాన్ని ప్రతిపాదించే పాంచరాత్ర శాస్త్ర ప్రామాణ్యాన్ని నిషేధించడం తగదు- అని సూత్రార్థం. ఇందు-

*"కర్తవ్యత్వేనవై యత్ర చాతురాత్మ్యముపాసతే।*
*క్రమాగతైః స్వసంజ్ఞాభిః బ్రాహ్మణై రాగమంతుతత్॥"*

(పౌష్కర సంహిత) ఆశ్రిత వత్సలుడైన వాసుదేవుడనే పరబ్రహ్మం, ఆశ్రితులు తనను సులభంగా ఆశ్రయించడానికి తన ఇచ్ఛచేత నాలుగు విధాలుగా ఉన్న రూపాలను, క్రమంగా వాటి పేర్లతో కూడా ఉపాసింపవలెను అని ఆగమశాస్త్రం విధించినది.

*"తత్ర జీవమనోఽహంకార తత్త్వానా మధిష్ఠాతారః సంకర్షణ ప్రద్యుమ్నా నిరుద్ధాః"*- జీవతత్త్వానికి సంకర్షణుడు, మనస్తత్త్వానికి ప్రద్యుమ్నుడు, అహంకార తత్త్వానికి అనిరుద్ధుడు అధిష్ఠాన దేవతలు- అన్నారు శ్రీ భాష్యకారులు.

ఇక కమనీయార్థం ఇట్లున్నది-

*"పూజితస్తే జనసాంరాశి రవ్యక్తో మూర్తి వర్జితః।*
*విశాఖయూప ఇత్యుక్తః తత్తత్ జ్ఞానాది బృంహితః॥*
*తస్మిన్ తస్మిన్ పదే తస్మాన్మూర్తి శాఖాచతుష్టయమ్।*
*వాసుదేవాదినా ప్రోక్తమనిరుద్ధాంతిమేన చ॥*
*తత్ర తత్ర పదే చైవ చాతురాత్మ్యం తథా తథా।*
*వూహోద్వ్యూహ సముత్పత్తౌ పదాద్యావత్పదాంతరే॥"*

శ్రీ వైకుంఠం అనే నిత్య విభూతియందు 'విశాఖయూప' మనే పేరు కలిగిన గొప్ప వృక్షాకారంతో వెలసిన రూప మొకటి యున్నది. ఆ రూపానికి క్రింది నుంచి పై భాగం వరకు నాలుగు స్థానాలలో, నాలుగు దిక్కుల నాలుగు

శాఖలు (కొమ్మలు) మొలచియున్నాయి. మొదటి స్థానం వాసుదేవ వ్యూహమూర్తిది. రెండవ స్థానం సంకర్షణ మూర్తిది, మూడవ స్థానం ప్రద్యుమ్న మూర్తిది. చివరి స్థానం అనిరుద్ధమూర్తిది అని పేరు పొందియున్నాయి.

అయితే, నాలుగు స్థానాలలో ఒక్కొక్క స్థానమందు నాలుగువైపుల నాలుగేసి మొలచిన శాఖలలో తూర్పుశాఖయందు వాసుదేవ మూర్తి ఉన్నాడు. దక్షిణ దిక్కు సంకర్షణుడున్నాడు. పడమటి శాఖయందు ప్రద్యుమ్నుడున్నాడు. ఉత్తర దిక్కున అనిరుద్ధుడున్నాడు.

మూలస్థానమందున్న మూర్తి శాఖలు నాలుగు జాగ్రదవస్థ కలవి. పైన రెండవ స్థానమందలి మూర్తిశాఖలు నాలుగు స్వప్నావస్థ కలవి. ఆ పైన మూడవ స్థానంలో ఉన్న మూర్తి శాఖలు నాలుగు సుషుప్తి అవస్థ కలవి. ఊర్ధ్వ స్థానంలోని మూర్తి శాఖలు నాలుగు తురీయావస్థ- మూర్ఛావస్థను కలిగియున్నాయి. ఇట్లు ఒక్కొక్క స్థానం నాలుగు మూర్తులను కలియున్నందువల్ల, నాలుగు స్థానాలలో (4×4= 16) షోడశ మూర్తులను కలియున్న విశాఖయూపం జ్ఞానాది గుణాలతో భాసిస్తున్నది.

విశేషమేమిటి? అంటే- జాగ్రత్, స్వప్నావస్థలుగల మూర్తులకు కరచరణాలుగానీ, ఉపకరణాలుగానీ లేవు. కాని ఇచ్ఛ మరియు సృష్ట్యాది వ్యాపారశాలిత్వం ఉన్నది. సుషుప్తి స్థానమందు తూర్పుదిక్కున ఉన్న వాసుదేవ మూర్తికి కరచరణాదులు లేవు. తదితర దిశలందున్న మూర్తులకు మాత్రం పాణిపాదాదులున్నాయి. తురీయావస్థ గల స్థానమందున్న నలుగురు మూర్తులలో ఏ మూర్తికి కూడా కరచరణాదులు లేనే లేవని శ్రీ సాత్వత శాస్త్రమందు రూపవైలక్షణ్యం ప్రపంచింపబడింది (ఈ శాస్త్రార్థం తెలిసినందువల్ల ఇక శ్లోకార్థం సులభంగా అవగతమవుతుందని నా ఆశయం).

హే కరీశ!- ఓ అత్తిమలైయప్పా! కఠినమైన కొండమీద మొలచి కల్పవృక్షమైన నీవు, నిన్ను ఆశ్రయించి ఉపాసించే వారి యొక్క కడు సున్నితమైన

గుండెలో చేవగల మొక్కగా మొలవక ఉండగలవా? యోగి హృద్ధ్యాన గమ్యుడవైన దేవా! అని అనురణించే సంబోధన ఇది.

రూఢస్య చిన్మయతయా హృదయే స్తంబానుకారి పరిణామ విశేష భాజః

శ్రీ వైకుంఠంలో విశాఖయూప మనేది వృక్షాకారంలో ఉన్నది. అది చిన్మయమే. స్వయంప్రకాశం కలది. భగవద్రూపం సహస్రభాను సమప్రభ కలదని గతశ్లోకం తెలిపింది. రూఢ శబ్దంచేత వృక్షం సూచితం. అంతే కాదు, భగవానుడు స్వయంప్రకాశమానుడు, స్వరూపమూ జ్ఞానానందమయమైనది. విగ్రహమూ జ్ఞానానందమయమైనది. ఆ యూప శాఖలయందున్న షోడశ వ్యూహమూర్తులు జ్ఞానానంద తేజః పూర్ణులు.

జ్ఞానం ఉండే స్థలం హృదయం. మనస్సు నిర్మలంగా ఉండి ఆహ్లాదాన్ని, ఆనందాన్ని కలిగిస్తూ పదహారు కళలతో ప్రకాశించే అవకాశం కలది. అట్టి మనస్సు కలిగియున్న జీవుల దేహాలయందు బ్రహ్మ వర్చస్సు పుంజీభవించి యుంటుంది. యమ, నియ, మాసన, ప్రాణాయామ, ప్రత్యాహార ధారణ, ధ్యాన నిష్ణాతులై, సమాధియోగారూఢులైన వారి హృదయమందు పరమవ్యోమం నుంచి దిగివచ్చిన విశాఖయూపం దృఢంగా నాటుకొంటుంది అని భావం.

విశాఖా నక్షత్రంతో కూడిన పున్నమ కలది వైశాఖ మాసం. భారతదేశ మందు దివ్యదేశాలలో వైశాఖమాసోత్సవం వైభవంగా జరుగుతుంది.

ఇది చాతురాత్మ్యోపాసన విధానం.

"వృక్ష ఇవస్తబ్ధో దివితిష్ఠత్యేకః తేనైవ పూర్ణం పురుషేణ సర్వమ్"- అన్నది ఉపనిషద్వాణి. పరరూపమిది. పరమపదనాథుడు పెద్దచెట్టువంటి ఆకారం కలిగి, ఎటువంటి పరిణతిని జెందక, అంటే మార్పులేకుండా, సదా ఏక రూపంతో భాసిస్తాడు. ఆ పరమపురుషుని చేతనే ప్రపంచమంతా నిండియున్నది అని ఉపనిషద్వాక్యార్థం.

"ఆదియమ్ శోదియురువు"- అవతారాలకు మూలకందం. ఆనందమయమైన జ్యోతిస్స్వరూపమది.

అట్టి పెద్ద చెట్టు రూపంలో ఉన్న యూపం సమాధియోగనిష్ఠుల సూక్ష్మ హృదయంలోకి ప్రవేశించి వేళ్ళూని (సమూలంగా) ఎలా నాటుకొని దృఢంగా ఉంటుంది? అంటే-

'స్తంబం' అంటే కుదురులోనే గంటగా మొలచిన గడ్డిపరక. ఇది ఇంచుమించు ఒక చేతిమూర ఎత్తు ఉంటుంది. యూపస్తంభమే భక్తులు సేవించే భాగ్యం పొందడానికి వారి హృదయంలో స్తంబాన్ని పోలియున్న ఆకారంగా పరిణమించి, మొలచియుంటుంది.

*చతుర్ష్వపిస్థానేషు శాఖావిభాగ చతురే తవచాతురాత్మ్యే*- ఈ స్తంబమందు నాలుగు స్థానాలలో నాలుగు దిక్కుల తూర్పు వాసుదేవుడు, దక్షిణాన సంకర్షణుడు, పడమర ప్రద్యుమ్నుడు, ఉత్తర దిశకు అనిరుద్ధుడు అనే నలుగురు వ్యూహమూర్తులు వెలసిన నాల్గేసి శాఖలు విభక్తమై యున్నాయి. (4×4= 16) షోడశమూర్తులు భాసిస్తున్నాయి. చతుః స్థానాలలో చతుర్దిశలయందు చాతుర్విధ్యంగా- జాగ్రత్స్వప్న సుషుప్తి తురీయావస్థలతో వెలసిన చాతురాత్మ్యం కరిగిరీశుని దివ్యమంగళ రూపమే అని భావం.




'చాతురాత్మ్యం' అంటే నాలుగు ఆత్మలు - దివ్య శరీరాలు కలిగియున్నది ఒక్క వరదుని దివ్యమంగళ విగ్రహమని సారార్థం. ఈ చతురత- సామర్థ్యం వాత్సల్య గుణ సముద్రుడైన వరదునికే తగియున్నది.

చాతురాత్మ్యే సత్త్వవంతః జాగ్రతి-

యోగుల హృదయాలవాలంలో దృఢంగా మొలిచిన స్తంబాకారంగా పరిణమించిన నాలుగు స్థానాలలోనూ చాతురాత్మ్యం- నాలుగు రూపాలుగా వెలసి యున్నవి వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ వ్యూహమూర్తులే.

సమాధియోగంలోని స్తంబమందలి నాలుగు స్థానాలలో, ఒక్కొక్కచోట ఉన్న వాసుదేవాది చతుర్మూర్తులను ఆరోహ క్రమంగా ధ్యానం చేస్తారు. ఇందు మొదటి స్థానమందు జాగ్రదవస్థను పొంది ధ్యానిస్తారు. జాగ్రదవస్థలో అంతరింద్రియ బహిరింద్రియాలు బహిర్వ్యాప్తిని పొందుతాయి.

తర్వాత రెండవ స్థానమందు స్వప్నావస్థను పొంది ధ్యానిస్తారు. స్వప్నావస్థలో బహిరింద్రియాలు పనిచేయవు. మనస్సు మాత్రమే పనిచేస్తుంది. ఆ పిమ్మట ఉపాసన పరిపక్వమై మూడవ స్థానమందున్న వాసుదేవాది చతుర్మూర్తులను సుషుప్తి అనే అవస్థను పొంది ధ్యానం చేస్తారు.

సుషుప్తి అవస్థలో లోపలి, వెలుపలి ఇంద్రియాలేవీ పనిచేయవు. సాత్త్వికుల ఉపాసన అత్యంతం పరిపక్వమైనందువల్ల నాల్గవ స్థానమందున్న వాసుదేవాది వ్యూహమూర్తులను తురీయమనే మూర్ఛావస్థను పొందినవారై ధ్యానంలో మగ్నమవుతారు. మూర్ఛావస్థలో ఏ ఇంద్రియ వ్యాపారముండదు. కేవలం ఉచ్ఛ్వాస నిశ్వాసలు మాత్రముంటాయి. ఈ విషయాన్నే శ్రీ పరాశరభట్టరు శ్రీరంగరాజస్తవంలో అనుసంధానం చేశారు.

*"జాగ్రత్స్వప్నాత్యలస తురీయ ప్రాయ ధ్యాతృక్రమ వదుపాస్యః।*
*స్వామిన్! తత్తత్సహ పరిబర్హ శ్చాతుర్వ్యూహం వహసి చతుర్ధా॥"*

(ఉత్తర శతకం-40)

ఇట్లు సాక్షాత్తుగా ముక్తి సాధనమైన భగవచ్ఛాస్త్రమందు చెప్పబడిన విద్యను అధికరించిన అధికారులలో కొందరు తమ అధికారానుగుణ్యంగా అనేక మూర్తిమయమైన విశాఖయూపాఖ్య భగవద్రూపాన్ని సావహిత చిత్తులై

సమస్తోపాసనమూ, వ్యస్తోపాసనమూ చేస్తుంటారనీ, దేశికులు 'వరదా! ఇదంతా నీ చాతుర్యమే' అని ప్రస్తుతించారు. వసంత తిలక.

20. నాగాచలేశ నిఖిలోపనిషన్మనీషా
మంజూషికా మరకతం పరిచిన్వతాం త్వామ్।
తన్వీ హృదిస్ఫురతి కాఽపి శిఖామునీనాం
సౌదామనీవ నిభృతా నవమేఘ గర్భా॥

**అర్థం:** హే నాగ+అచల+ఈశ= ఓ కరిగిరి ప్రభూ!; నిఖిల+ఉపనిషత్+మనీషా మంజూషికా మరకతం= సమస్త ఉపనిషత్తుల ఆశయమనే పేటికకు మరకత మణియైన; త్వాం= నిన్ను; పరిచిన్వతాం= బాగా ధ్యానించే; మునీనాం= యోగుల యొక్క; హృది= ఎదలో; తన్వీ= సూక్ష్మమైన; కా, అపి= ఒక విలక్షణమైన; శిఖా= (అగ్ని) జ్వాల అనే; నిభృతా= నిశ్చలమైన; నవమేఘ గర్భా= కొత్త మేఘం తన గర్భమందు కలిగియున్న; సౌదామనీ, ఇవ= మెరుపువలె; స్ఫురతి= ప్రకాశిస్తున్నది.

**తా॥** ఓ నాగాచలేశా! ఉపనిషత్తులన్నిటియొక్క తాత్పర్య విషయమనే మంజూషికకు ఒక మరకతమణి (పచ్చరాయి)గా ఉన్న నిన్ను గొప్పగా ఉపాసించే మునుల హృదయమందు సూక్ష్మమైన, అనిర్వచనీయమైన అగ్ని జ్వాల, చలించకుండా నూతన మేఘం తన మధ్యనున్న మెరుపు తీగలాగా ప్రకాశిస్తుంది.

**వ్యాఖ్య:-** భగవానుని అంతర్యామి రూపం వర్ణితం.

మునుల హృదయంలో భగవద్దివ్యమంగళ విగ్రహం పచ్చని స్తంబాకారంగా వెలసి, చాతురాత్మ్యోపాసనకు ఉపకరించే వ్యూహరూపమని ఇతః పూర్వం సుశ్లోకితం. ఈ శ్లోకం భగవానుడు యోగుల యెదలో అగ్ని జ్వాలగా వెలుగుతూ, అంతర్యామియై ఉపాసింపబడుతున్న రూపాన్ని వర్ణిస్తున్నది.

నాగాచలేశ- ఇది సాభిప్రాయ సంబోధన. హస్తిగిరి మీద స్థావరంగా ప్రతిష్ఠింపబడిన నీవు, మననశీలురైన మునుల యొక్క నిశ్చలమైన మనస్సులోనూ

నాగాచలం లాగా, అచంచలమైన జ్వాలా రూపంలో వెలసి, అంతర్యామివై యున్న ఓ వరదరాజా! అని అర్థం.

అంతర్యామి (రూపమైన) విగ్రహ విశిష్టమైన ఉపాసనకు అనురూపమైన సంబోధన ఇది.

*నిఖిలోపనిషన్మనీషా మంజూషికా మరకతం-*

మరకతమణి ఒక పచ్చ(రాయి) ని రత్నం. రత్నం పెట్టెలో భద్రపరచబడి యుంటుంది. అందరికి కనబడకుండా యుంటుంది. ఉపనిషత్తులన్నీ భగవత్స్వరూప రూపవైభవాన్నే ప్రకటిస్తుంటాయి. ఛాందోగ్యాద్యుపనిషత్తుల హృదయ పేటికలోని మరకత మణిలాగా, శ్యామలవర్ణంతో కూడిన విగ్రహుడు భగవానుడని వర్ణింపబడినది.

'హిరణ్యనిధి' అని భగవంతుణ్ణి పేర్కొన్నది ఛాందోగ్యోపనిషత్తు- సువర్ణ నిధిపైన సంచరిస్తున్ననూ, దాన్ని జనులు చూడలేకున్నారు, పొందలేక పోతున్నారని హెచ్చరిస్తున్నది (ఛాం.) ఉపనిషత్తు. "వెత్తమానిదియామ్ మదుశూదనై"- (తి.వా.మొ. 6-7-11) అని ఆళ్వార్లు స్తుతించారు. ఈ వాక్యం వహ్నిశిఖలోని నవ మేఘ గర్భయైన సౌదామనీ సామ్యాన్ని కూడా వ్యక్తపరుస్తున్నది.

పచ్చని చెట్టుగానే కాదు, పచ్చని రాయిగానూ వెలుగుతున్న దివ్యమంగళ రూపమది.

*త్వాం పరిచిన్వతాం మునీనాం హృది తన్వీకాఽపి శిఖాస్ఫురతి-*

(నిన్ను) భగవానుణ్ణి బాగా అంతర్యామ్యుపాసనచేసే మునులయొక్క హృదయమందు సూక్ష్మంగానూ, నిర్వచింపరాని విధంగా ఒక అగ్ని జ్వాల ప్రకాశిస్తుంది- అని అర్థం. ఉపాసన చేసే మునులందరి హృదయాల్లో వెలుగుతుందని చెప్పనలవి కాదు, కొందరికి మాత్రమే ఇది అనుభవంలోకి వస్తుందనే అర్థమూ ఉంది. ఉపనిషత్తుల హృదయంలో ప్రకాశించేదేదో, అదే,

వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థులై నిరంతరం మనన శీలురైన యోగుల హృదయ కమలంలోనూ ప్రకాశిస్తుంది.

ఎలా ప్రకాశిస్తుందో 'నారాయణానువాకం' వివరిస్తున్నది.

*"పద్మకోశ ప్రతీకాశం హృదయం చాప్యధోముఖమ్।*
*అధోనిష్ట్యా వితస్త్యాంతే నాభ్యాము పరితిష్ఠతి॥"*

చేతనుల హృదయాంగమందు సూక్ష్మమైన కమలమున్నది. అంటే, కంఠానికి క్రింది భాగానికి, నాభికి పైభాగానికి మధ్యన (వితస్తి–జిట్టెడు) ప్రాదేశిక ప్రమాణమందు క్రిందికి మొగంజేసి యున్న– అధో ముఖమై– తామరమొగ్గ ఆకారంలో హృదయమున్నది. ఆ హృదయ కమలమందు అంతర్యామి పురుషుడైన నారాయణుడు వెలుగుతున్నాడు.

*"అంగుష్ఠ మాత్రః పురుషో మధ్య ఆత్మనితిష్ఠతి"*– (కఠోపనిషత్తు) ఆ హృదయ కమలంలో ఉన్న జీవాత్మ యొక్క నడుమ అంగుష్ఠ మాత్రః– బొటనవ్రేలంత పురుషుడు– అంతర్యామి యైన పరమాత్ముడున్నాడు. ఎలా వెలుగుతున్నాడు?

*"నీ వారశూకవత్ తన్వీ"– (కాఠ పి శిఖా)*
*"తస్య మధ్యేవహ్ని శిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః"*

ఆ హృదయ పుండరీకం నడుమ వరిధాన్యపు గింజముల్లు వలె చాలా చిన్నగా, అగ్నిజ్వాల ఊర్ధ్వంగా ఎగురుతున్న రూపంతో ఉన్నాడు. (ఇదే జ్వాల– జఠరాగ్ని యైన వైశ్వానరుడు అనబడుతున్నాడు. "ప చామ్యన్నం చతుర్విధమ్"– అని భగవద్గీత బోధించిన రీతిగా మనం భుజించిన ఆహారాన్ని జీర్ణింప జేస్తున్నాడు) ఇదొక విలక్షణమైన అగ్నిజ్వాల. అయితే హృదయం మండదా? వేడి యెక్కదా? అనే ప్రశ్న జనిస్తుంది కదా! అందుకే ఈ చివరి మాటయే సమాధానమిస్తుంది.

సౌదామనీవ నిభృతా నవమేఘ గర్భా-

(నవః మేఘః గర్భః యస్యాః సా= నవ మేఘ గర్భా అని బహుబ్రీహి సమాస పదమిది) కొత్త మేఘం గర్భంగా కల చలించని విద్యుల్లత- మెరుపు తీగలా ఉంటుంది అగ్నిజ్వాల.

'మిన్నిన్నిలైయిల" మెరుపుతీగ స్థిరమైనది కాదు కదా! క్షణికమైనది. కాని, ఈ అగ్నిజ్వాల అచంచలమైన, నాగాచలంవలె చలించకుండా (నిభృతా) స్థిరంగా ఉండే సౌదామని- మెరుపువలె ఉంటుంది.

"నీలతోయద మధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా।"

"తస్యాశ్శిఖాయామధ్యే పరమాత్మా వ్యవస్థితః।
పీతా భాస్వత్యణూ పమా"-

ఈ మెరుపు తీగ నడుమ కొత్త మేఘం అంటే- వర్షించడానికి నీరు నిండుగా ఉన్న చల్లని మేఘం- శ్యామల వర్ణంతో ఉంటుంది (పచ్చగా భాసిస్తుంది. వేడిమి ఉండదు).

"సర్వస్య చాహం హృదిసన్నివిష్టః"- "ఈశ్వరః సర్వ భూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి"- (భ.గీత.) చేతనాచేతన వస్తువులన్నిటిలోనూ భగవానుడున్నాడు. అన్నమాట వాస్తవమే. అది పరమాత్మయొక్క నిరుపాధిక లక్షణం. దుష్టుల హృదయాలలోనూ వెలుగుతుంటాడు. "కంటకాగ్ర ఇవస్థితః" భక్తి లేనివారి యెదలలో ముల్లు (ముండ్ల)మీద ఉన్నట్లే ఉంటాడని శాస్త్రం. కాబట్టి, అందరి అనుభవానికి రాని విషయమిది.

"తస్మిన్ యదంతస్తదుపాసితవ్యమ్"- హృదయ కమలమందు అంతర్యామియై యున్న పరబ్రహ్మమే ఉపాస్య దైవం- అని సకలోపనిషదర్థాన్ని బాగా తెలుసుకొన్న ప్రజ్ఞావంతులే యత్నించి నిరంతరం ధ్యానమగ్నులైన

అధికారులకే అట్టి అగ్ని జ్వాల నడుమ భాసించే అంతర్యామి రూపం ప్రత్యక్ష విషయంగానో, ప్రత్యక్ష సమానాకార స్మృతి విషయంగానో స్ఫురిస్తుంది.

శ్రీ భాష్యకారులు 'వేదాంత సంగ్రహం'లో 'వహ్నిశిఖా' అంటే "స్వాదంతర్నిహిత నీలతోయదాభ పరమాత్మ స్వరూపా" అని నిర్వచించారు.

*"లింగభూయస్త్వాధికరణం (101)లో 'లింగ భూయస్త్వాత్ తద్ధి బలీయస్తదపి"*- (3-3-43) అనే బ్రహ్మసూత్రార్థం ఈ విషయాన్ని నిర్ణయించింది.

'లింగం' అంటే చిహ్నమని అర్థం. ఏదైన ఒక విషయాన్ని స్థిరపరచడానికి ప్రకరణం కన్న చిహ్నమే ప్రబల ప్రమాణం. *"శ్రుతి లింగ వాక్య ప్రకరణస్థాన సమాఖ్యానాం సమవాయే పార దౌర్బల్యమర్థ విప్ర కర్షాత్"*- (పూర్వమీమాంస, 3-13-3) అనే సూత్రం చేత శ్రుతి, లింగ, వాక్య, ప్రకరణ, స్థాన, సమాఖ్యలు అనబడే ఆరు ప్రమాణాలలో ఉత్తరోత్తరాల కంటెను పూర్వ పూర్వాలే ప్రబలమైనవని నిర్ణయింప బడినాయి.

పరవిద్యల యందు ఉపాస్య వస్తువుయొక్క స్వరూప విషయాన్ని దృఢ పరచే చిహ్నాలు అనేకంగా ఉన్నాయి. కొన్నిచోట్ల పరవిద్యలలో అక్షరుడని, పరంజ్యోతి యని శివుడని, బ్రహ్మ అని, పరమాత్మయని చెప్పబడినాయి.

*"తస్యాః శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః।*
*సబ్రహ్మ సశివః సేంద్రః సోక్షరః పరమస్స్వరాట్॥"*

అనే శ్రుతి వాక్యం, ఆ జ్వాల నడుమ పరమాత్మయైన నారాయణుడే ఉన్నాడు. అతడే బ్రహ్మ, శివుడు, ఇంద్రుడు, నాశంలేని వాడు, శ్రేష్ఠుడు, స్వయం ప్రకాశుడు, అన్ని విద్యలయందు ఉపాస్యుడతడే యని ప్రకటిస్తున్నది.

కాబట్టి, నారాయణానువాకం సర్వశబ్ద వాచ్యుడు నారాయణుడే అని స్పష్టపరచింది. ఆ నారాయణుడే అస్థూలత్వాదులతో కూడినట్టి ఆనందాది గుణాలుగల పరబ్రహ్మయని సూచించే లింగమవుతున్నదని సిద్ధాంతీకరింపబడింది

(శ్రీభాష్యం). ఈ శ్లోకమందు, అందరి హృదయాలలో భగవానుని సన్నిధానం అవశ్యంగా ఉంటుందని ప్రతిపాదింపబడింది అనడంలో దోషం లేదు.

ఉపమ, రూపక, పరికరాలంకారాలున్న శ్లోకమిది. వసంత తిలక.

21. *ఔదన్వతే మహతి సద్మని భాసమానే*
*శ్లాఘ్యే చ దివ్య సదనే తమసః పర స్మిన్।*
*అంతః కళేబరమిదం సుషిరం సుసూక్ష్మం*
*జాతం కరీశ! కథమాదరణా స్పదంతే॥*

**అర్థం:** హే కరీశ!= ఓ హస్తిశైలనాథా!; ఔదన్వతే= పాలకడలియనే; మహతి= గొప్ప; సద్మని= నివాస స్థానం; తమసః= ప్రకృతి మండలం కంటె; పరస్మిన్= పైన ఉన్న; శ్లాఘ్యే= కొనియాడ దగిన; దివ్య సదనే, చ= దివ్యమంటపం కూడా; భాసమానే (సతి)= ప్రకాశిస్తుండగా; అంతః కళేబరం= శరీరం లోపల ఉండే; సుసూక్ష్మం= మిక్కిలి సూక్ష్మమైన; ఇదం= ఈ; సుషిరం= కుహరం (రంధ్రం); తే= నీకు, కథం= ఎట్లు?; ఆదరణ+ఆస్పదం= ప్రీతికి పాత్రం; జాతం= అయింది? (ఆశ్చర్యమే).

**తా॥** ఓ కరీశా! నీకు పాలకడలి ఒక విశాలమైన వాసస్థానం, ప్రకృతి మండలానికి పైన దూరంగా ఉన్న వైకుంఠమందు స్తుతింపదగిన దివ్య మహామండపం కూడా ఉన్నది. అవి అద్భుతంగా భాసిస్తుండగా, ఈ శరీరం లోపల ఉన్న, సుసూక్ష్మమైన సుషిరం నీ యాదరణకు ఎట్లు పాత్రమయింది? ఇది ఆశ్చర్యమే.

**వ్యాఖ్య:–** అంతర్యామి రూపం కేవలం నిరతిశయ వాత్సల్య మూలకమని సుశ్లోకితం.

యోగాభ్యాసం చేసిన మునివరుల హృదయ మందు భగవానుడు, నీటితో నిండిన మేఘాన్ని తనలో ఇముడ్చుకొన్న మెరుము రూపంగా అంతర్యామియై ప్రకాశిస్తున్నాడని పూర్వ శ్లోకమందు చెప్పబడింది. ఈ శ్లోకం కూడా అంతర్యామి

విషయాన్నే భంగ్యంతరంగా శ్లాఘిస్తున్నది. యోగి వరులలో మాత్రమే అంతర్యామిగా ఉంటాడా? అందరి హృదయాల్లో కూడా ఉంటాడా? సర్వాంతర్యామి కదా! అనే విషయం శాస్త్రమందు చాలా వివరింప బడింది.

'అంతర్యామ్యధికరణం' (1-2-4)లో పృథివ్యాది మహాభూతాలలోనూ ఉన్నాడు. అత్యల్ప వస్తువులలోనూ పరమాత్మ అంతర్యామిగ ఉన్నాడని విశదీకరింప బడియున్నది.

"తత్సృష్ట్వా, తదనుప్రవిశ్య, సచ్చత్యచ్చా భవత్"- (తై.ఉప) పరమాత్మ జగత్తును సృజించి, దానిలో ప్రవేశించి చేతనాచేతన పదార్థాలుగా నయ్యాడు. *"అంతః శరీరే నిహితో గుహాయాం అజ ఏకోనిత్యః"*- (సుబాలోపనిషత్) జన్మరహితుడు, స్వతంత్రుడు, నిత్యుడైన పరమాత్మ అందరి శరీరం లోపల హృదయగుహయందు అంతర్యామియై ఉన్నాడు.

*"య ఆత్మని తిష్ఠన్ య ఆత్మనోఽంతరో యమాత్మాన వేద యస్యాత్మా శరీరం, య ఆత్మాన మంతరో యమయతి సత ఆత్మాఽంతర్యామ్యమృతః"*- (సుబాలోపనిషత్) ఎవడాత్మయందు ఉండి, దానిచే తెల్యబడక, అదే శరీరంగా కలవాడై లోన ఉండి నియమిస్తున్నాడో అతడే జీవుడవైన నీకు అంతర్యామి, అమృత స్వరూపుడు.

*"పరస్యైవ బ్రహ్మణః సర్వాత్మత్వం, సర్వశరీరత్వం, సర్వస్య నియతృత్వంచ ప్రతిపాద్యతే"*- పరబ్రహ్మమే అన్నిటికి అంతరాత్మగా, సర్వం తనకు శరీరంగా, అన్నిటిని నియమించేవాడుగా ప్రతిపాదింప బడుతున్నాడు (శ్రీభాష్యం).

*"పరన్ద తన్బరవైయుళ్ నీర్ దొఱుమ్ పరన్దుళన్*
*పరన్ద వణ్డమిదెన నిలవిశుమ్బొషివఱి*
*కడన్ద శిలిడన్దొఱు మిడన్తిగష్ పొరుదొఱుమ్*
*కరన్దు ఎంగుం పరన్దుళన్" (తి.వా.మొ. 1-1-10)*

పరమాత్మ కారణ జలరూపమైన ఏకార్ణవమందు, సూక్ష్మమైన జలపరమాణువుల యందు, పృథివ్యంతరిక్షాది లోకాంతర్వర్తులై అతిసూక్ష్మంగా ఉండే అచిద్వస్తువులయందును, చిద్వస్తువులయందును, ఒక్కచోటైనను వదలక అతిసూక్ష్మస్వరూపుడై, వ్యాప్యవస్తువులు కూడా తెలుసుకోజాలని రీతిగా మరగియుండి, అంతటా వ్యాపించి యున్నాడు అని నమ్మాళ్వార్ల శ్రీసూక్తి.

*ఔదన్వతే మహతి సద్మని*- లక్ష్మీదేవికి పుట్టినిల్లైన పాలసముద్రం భగవానుని నివాస స్థానమై యున్నది. భగవానునికి శ్వశురగృహం పరమ సుఖంగా ఉన్నది. *"అంభస్య పారే"*- (నా. ఉ) అపారే అంభసి- ఎల్లలు లేని నీటి వైశాల్యం కలది. *"యమంతః సముద్రేకవయోవయన్తి"*- (అంతః=స్థానం) సముద్రమందు నివసించి యున్నందువల్ల బ్రహ్మాది దేవతలు ఆపదలు కలిగినప్పుడు అక్కడకు చేరి ఆర్తితో భగవంతుణ్ణి స్తుతించి పూజించే స్థలమది. కాబట్టి *'మహతి సద్మని'*- పూజనీయమైన గొప్ప భవన మనబడింది. పాలకడలిలో ప్రణతార్తి హరుడై యున్నాడు.

*'ఉదన్వాన్ ఉదధిః సింధుః'* (అమరం). ఉదన్వంతుడు- నీరు కలవాడు సముద్రుడని అర్థం. (ఉదన్వతః ఇదం= ఔదన్వతం) సముద్ర సంబంధమైన (సద్మ) గృహమని అర్థం. ఇది ప్రామాణికంగా ప్రసిద్ధం.

*శ్లాఘ్యేచ దివ్యసదనే తమసః పరస్మిన్*- ప్రకృతిమండలానికి దూరప్రదేశ మందున్న వేయిస్తంభాల మణిమయమంటపమందు నివసించే వాడు పరమ పురుషుడు.

*"దేవానాం పూరయోధ్యా"*- దేవతల పట్టణమైన అయోధ్యయని, 'అపరాజిత' యని పేర్కొనబడింది. *"యత్ర పూర్వే సాధ్యాస్సన్తి దేవాః"*- అక్కడ సాధ్యదేవతలు- నిత్యసూరులు, ముక్తపురుషులు ఉంటారు. *"తద్విప్రాసో విపన్యవో జాగృవాంసః సమింధతే"*- ఆ నిత్యసూరులు, ముక్తాత్మలు సర్వదా (శ్లాఘ్యే)

స్తుతిస్తూ జ్ఞాన, ఆనందమయులై ప్రకాశిస్తుండే పరమపదమని అర్థం. అప్రాకృతమైన దివ్యసదన మది.

*"లోకం వైకుంఠనామానం దివ్యం షాడ్గుణ్య సంయుతమ్।*
*అప్రాకృతం సురైర్వంద్యమ యుతార్క సమప్రభమ్॥"*

(జితంతాస్తోత్రం. 2-18). జ్ఞానశక్తి బలైశ్వర్య వీర్యతేజస్సులనే ఆరుగుణాలతో కూడి అనేక సూర్యుల కాంతులతో సమానమైన కాంతితో ప్రకాశిస్తూ, ప్రకృతి సంబంధం లేశమైనను లేని, దివ్యమైన, వైకుంఠమనే పేరు కలిగిన లోకమని బృందారకులచే స్తుతింపబడుతున్నది.

(భాసమానే దివ్యసదనేచ- పరమాకాశమందలి సూర్యమండల మందు కూడా (చకారం వల్ల) నివసిస్తాడని అర్థం).

భాసమానే సతి- క్షీర సముద్రమూ, పరపదమూ (నీకు) పరమాత్మకు జ్యోతిర్మండలంగా ప్రకాశించే నివాసస్థానాలుగా ఉన్నాయి కదా! ఇవన్నీ భగవంతునికి ఆదరణీయాలే కదా!

*అంతః కళేబరమిదం సుషిరం సుసూక్ష్మం-*

రక్తమాంసాలతో కూడి, దుర్గంధ భూయిష్ఠమైన ఈ ఎముకల గూడు అనే (మా) శరీరం లోపల ఉన్నది ఒక చిన్న రంధ్రం- సుషిరం. "*కుహరం వివరం సుషిరం బిలం*"- (అమరం).

ఇట్టి హేయమైన శరీరంలోని హృదయ కుహరమందు భగవానుడు అంతర్యామి రూపంగా నివసించడం ఆదరణీయమా? భగవానుడు జీవుల హృదయ కుహరమందు, ఎవరికి కనబడకుండా అంతర్యామిగా వెలసి యుండడం ఆయనకు ఎలా ప్రీతిపాత్రమయినదో? ఆశ్చర్యమే కదా!

వాస్తవంగా, దయాంబురాశియైన సర్వేశ్వరుని వాత్సల్యమే కారణం. లేకపోతే, హృదయ గుహయందు ఆదరణకు నిమిత్తమైన గుణమొక్కటి కూడా

లేనప్పుడు ఆచోట ఆ దివ్యరూపం వెలసి యుండడానికి కారణం మరొక్కటి లేనే లేదు కదా! కేవలం ఆయన యొక్క నిరతిశయ వాత్సల్యమే కారణం.

*జాతం కరీశ! కథ మాదరణాస్పదంతే-*

ఓ కరిగిరిప్రభూ! ఈ సుసూక్ష్మమైన సుషిరం, ఎట్లు నీ యాదరణకు స్థానమైనది? అని దేశికులు ఆశ్చర్యాన్ని ప్రకటించారు.

యథార్థంగా జీవుడు శరీరంలో ప్రేశించినప్పుడే దేవుడూ ప్రవేశించాడు. ఆయన రక్షకుడు, జీవుడు రక్షింపదగినవాడు. జీవుడు ఆర్తుడు, భగవానుడు ఆర్తిహరుడు. భగవానుడు నియామకుడు, జీవుడు నియామ్యుడు. మనం భుజించే ఆహారం అంతర్యామికి నివేదనమన్నమాట.

జీవుడూ దేవుడూ ఈ శరీరమందలి హృదయ కమలమందలి సూక్ష్మమైన సుషిరంలో ప్రవేశించారని శ్వేతాశ్వతరోపనిషత్తు తెల్పుతుంది.

"ద్వాసు పర్ణాసయుజా సఖాయా" అనే శ్రుతి ప్రమాణం. ఒకే చెట్టుపైన రెండు పక్షులున్నాయి (జీవుడు, దేవుడు ఈ శరీరమందు ఉన్నారు). జీవుడు ఆ చెట్టు ఫలాన్ని (కర్మఫలం) అనుభవిస్తున్నాడు. దేవుడు (ఫలాన్ని తినకుండా) సాక్షిగా ఉన్నాడని బోధిస్తున్నది.

జ్ఞానముండే స్థలం హృదయం. ఈ హృదయాన్ని ఉపనిషత్తు 'దహర ఆకాశం' అంటుంది. సూక్ష్మమైన బిలం- సుషిరం అని భావం. దహరాకాశ మందున్న అంతర్యామి రూపాన్ని జీవుడు ఉపాసించే యోగ్యుడు. "తస్మిన్యదంతస్తదుపాసితవ్యం" అనే ఉపనిషద్వాణి ఈ భావాన్నే ప్రకటిస్తున్నది.

"*య ఏషోఽంతర్ హృదయ ఆకాశః తస్మిన్ శేతే*"- (బృహ. 4-4-22) ఆ పరమాత్మ హృదయాకాశంలో నివసించియున్నాడు. ఎట్టి జుగుప్సలేకుండా భగవానుడు హృదయమందు అంతర్యామిగా వెలసి యున్నాడంటే అదెంత సౌలభ్యమో! ఎంత సౌశీల్యమో కదా!

*"తిణ్ణమఘున్దక్కట్టి ప్పులశెయ్ వినైవన్కయిత్తాల్*
*పుణ్ణైమఱైయ వరిన్దెన్నై ప్పోరవైత్తాయ్ పురమే" (తి.వా.మొ.5-1-5)*

పాపాలనే దృఢమైన త్రాటిచే మాంసం కనబడకుండా కట్టి చర్మంతో కప్పి సంసారమందు పడవేశాడు భగవానుడు. కర్మానుగుణంగా జీవులను అలా పడవేసిననూ, వారి హృదయమందు నిత్యం అంతర్యామ్యుపాసనకు అనుగుణంగా సన్నిధానుడై యుండడానికి దివ్యమంగళ విగ్రహుడైన భగవానుని అపార వాత్సల్యమే కారణమని ఆచార్యులు అంతర్యామి రూపాన్ని స్తుతించారు. వసంత తిలక.

22 *బాలాకృతేర్వట పలాశమితస్యయస్య*
*బ్రహ్మాండ మండల మభూ దుదరైక దేశే।*
*తస్యైవ త ద్వరద! హన్త! కథం ప్రభూతం*
*వారాహ మాస్థితవతో వపుర ద్భుతం తే॥*

**అర్థం:** హే వరద!= ఓ వరదా!; బాల+ఆకృతేః= బాలునియొక్క ఆకారం వంటి ఆకారం కలిగి యున్నట్టి; వటపలాశ మితస్య= మఱ్ఱి ఆకుమీద ఇమిడియున్నట్టి; యస్య= ఎవని యొక్క; ఉదర+ఏకదేశే= కుక్షియందలి ఒక స్థలమందు; యత్= ఏ; బ్రహ్మాండమండలం= బ్రహ్మాండ సముదాయం; అభూత్= ఉండెనో; తత్= ఆ బ్రహ్మాండ సమూహం; వారాహం= వరాహానికి సంబంధించిన; అద్భుతం= ఆశ్చర్యకరమైన; వపుః= శరీరాన్ని; ఆస్థితవతః= పరిగ్రహించినట్టి; తస్య, ఏవ, తే= బ్రహ్మాండమండలం ఉదరమందు ఒక కోణంలో అణగియున్న నీకు మాత్రమే; కథం= ఎట్లు?; ప్రభూతం= పర్యాప్తమై; అభూత్= ఉన్నది?; హంత= ఆశ్చర్యమే.

**తా॥** ఓ వరదరాజా! బాలుని ఆకృతివంటి ఆకృతిని కలిగి, ప్రళయకాలాన మహార్ణవ మందు ఒక వటపత్రం మీద పవళించిన నీ ఉదరమందలి ఒక భాగాన బ్రహ్మాండమండలం ఇమిడియున్నది. భూదేవిని ఉద్ధరించడానికి అవతరించినప్పుడు అద్భుతమైన వరాహ విగ్రహాన్ని ధరించిన నీకు మాత్రమే ఆ బ్రహ్మాండ మండలం ఎట్లు అణగియున్నది? ఇది ఆశ్చర్యంగా ఉన్నది.

**వ్యాఖ్య:-** పరవ్యూహాంతర్యామ్యవతారాల తర్వాత విభవావతారాన్ని ప్రస్తుతిస్తున్న శ్లోకం.

భగవానుని, వటపత్రశాయిగా ఉన్న బాలక రూపాన్ని, అతిమహత్తరమైన శ్రీ వరాహ రూపాన్ని- అద్భుతమైన పరస్పర చరిత్రలను అనుసంధిస్తూ, అఘటిత ఘటనా సామర్థ్యం ప్రకటింపబడుతున్నది.

*"అత్తా చరాచర గ్రహణాత్"*- (1-2-9) అనే బ్రహ్మసూత్రం స్థావర జంగమ రూపమైన జగత్తు యొక్క ఉపసంహార రూపమైన భోక్తగా తెలియబడే వాడు పరమాత్మయే అని తెల్పిన విషయాన్ని వివరిస్తున్న శ్లోకమిది.

*"సోऽధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్"*- (కఠోపనిషత్. 3-9) సమస్త పదార్థాలు చేరే స్థానం విష్ణువే అని వేదాంత శాస్త్రం తెల్పుతున్నది.

*"పాలనా యేషులగుణ్డు పరివిన్ఱి ఆలిలై యన్నవశమ్ శెయ్యు మణ్ణలార్"* (తి.వా.మొ. 4-2-1) బాలుడై సప్తలోకాలను ఆరగించి, శ్రమలేకుండా వట పత్రమందు అన్నం జీర్ణమయ్యే విధంగా పవళించిన స్వామియందు వ్యామోహ పడినారు నమ్మాళ్వార్లు.

*బాలాకృతేర్వట పలాశ మితస్య యస్య*
*బ్రహ్మాండ మండల మభూత్ ఉదరైక దేశే-*

భగవానుడు ప్రళయ కాలమందు బ్రహ్మాండ సముదాయాన్ని తనలోకి చేర్చుకొని, మహార్ణవమందు మఱ్ఱియాకు మీద తన దివ్యమంగళ విగ్రహం ఇమిడియుండే రీతిగా ఒక చిన్న బాలుని యొక్క రూపం లాంటి రూపాన్ని వేషాన్ని ధరించి యున్నాడు.

*"వటస్య పత్రస్య పుటే శయానం బాలం ముకుందం మనసాస్మరామి"*-

మఱ్ఱి యాకు పైన పవళించిన, మోక్షదాతయైన బాలుణ్ణి మనస్సుతో స్మరిస్తున్నాను- అనే మాట ప్రసిద్ధమే కదా!

సర్వేశ్వరుడు విరాట్ పురుషుడు. వటపత్రంయొక్క పరిమాణం ఎంత చిన్నదో అందరికి తెలిసిందే కదా! ఆ వటపత్రం మీద సర్వేశ్వరుడు చిన్న నిసుగు యొక్క రూపంతో పడుకొని యుండడం అద్భుతమైన విషయం. ఆ బాలుని కుక్షియందు బ్రహ్మాండమండలం నిక్షిప్తమైయున్నది. ఒకటి కాదు రెండు కాదు, అనేక కోటి బ్రహ్మాండాల సముదాయం ఆ బాలుని ఉదరంలో ఒక మూలకు ఒదిగియుంది– అనే మాట మనకే కాదు, బ్రహ్మాది దేవతల ఊహకు కూడా అందని విషయమే కదా!

'*తమద్భుతం బాలక మంబుజేక్షణం*'– అని కేల్మోడ్చి ధ్యానం చేద్దాం.

*"న్యగ్రోధం సుమహాన్తం వై విశాలం పృథివీపతే।*
*శాఖాయాం తస్య వృక్షస్య విస్తీర్ణాయాం నరాధిప॥*
*ఫుల్ల పద్మ విశాలాక్షం బాలం పశ్యామి భారత।*
*యచ్చకించిజ్జగత్ లోకే దృష్టం స్థావర జంగమమ్॥*
*తదపశ్య మహంసర్వం తస్య కుక్షౌ మహాత్మనః"*

*(భారతం, వనపర్వం. -169)*

ఓ మహారాజా! ఒక పెద్ద మట్టిచెట్టుయొక్క విశాలమైన కొమ్మయందు స్థావరజంగమ రూపమైన జగత్తును తన కడుపులోన చేర్చుకొన్న పద్మదళాయ తాక్షుడైన బాలుణ్ణి చూశాను. ఆ బాలుడే మళ్ళీ జగత్తును సృష్టించాడు అని ఒక ముని (మార్కండేయ మహర్షి ఆ బాలముకుందుని గర్భమందున్నప్పుడే తాను అంతా చూశాను అని) చెప్పిన కథ యున్నది.

సర్వేశ్వరుడు బాలకుని రూపంలో ఉండి ఆయన ఉదరంలోని ఒక కోణంలో బ్రహ్మాండ మండలం అణగియుంటే, ఆ బ్రహ్మాండమండలం ఆ బాలుని ఉదరంకంటె పరిమితమో? అపరిమితమో తెల్యకున్నది. అపరిమితమే అయితే, ఆ బాలుని అవయవాలలో ఒక భాగమైన కడుపులో ఒక మూలకు బ్రహ్మాండ మండలం ఒదిగి యుండడం అత్యాశ్చర్యం కాదా? ఇక, పరిమితమే అనుకొంటే,

ఆ బాలుడే శ్రీ వరాహావతారాన్ని ధరించి "జానుదఘ్నే మహోదధౌ" (సం.సూ.) మోకాలుబంటి మహాసముద్రమందు ప్రవేశించి, అఖండ భూమండలాన్ని ఉద్ధరించాడు కదా! ఆ వరాహ (పంది) రూపం అత్యద్భుతమైనది.

*"శతయోజన విస్తీర్ణముచ్ఛ్రితం త్రిగుణం తతః*
*నీలజీమూత సంకాశం మేఘస్తనిత నిస్వనమ్॥*
*ఖుర మధ్యగతో యస్య మేరుః కణకణా యతే॥"*

యజ్ఞవేదికయందు యాగాగ్నిగా అవతరించిన ఈ వరద భగవానుడే యజ్ఞవరాహావతారుడనడం ఉచితమే కదా! ఆ వరాహస్వామి యొక్క శరీరం నూరు యోజనాల విస్తీర్ణం కలిగి, అంతకంటె మూడు రెట్లు అధికంగా ఔన్నత్యం, ఎత్తు- కలది. నీలమేఘం లాంటి వన్నె కలిగి, ఉరుమువలె ఘుర్ ఘుర ధ్వని కలది. విశ్వవిలక్షణ వైపుల్యం, ఆయామం కలిగిన అఖండ మహీమండలం దుంపగడ్డలాగా శోభించే దంష్ట్రాగ్రం (కోరమొన) కలిగి, మహా మేరు పర్వతం (బంగారు కొండ) గిట్టల నడుమ కణకణమని మెరుస్తున్న రూపమే శ్రీ వరాహమూర్తి.

అనంతకోటి గుణాధికమైన శ్రీ వరాహ విగ్రహం అల్పమైన అండమండల మందు చీమల పుట్ట రంధ్రంలో మహాగజంలాగా అణగియుండడం అత్యంతాశ్చర్యం కాదా? ఈ రెండు ఘటనలు ప్రమాణ సిద్ధమైనవే, అయినా విరుద్ధమైన ఘటనలే.

*తస్యైవ తద్వరద హన్త కథం ప్రభూతం*
*వారాహమాస్థితవతో వపురద్భుతంతే-*

బ్రహ్మాండ మండలం బాలరూప మందు ఇమిడియున్న సర్వేశ్వరుడే శ్రీ వరాహమూర్తిగా వెలసినప్పుడు, ఆయన బృహద్రూపం బ్రహ్మాండమండల మందు ఒదిగియుండడం అచింత్యమై, అద్భుతంగా గోచరిస్తున్నది. భగవదవతార మహిమ అవాఙ్మానసగోచరం కదా!

*"విశ్వాన్తర్వర్తి బాలోద రగత మఖిలం కస్య విశ్వాస భూమిః
తస్మాదౌపేంద్ర మీదృగ్భవతు రసవశాదింద్ర జాలం ప్రవృత్తమ్।
మా భూదాశ్చర్య శక్తే రవితథ మిద మిత్యేవ సర్వాప్త సిద్ధేః
వ్యాఘా తస్యోపశాంతి స్తదను గుణదశా భేద యోగాదిభిః స్యాత్॥"*
(తత్త్వముక్తా కలాపం. 3-75)

చాలా చిన్న బాలుడైన వటపత్రశాయి యొక్క ఉదరమందు సర్వ ప్రపంచం విశ్రమించి యున్నదనే మాట ఎవరికీ నమ్మరానిది. ఈ ప్రక్రియ ఇంద్రజాల విద్యవలె కనబడుతున్నది. కాబట్టి, ఇది అచింత్యమైనదే, అద్భుతమైన విషయమే కదా! అవాప్త సమస్త కాముడైన సర్వేశ్వరుని యొక్క అఘటితఘటనా సామర్థ్యమని భావించవలసిందే.

అంగుష్ఠమాత్రుడై అంతర్యామిగా వెలసిన పరమ పురుషుడే (21వ శ్లో.) వటపత్ర పరిమితుడై యున్నాడు.

*"ఇన్రైన్నె ప్పొరుళాక్కి తన్నై యెన్నుళ్ వైత్తాన్
అన్రైన్నె ప్పుఱమ్ పోగప్పుణర్త్త దెన్ శెయ్వాన్" (తి.వా.మొ. 10.8.3)*

శ్రియఃపతి ఇప్పుడు నన్ను స్వీకరించడానికి, ఇంతకాలం స్వీకరించక ఉపేక్షించడానికి కారణమేమిటో స్వామినే నమ్మాళ్వార్లు అడిగి తెలుసుకోదలచారు. శ్రియఃపతి అందుకు సమాధానం చెప్పక, ఇప్పుడు నీకేమి కావాలో చెప్పవయ్యా! అంటే, ఆళ్వార్లు, నీ పాదసేవయే నాకు స్థిరంగా నుండవలెనని ప్రార్థించారు.

*"నల్ గురవుమ్ శెల్వుమ్ నరగుమ్ శువర్క్కముమాయ్"*- (తి.వా.మొ. 6-3) అనే దశకంలో దారిద్ర్యం- సంపత్తు, నరకం-స్వర్గం, పగ-స్నేహం, విషం-అమృతం, కోపం-అనుగ్రహం, ఒకటేమిటి? చెడ్డ వస్తువులూ మంచివస్తువులూ విభూతిగా కలవాడై, ఆ విభూతి ద్వారా అనేక విధాలుగా వ్యాపించి యున్న శ్రియః పతి యొక్క నిర్హేతుక కృపయే అందఱు ఉజ్జీవించడానికి కారణమని నమ్మాళ్వార్లు నమ్మినారు. పరస్పర విరుద్ధ విభూతి కలవాడు సర్వేశ్వరుడు.

కాబట్టి మాయావతారమని, మిథ్యయని, ఇంద్రజాలమని భావించడం తప్పు. శ్రియఃపతి యొక్క స్వాతంత్ర్యమే, కారుణ్యమే (కృపయే) ప్రధాన కారణం. పరస్పర విరుద్ధ ఘటనలైననూ, అవికూడా అఘటిత ఘటనా సమర్థుడైన సర్వేశ్వరుని అచింత్యాద్భుత శక్తిచేతనే నిర్వహింపబడుతున్నవనడమే సత్యమని ఆచార్యుల అధ్యవసాయం. వసంత తిలకా వృత్తం.

23. *భక్త స్య దానవశిశోః పరిపాలనాయ*
*భద్రాం నృసింహ కుహనా మధిజగ్ముషస్తే।*
*స్తం భైక వర్జ మధునాఽపి కరీశ! నూనం*
*త్రైలోక్య మేతదఖిలం నరసింహ గర్భమ్॥*

**అర్థం:** హే కరీశ!= ఓ గజ పర్వతాధిపతీ!; భక్తస్య= భక్తుడైన; దానవ శిశోః = అసుర బాలుని యొక్క (హిరణ్యకశిపుని పుత్రుడైన ప్రహ్లాదుని యొక్క); పరిపాలనాయ= రక్షణకోసం; భద్రాం= మంగళకరమైన; నృసింహకుహనాం= నరుడు, సింహం అనే మాయారూపాన్ని; అధిజగ్ముషః= పొందిన; తే= నీ యొక్క (వ్యాప్తిని పొందియున్న) ; ఏతత్= ఈ; అఖిలం= సమస్తమైన; త్రైలోక్యం= జగత్త్రయం; అధునా, అపి= ఇప్పటికినీ; స్తంభ+ఏక, వర్జం= ఒక్క స్తంభాన్ని మాత్రం విడిచి; నరసింహ గర్భం= నరసింహ స్వామిని ఉదరమందు కలిగియున్నది; నూనం= నిశ్చయం.

**తా॥** ఓ హస్తిగిరీశా! భక్తుడైన రాక్షస బాలుని సంరక్షణార్థం మంగళ కరమైన నరసింహం అనే ఆశ్చర్య రూపాన్ని ధరించి అంతటా వ్యాపించి యున్నావు. అట్టి నీ విగ్రహ వ్యాప్తి చేత నేటికీ- ఎల్లకాలం- మూడు లోకాలలోని ప్రతివస్తువు, ఒక్క స్తంభాన్ని వదలి, నరసింహమూర్తిని తన గర్భమందు కలిగి యున్నది. ఇది నిశ్చయం.

**వ్యాఖ్య:-** ఆశ్చర్యకరమైన నరసింహావతారం వర్ణితం.

వరాహావతారం లాగా తర్వాతదైన నరసింహావతారం కూడా ఆశ్చర్యావహ మైనదని ఉత్ప్రేక్షింపబడినది.

*భక్తస్య దానవ శిశోః పరిపాలనాయ-*

రాక్షస బాలుడు శ్రీహరి భక్తుడు కావడమే ఆశ్చర్యం కదా! హిరణ్యకశిపుడు అనే రాక్షస రాజు తనకన్న గొప్పవాడు వేరొకడెక్కడా లేడనే అహంభావంతో 'హిరణ్యాయనమః' అని జపించవలెను, తననే ధ్యానించవలెనని లోకాన్ని శాసించాడు. హిరణ్యాసురునికి కలిగిన ఐదుగురు పుత్రులలో ఒక్క ప్రహ్లాదుడనే పేరుగల కుమారుడు మాత్రం 'హరయేనమః, నారాయణాయ నమః' అని తాను పుట్టినప్పటినుంచి ఎల్లకాలం ధ్యానించేవాడు. నారాయణ నామస్మరణను అసహ్యించే తండ్రి, తన పేరును తప్ప శ్రీహరి పేరును మనస్సులో కూడా తలచకూడదని కుమారునికి ఎన్నివిధాల బోధించినా, ప్రహ్లాదుని నోట నారాయణ నామమే ఆలపించబడేది. అందువల్ల ఏ రాజు కూడా తన పుత్రుణ్ణి హింసించని విధంగా, హిరణ్యకశిపుడు ప్రహ్లాదుణ్ణి అతిక్రూరంగా హింసించాడు.

అగ్నిజ్వాలల్లో ప్రహ్లాదుణ్ణి పడవేయగా, హరిని స్మరించే ప్రహ్లాదునికి అగ్ని, చందనంవలె చల్లగా ఉండేది. విషాన్ని గొంతులో పోస్తే, అది అమృతంగా ఉండింది. అనేకంగా హింసింపబడుతున్న తన భక్తుణ్ణి శ్రీహరి కాపాడుతుండేవాడు. సాధు పరిత్రాణమే ప్రయోజనంగా కలవాడు శ్రియఃపతి కదా!

'ఎక్కడున్నాడురా? హరి' అని తండ్రి కోపావేశంతో అడిగాడు. తండ్రీ! *'ఇందుగలడందులేడని సందేహము వలదు, చక్రిసర్వోపగతుడు'*- అంతటా వ్యాపించియున్నాడని ప్రహ్లాదుడు సమాధానమిచ్చాడు. ఇట్లు ప్రహ్లాదుడు ప్రతిజ్ఞ చేయగానే శ్రీమన్నారాయణుడు తన భక్తుని మాటను సత్యమని నిరూపించడానికి విశ్వమంతటా ఒక్క వస్తువును విడవకుండా అన్నిటిలో వ్యాపించి యున్నాడు.

*"సత్యం విధాతుం నిజభృత్య భాషితం*
*వ్యాప్తించ భూతేష్వఖిలేషు చాత్మనః।*
*అదృశ్యతా త్యద్భుత రూపముద్వహన్*
*స్తంభే సభా యాం నమృగం నమానుషమ్॥" (భాగవతం)*

తన భక్తులమాటను సత్యం చేయదలచాడు భగవానుడు. ఈ శ్లోకమందు ప్రహ్లాద శబ్దం లేదు. ఆశుతోషులైన- త్వరగా సంతోషాన్ని పొంది యాచించిన వారికి వరాలను ఇచ్చేవారు బ్రహ్మాది దేవతలు కూడా భగవానుని భృత్యులే కదా! బ్రహ్మదేవుడు హిరణ్యకశిపునికి ఏ వ్యక్తి చేతగానీ, పగలుగానీ, రాత్రిగానీ, చావకుండా అద్భుత వరాల నిచ్చాడు కదా! ఆ బ్రహ్మ మాటను కూడా కాపాడడమూ శ్రీహరికి అవసరం. హిరణ్యకశిపుడు శ్రీహరిని ఏ చోటనైనా చూపించమని స్థలాన్ని నిర్దేశిస్తే ఆ స్థలంలో, అప్పుడే ఉద్భవించవలసి వస్తుందని భక్త సంరక్షకుడైన భగవానుడు ప్రతి వస్తువునందు ప్రత్యేకంగా- నరుడు కాకుండా, సింహం కాకుండా- రెండు రూపాలున్న నరసింహ రూపంతో- అంతర్వ్యాప్తిగా యుండడం అద్భుతమే కదా!

హిరణ్యకశిపుడు తన దర్బారులో ఒక స్తంభాన్ని తన గదతో తట్టి, ఇందులో ఉన్నాడా? ఉంటే కనబడదేమి శ్రీహరి? అన్నంతలోనే తాను తట్టిన స్తంభంలో నుంచే నృసింహరూపంతో వెలుపలికి వచ్చి కనబడినాడు (భాగవత శ్లోకం యొక్క తాత్పర్యం).

*"అన్దియం బోది లరియురువాగి అరియై యషిత్తవన్"*- (తిరుప్పల్లాండు). చక్రాయుధుడైన హరి సంధ్యాకాలమందు నృసింహరూపంతో ఆవిర్భవించాడని పెరియాళ్వార్ల శ్రీసూక్తి.

*"ఎంగమ్ముళన్ కణ్ణ నెన్ద మగనైక్కాయ్న్దు*
*ఇంగిల్లై యాలెన్ఱు ఇరణియన్ తూన్ పుడైప్ప*
*అంగప్పొషుదే అవన్ వీ యత్తోన్ఱియ, ఎన్*
*శింగప్పిరాన్ పెరుమై ఆరాయుమ్ శీర్మైత్తే"* (తి.వా.మొ. 2-8-9)

సర్వోపగతుడు చక్రియని ప్రతిజ్ఞ చేసిన ప్రహ్లాదుని మీద తన కళ్ళల్లో నిప్పులు చెరుగుతూ హిరణ్యకశిపుడు స్తంభాన్ని కొట్టి 'ఇక్కడ లేడే' అంటూండగానే,

అక్కడే- అప్పుడే ఆవిర్భవించిన నృసింహస్వామి యొక్క మహిమను పరిచ్ఛేదించి తెలియశక్యమా! అన్నారు నమ్మాళ్వార్లు.

*"పొన్ పెయరోన్ నాగత్తై కూరార్న్ద వళ్ళుగిరాల్ కీణ్డు*
*కుడల్ మాలై శీరార్ తిరుమార్విన్ మేల్కట్టి"-*

హిరణ్యకశిపుని శరీరాన్ని తన వాడియైన గోళ్ళచేత చీటి, పేగులను లాగి తన వక్షఃస్థలాన మాలికలుగా ధరించాడని ఆళ్వార్ల శ్రీసూక్తి.

*"కయాధుసుత వాయస ద్విరద పుంగవ ద్రౌపదీ"-* (అభీతిస్తవం-19)

*ప్రహ్లాదో హవై కాయాధవః* (శ్రుతి). హిరణ్యకశిపుని పత్నిపేరు 'కయాధువు'. కయాధువు యొక్క పుత్రుడు 'కాయాధవుడు' అని ప్రహ్లాదుని పేరు. ప్రహ్లాదుడు, కాకాసురుడు, గజేంద్రుడు, ద్రౌపది మొదలైన వ్యక్తులు గొప్ప భక్తులుగా పరిగణింపబడినారు. ప్రహ్లాదుడు రాక్షస జాతికి చెందిన బాలుడే అయినా ప్రహ్లాద, నారద, పరాశర, పుండరీక' అనే మహాభక్తుల పట్టికలో అగ్రగణ్యుడయ్యాడు.

సర్వబంధువు, సర్వరక్షకుడు శ్రీమన్నారాయణుడే అన్న మహా విశ్వాసం మూర్తీభవించిన దనుజ బాలుడు తండ్రికి ముక్తిని కలిగింపజేసినవాడే కాక, అతని వంశంలో జనించేవారిని సంహరించ జాలనని నృసింహ భగవానునిచేత అభయాన్ని పొందిన భక్తాగ్రేసరుడు ప్రహ్లాదుడు.

*స్తంభైక వర్జ మధునాఽపి త్రైలోక్యమే తదఖిలం నరసింహ గర్భమ్-* పరమ భక్తుని మాటను కాపాడడానికి తన విధేయతను ప్రకటిస్తూ, 'ఎంత కష్టపడినా అది నాకిష్టమే' యని నిరూపించిన భగవద్వాత్సల్యం అపారమైనది కదా! అని ఆశ్చర్య పడినారు నిగమాన్త దేశికులు.

బ్రహ్మాండకోటిని భగవానుడు తన కుక్షిలోని ఒక కోణమందు రక్షిస్తూ వటపత్ర పరిమితమైన బాలుని రూపంతో వెలసి యుండడమూ ఆశ్చర్యమే.

బ్రహ్మాండమండలం కంటె ఎన్నో రెట్లు అధికమైన వరాహ రూపాన్ని దాల్చి బ్రహ్మాండ మండలమందే సంచరించడమూ ఆశ్చర్యమే. సర్వాంతర్యామిగా చరాచర పదార్థాలలో వెలసి శాస్తగా ఉండడమూ ఆశ్చర్యదాయకమే.

ఒక భక్తుని వాక్కును వమ్ముగాకుండా కాపాడడానికి అన్ని వస్తువులలో- అన్ని స్తంభాల లోపలనూ ద్విరూపధారియై యుండి, ఒక్క స్తంభంలో నుంచి మాత్రమే వెలికివచ్చినందువల్ల ఆ స్తంభం తప్ప మిగత లోక త్రయమందలి వస్తు సముదాయం మాత్రం నేటికీ- ఎప్పటికినీ గర్భవతిగా ఉండడం అమితమైన ఆశ్చర్యం కదా!

*భద్రాం నృసింహకుహనా మధిజగ్ముషస్తే-*

నృసింహ రూపమే మాయారూపం. కుహనా శబ్దానికి వంచన అని అర్థం. లేదా వక్రమార్గమని భావం. ఇది మాయా అంటే ఆశ్చర్యమే. నరత్వం సింహత్వం- తలమాత్రం సింహంయొక్క తలగా ఉండి, తక్కిన భాగమంతా మనుష్య రూపంగా ఉండడం పరస్పర విరుద్ధమని అర్థం. రామకృష్ణావతారాలవలె సజాతీయం కాక విరుద్ధ రూపాలైన రెండింటిని కలిగియున్న అవతారం ఆశ్చర్య దాయకమే.

హిరణ్యకశిపుని కోసం సింహరూపం, భక్తాగ్రేసరుడైన ప్రహ్లాదుని కోసం నరరూపం ధరింపబడింది. ఈ విరుద్ధ రూపద్వయ యోగం కూడా ప్రకృతి సంబంధం కలది కాదని, కేవలం జ్ఞానానంద లక్షణం కలిగియున్న అప్రాకృతమైన భగవద్విగ్రహమే అని పిండితార్థం. కాబట్టి, ఈ రూపం 'భద్రాం' అనబడింది. లక్ష్మీవిశిష్టమైనది. క్షేమంకరమైనదే కదా!

*"సర్వోపి యం సమాశ్రిత్య సకలం భద్రమశ్నుతే।*
*శ్రియాచ భద్రయా జుష్టో యస్తం భద్రం నమామ్యహమ్॥"*

మంగళకారిణి- క్షేమాన్ని కలిగించే లక్ష్మీదేవి చేత ఆశ్రయింపబడినట్టి వాడెవడో, ప్రతివ్యక్తి ఎవరిని ఆశ్రయించి (భద్రం) క్షేమాన్ని పొందుతుంటాడో

అట్టి 'భద్ర' శబ్దవాచ్యుడైన నృసింహ భగవానునికి నమస్కరిస్తున్నాను అని సర్వజ్ఞుడైన రుద్రదేవుడు వివరించిన నృసింహ మంత్రరాజ పదస్తోత్రమందు ఉన్నట్టి శ్లోకమిది. అట్టి నృసింహ మంత్రంలోని 'భద్ర' శబ్దాన్ని ప్రయోగించి పరమ శివుడు నృసింహమూర్తిని స్తుతించాడు. కాబట్టి 'నృసింహ కుహనాం భద్రాం' అంటే దివ్యమంగళ విగ్రహుడైన నృసింహ భగవానుణ్ణి సమస్త ప్రపంచం అణువణువు తన లోపల కలిగియున్నది.

అన్ని స్తంభాల లోపల వ్యాపించి యున్న నృసింహ భగవానుడు ఒక్క స్తంభంలో నుంచి మాత్రమే ఆవిర్భవించాడు. కాబట్టి మిగిలిన స్తంభాలన్ని నృసింహమూర్తిని తమ గర్భం లోపల కలిగియున్నా యనడం కవితా చమత్కృతి.

నృసింహావతారం అంతర్వ్యాప్తిని ప్రకటిస్తుంది. 'సర్వవ్యాపిన మాత్మానం క్షీరే సర్పి రివార్పితమ్' (శ్వేతా. ఉపనిషత్).

"కఱన్ద పాలుళ్ నెయ్యేపోల్"– నమ్మాళ్వార్ల దివ్యవాణి. భగవానుడు పాల (క్షీరం)లో చమురులాగా సర్వవ్యాప్తియై యున్నాడనడం సత్యం.

నూనం– ఇది ఉత్ప్రేక్షను సూచించే పదం. వసంత తిలక.

24. *క్రామన్ జగత్ కపట వామనతా ముపేతః*
*త్రేధా కరీశ! స భగవాన్ నిదధే పదాని।*
*అద్యాపి జన్తవ ఇమే విమలేన యస్య*
*పాదోదకేన విధృతేన శివా భవంతి॥*

**అర్థం:** హే కరీశ!= ఓ హస్తిగిరినాథా!; కపట వామనతాం= వంచనతో హ్రస్వమైన ఆకృతిని; ఉపేతః= పొందియున్న; సః= ప్రసిద్ధుడవైనట్టి; భవాన్= నీవు; జగత్= జగత్తును; క్రామన్, సన్= కొల్వ బూనుకొంటూ; త్రేధా= మూడు విధాలుగా; పదాని= అడుగులను; నిదధే= పెట్టినావు; యస్య= ఏ, నీ యొక్క; విమలేన= పాపాలను

పోగొట్టే- స్వచ్ఛమైన; విధృతేన= ధరింపబడినట్టి; పాద+ఉదకేన= పాద తీర్థంచేత; ఇమే= ఈ (కనబడుతున్న); జంతవః= ప్రాణులు; అద్య+అపి= నేటికి కూడా; శివాః = పవిత్ర (మంగళ) జీవులుగా; భవంతి= అవుతున్నాయి.

**తా॥** ఓ కంచివరదరాజా! నీవు వంచనతో కూడిన మరుగుజ్జు రూపాన్ని ధరించి ప్రపంచాన్ని మూడడుగులతో కొలిచావు. అట్టి నిర్మలమైన నీ పాద తీర్థాన్ని తలమీద ధరించిన పానంచేసిన (ఆనాడు రుద్రుడే కాక) జంతువులు నేడు- ఎల్లప్పుడు కూడా - పాపాలను పోగొట్టుకొని పవిత్ర జీవులవుతుంటాయి.

**వ్యాఖ్య:-** వామనావతారం వర్ణితం.

ద్విరూపధారియైన నృసింహావతారం తర్వాత కపట వామన రూపంతో త్రివిక్రమావతారంగా ప్రసిద్ధిని పొందడం ఆశ్చర్యమని ప్రకటించే శ్లోకమిది.

కపట వామనతాముపేతః- మూడు లోకాలను జయించి గర్విష్ఠుడైన బలిచక్రవర్తియనే రాక్షసరాజు ప్రహ్లాదుని పౌత్రుడు. విరోచనుని పుత్రుడు 'వైరోచని' యనే పేరుతో ప్రసిద్ధిని పొంది యజ్ఞాలు చేస్తుండేవాడు. భక్తాగ్రేసరుడైన ప్రహ్లాదుని వంశమందు జనించిన వారిని చంపనని అభయమిచ్చాడు నృసింహ భగవానుడు. దేవరాజైన ఇంద్రునికి త్రైలోక్యాధి పత్యాన్ని పునః కల్పించడమనే స్వప్రయోజనార్థమై కశ్యప ప్రజాపతికి ధర్మపత్నియైన అదితి గర్భమందు దేవేంద్రునికి తమ్ముడుగా ఆవిర్భవించిన శ్రియఃపతి ఉపేంద్రుడని వ్యవహరింపబడినాడు.

బ్రహ్మచారియైన ఉపేంద్రుడు అందమైన పొట్టి-వామన రూపంతో యజ్ఞ వాటికలోకి పోయి, మహాబలిని మూడడుగుల భూమిని దానం చేయుమని యాచించడమే ఒక నాటకం- కపటం- వంచన. మాట తప్పని మహాబలి వామనుని యాచనకు ఆశ్చర్యపడి, మూడడుగుల నేలను దానం చేస్తానన్నాడు.

దాన జలధార నేలకు చేరునంతలోనే వామనుడు బ్రహ్మాండమంతా నిండి, పరమ పదమందలి వాకిలికి తాకునట్టి అద్భుతరూపంగా పెరిగినాడు.

"పృథివ్యాః జ్యాయా నన్తరిక్షాత్ జ్యాయాన్"- ఇది వామన స్వరూపమో, భూమికంటె విపులమైన అంతరిక్షం కన్న గొప్పదైన భగవానుని దివ్యమంగళ విగ్రహమో అని ఆశ్చర్యాన్ని కలిగించే రూపమిది.

*స భగవాన్ క్రామన్ జగత్ త్రేధా నిదధే పదాని*- బ్రహ్మాండాంత సంవర్ధియైన ఆ వామన భగవానుడు ప్రపంచాన్ని ఆక్రమింపబూని మూడు అడుగులు పెట్టాడు.

('స' అనే చోట 'హి' అనే శబ్దప్రయోగ పాఠం ఉంది. 'హి' అంటే- సమర్థనీయమే కదా! అర్థం.)

ఒక పాద విక్షేపంచేత పృథివిని పూర్తిగా కొల్చాడు. రెండవ వామపాద విక్షేపం చేత అంతరిక్షాన్ని- ఊర్ధ్వలోకాల నన్నిటిని కొలిచాడు. "అధిక్షియంతి భువనాని విశ్వా" (శ్రుతి) విశ్వంలోని అండసముదాయం సంపూర్ణంగా ఆక్రమింపబడింది. మూడవ అడుగు పెట్టడానికి చోటులేనందువల్ల తన తలను జూపిన బలియొక్క శిరస్సు మీద పెట్టినాడు. బలి పాతాళానికి పోయాడు.

"*త్రీణి పదా విచక్రమే*"- (ఋగ్వేదం. 1-22-18)

త్రేధా విష్ణు రురుగాయో విచక్రమే, మహీదివం పృథివీ మంతరిక్షమ్" (తైత్తి.బ్రాహ్మణమ్. 3-1-2-18)

"*తవ జయముఖరో డిండిమస్తత్ర వేదః*"- (శ్రీరం. రా.స్త.ఉ.శ. 67) త్రివిక్రముని విజయధ్వజ వ్యాప్తిని వేదమనే డక్కా లోకానికి చాటి తెలిపిందన్నాడు శ్రీ పరాశర భట్టర్. వామనుడు త్రివిక్రముడవడమే అత్యంతాశ్చర్యం కదా!

భగవానుని వామపాదం బ్రహ్మలోకానికి చేరగానే చతుర్ముఖ బ్రహ్మ పరబ్రహ్మ పాదానికి తన కమండలూదకం చేత అభిషేకం చేశాడు. అప్పుడు ఆ భగవానుని వామపాదాంగుష్ఠం నుంచి తీర్థం ప్రవాహంగా పరిణమించింది. అలా ఉద్భవించిన గంగాప్రవాహాన్ని రుద్రుడు తన జడలలో దాల్చి బంధించాడు.

వేగం తగ్గినా, ఇంకా పెరుగుతున్న గంగా ప్రవాహధారను భూమి మీదికి విడిచాడు.

*"యచ్ఛౌ చ నిస్సృత సరిత్ ప్రవరోదకేన*
*తీర్థేన మూర్ధ్ని విధృతేన శివః శివోఽ భూత్" (శ్రీభాగ. 3-28-22)*

పవిత్రమైన శ్రీ మహావిష్ణు పాదోద్భవయైన గంగోదకాన్ని రుద్రుడు తన శిరస్సున ధరించినందువల్ల పవిత్రుడై శివ శబ్ద వాచ్యుడయ్యాడని శ్రీ భాగవత సూక్తి.

*"అత్ర గంగాం మహాదేవః పతంతీం గగనా చ్చ్యుతామ్।*
*ప్రతి గృహ్య దధౌ లోకే మాను షే బ్రహ్మ విత్తమ్॥"*

(భారతం, ఉద్యోగపర్వం. 3-8)

ఆకాశం నుంచి జారిపడుతున్న గంగాప్రవాహాన్ని మహాదేవుడు తన జటా జూటంలో అరికట్టి, బ్రహ్మద్రవ్యమైన గంగోదక ధారను మనుష్య లోకానికి జారవిడిచాడు.

*"తదంబు పరయాభక్త్యా దధారశిరసాహరః।*
*పావనార్థం జటామధ్యే యోగ్యోఽస్మీత్యవధారణాత్॥"*

శ్రీ విష్ణు పాదతీర్థాన్ని హరుడు పరభక్తితో పావనం కోసం యోగ్యుదనవుతా ననే భావనవల్ల తన తలమీద జడల నడుమ ధరించాడని ఈశ్వర సంహిత ప్రకటిస్తున్నది.

"*కస్యపాదోదకేన సశివః స్వశిరోధృతేన*" (స్తో.ర. 13). పరబ్రహ్మయొక్క పాదతీర్థాన్ని తన తలమీద ధరించి శివదేవుడు పావనుడు-మంగళమూర్తి- అయ్యాడన్నారు ఆళ్వందార్లు.

*"అద్యాపి జన్తవ ఇమే విమలేన యస్య*
*పాదోదకేన విధృతేన శివా భవంతి*

పూర్వం మహాదేవుడు ఒక్కడే విష్ణు పాదోదకమైన గంగాజలాన్ని తన

తలమీద ధరించినందువల్ల శివుడు- పునీతుడు అయ్యాడు. ఈ కలియుగాన కూడా భవిష్యత్కాలాన కూడా- సకల పాప తాపాలను ధ్వంసంచేసే, బ్రహ్మ కడిగిన భగవంతుని శ్రీపాదతీర్థాన్ని- గంగోదకాన్ని- తలమీద ధరించి గంగానదిలో శిరః స్నానం చేసి, పానం చేయడం వల్లనూ సకల జంతువులు- మనుష్యులే కాదు, సర్వప్రాణులు- శరీర ధారులందరు పునీతులు మంగళమూర్తు లవుతున్నారు. త్రివిక్రముడుగా వెలసిన వామనుని వామపాదం-ఎడమకాలు యొక్క బొటన వ్రేలునుంచి ఉద్గమించిన గంగోదకాన్ని పానం చేయడం, శిరసాధరించడం వల్ల పాపరాశి నశించి, అనిష్ట నివృత్తి, ఇష్టప్రాప్తి కలిగి, సకల జీవులు సుఖజీవనులవుతున్నాయి. ఓ వరదరాజా! నీ త్రివిక్రమావతార మహిమ సకల ప్రాణులకూ ప్రేయఃశ్రేయస్సులను కలిగిస్తున్నది. వసంత తిలక.

*25. యేనా చల ప్రకృతినా రిపు సంక్షయార్థీ*
*వారాం నిధిం వరద! పూర్వ మలంఘయస్త్వమ్।*
*తం వీక్ష్య సేతు మధునాऽపి శరీర వంతః*
*సర్వే షడూర్మి బహుళం జలధింతరంతి॥*

**అర్థం:** హే వరద= ఓ వరదుడా!; త్వం= నీవు; రిపు సంక్షయ+అర్థీ= శత్రువులను నశింపజేయకోరిన వాడవై; అచల ప్రకృతినా= పర్వతాలు మూలకారణం గల; యేన= ఏ సేతువుచేత; వారాంనిధిం= సముద్రాన్ని; పూర్వం= మునుపు- రామావతారకాలాన; అలంఘయః= దాటినావో; తం= ఆ ప్రసిద్ధమైన; సేతుం= ఆనకట్టను; సర్వే, శరీరవంతః= సకల దేహధారులు- ప్రాణులు; వీక్ష్య= దర్శించి; అధునా, అపి= ఇప్పుడు-కలికాలాన, కూడా; షట్+ఊర్మి, బహుళం= ఆరు రూపాల కెరటాలచే నిండియున్న; జలధిం= (సంసార) సముద్రాన్ని; తరంతి= దాటుతున్నాయి.

**తా॥** కోరికల నీడేర్చే ఓ దేవా! నీవు నిన్ను ఆశ్రయించిన భక్తుల యొక్క విరోధులను వధింప దలచిన వాడవై పూర్వం గుట్టలతో కట్టిన ఆనకట్ట మీద నడిచి సముద్రాన్ని దాటినావు. నీ రామావతార కాలంనాటి సేతువును

సందర్శించిన సకల ప్రాణులు ఈ కలికాలంలోనూ కామక్రోధ లోభ మోహ మద మత్సరాలు అనే ఆరు విధాలైన అలలతో పూర్ణమైన సంసార సముద్రాన్ని దాటుతున్నాయి.

**వ్యాఖ్య:-** ఆశ్చర్యకరమైన దివ్యచరిత్రగల కరుణా కాకుత్థ్సరూపాన్ని వర్ణిస్తున్న శ్లోకం.

జగత్కుటుంబియైన కంచి వరద భగవానుడు జగద్రక్షణార్థం పడినపాట్లు ఆశ్చర్యకరమైనవే కదా! దేవజాతిలో అవతరించిన వామనుడే త్రివిక్రముడై గంగాజనకుడైన చరిత్రకంటె ఆశ్రిత రక్షణార్థం తన మహత్వాన్ని తగ్గించుకొని మానవజాతిలో పుట్టి మర్యాదా పురుషోత్తముడుగా పేరు పొందిన శ్రీరాముని చరిత్ర దివ్యమైనది కదా!

సర్వేశ్వరుడు తనను నాలుగు రూపాలుగా- రామభరతలక్ష్మణ శత్రుఘ్నులుగా విభజించుకొని దశరథ చక్రవర్తికి కుమారునిగా అవతరించడమే అద్భుతం. తండ్రిని సత్యవంతునిగా జేయడానికి రాముడు రథ గజ తురగ పదాతి సైన్యంతో కూడిన రాజ్యాన్నీ, రాజభోగ్య భాగ్యాలను తృణప్రాయంగా భావించి, వనవాసం చేయడమూ, అక్కడ విరోధ ఖరదూషణాద్యనేక రాక్షసులను సంహరించి ఋషులచే ఆదరింపబడిన రాముడు ఆదర్శ చరితుడు.

యే నా చల ప్రకృతినా రిపు సంక్షయార్థీ వారాంనిధి పూర్వమలంఘ యస్త్వమ్-

"న మేద్వే ష్యోఽ స్తి కశ్చన"-నాకు శత్రువొక్కడైనా లేదు-(భ.గీ.9-29). అనే భగవానునికి- "పాండవాన్ ద్విషసే రాజన్ మమప్రాణాహి పాండవాః" ఓ దుర్యోధనా! నా పంచప్రాణాలైన పాండవులను ద్వేషించే నీవు నాకు శత్రువువే-(భార.ఉద్యో. పర్వ. 90-33) అన్నట్లు- తనను ఆశ్రయించిన వారికి విరోధులైన వారే తనకు శత్రువులు కదా!

భగవానుడు తాను ఉన్న చోటనే ఉండి, తన సంకల్ప మాత్రం చేతనే లోక కంటకులైన దురాత్ములను సంహరించే సమర్థుడు. అయినా, తన భక్తులకు తన దివ్య రూపాన్ని దర్శింపజేసి వారిని తరింప జేయడం కోసమే మాయా మానుష విగ్రహుడైన రాముడుగా భూమండలమందు అవతరించాడు.

భగవానుడు, తనను అడిగి తననుంచి వస్తువులను, వరాలను పొందువారే ఉదారులు అని కీర్తించిన కరుణాపయోనిధి కదా!

*"స పుత్ర పౌత్రం సామాత్యం సమిత్ర జ్ఞాతి బాంధవమ్।*
*హత్వా క్రూరం దురాత్మానం దేవర్షీణాం భయావహమ్॥"*

(రా.బాల. 1-15-30) దేవతలను, ఋషులను, సజ్జనులను హింసిస్తూ లోక భయంకరుడైన రావణాసురుణ్ణి, వాని సంతానం, మంత్రులు, స్నేహితులు మొదలైన బంధువులతో పాటు, సంహరిస్తానని వైకుంఠుడు తనను ప్రార్థించిన దేవతలకు, ఋషులకు అభయమిచ్చాడు.

రిపుసంక్షయార్థీ- లోక విద్రావణుడైన రావణుడు లంకేశుడు. అగాధమైన, విశాలమైన సముద్రమే దుర్గంగా కలది లంకానగరం. దశకంఠుడైన రావణుడున్న చోటికే పోయి వాని కంఠదశకాన్ని లుంఠనం చేయదలచాడు శ్రీరాముడు.

అచల ప్రకృతిగా- వెండికొండ మీద మరకత శైలం వలె ఆదిశేషుని పైన శ్యామ వర్ణంతో ప్రకాశించే దివ్య రూపం మార్చి [illegible] రూపంలో ఉన్ననూ శ్రీరాముడు స్థిరమైన, పవిత్రమైన స్వభావం కలవాడు. కాబట్టి సముద్రానికి గుట్టలతో ఆనకట్టను నిర్మించాడు.

"పర్వతాంశ్చ సముత్పాట్య"- ఎన్నడు కూడా చలనం లేని పర్వతాలను పెకలించి తెచ్చి సముద్రంలో వేసినవారు మంచి వస్తువులను కూడా ముక్కలు ముక్కలుగా చేసి చిందర వందరగా పడవేసే చపలచిత్తులైన వానరులు కదా! "కపయః కర్మ కుర్వంతి"- చిలిపి చేష్టలతో చిరాకును కలిగించే కోతులు గుట్టలను

గ్రక్కదలించి తెచ్చి క్రమ బద్ధంగా నీటిలో వేసే కార్యానికి పూనుకోవడమే ఆశ్చర్యం. అంతేకాదు "అప్సు గ్రావాణః ప్లవంతే"- (మీమాంసా కౌస్తుభం. 1-2-1) ఆ కొండలన్నీ చొప్పబెండుల లాగా జలధిలో తేలడం కూడా అత్యంతాశ్చర్యం కదా! ఇది శ్రుత్యను సంహితమైన ఆశ్చర్య చరితం.

*యేన వారాంనిధిం అలంఘయః-*

పవిత్ర స్వభావానికి ప్రచ్యుతి యుండదు. పైగా, లోక ప్రసిద్ధమైన ఆయా వస్తువుల స్వభావాన్ని అన్యథాకరించే సమర్థుడు. శత్రువును స్వ సంకల్పంచేత నిర్మూలించే శక్తి కలవాడైననూ, బృందారకుల అభ్యర్థనను బట్టి బహుప్రయత్నంతో సముద్రమందు సేతువును నిర్మించి, దాని మీద శ్రీరాముడు తన సైన్యంతో కూడా నడిచి, సముద్రాన్ని దాటి దుర్భేద్యమైన లంకానగరానికి చేరడం అద్భుతమైన చరితంగా గోచరిస్తుంది. చారిత్రక పురుషుడని ప్రఖ్యాతుడు శ్రీరాముడు.

*తం వీక్ష్య సేతు మధునాఽపి శరీరవంతః సర్వే షడూర్మి బహుళం జలధిం తరంతి-*

త్రేతాయుగమందు రామావతార కాలాన నిర్మింపబడిన పవిత్ర సేతువును, ఎన్నో కల్పాల రూపమైన బహుతర కాలం గడచిపోయిన ఈ కలియుగ కాలమందు కూడా మనుష్యులే కాదు, పశుపక్ష్యాది సర్వప్రాణులు సందర్శించి తరిస్తున్నాయి.

శ్రీరాముడు పుష్పక విమానంపైన అయోధ్యా నగరానికి తిరిగి పోతున్నప్పుడు సీతమ్మతో సేతువును చూపుతూ పల్కిన మాట స్మరణీయం.

*"ఏత ద్దృశ్యతే తీర్థం సాగరస్య మహాత్మనః।*
*సేతు బంధ ఇతిఖ్యాతం త్రైలోక్యేన పూజితమ్।*
*ఏతత్ పవిత్రం పరమం మహా పాతక నాశనమ్॥"*

(రా.యు.కాం. 123-20,21). ఇక్కడ కనబడుతున్నదంతా మహాసముద్ర జలమే. ఇదిగో! ఇది సేతుబంధమని ప్రసిద్ధిని పొందింది. ఈ సేతుబంధం పరమ పవిత్రమైనది. పంచమహాపాతకాలను నశింపజేస్తుంది. కాబట్టి మూడు లోకాల జనులు ఈ సముద్ర సేతువును పూజిస్తుంటారు అని భగవానుడే స్వయంగా తెల్పినాడు. శ్రీరామభద్రుడు సేతువుమీద నడిచి సముద్రాన్ని దాటినాడు. దేహధారులు ఆ సేతువును దర్శించినంతలోనే సముద్రాన్ని దాటుతున్నారు.

*షడూర్మిబహుళం జలధిం తరంతి*- మహాసముద్రం జలరూపమైన ఒక్క ద్రవ్యం చేతనే అనేక తరంగాలు కలది. పవిత్రమైన ఆ సముద్ర సేతువును శరీరధారులెల్లరు సందర్శిస్తుంటారు, స్నానం చేస్తుంటారు. తత్ఫలితంగా మరొక సముద్రాన్ని తరిస్తారు. అదే సంసార సముద్రం. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యం అనే ఆరు విధాలైన వస్తువులచేత అనేకానేక తరంగాలతో నిండియున్న సంసార సముద్రాన్ని తరిస్తారు అని సారార్థం. "సేతుం దృష్ట్వా సముద్రస్య బ్రహ్మహత్యాం వ్యపోహతి" (పరాశర స్మృతి). శ్రీరామునిచేత నిర్మింపబడిన సముద్రసేతువును కన్నులతో చూచినంత మాత్రాన, బ్రహ్మహత్య చేసిన పాపం కూడా నశిస్తుంది అని శాస్త్రం నొక్కి చెబుతున్నది కదా! శ్రీరాముని దివ్య చరితమహిమ అత్యద్భుతమని సుశ్లోకితం. వసంత తిలక.

*26. ఇత్థం కరీశ! దురపహ్నవదివ్య భవ్య*
*రూపాన్వితస్య విబుధాది విభూతి సామ్యాత్।*
*కేచి ద్విచిత్ర చరితాన్ భవతోఽ వ తారాన్*
*సత్యాన్ దయాపరవశస్య విదంతి సంతః॥*

**అర్థం:** కరీశ!= ఓ హస్తి భూధర ప్రభూ! ఇత్థం= ఇట్లు ఆశ్చర్యకరమైన అవతారాలను ప్రదర్శింపగా; దురపహ్నవ, దివ్య, భవ్యరూప+అన్వితస్య= (అసత్యమని) అపలపింపశక్యం కానట్టి, స్వప్రకాశకాలైన, శుభాశ్రయాలైన రూపాలతో కూడినట్టి;

దయా పరవశస్య= కృపా పరతంత్రుడవైన; భవతః= నీయొక్క; విబుధ+ఆది విభూతి సామ్యాత్= దేవ మనుష్యాది జాతులతో సమానంగా ఉండే కారణం వల్ల; విచిత్ర చరితాన్= ఆశ్చర్యమైన నడవడి కలిగియున్న; అవతారాన్= అవతారాలను; కేచిత్= కొందరు; సంతః= సజ్జనులు; సత్యాన్= (సత్యాలే; ఇతి= అని); విదన్తి= తెలిసి చెబుతున్నారు.

**తా॥** ఓ హస్తిగిరీశా! ఆశ్చర్యకరమైన నీ యవతారాలు ఎవరిచేతను అపలపించడానికి శక్యం కానివి. అవి దివ్యమైనవి, అప్రాకృతమైనవి. నీవు దయా పరవశుడవై దేవతలతోనూ, మనుష్యులతోనూ సజాతీయమైన దివ్యమంగళ విగ్రహాలను ధరించి, చిత్ర విచిత్రమైన చరిత్రలతో కూడిన నీ యవతారాలను కొందరు బ్రహ్మజ్ఞానంగల మహాత్ములు సత్యమైనవి గానే అవతార రహస్యాలను తెలిసి చెబుతున్నారు.

**వ్యాఖ్య:-** అత్యాశ్చర్యకరమైన కొన్ని భగవదవతారాలను దిఙ్మాత్రంగా నిరూపించి, అసంఖ్యాతాలైన భగవద్రూపాల సత్యత్వాన్ని దృఢీకరిస్తూ, రూప నిరూపణను ఈ శ్లోకంతో ముగిస్తున్నారు దేశికులు.

ఇత్థం- వటపత్రశాయి, వ్యూహమూర్తి, హార్దరూపం, విభవావతారం, భగవద్రూపాలేమైనా అత్యంతాశ్చర్య కరమైనవిగానే నిరూపిస్తూ, ఇంతవరకు పైన సుశ్లోకింపబడినాయి.

భగవదవతారాలన్నీ భక్తులను అనుగ్రహించే గుణ విశిష్టమైనవే కదా! కొందరు భగవచ్ఛబ్ద వాచ్యుడైన పరబ్రహ్మపైన విశ్వాసం లేని, విపరీత జ్ఞానం కలిగియున్న కుదృష్టులు 'పరబ్రహ్మకు రూపంలేదు, గుణం లేదు, విభూతి లేదు, అంతా మిథ్య (అసత్యం), మాయా మయత్వమని వాదిస్తుంటారు. వారి వాదనను ఖండిస్తూ, "బహూని మేవ్యతీతాని జన్మాని తవచార్జున" (భ.గీత.4-3). ఓ యర్జునా! నాకూ, నీకూ ఎన్నో జన్మలు గడిచిపోయినాయి- "కృష్ణ రూపాణ్య సంఖ్యాని" (శ్రీ పాంచరాత్రం) కృష్ణ భగవానుని రూపాలు లెక్కకు మిక్కిలిగానున్నవి'

అన్నట్లు భగవదవతారాలు అసంఖ్యేయాలు అని సప్రమాణంగా నిరూపించే శ్లోకమిది.

దురపహ్నవ దివ్య భవ్య రూపాన్వితస్య-

దురపహ్నవాలు భగవద్రూపాలు. *"అజాయమానో బహుధా విజాయతే"* (తై. అర.3-13-1) పుట్టుకలేనివాడు అనేక విధాలుగ పుట్టుతుంటాడు; *"హిరణ్మయః పురుషోదృశ్యతే హిరణ్యశ్మశ్రు హిరణ్య కేశ ఆ ప్రణఖాత్ సర్వ ఏవ సువర్ణః"*- (ఛాం. ఉ. 1-6-6) బంగారు వన్నెగల మీసాలు, బంగారు వన్నెగల కేశాలు కలవాడు, గోర్లు మొదలుకొని అంత బంగారు (మంచి) వన్నెగల హిరణ్మయ పురుషుడు చూడముచ్చటగా కనబడుతుంటాడు అని శ్రుతులు పలుకుతున్నాయి.

*"త్రీణి పదా విచక్రమే"*- (ఋగ్వేదం) మూడు పదాలతో మూడు లోకాలను కొలిచాడు. *"సమస్తాః శక్త యశ్చైతా నృప! యత్ర ప్రవర్తితాః। తద్విశ్వరూప వైరూప్యం రూపమన్యద్ధరేర్మహత్॥"* (వి.పు.6-5-70). ఓ రాజా! ఈ శక్తులన్నీ దేనియందు నిలువబడినాయో అది జగద్రూపం కంటెను విలక్షణమైనది, విష్ణువు యొక్క మరొక గొప్ప రూపమది.

ఇత్యాది శ్రుతి స్మృతుల సుదృఢ ప్రమాణాల బలంవల్ల 'జగత్తుమిథ్య' అని వాదించేవారిచేత కూడా స్వరూపంగా గానీ, స్వభావంగా గానీ 'భగవదవతా రాలు సత్యాలు కావు' అని చెప్పడానికి శక్యం కానివి.

అవతారాలు దివ్యమైనవి. అప్రాకృతమైనవి, శుద్ధసత్త్వమయమైనవి. అలవోకగా చూచినంత మాత్రాన అజ్ఞాన, విపరీతజ్ఞాన మూలకమైన పాపరూప అంధకారాన్ని తొలగించే వెలుగుతో కూడిన రూపాలు కదా! తనంత తానై ఎల్లప్పుడు ప్రకాశించే దివ్యమంగళ విగ్రహుడు కదా భగవానుడు.

భవ్యరూపాలు-

*"తాపం హరతి యత్పుంసాం స్మృతం సంకల్ప నామయమ్।*
*తత్పుండరీక నయనం విష్ణోర్ద్రక్ష్యామ్యహం ముఖమ్॥"*

ఎవని నామాన్ని మనస్సులో స్మరించి తలచినంతనే చేతనుల పాప సంతాపాలు పటాపంచలవుతాయో, అట్టి పుండరీకాక్షుడైన విష్ణుమూర్తి ముఖమండలాన్ని చూచే భాగ్యం నాకు కలుగనున్నది అన్నట్లు రూప దర్శనం చేతగానీ, నామస్మరణచేతగానీ ఆధ్యాత్మిక, అధి భౌతిక, అధి దైవికాలనే తాపత్రయాలు నశించే శుభాశ్రయాలైన అవయవ సౌష్ఠవం గల రూపాలు.

దయా పరవశస్య- భగవానుడు పరహిత ప్రావణ్యం కలవాడు. ఆయన హృదయంలో దయ పొంగులు వారుతుంది. మనం పడే బాధలకు మనకంటె భగవానుడే ఎక్కువ బాధ పడుతుంటాడు. కాబట్టి, ఆయన దయాపరతంత్రుడు.

విబుధ ఆది విభూతి సామ్యాత్-

*"సమస్త శక్తి రూపాణి తత్కరోతి జనేశ్వర।*
*దేవతిర్య జ్మనుష్యాఖ్యా చేష్టావంతి విశేషతః॥"* (వి.పు. 6.5.71)

సర్వశక్తిమంతుడైన భగవానుడు సుకుమార ముగ్ధ మంజుల విగ్రహాన్నే- తన రూపాన్నే- దేవతలతో, మనుష్యులతో, తిర్యక్కులతో సమానమైన చేష్టలు గల (అవతార) రూపాలుగా తన లీల చేత చేస్తుంటాడు.

*"ఇచ్ఛాగృహీతాభిమతోరుదేహః సంసాధి తాశేష జగద్ధితోఽసౌ॥"* (వి.పు.6.5.84) సర్వేశ్వరుడు తన ఇచ్ఛ- సంకల్పం- చేతనే ఇష్టమైన గొప్ప శరీరాన్ని గ్రహించి సకల లోక హితాన్ని సాధిస్తుంటాడు. దేవమనుష్యాది రూపాలతో ఉన్నప్పటికీ విభూతి సామ్యాన్ని వదలడు.

విచిత్ర చరితాన్- దేవమానవాది జాతులలో అవతరించినా, ఆ జాతి స్వభావాలకు విరుద్ధమైన పనులను కూడా చేస్తూ ఆశ్చర్యాన్ని కలిగిస్తుంటాడు.

*"ఈ శన్నపి మహాయోగీ సర్వస్య జగతః ప్రభుః*
*కర్మాణ్యా రభతే కర్తుం కీ నాశ ఇవ దుర్బలః॥"*
*తేన వంచయతే లోకాన్ మాయా యోగేర కేశవః॥*

(మహాభారతం- ఉద్యోగ పర్వం- 9-67-14)

*"పతిం విశ్వస్య"*- అన్నట్లు జగదీశ్వరుడైననూ, దుర్బలుడైన కర్షకుడు వ్యవసాయం- నేలను దున్ని పంటపండించడానికి పనులు- చేయునట్లు అనేక కార్యాలను చేస్తుంటాడు. ఇట్టి తన మాయచేత లోకాన్ని భ్రమింపజేస్తాడు.

వామన బ్రాహ్మణుడు యాచన- బిచ్చమడుగడం- చేయడం జాతి స్వభావమే కదా! అప్పుడే త్రివిక్రముడై విశ్వజనులను ఆశ్చర్యపరచాడు. మోహిని అవతారమందు స్తనప్రదర్శన, కందుక క్రీడలాంటి కృత్యాలతో దానవులను వంచించడమే కాక, రుద్రుణ్ణి వ్యామోహితునిగా చేయడం ఆశ్చర్యం కాదా!

మానవేతరులతో చావు ఉండదని బ్రహ్మ ఇచ్చిన వరం వల్ల లోక కంటకుడైన రాక్షస రాజును- రావణుణ్ణి- *"ఆత్మానం మానుషం మన్యే"* అనే శ్రీరాముడు సంహరించాడు.

*"మానుషా ఘ్నంతి రాక్షసాన్"*- మనుష్యులను పుట్నాలవలె బుక్కే రాక్షసులను మనుష్యులే చంపడం 'కాలగతి కుటిలమైనది' అని లోకులు భావించడం విచిత్రం కాదా!

ఇట్టి విచిత్ర కృత్యంవల్ల ఏం ప్రయోజనం? అంటే, ఆ యవతార పురుషుడు దయాపరవశుడనడమే సమాధానం.

*"జగతా ముపకారాయ నసాకర్మ నిమిత్త జా"*-

పిలున్ద వాఋం వళర్ న్దవాఋం పెరియ పారతం కైశెయ్‌దు (తి.వా.మొ. 5.10.1) అని ఆళ్వార్లు అనుసంధించినట్లు శ్రీ గోపాలకృష్ణుని చేష్టలన్ని విచిత్రమైనవే కదా! ఆవిర్భవించినప్పటినుంచే అద్భుత చరితం కదా!

ఆలకాపరియైననూ దూతకృత్యమూ, సారథ్యమూ "నేను బ్రహ్మచారినే, సత్యవంతుడనే *అయితే శిశువు (ఉత్తర గర్భం) జీవించుగాక*" అని ప్రతిజ్ఞ చేయడం, వైదికుని పుత్రులను అన్వేషించి తెచ్చి ఇవ్వడమూ అన్నీ అచింత్యాద్భుతాలే.

భగవంతునికి సంబంధించినట్టి, అతిమానుషమైనట్టి, హద్దులేని ఈ జగద్వ్యాపారం లోకోపకారం కోసమే, కాని కర్మ కృతం కాదు అన్నాడు శ్రీ పరాశర మహర్షి.

*అవతారాన్ కేచిత్ సంతః సత్యాన్ విదంతి-*

కొందరు సత్పురుషులు భగవానుని వింత నడువడి కలిగిన అవతారాలు సత్యమైనవే అని తెలిసి వెల్లడిస్తున్నారని అర్థం. భూమండలమందు భగవదవతార రహస్యాలు తెలిసిన, తెలుసుకోదగిన జ్ఞానం లేని, జనులెందరో ఉన్నారు. వారు అవతారాలన్నీ ఇంద్రజాలమనీ, మాయామయాలనీ, మిథ్య అసత్యాలనీ ఆలపిస్తుంటారు. అవన్నీ శాస్త్ర ప్రమాణమెరుగని ప్రసంగాలే. కాబట్టి అవతారాలు 'దురపహ్నవ దివ్య భవ్యరూపాన్వితాలు' అని అసత్యత్వ వాదం ఖండింప బడింది కదా!

*"జన్మ కర్మచ మే దివ్యమేవం జానాతి తత్త్వ తః।*
*త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతిసోఽ ర్జున॥" (భ.గీ. 4-9)*

పార్థా! దివ్యమైన నా జన్మకర్మల నెవడు తత్త్వతః- బుద్ధితో గ్రహించిన అనుభవజ్ఞానం వల్ల తెలిసికొంటాడో, అతడు మరణించిన తర్వాత తిరిగి పుట్టడు, నన్నే చేరుకొంటాడు అని గీతాచార్యోపదేశం. అవతార పురుషులు జన్మకర్మలు మానవుల జన్మకర్మల వలె కర్మపరతంత్రాలు గాక దివ్యమైన వనీ, ఈ సత్యాన్ని గ్రహించినవాడు శాశ్వతానందాన్ని పొందగలడని నొక్కి చెప్పబడింది.

*"ఉయిర్ అళప్పాన్ ఎన్నిన్ఱ యోనియు మాయ్ ప్పిఱందాయ్, ఇమైయోర్ తలైవా"* (తిరువిరుత్తమ్-1)

ఓ దేవరాజా! నీవు పలు యోనుల యందు ప్రాణులను రక్షించడం కోసం దయా పరుతంత్రుడవై జన్మించావు. అవతరించావు, అని శ్రీ శఠకోప దివ్యసూరులు భగవద్గుణానుభవం చేశారు. మరుకాంతారంలో- ఎడారిలో- జలాశయాల వలె, కుదృష్టి బహుళమైన ఈ ప్రకృతి మండలమందు బ్రహ్మజ్ఞానం కల మహానుభావులు కొందరు ఉన్నారు. అట్టి సత్పురుషులు మాత్రమే భగవదవతారాలు, విచిత్ర చరితాలు అనే సత్యాన్ని ప్రకటించడమే ప్రమాణమని దృఢీకరింపబడింది. వసంత తిలక.

*27. సౌశీల్య భావితధియా భవతా కథంచిత్*
*సంఛాదితా నపి గుణాన్ వరద! త్వదీయాన్।*
*ప్రత్యక్ష యంత్య వికలం తవ సంనికృష్టాః*
*పత్యుస్త్విషామివ పయోదవృతాన్ మయూఖాన్॥*

**అర్థం:** హే వరద= పేరరుళాప్పెరుమానే!; సౌశీల్య భావితధియా= సౌశీల్య గుణంచేత సత్తను పొందిన ధిషణ కల్గిన; భవతా= నీ చేత; కథం చిత్= ఏ విధంగానో; సంఛాదితాన్= కప్పిపుచ్చబడిన; త్వదీయాన్= నీకు సంబంధించిన; గుణాన్ అపి= (కల్యాణ) గుణాలను కూడా; తవ= నీ యొక్క; సన్నికృష్టాః= సమీపమందున్న వారు; త్విషాం= కాంతులకు; పత్యుః= అధిపతియైన సూర్యుని యొక్క; పయోదవృతాన్= మేఘాలచే ఆవరింపబడిన; మయూఖాన్= కిరణాలను; సన్నికృష్టాః, ఇవ= దగ్గరున్న వారివలె; అవికలం= సంపూర్ణంగా; ప్రత్యక్ష యంతి= కన్నులతో చూస్తారు.

**తా॥** ఓ వరదా! సౌశీల్య గుణంచేత పొందిన బుద్ధిగల నీవు చాలా ప్రయాసపడి నీ గుణాలను మరుగు పరచుకొన్నావు. తేజస్సులకు అధిపతియైన సూర్యుని యొక్క కిరణాలను మేఘాలచే ఆవరింపబడినవైననూ వాటికి దగ్గరగా ఉన్నవారు స్పష్టంగా చూస్తున్నట్లు, నీకు అంతరంగిక భక్తులైన వారు నీ కల్యాణ గుణాలను ప్రత్యక్షంగా చూస్తుంటారు.

వ్యాఖ్య:- అర్చావతారమందలి కల్యాణ గుణాలను అంతరంగికులైన భక్తులు నేరుగా చూస్తుంటారని అర్చావతార మహిమను ఉగ్గడించే శ్లోకమిది.

ఇంతవరకు పరవ్యూహ విభవహార్ద రూప నిరూపణం చేసిన తర్వాత, అర్చారూపంతో కూడిన భగవంతుని యందు సర్వజ్ఞత్వ, సర్వశక్తిత్వ, పరమకారుణికత్వాదిరూప కల్యాణ గుణాలను విభవావతారాల యందు ఉన్న విధంగానే భగవత్సన్నిధిలో నున్న అంతరంగిక భక్తులు ప్రత్యక్షంగా చూస్తుంటారని సమర్థింపబడుతున్నది. అర్చావతార మహిమ స్తుతింపబడుతున్నది.

సౌశీల్య భావిత ధియా కథంచిత్ సంఛాదితాన్ గుణాన్-

గొప్ప తనంకల వ్యక్తి తనకంటె తక్కువ స్థాయి కల సామాన్య జనులతో బాగా కలిసి మెలిసే యుండే గుణాన్ని 'సౌశీల్యం' అంటారు.

*"మహతో మందైస్సహ నీరంధ్రేణ సంశ్లేషరుచిః సౌశీల్యం"* అని నిర్వచనం.

పరత్వాది సర్వశక్తిమంతుడైన సర్వేశ్వరుడు సౌశీల్య గుణాన్ని ప్రకటించడం కోసం రామకృష్ణావతారాలను ధరించి సామాన్యులైన నరులతోనూ, వానరులతోనూ సన్నిహితుడై తన మహిమను వెల్లడించాడు.

*"పిశాచాన్ దానవాన్ యక్షాన్ పృథివ్యాం యేచ రాక్షసాః।*
*అంగుళ్య గ్రేణ తాన్ హన్యామిచ్ఛన్ హరి గణేశ్వర॥"*
*(రా. యు. 18. 23)*

ఓ కపీశ్వరా! సుగ్రీవా! నేను తలచుకొంటే పిశాచ, దానవ, యక్షులనే కాదు, పృథివియందున్న రాక్షసులనూ చిటికెన వ్రేలితో చిదిమివేస్తానన్నాడు శ్రీరాముడు.

వెన్నను దొంగిలించినందువల్ల తల్లి యశోద ఱోటికి కట్టివేస్తే, ఆ ఱోటినే రెండు మద్ది చెట్ల నడుమ ఈడ్చుకొంటూ పోయి యమళార్జున భంగం చేసి నలకూబరమణి గ్రీవుల శాప విమోచనం చేశాడు గోపాలకృష్ణుడు. గొల్లలతో

ఆడుకొన్నవాడే ఘోరయుద్ధమందు చండమార్తాండుణ్ణి చక్రంతో ఆచ్ఛాదించాడు కదా! అట్టి దివ్యమంగళ విగ్రహుడే అర్చామూర్తిగా వెలసినప్పుడు తన కల్యాణ గుణాలను (కథంచిత్) సౌశీల్య గుణానికి ఆయత్తమైన బుద్ధిచేతనే ఆచ్ఛాదించుకొన్నాడు. ఆ బుద్ధి ఎంత స్వతంత్రమైనదో కదా!

"దండినా ఘటో హతః"– దుడ్డు కఱ్ఱకలవాడే కుండను పగుల గొట్టాడు అన్నప్పుడు, కుండ బద్దలు కావడానికి కారణం దుడ్డుకఱ్ఱయే కదా! అట్లే, సౌశీల్య కార్యాలకు అనుకూలించిన (భగవానుని బుద్ధి) సంకల్ప జ్ఞానం చేతనే అర్చావతారంలో పరత్వాది కల్యాణ గుణాలు మఱుగు పరచబడినాయి. అవి బటయకు ప్రకాశించకుండా, కేవలం అర్చక పరాధీనుడై, అర్చకులు చేసే కృత్యాలను సహించుకొంటూ, నిశ్చేష్టగా మౌనంగా వెలసి యున్నాడు. అర్చారూప భగవానుడు.

ఈ శ్లోకంతో శ్రీ భాష్యమందలి తృతీయాధ్యాయంలోని ద్వితీయపాద మందు (ఉభయ లింగపాదం) చెప్పబడిన విధంగా ప్రాప్యరుచి సిద్ధ్యర్థం సౌశీల్యాది కల్యాణ గుణాకరత్వం చెప్పబడింది.

*సంఛాదితా నపి గుణాన్ వరద! త్వదీయాన్ ప్రత్యక్ష యంతి అవికలం తవ సన్నికృష్టాః–*

సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వాది కల్యాణ గుణాలు లేకుంటే వరదుడు అనే పేరు ఎట్లు సార్థకమవుతుంది?

*"యది సంతిగుణాః పుంసాం వికసంత్యేవ తే స్వయం।*
*నహి కస్తూరికా మోదః శపథేన నివార్యతే॥"*

సామాన్యులైన చేతనులకు గుణాలు ఉంటే అవి తమంత తామే అవశ్యంగా ప్రకాశిస్తాయి. కస్తూరిని దాచినా, దాని వాసన దాగదు కదా! (అప్పయ్య దీక్షితుల (కువలయానందం సూక్తి). విశ్వాతీతుడూ, జ్ఞానశక్త్యాది గుణ విశిష్టుడైన

భగవానుడు తన మహిమచేత తన దివ్యమంగళమైన అర్చా విగ్రహమందు కల్యాణ గుణాలు ప్రకాశించకుండా మఱుగు పరుచుకొన్నప్పటికీ సన్నికృష్టులు- దగ్గరగా ఉన్నవారు భగవత్ప్రీతి పాత్రులు ఆ గుణాలను కన్నులతో స్పష్టంగా చూస్తారు, అనుభవిస్తారు.

"యమే వైష వృణుతే తేన లభ్యః" ఉపనిషత్తు బోధించినట్లు భగవత్ప్రేమ పాత్రులకు పరవ్యూహ విభవాల యందు ఉన్నట్లే, అర్చా రూపమందు కూడా కల్యాణ గుణాలు గోచరిస్తాయి.

"సన్నికృష్టా చ్చ సౌహార్దం జాయతే స్థావరేష్వపి"- 'సౌహార్దం' అంటే శోభన శంసి హృదయం- శుభాన్ని, హితాన్ని కోరే మనస్సు. ప్రేమ అని అర్థం.

చట్లయందు, చెట్ల యందు కూడా దగ్గరగా ఉన్నందువల్ల సౌహార్ద గుణం ప్రకాశిస్తుంది అంటారు విజ్ఞులు.

"మయర్వఱమదినల మరుళినన్"- అజ్ఞానాన్యధా జ్ఞాన విపరీత జ్ఞానాలను నశించునట్లు భక్తి రూపజ్ఞానాన్ని భగవానుడు కృపజేసిన నమ్మాళ్వార్లు అర్చారూప గుణ సౌందర్యాన్ని "కణ్డేనెమ్మానే" (5. 8-1) నేను కన్నులతో సేవించాను అన్నారు.

*అమ్మా నాషిప్పిరాన్ అవనె విడత్తాన్ యా నార్?*
*ఎమ్మా పావియర్క్కు విదివాయ్క్కిన్ఱు వాయ్క్కుమ్ కణ్డీర్"*
*(తి.వా.మొ. 5. 1. 7)*

పరత్వ వైభవాన్ని కొనియాడిన నమ్మాళ్వార్లు, సర్వజ్ఞుడై, సర్వశక్తుడై సకల కల్యాణ గుణాకరుడైన చక్రధారి సర్వేశ్వరుడెక్కడ? కడు నికృష్టుడనైన నేనెక్కడ? అని నైచ్యాను సంధానం చేస్తూ, ఎంత పాపాత్ములకైనను భగవత్కృప ఫలించే కాలం వచ్చినప్పుడు అవశ్యంగా ఫలిస్తుందని అధ్యవసాయాన్ని ప్రకటించారు.

"కంగులుమ్ పగలుమ్" (తి.వా.మొ. 7ప.) అనే దశకంలో తల్లి మాటగా, శ్రీరంగనాథుని సౌహార్దం పరరూపం మొదల్కొని ఆర్చారూపం వరకు ప్రకాశిస్తున్నదని ఆళ్వార్లు అనుగ్రహించారు.

తిరుక్కచ్చినంబి (శ్రీకాంచీపూర్ణులు) అనే మహానుభావులు కంచి వరదరాజ ప్పెరుమాళ్ళకు తిరువాలవట్టమ్ వింజామర వీచే ఆంతరంగ కైంకర్యపరులు. పెరియనంబి శిష్యులు. వరదరాజ భగవానునితో ముఖాముఖిగ సంభాషించే వారని ప్రసిద్ధిని పొందినవారు. 'దేవరాజాష్టకం' అనే చిన్న స్తోత్రాన్ని అనుగ్రహించారు. తిరుక్కచ్చినంబి ద్వారా భగవద్రామానుజులకు షడ్వార్తలను- ఆరు ప్రశ్నలకు దేవరాజస్వామిచే సమాధానాలను పొంది కృపజేస్తే, విశిష్టాద్వైత సిద్ధాన్త ప్రచారం ప్రవర్తింప బడింది.

సన్నికృష్టులైన తిరుక్కచ్చినంబిగారికి కంచివరదరాజస్వామి అర్చామూర్తి యొక్క కల్యాణ గుణాలు సంపూర్ణంగా గోచరించాయి అని సారార్థం.

పత్యుస్త్విషామివ పయోదవృతాన్ మయూఖాన్ సన్నికృష్టాః ప్రత్యక్షయంతి-

వానకాలంలో మేఘాలచే సూర్యుని కిరణాలు ఆచ్ఛాదింపబడిననూ, మేఘమండలంపైన ఉన్నవారు రవికిరణాలను (ఎండను) ప్రత్యక్షంగా చూస్తారు. ఆ విధంగానే అర్చామూర్తి యందు కల్యాణ గుణాలు ఆచ్ఛాదింపబడి యున్నప్పటికీ, (సన్నికృష్టులు) అంతరంగ భక్తులు ఆ గుణాలను పూర్తిగా సేవిస్తుంటారు అని దృష్టాంతాన్ని దేశికులు ప్రదర్శించారు.

శ్లోకం ఉపమాలంకార సజ్జితం. వసంత తిలక.

*28.* *నిత్యం కరీశ! తిమిరావిల దృష్టయోஉపి*
*సిద్ధాం జనేన భవతైవ విభూషితాక్షాః*
*పశ్యం త్యు పర్యుపరి సంచరతా మదృశ్యం*
*మాయా నిగూఢ మనపాయ మహానిధిం త్వామ్॥*

**అర్థం:** హే కరీశ!= ఓ హస్తిశైలాధిపతీ!; తిమిర+ఆవిల, దృష్టయః, అపి= దోషమనే అంధకారంచేత కలుషితమైన యోగ దృష్టి కలవారైనప్పటికీ; సిద్ధ+అంజనేన= దృష్టిని ఇచ్చే అంజనం కాటుకగా ప్రకాశించే; భవతా, ఏవ= దివ్యమంగళ విగ్రహంగా

ఉన్న నీ చేతనే; నిత్యం= ప్రతిదినం- ఎల్లప్పుడు; విభూషిత+అక్షాః= (నీ స్వరూపమనే అంజనం చేత) అలంకరింపబడిన కన్నులు కలవారైన (నిన్ను నిత్యం సేవించినందువల్ల నీ కృపచేత తత్త్వజ్ఞానాన్ని పొందిన) వ్యక్తులు; ఉపరి, ఉపరి= మీద మీద; సంచరతాం= (నిధియున్న నేలమీదనే) నడుస్తున్న వారికి; అదృశ్యం= కనబడనట్టి; మాయా నిగూఢం= అనాదియైన అవిద్యచేత- సంచితకర్మ దుర్వాసన చేత- తెల్యబడక ఉన్నట్టి; అనపాయ మహానిధిం= ఎట్టి అపాయం లేని గొప్ప నిధియైన; త్వాం= నిన్ను పశ్యంతి= చూస్తున్నారు.

**తా॥** ఓ హస్తిశైలేశా! నిధియున్న ప్రదేశం మీదనే ప్రతిదినం సంచరిస్తున్నప్పటికీ తమోగుణం చేత దృష్టిలోపించిన కన్నులు కలిగిన వ్యక్తులు, సిద్ధాం జనాన్ని కన్నులకు అలంకరించుకొని రహస్యంగా ఉన్న పెన్నిధిని చూడగలుగుతుంటారు. ఆ రీతిగానే, అనాదిగా సంచిత పాపకర్మ (అవిద్యా) సంబంధం వల్ల వస్తువులను చూడలేని కంటిదోషం గల జనులు శుభాశ్రయమైన నీ అర్చారూపం అనే సిద్ధాంజనాన్ని తమ కన్నులకు పెట్టుకొని- నిత్యం నీ దివ్య మంగళ విగ్రహాన్ని సేవిస్తూ- తమ హృదయంలో అంతర్యామియై వెలసియున్న మహానిధివి నీవే యని నిర్ధారణ చేసుకొంటున్నారు.

**వ్యాఖ్య:-** అర్చామూర్తి గుణాలను అనుభవించడమే హితమైనదని బోధిస్తున్న శ్లోకం.

"సౌశీల్య భావితధియా"- అని పూర్వశ్లోకమందు ఉపాయత్వానికీ, ఉపేయత్వానికీ ఉపయోగపడే గుణాలు- ఉభయ లింగ పాదమందున్నట్లు- సామాన్యంగా ప్రతిపాదింప బడినాయి. 'అథమునిః' (బృహ. ఉప. 3-5-1) అన్నట్లు, భక్తికి అంగమైన శుభాశ్రయ చింతన ఆవశ్యకం. శుభాశ్రయచింతన లేకుండా స్వరూప సాక్షాత్కారం సాధ్యం కాదు.

పరవ్యూహావతారాలు ప్రత్యక్షీకరింపబడవు. విభవావతారాలు జల ప్రవాహాల లాగా వచ్చిపోయినవి కదా! ఇక ప్రత్యక్షంగా కంటికి కనబడే

దివ్యమంగళాకృతితో వెలసియున్న అర్చామూర్తిని మనోవాక్కాయాలనే కరణత్రయంతో భజించడమే పరమార్థమని, ఈ శ్లోకం మొదలుకొని తత్త్వహిత పురుషార్థాల నిరూపణం విశదీకరింప బడుతున్నది.

*నిత్యం కరీశ! తిమిరా విల దృష్టయోఽపి సిద్ధాంజనేన భవతైవ విభూషితాక్షాః-*

కరీశ!- హస్తిగిరియందు ఎల్లప్పుడు ప్రపన్నులచేత సేవింపబడుతూ వేంచేసియున్న అర్చామూర్తి వరదరాజస్వామిని సంబోధించే పదం. 'తిమిరం' అంటే చీకటి, పాపం, దోషమని అర్థం. కన్నులున్నా వస్తు స్వరూపాన్ని చూడలేక పోవడం కంటిదోషమంటారు. పాపం వ్యాధి రూపంగా పీడిస్తుంది. అనేక జన్మలలో చేసిన పాప కర్మల దుర్వాసన, పెరిగి రాగద్వేషాది కార్యాలను చేయడానికి కారణమవుతుంది. తత్ఫలితంగా తమోగుణం వ్యాపించి వస్తువులను చూడగలిగే కంటి చూపు లోపిస్తుంది.

దోషం చేత కలుషితమైన నేత్ర దృష్టికల జనులు కూడా లోకంలో- సిద్ధుల యొక్క అంజనం= సిద్ధాంజనం (షష్ఠీతత్పురుష), సిద్ధపురుషులు సంపాదించి ఇచ్చిన అంజనాన్ని తమ కన్నులకు చక్కగా అలంకరించుకొనడం వల్ల భూమి లోపల దాచబడిన ద్రవ్య నిధిని చూడగలుగుతున్నారు. ఇది లౌకికం.

ఈ వాక్యంచేత మరొక అర్థమూ అనురణిస్తుంది. దృష్టి, అక్షి (కన్ను) అనే పదాలకు జ్ఞానం అని అర్థం. సిద్ధమైన అంజనం= సిద్ధాంజనం (కర్మధారయ సమాస పదం). దివ్యమంగళ విగ్రహమే సిద్ధాంజనం అని తాత్పర్యం.

భక్తియోగమందు భగవద్ధ్యాన మగ్నమైన చిత్తానికి మధ్య మధ్య ఇతర విషయాలను స్మరించడం వల్ల దోషం సంభవిస్తుంది. ఆ దోషంవల్ల యథార్థవస్తు తత్త్వ జ్ఞానం కలుషిత మవుతుంది. కలుషిత జ్ఞానం కల్గిన యోగపురుషులు కూడా సిద్ధోపాయమైన అంజన మనే అర్చామూర్తిని- యత్నం చేయకుండా లభించిన విలక్షణమైన ద్రవ్యాన్ని, దివ్యమంగళ విగ్రహాన్ని- నిత్యం కన్నార

సేవించడం వల్ల ప్రపత్తి విద్యా రూపజ్ఞానం కలవారై, అట్టి జ్ఞానం చేత భగవద్రూపమైన మహానిధిని దర్శించగలుగుతున్నారు. ఇది దైవికం.

ఇట్లు పూర్వార్ధంలో భగవానుని సర్వ నియంతృత్వం సూచితం.

*"సిద్ధాంజన మివశ్యామాం తవతనుం నిజవిలోచనేషు క్షిపన్తః।*
*అచ్యుత! లక్ష్మీనివాసం నిత్యనిగూఢం నిధిమివ పశ్యంతిత్వామ్॥"*

(అచ్యుత శతకం-45) (దేశికులు అచ్యుత శతకాన్ని ప్రాకృతభాషలో రచించి, దానికి ఛాయగా, సంస్కృత శ్లోకాలను తామే అనుగ్రహించారు).

ఓ అచ్యుతా! నీలవర్ణంగల నీ విగ్రహాన్ని (రూపాన్ని) తమ కన్నుల యందు సిద్ధాంజనం వలె అలంకరించుకొన్న జనులు శ్రీ నికేతమైన నిన్ను సర్వదా రహస్యంగా ఉన్న నిధినివలె చూస్తుంటారు అని శ్లోకార్థం.

నీలమైన భగవద్విగ్రహం సిద్ధాంజనంగా వర్ణితం. భగవానుడే పెన్నిధి. ప్రాపకుడూ, ప్రాప్యుడూ భగవానుడే అని భావం.

*"సందర్శనా దకస్మాచ్చ పుంసాం సమ్మూఢ చేతసామ్।*
*కువాసనా కుబుద్ధిశ్చ కుతర్కనిచయస్తథా॥*
*కు హేతుశ్చ కుభావశ్చ నాస్తికత్వం లయం వ్రజేత్॥" (శా. 2-89)*

మూఢులు హఠాత్తుగా ఒక్కసారి సేవించినంత మాత్రాన సకల పాపాలు నశిస్తాయి. ఇక ప్రతిదినమూ సేవిస్తుంటే పాప నివృత్తిని గూర్చి చెప్పవలసిందే ముంది?

*పశ్యం త్యు పర్యుపరి సంచరతా మదృశ్యం మాయా నిగూఢం అనపాయ మహానిధిం త్వామ్–*

లోకులు దాచబడిన నిధియున్న స్థలం మీదనే నిత్యం నడుస్తున్ననూ వారికి ఆ నిధి కనబడకుండానే ఉంది. సిద్ధాంజనాన్ని తమ కన్నులకు పెట్టుకొన్న జనులకు మాత్రం ఆ నిధి కనబడుతుంది. భగవంతుని దివ్య రూపమనే

సిద్ధాంజనాన్ని నయన రంజకంగా అలంకరించుకొన్న మహానుభావులకు మాత్రం హృదయ గుహలో రహస్యంగా పెన్నిధిగా వెలసి యున్న అంతర్యామియొక్క సాక్షాత్కారానుభవం కలుగుతుంది.

నిరపాయం- లోకంలో భౌతికమైన నిధిని కనుగొనడానికి ప్రయత్నిస్తే, అది అపాయంతో కూడినది (సాపాయం)గా ఉండే అవకాశం ఉంది. కాని, భగవద్రూపమైన నిధి అపాయం లేనిది, శాశ్వతానంద ప్రదమైనది.

మాయానిగూఢం-

*దైవీహ్యేషాగుణ మయీ మమమాయాదురత్యయా।*
*మామేవ యే ప్రపద్యంతే మాయామేతాంతరన్తితే॥* (భ.గీ.7-14)

సత్త్వరజస్తమో గుణమయమైన ప్రకృతిని- మాయను నేనే లీలగా సృష్టించుకొన్నాను. 'మాయ' అంటె, మిథ్య కాదు. మాయ భగవంతుని స్వరూపాన్ని కనిపించకుండా చేస్తుంది. కాబట్టి నా మాయను ఎవ్వరూ తప్పించుకొన జాలరు. పరమాత్మయైన నన్ను మాత్రమే ఉపాయం- శరణం అని నమ్మియున్నవారే నా యీ మాయను అవలీలగా దాటగలరు. నన్నే ఉపాసిస్తారు అని గీతాచార్యోపదేశం.

అట్టి భగవన్మాయ చేతనే తెలియబడకున్నది ఈ మహానిధి. ఈ శ్లోకమందు *"గతి శబ్దాభ్యాం తథా హి దృష్టం, లింగంచ"*- (బ్ర.సూ. 1-3-14) అనే ఈ సూత్రానికి శ్రీభాష్యకారులైన భగవద్రామానుజుల వారి రెండవ విధమైన వ్యాఖ్యానం వివరింపబడింది.

పరబ్రహ్మ ఉపాస్యుడుగా వెలసియున్న చేతనుల హృదయకమలాన్ని బ్రహ్మపురం, దహరం అంటారు. *"అస్మిన్ బ్రహ్మ పురే దహరం పుండరీకం వేశ్మ దహరోఽస్మిన్నంతర ఆకాశః"* అని ఉపనిషద్వాక్యం ఎల్లప్పుడు అంతరాత్మగా ఉండేది దహరాకాశమనబడుతున్నది.

"హిరణ్యనిధిం నిహితమ క్షేత్రజ్ఞాః ఉపర్యుపరి సంచరంతో నవిందేయుః ఏవమేవ ఇమాః సర్వాః ప్రజాః అహరహర్గచ్ఛంత్యః ఏతం బ్రహ్మలోకం నవిందంతి అనృతేన హి ప్రత్యూఢాః" (ఛాం. ఉ. 8-3-2)

దహరాకాశమందు హిరణ్యనిధి కలదని తెలియక దాని మీదనే జనులు ప్రతిదినం నడుస్తున్నప్పటికీ, పరబ్రహ్మను నిత్యం పొందుతున్ననూ, అజ్ఞానావృతులై నందున ఆ నిధిని తెలుసుకోలేక పొందకున్నారు అని వాక్యార్థం.

"తస్మిన్యదంతస్తదన్వేష్టవ్యం"- "అస్మిన్ కామాః సమాహితాః" దాని లోపల సూక్ష్మ (దహర)మైన ఆకాశమేది కలదో, దాన్ని కన్గొనవలెను. దానియందు స్వాభావికానవధికాతి శయ కల్యాణ గుణసమూహాన్ని ధ్యానం చేయవలెను. ఆ యుభయాన్నీ- రూపాన్నీ, గుణ సముదాయాన్నీ ఉపాసించవలెనని ఉపదేశింప బడింది.

ఉత్తరార్ధంలో పరమ భోగ్య భూత కల్యాణ గుణాశ్రయత్వం వ్యంజితం. సమాసోక్త్యలంకారం.

ఈ శ్లోకంలో శారీరక తృతీయాధ్యాయ చతుర్థపాదమందలి (అంగపాదం) 'సహకార్యంతర విధ్యధికరణం'లో చెప్పబడినట్లు 'శుభాశ్రయ చింతనం' మరియు తృతీయపాదమందు చెప్పిన 'ఉపాసన' కూడా విశదీకరింపబడినాయి. వసన్త తిలక.

*29. సద్య స్త్యజంతి వరద! త్వయిబద్ధ భావాః*
*పైతామహాదిషు పదేష్వపి భావ బంధమ్।*
*కస్మై స్వదేత సుఖ సంచరణోత్సుకాయ*
*కారాగృహే కనక శృంఖలయాఽపి బంధః॥*

**అర్థం:** హే వరద!= సర్వాభీష్ట ప్రదుడవైన ఓ దేవా!; త్వయి= నీ యందు; బద్ధ భావాః= దృఢంగా నిల్పబడిన మనస్సు కలిగిన తత్త్వజ్ఞానులు; పైతామహ+ఆదిషు=

బ్రహ్మ మొదలైన వారికి ఉన్నట్టి; పదేషు, అపి= పదవులందు కూడా; భావ బంధం= ఆశాబంధాన్ని; సద్యః= క్షణాననే; త్యజంతి= విడిచివేసుకొంటున్నారు- వదలుకొంటారు; సుఖ సంచరణ+ఉత్సుకాయ= సుఖంగా సంచరించడమే ఔత్సుక్యం గల; కస్మై= ఎవని కొరకు? ఎవనికి; కారాగృహే= చెరసాలయందు; కనక శృంఖలయా, అపి= బంగారు సంకెళ్ళతో కూడియున్నను; బంధః= బంధం- చెఱసాలయందు నివసించడం; స్వదేత= రుచిస్తుంది?

**తా॥** ఓ వరదా! సర్వేశ్వరుడవైన నీయందు ఆసక్తమైన అంతఃకరణం గల పురుషార్థులు బ్రహ్మరుద్రేంద్రుల పదవుల యందు కూడా ఏర్పడిన ఆశాబంధాన్ని క్షణంలో వదలి వేస్తారు. సుఖంగా సంచరించే వేడుక కోసం చెఱసాలయందు బంగారు సంకెళ్ళు వేసి యుంచిననూ అక్కడ నివసించడం ఎవనికి రుచిస్తుంది? రుచించదు.

**వ్యాఖ్య:-** భగవద్రూప గుణాలయందు అభిరుచిగల జ్ఞానులకు ప్రాకృతిక భోగాలు రుచించవు అని సుశ్లోకితం.

ఈ శ్లోకమందు, శారీరక తృతీయాధ్యాయ ప్రథమపాదమందు చెప్పిన మోక్షేతర పురుషార్థాల హేయత్వం (ప్రాప్యవ్యతిరిక్త వైతృష్ణ్య జననార్థం) వివరింపబడింది.

'వరద' అనే సంబోధనచేత నిత్య విభూతి, లీలా విభూతి అనే ఉభయ విభూతులతో కూడి, తన స్వరూపానికి అనురూపమైన వరాలను ఆశ్రితులకు ప్రసాదించే వాడని విశదీకృతం.

*సద్యస్త్యజంతి త్వయి బద్ధ భావాః పైతామహాదిషు పదేష్వపి భావబంధమ్-*

సమస్త కల్యాణ గుణాలు కలవాడు, అఖిల హేయ ప్రత్యనీకుడు, అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకుడు శ్రీమన్నారాయణుడు.

"తథా సుర నరస్తంబ బ్రహ్మాండ శతకోటయః।
క్లేశ కర్మ విపాకాద్యై రస్పృష్టస్యా ఖిలే శితుః॥
జ్ఞానాది షాడ్గుణ్య నిధే రచింత్య విభవస్య తాః।
విష్ణోర్విభూతి మహిమ సముద్రస్య ద్రప్స విప్రుషః॥"

(సంవిత్సిద్ధి-21,22) అని ఆళ్వందార్లు అన్నట్లు, జ్ఞానాది షాడ్గుణ్య నిధియూ, అచింత్య విభవమూ కలిగినవాడూ, క్లేశకర్మ విపాకాదులు తనకు అంటనివాడూ అయిన విష్ణుభగవానుని మహిమ అనే సముద్రంలో శతకోటి బ్రహ్మాండ మండలాలు నీటి తుంపరలు కదా!

తానున్నచోట, తనలోనూ ఒక కోణమందు ఇమిడి యుండే, అనంత బ్రహ్మాండ మండలాల చేత మండితమైన, ఇరువై నాలుగు తత్త్వాలతో కూడి తమస్సత్త్వ రజోగుణరూపమైన లీలా విభూతి యొక్క త్రిగుణాలకు మించిన భోగాలతో కూడిన భగవానుని ఆనందం అపారమైనది. నిత్యమైనది, నిరతిశయమైనది.

"తేయేశతం ప్రజాపతేరానందాః, స ఏకో బ్రహ్మణ ఆనందః"- ఆనందవల్లి (తై. ఉప) యందు చెప్పినట్లు వంద చతుర్ముఖ బ్రహ్మల ఆనందాలతో సమానంగా తూగేది పరబ్రహ్మ ఆనందం.

"యతోవాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ, ఆనందం బ్రహ్మణో విద్వాన్, న బి భేతి కుతశ్చన"- (తై. ఉ.). అట్టి పరబ్రహ్మానందాన్ని శ్రుతులు మనస్సుతోనైనా తెలుసుకోలేక నేటికీ ఇంక ప్రయత్నిస్తున్నాయి. అట్టి పరమ పదనాథుని ఆనందం శాశ్వతమైనదని శాస్త్రం ద్వారానో, స్వాచార్యుల ద్వారానో తెలుసుకొని, ఉత్కటమైన ప్రేమానురాగాలతో పరబ్రహ్మను ఉపాసించే ప్రవృత్తి కలవారు (బద్ధభావాః) తత్త్వజ్ఞానులు.

ఒక పదార్థమందు అభిరుచికలవారైన లోకులు దానికంటె వేరైన వస్తువులను ఇష్టపడరు కదా!

పితామహుడంటె చతుర్ముఖ బ్రహ్మ; ఆది శబ్దం చేత శివుడు, ఇంద్రుడు మొదలైన లోకాధిపతులు చెప్పబడినారు. బ్రహ్మరుద్రేంద్రులు పెక్కేండ్లు తపో యజ్ఞ కర్మలను చేసి, శ్రియఃపతి అనుగ్రహం చేత తమ తమ పదవులందు ఆధిపత్యాన్ని సంపాదించుకొన్నవారు. 'ఆవిరించాదమంగళం' అన్నట్లు బ్రహ్మరుద్రాదులు కూడా శుభాశ్రయులు కారు. వారి పదవులు కూడా శాశ్వతమైనవి కావు. ఒకానొక కాలాన, ప్రకృతి మండలమందున్న వారి వారి స్థానాధిపత్యాన్ని విడిచి 'పొండు' అంటే భగవదాజ్ఞను పాటించి పోవలసిన వారే. అష్టైశ్వర్యాలను అనుభవించే ఆశను వదలుకొని వెళ్ళిపోవలసిన వారే కదా!

*"సఖల్వేవం వర్తయన్ యావదాయుషం బ్రహ్మలోక మభిసంపద్యతే నచ పునరావర్తతే, నచ పునరావర్తతే"*- (ఛాం. ఉప. 8-15-1) లేదా, వారు జీవించినంత కాలం తమ అధికారానికి అనుగుణంగా వర్తిస్తూ, దేహావసాన మందు పునరావృత్తి లేని- తిరిగి ప్రకృతిమండలమందు జన్మింపలేనట్టి- వైకుంఠ స్థానాన్ని చేరి శాశ్వతానందాన్ని పొందవలెననే ఆకాంక్షతో ఆ పరబ్రహ్మను ప్రార్థించవలసిన వారే.

*"క్వనాకపృష్ఠగమనం పునరావృత్తి లక్షణమ్।*
*క్వజపోవాసుదేవేతి ముక్తి బీజమనుత్తమమ్॥"*

పునరావృత్తి లక్ష్మణమైన స్వర్గ భోగాలనుభవమెక్కడ? వాసుదేవ మంత్రానుసంధానం చేత అపరిచ్ఛిన్నమైన భగవదనుభవ లక్షణం అనే ముక్తి రూపమైన, సర్వాభ్యధికమైన పురుషార్థాన్ని సాధించే అనుభవమెక్కడ? అని మహర్షులు, తత్త్వజ్ఞానులు సాధన దశయందే స్వర్గ సౌఖ్యానుభవానికీ, వైకుంఠ వాసానుభవానికీ సామ్యం అసంభవమని వివేచన చేస్తారు.

"ఏతేవై నిరయాస్తాత! స్థానస్య పరమాత్మనః"- (శాంతిపర్వం. 196-6) 'మహాభారతం'లో సత్యలోకం వరకు లోకాలనన్నిటినీ వర్ణించి పరమాత్మయొక్క

స్థానం నిరతిశయానందం కలది; తక్కిన బ్రహ్మలోకాదులన్నీ నరకప్రాయాలే అని నిర్ణయింప బడింది.

కాబట్టి, భగవదనుభవమందు లగ్నమైన పరమైకాంత భక్తుల మనస్సు ఇతర విషయాలయందు సంచరించడానికి ఇష్టపడదు.

సిద్ధాంజనం కన్నులకు అలంకరించుకొని నిధిని జూచి, దాన్ని పొందే యత్నం చేస్తున్న వ్యక్తికి ఎవడైనా రెండు నాణాలను అయ్యో! పాపం, దరిద్రుడు కదా! అని ఇవ్వదలచినప్పుడు, ఆ వ్యక్తి రెండు రూపాయిలకు కప్పెడు కాఫీ కూడా లభించదని వాటిని తీసుకొనే ఆశను వదలుకొంటాడు. అట్లే భగవంతుని యందు బద్ధమైన తత్త్వజ్ఞుల మనస్సుకు అంతకంటె స్వల్పమైన ఫలానుభవ రూపం కలిగిన బ్రహ్మ రుద్రాది పదవుల యందు జిహాస ఏర్పడుతుంది. కాబట్టి మోక్షఫలాన్ని పొందే స్వభావం కల వివేకవంతులు ధర్మార్థ కామాలు అనే త్రివర్గ ఫలభోగమందు ఆశను వదలుకొంటారు అని భావం.

*"అడైయుమ్ వైగున్దముమ్ పాఱ్కడలు మంజన వెఱ్పు మవై నణియ*
*కడైయఱ ప్పా శంగళ్ విట్ట పిన్నై యన్ఱి యవనవైకాణ్ కొడానే"*
*(తి.వా.మొ. 8-2-8)*

భగవానుడు వేంచేసియున్న శ్రీవైకుంఠం, క్షీరాబ్ధి, అంజనాద్రి (తిరుమల) మొదలైన దివ్య దేశాలు దగ్గరనే యున్నాయి. అయినా, ప్రాకృత విషయాలయందు పూర్తిగా ఆశను విడిచిన తర్వాతనే గాని, సర్వేశ్వరుడు వాటిని చూడనీయడన్నా రాళ్వార్లు.

*"కస్మైస్వదేత సుఖసంచరణోత్సుకాయ కారాగృహే*
*కనక శృంఖలయాఽపి బంధః-*

కేవలం ఉదరపోషణయందు ఆసక్తి గల వ్యక్తికి భోజనం మాత్రం లభిస్తుందని కారాగృహవాసమే సుఖమనిపిస్తుంది. సుఖావహమైన

సంచరణమందు అంటే స్వతంత్రంగా రాజ్యాన్ని పాలించడం, శత్రువులను గెల్వడం మొదలైన వ్యాపారమందు ఔత్సుక్యం గల రాజకుమారునికి చెరసాలలో వసతి ఏర్పరచబడింది. ఆ కారాగృహవాస కాలమందు సామాన్య జనులకు దుర్లభమైన, మహారాజుకు మాత్రమే యోగ్యమైన, భోగ్యమైన భోగోపకరణ సమృద్ధి కల్పించబడింది. ఆ రాజకుమారుని కాళ్ళకు కూడా ఇనుప సంకెళ్ళు తగిలించడం తగదని బంగారు సంకెళ్ళు అమర్చబడినాయి, అంటే ఇతర భోగ్య సమృద్ధిని గూర్చి చెప్పేదేమి?

రాజులు తమ యాజ్ఞను అతిక్రమించి రాజ్యాన్ని ఆక్రమించడానికి ప్రవర్తిస్తున్న తమ పుత్రాదులను కూడా తగిన కాలం వచ్చేదాక కారాగృహంలో ఉంచడం రాజనీతి శాస్త్ర విరుద్ధం కాదు. మహారాజు కల్పించిన రాజయోగ్య భోగమంతా ఆ రాజకుమారునికి జిహాసాస్పదం అవుతుంది, అంటే రాజభోగాన్ని వదలుకొనే కోరిక జనిస్తుందని అర్థం.

ఆ విధంగానే, తత్త్వజ్ఞులకు తాము కోరిన నిరంకుశ భగవదనుభవ రూపమైన మహానందం సిద్ధించకున్నా, దానికి విరుద్ధమైన కర్మ సంబంధాన్ని ఆపాదించి భగవంతుని వల్ల కల్పించబడిన భోగమంతా జిహాసాస్పదమవుతుందని అర్థం.

ఈ శ్లోకంలో ఉత్తరార్థమందు చెప్పబడిన 'కస్మైస్వదేత?' కాళ్ళకు బంగారు సంకెళ్ళు వేసినా, ఆ బంధం ఎవనికి ఇష్టమవుతుంది? ఎవరికీ ఇష్టం కాదు. ఆ బంధాన్ని వదలు కొంటారు అనే మాటకూ– పూర్వార్థంలో ఉన్న 'భావబంధం త్యజంతి' ఆశాబంధాన్ని వదలు కొంటారు అనే మాటకూ అర్థం ఒక్కటే. ఈ రెండు వాక్యాలయందు అర్థసాదృశ్యాన్ని బట్టి, పూర్వార్థం ఉత్తరార్థం చేత దృఢీకరింప బడింది. ఇది ప్రతివస్తూపమాలంకారం.

"వాక్యయోరేక సామాన్యేప్రతివస్తూపమామతా" అని లక్షణం.

*తవామృత స్యందిని పాదపంకజే*
*నివేశితాత్మా కథమన్యదిచ్ఛతి।*
*స్థితేఽ రవిందే మకరంద నిర్భరే*
*మధు వ్రతో నేక్షురకం హివీక్షతే॥ (27)*

అమృతాన్ని చిందించే నీ పాదకమలాలయందు స్థిరంగా నిల్పబడిన మనస్సును కలవాడు సారంలేని మరొక వస్తువును దేనిని ఆశిస్తాడు? మకరందంతో నిండియున్న కమలంలో ఉండే తుమ్మెద సారంలేని ఉమ్మెంత పూవును కన్నెత్తి కూడా చూడదు కదా! ఆళ్వందార్ స్తోత్రరత్నంలోని ఈ శ్లోక తాత్పర్యార్థమందు ఐక కంఠ్యం కూడా సుస్పష్టం. పోతనామాత్యుని 'మందార మకరంద' పద్యభావమూ ఇదే కదా! బ్రహ్మాది పదవులు, బంగారు సంకెళ్ళతో కారాగృహమందు నివసించడం రెండు భోగాలు సమానమే అని పిండితార్థం. వసంత తిలక.

30. *హస్తీశ! దుఃఖ విషదిగ్ధ ఫలాను బంధి*
*న్యా బ్రహ్మ కీట మపరాహత సంప్రయోగే।*
*దుష్కర్మ సంచయవశాత్ దురతిక్రమే నః*
*ప్రత్యస్త్ర మంజలి రసౌ తవ నిగ్రహాస్త్రే॥*

**అర్థం:** హే హస్తీశ! = సులభో పాయం చేత ఏనుగులు కూడా ఫలం పొందునట్లు అర్చామూర్తిగా వెలసిన దేవా!; దుఃఖ విషదిగ్ధఫల+అనుబంధిని= దుఃఖమనే విషంచేత పూయబడిన సంసారమనే బాణాగ్రానికి సంబంధించినట్టి; ఆ బ్రహ్మకీటం= చతుర్ముఖ బ్రహ్మమొదల్కొని చిన్న పురుగు వరకు; అపరాహత సంప్రయోగే= ప్రతిఘటింపరాని ప్రయోగం కల్గినట్టి; దుష్కర్మ సంచయవశాత్= పాపకర్మ సముదాయ కారణంవల్ల (జాతే) కల్గినట్టి; తవ= నీ యొక్క; నిగ్రహ+ అస్త్రే= కోపం అనే- దండించే అస్త్రం; నః= మాకు; దురతిక్రమే (సతి)= నివారింపరానిది కాగా; అసౌ= ఈ; అంజలిః= కైమోడ్పు- శరణాగతి; ప్రత్యస్త్రం= ఎదిరించే అస్త్రం; భవతి= అవుతుంది.

**తా॥** ఓ హస్తీశా! దుఃఖమే ఎక్కువగా ఉన్న సంసారం అనే బాణం యొక్క మొనకు విషం పూసి దాన్ని మంత్రించి అస్త్రంగా ప్రయోగించావు. ఈ నీ ప్రయోగం- దండన బ్రహ్మ మొదలు కీటం వరకున్న బద్ధజీవులు తప్పించు కొనరానిది. ఇందుకు మేము చేసిన పాపకర్మలే నీ నిగ్రహానికి కారణం. తత్ఫలితంగా, ఏ విధంగానూ నివారింపబడని నీ నిగ్రహాస్త్రాన్ని ఎదిరింపదగిన ప్రత్యస్త్రంగా మేము అంజలిని ఘటిస్తున్నాము.

**వ్యాఖ్య:-** ప్రపత్తి- శరణాగతియే పరమపురుషార్థ సాధనమని సుశ్లోకితం.

ఈ శ్లోకమందు "నానా శబ్దాది భేదాత్"- (3-3-56)

"వికల్పో అవిశిష్ట ఫలత్వాత్"- (3-7-57) అనే బ్రహ్మసూత్రాల అర్థం సంగ్రహింపబడింది.

బ్రహ్మోపాసన విద్యలు అనేక శబ్దాలచే పేర్కొనబడినాయి. ముఖ్యంగా, ఉపాసనాధికారులు భక్తి యోగాన్ని గానీ, ప్రపత్తినిగానీ అనుష్ఠింప వచ్చునని వికల్పింపబడియున్నది. శ్రమతో కూడినది భక్తియోగం. సులభోపాయమైనది ప్రపత్తి-శరణాగతి. ఈ రెండింటిలో దేన్ని అనుష్ఠించినా, ఫలం మాత్రం ఒక్కటే. భేదం లేదు అని వేదాంత శాస్త్రం బోధిస్తున్నది.

"భక్త్యా పరమయా వాఽపి ప్రపత్యా వా మహామతే।
ప్రాప్యోఽ హం నా న్యథా ప్రాప్యో మమకైంకర్య లిప్సు భిః॥"

ఓ గొప్ప ప్రజ్ఞగలవాడా! నాకు సేవ చేయగోరే వారి చేత పరమ భక్తిచేత గానీ, న్యాసవిద్య అనే ప్రపత్తిచేతగానీ నేను పొందదగిన వాడను. మరొక విధంగా నన్ను పొంద శక్యం కాదు అనే భగవచ్ఛాస్త్ర ప్రమాణాన్ని బట్టి, మోక్షసాధనమైన భక్తి, ప్రపత్తులు అనబడే రెండు మార్గాలు వికల్పంగా ప్రదర్శింపబడినాయి. 'వికల్ప'మంటే ఏదైన నొక మార్గాన్ని అనుసరించినా మోక్షఫలం లభిస్తుంది- అని అర్థం. ఫలంలో కూడా భేదం లేదు.

ఇట్లు వికల్పంగా చెప్పబడిన భక్తి ప్రపత్తులలో ఇంతవరకు (27-29) భక్తి నిరూపింపబడింది. ఈ కలికాలంలో ద్రవ్యం, కాలం, శ్రమ ఎక్కువగా వినియోగింపదగిన భక్తి యోగాన్ని అనుష్ఠించడం అశక్యమైనందువల్ల పురుషార్థం ఎట్లు సిద్ధిస్తుంది? అనే శంకను పరిహరించడానికి, ప్రపత్తి రూపమైన ఉపాయమే పరమ పురుషార్థ సాధనమని ఉపదేశిస్తున్నది ఈ శ్లోకం.

*దుఃఖ విషదిగ్ధ ఫలానుబంధిని నిగ్రహాస్త్రే-*

నిగ్రహమంటే కోపం. భగవంతునికి వైషమ్యం- పక్షపాతం ఉండదు. కాబట్టి ఎన్నో జన్మల నుంచి మనం చేసిన కర్మలే భగవన్నిగ్రహానికి కారణం. *"క్షిపామ్య జస్రమశుభాన్"* (భ.గీత- 16-19) అన్నట్లు భక్తి యోగాన్ని అనుష్ఠించే జ్ఞాన శక్తి లేనందువల్ల మనం చేసిన పాపకర్మల వల్ల దుఃఖమే అధికంగా ఉన్న సంసారంలో పడవేసే సంకల్పమే భగవన్నిగ్రహం.

*"ఎణ్ణారాత్తుయర్ విళైక్కుమ్ ఇవైయెన్నవు లుగియత్తై"*- (తి.వా.మొ. 4-9-1) అంతంలేని దుఃఖాలను కలగుజేసే సంసారం యొక్క ఈ స్వభావం సహించరానిది అన్నారు నమ్మాళ్వార్లు.

సంసార ప్రాపక సంకల్పమే భగవన్నిగ్రహం. ఈ నిగ్రహమే అస్త్రంగా (రూపక, శ్లేషాలంకారాలచే) చెప్పబడింది. అస్త్రమంటే, బాణమందు గానీ, గడ్డిపరక యందుగానీ ఎక్కువ శక్తిని కలిగించే మంత్రంచేత అభిమంత్రించి ప్రయోగింపబడేది.

దుఃఖమనే విషంచేత మిశ్రితమైన సుఖానికి సంబంధించింది సంసారం. 'ఫలం' అంటె లాభం, బాణాగ్రమని అర్థం. శ్లిష్టపదమిది. 'సస్యేహేతుకృతే ఫలమ్' (అమరం). *ఫలం జాతిఫలే ముష్టౌ ముక్తాధాన్య కణేషుచ। బాణాగ్రవార్షత్రి ఫలే తక్కోలే ఫలకేపిచ। ఫలం భావే ధనే బీజే నిష్పత్తౌ భోగలాభయోః।* (నిఘంటువులు). విషంచేత పూయబడిన బాణాగ్రానికి సంబంధించినట్టిది అని అస్త్ర పరమైన

అర్థం. బాణం యొక్క మొనకు విషం పూయడం వల్ల ఎక్కువ శక్తి కలిగి, అది చేసే పని వ్యర్థం కాదు అని భావం.

*"స దర్భం సంస్తరాత్ గృహ్య బ్రాహ్మేణాస్త్రేణ యోజయత్।*
*సదీప్త ఇవ కాలాగ్నిః జజ్వాలా భిముఖోద్విజమ్॥"*

(రా. సుం.కాండ. 38-30) శ్రీరాముడు దర్భలచేత అల్లబడిన చాప నుంచి ఒక దర్భకట్టను (తృణవిశేషాన్ని) తీసుకొని, బ్రహ్మాస్త్ర మంత్రాన్ని అనుసంధించి ప్రయోగించాడు. ఆ బ్రహ్మాస్త్రం ప్రళయకాలాగ్ని లాగా, జాజ్వల్యమానంగా సెగలనెగ జిమ్ముతూ కాకి వెంటబడింది.

*"త్రీన్ లోకాన్ పరిక్రమ్య తమేవ శరణం గతః"*- (33). ఆ కాకాసురుడు మూడు లోకాలను తిరిగి తిరిగి అలసిపోయినా, అస్త్ర పరాక్రమం లేశమైనా తగ్గనందువల్ల- రక్షకుడెవ్వడు లేనందువల్లనూ, మళ్ళీ రాముడే రక్షకుడని వచ్చి శరణాగతుడయ్యాడు.

భగవన్నిగ్రహాస్త్రం బలిష్ఠమైనది. అది నివారింప శక్యం కానిదని తాత్పర్యం.

*ఆ బ్రహ్మ కీట మపరాహత సంప్రయోగే-*

నిగ్రహాస్త్రం- భగవత్సంకల్పం- తప్పించుకొనరానిది, ఎదిరించరానిది. అతి స్వల్పమైన, క్షుద్రమైన పురుగుచేత ఎట్లు ప్రతిఘటింప రానిదో, అట్లే అతి బల పరాక్రమ శాలియైన చతుర్ముఖ బ్రహ్మ చేతనూ నిగ్రహాస్త్రం వారింపరానిది, ఎదిరింపరానిదై తన కార్యాన్ని నిర్వహించే సామర్థ్యం కలది. క్షుద్ర జంతువు వలె బ్రహ్మకూడా సంసారమనే సుడి గుండంలోకి భగవానుని నిగ్రహ సంకల్పంచే విసరి పారవేయబడిన వాడే యని తాత్పర్యం.

కొందరికి సంసారం సుఖమనిపించినా ముముక్షువులకు అది స్వస్వరూపానికి తగిన మహానందానికి విరోధికావడం వల్ల భగవత్సంకల్పం నిగ్రహరూపమనియే స్ఫురిస్తుంది. ఇక 'దుఃఖాధిక్యం కలది సంసారం' అని స్పష్టంగా గోచరించినప్పుడు వారికి- ప్రపన్నులకు అది ఎంత దుర్భరమో కదా!

*దుష్కర్మ సంచయవశాత్ దురతిక్రమే నః-*

"*అసన్నేవ స భవతి, అసద్బ్రహ్మేతి వేదచేత్*"- (ఆనందవల్లి) దేవునికి రూపం లేదు, గుణం లేదు, విభూతి లేదు, అసలు దేవుడే లేదు అని అపలపించే మన పాపానికి నిష్కృతి లేదు కదా! శత్రువులు సహింపరాని ఘోరయుద్ధం చేస్తూ, వాని రూపాన్నే లేకుండా చేయాలనే భావంతో ముందుకు దూకుతుంటే, గత్యంతరం లేక అభేద్యమైన నారాయణాస్త్రాన్ని ప్రయోగించినట్లు, మనపాప కృత్యాలవల్లనే భగవంతునికి నిగ్రహ సంకల్పం ఆవశ్యకమయింది.

ఆగ్నేయాస్త్రాన్ని వారుణాస్త్రం నివారిస్తుంది. నాగాస్త్రాన్ని గారుడాస్త్రం నివారిస్తుంది. నారాయణాస్త్రాన్ని వారించడానికి ఎదిరించే అస్త్రమే లేదు. భగవంతుని నిగ్రహ సంకల్పమనే అస్త్రాన్ని వారించే భక్తియోగ మందు జ్ఞాన శక్త్యాదులు మనకు లేనందువల్ల భక్తియోగం చేత వారింప శక్యం కానిదై, అది తన కార్యాన్ని సమర్థవంతంగా నిర్వహిస్తున్నది.

*ప్రత్యస్త్ర మంజలి రసౌ తవనిగ్రహాస్త్రే-*

నిగ్రహాస్త్రం అమోఘంగా స్వకార్య నిర్వహణ సామర్థ్యాన్ని ప్రదర్శిస్తుండగా, దాన్ని నివారించడానికి మనం చేసే ప్రణామమే- అంజలియే- ప్రత్యస్త్ర స్థానాన్ని పొందుతున్నది.

అంజలయతి ఇతి= అంజలిః. అకారవాచ్యుడైన విష్ణుభగవానుణ్ని నీరు నీరు చేస్తుంది- ద్రవింపజేస్తుంది. అనుగ్రహింప జేస్తుందని తాత్పర్యం. 'అంజలి' అనే మాటను ఉచ్చరిస్తూనే- వాచికంగా కైంకర్యం చేస్తున్నప్పుడే, కాయికంగా చేతులను మొగిడ్చి- కైంకర్యం చేయవలెనని నిర్దేశిస్తున్నట్లు అంజలిః 'అసౌ' (ఈ) అనే పదం (అదశ్శబ్దం నిర్దేశవాచకం) సూచిస్తున్నది.

విశ్వామిత్రుడు అస్త్ర ప్రయోగం చేసినప్పుడు దాన్నివారించడానికి వసిష్ఠుడు బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. అశ్వత్థామ ప్రయోగించిన అస్త్రాన్ని అణచి

వేయడానికి శ్రీకృష్ణుడు నారాయణాస్త్రాన్ని ఉపయోగించాడు. ఆ విధంగా, భగవానుడు స్వసంకల్పమనే నిగ్రహాస్త్రాన్ని ప్రయోగిస్తున్నప్పుడు, బద్ధాంజలియై నరుడు ప్రపత్తిని ప్రత్యస్త్రంగా ఉపయోగిస్తే, భగవానుడు 'జితోఽస్మి' యని అనుగ్రహిస్తాడు కదా!

*"కృతాపరాధస్య హితే నాన్యత్ పశ్యామ్యహం క్షమమ్।*
*అంతరేణాంజలిం బద్ధ్వా లక్ష్మణస్య ప్రసాదనాత్॥"*
*(రా. కిష్కింధా. 32-17)*

అపరాధపడిన నీవు లక్ష్మణస్వామి సన్నిధిలో అంజలి బద్ధుడవై శరణు పొందడం కంటె వేరొక ఉపాయం (క్షమాపణ హేతువు) కానరాకున్నది అని ఆంజనేయుడు సుగ్రీవునికి హితబోధ జేశాడు.

ఏదో కారణంగా, ప్రతికూలుడై ప్రవర్తించినా, ప్రపత్తిని చేస్తే భగవానుడు క్షమించగలడు. శ్రీ బదరికాశ్రమంలో ధర్మాత్మజుడైన భగవంతుణ్ణి ఎదిరించి క్రోధాంధుడై రుద్రుడు బాణం వేయగా, చతుర్ముఖ బ్రహ్మ వచ్చి, అతడు సర్వేశ్వరుడనే విషయం తెల్పాడు.

*"ప్రసాదయామాస భవో దేవం నారాయణం ప్రభుమ్।*
*శరణంచ జగామాద్యం వరేణ్యం వరదం హరిమ్॥"*

వెంటనే రుద్రుడు భగవంతుడైన శ్రీమన్నారాయణుణ్ణి శరణు పొందడంచేత భగవదనుగ్రహాన్ని సంపాదించుకొన్నాడు.

*"తతోఽథ వరదో దేవో జితక్రోధో జితేంద్రియః।*
*ప్రీతిమాన భవత్తత్ర రుద్రేణ సహసంగతః॥" (ర.త్ర.సారం)*

అనుగ్రహాన్ని కలుగజేసే శరణాగతి జేయగా జితేంద్రియుడైన భగవానుడు కోపం పోయినవాడై రుద్రుని విషయంలో ప్రీతిగలవాడై అతనితో కలిసి యుండెనని తెలుస్తున్నది.

"తేశ మానవణి కలనుమ్ ఎన్ కైకూప్పు చ్చెయ్ గైయే"- (తి.వా.మొ. 4-3-2) శ్రియఃపతి నా అంజలి బంధాన్ని ఉజ్జ్వలాభరణంగా స్వీకరించాడు అని వకుళాభరణుల శ్రీసూక్తి.

*"త్వ దంఘ్రి ముద్దిశ్య కదాఽపి కేనచిత్*
*యథా తథావాఽపి సకృత్ కృతోఽంజలిః।*
*తదైవ ముష్ణాత్య శుభాన్య శేషతః*
*శుభాని పుష్ణాతి నజాతు హీయతే॥" (స్తో. ర. 28)*

నీ పాదపద్మాలను ఉద్దేశించి ఎప్పుడైనా, ఎవనిచేత అయినా, ఏ రీతిగా ఉంటే ఆ రీతిగానే యైనా ఒక్కసారి చేయబడిన అంజలి, ఆ క్షణమే అశుభాలను హరిస్తుంది. శుభాలను సమృద్ధిగా సమకూర్చుతుంది. "న జాతు హీయతే" అన్నది ఇతర కర్మల లాగా ఫలాన్ని ఇచ్చిన తర్వాత నశించే విధంగా నశించక, ఎల్లప్పుడూ ఉంటుంది అని ఆళ్వందార్ సూక్తి.

*"రూక్షాక్షరాణి శృణ్వన్వై తథా భాగవతేరితాన్।*
*ప్రణామ పూర్వకం క్షాంత్యా యోవదే ద్వైష్ణవోహి సః॥" (ర.త్ర.సా)*

భాగవతులు తనను గూర్చి పరుషంగా మాటలాడితే, విని, దండం సమర్పించి క్షమాపణను కోరుకొనేవాడు శ్రీ వైష్ణవుడు- ప్రపత్తి, న్యాసం, శరణాగతి, బద్ధాంజలి సమానార్థకాలు. ఇందు, అంజలి శబ్దంచేత ప్రపత్తి చెప్పబడింది. ప్రపత్తికి భగవన్నిగ్రహ నివర్తకత్వం కైముతికన్యాయ సిద్ధం. వసన్త తిలక.

*31. త్వద్భక్తి పోత మవలంబితు మక్షమాణాం*
*పారం పరం వరద! గంతు మనీశ్వరాణామ్।*
*స్వైరం లిలంఘయిషతాం భవ వారి రాశిం*
*త్వా మేవ గంతు మసి సేతు రభంగురస్త్వమ్॥*

**అర్థం:** హే వరద!= వరాలనిచ్చే ఓ దేవా!; త్వత్+భక్తిపోతం= నీమీద భక్తి అనే నౌకను; అవలంబితుం= ఆశ్రయించడానికి- చేతులతో పట్టుకోవడానికి; అక్షమాణాం= సామర్థ్యం లేనివారికి; పరం= అత్యంత దూరాన ఉన్న- పరబ్రహ్మ రూపమైన; పారం= ఆవలి తీరాన్ని; గంతుం= (భక్తియోగం చేత) పొందడానికి; అనీశ్వరాణాం= శక్తిలేని వారికి= భవ వారిరాశిం= సంసారమనే సముద్రాన్ని; స్వైరం= స్వేచ్ఛగా; లిలంఘయిషతాం= దాటగోరేవారికి; త్వాం= నిన్ను; గంతుం= (చేర) పొందడానికి; త్వం, ఏవ= నీవే; అభంగురః= (క్షతిలేని) దృఢమైన; సేతుః= వారధి- వంతెనగా; అసి= ఉన్నావు.

**తా॥** ఓ వరదా! నీ పైన ఉండే భక్తి యనే నావను ఆధారం చేసుకొని సంసారమనే సాగరాన్ని దాటి ఆవలిగట్టుకు చేరాలనే జ్ఞానం లేని వారికీ- జ్ఞానమున్నా చాలా దూరంగా ఉండే సంసార సాగరంలో ఈవలి దరినుంచి ఆవలి దరికి చేరుకొనే ఆయాసాన్ని భరించే దేహశక్తి లేని వారికీ, సంసార సముద్రాన్ని ఇష్టపడి దాటడానికి ఆశపడేవారికీ, ఓ దేవా! నిన్ను పొందడానికి నీవే సులభమార్గమై, దృఢమైన సేతువు- వంతెనగా ఉన్నావు.

భగవానుడే ఉపాయం, ఉపేయం అని తాత్పర్యం.

**వ్యాఖ్య:-** భగవత్సాన్నిధ్యాన్ని పొందగోరే జనులకు 'ప్రపత్తి'యే లఘూపాయమని సుశ్లోకితం.

భక్తి గరీయసి, ప్రపత్తి లఘీయసి కదా! గురుతరమైన భక్తియోగానికీ, అత్యంత లఘువైన ప్రపత్తికీ వికల్పం ఉండడం (రెండింటిలో ఏ ఒకటినైనా అనుష్ఠిస్తే మోక్షఫలం లభిస్తుంది అనే శాస్త్ర ప్రమాణం) వల్ల అందరు లఘూపాయమైన ప్రపత్తినే అనుష్ఠించడానికి సిద్ధపడుతారు. గురుతరోపాయమైన భక్తియోగసాధనకు ఎవడు కూడా ఇష్టపడడు. ఆ భక్తియోగానుష్ఠాన విధాయకమైన శాస్త్రానికి అప్రామాణ్యమూ ఏర్పడుతుంది కదా! అందువల్ల ప్రపత్తి, భక్తికి అంగమే కాని స్వతంత్రమైనది కాదు అనే శంకను నివారించడానికి శాస్త్ర విహితమైన

వికల్పంచేత 'ఫలప్రాప్తి'లో భేదం ఉండదు. వ్యవస్థితాధికారి భేదం మాత్రం ఉంటుందనే విషయం ఈ శ్లోకంచేత తెల్పబడుతున్నది.

శాస్త్రమందు మోక్షోపాయంగా చెప్పబడిన భక్తి ప్రపత్తులయందు జనులు తమ పుణ్యపరిపాకంవల్ల ఇష్టం కలవారై యుండడానికి సర్వేశ్వరుడే స్వయంగా కారణభూతుడు.

భక్తియోగం త్రైవర్ణికులు కానివారికీ, త్రైవర్ణికులలోనూ జ్ఞానంలోకానీ, శక్తిలోగానీ, ఈ రెండింటిలోగానీ కొరత కలవారికీ, మోక్షఫలం కలుగడంలో ఆలస్యాన్ని సహించి యుండజాలనంత తీవ్రమైన ఆర్తిగలవారికి అనుకూలమైనది కాదు.

*త్వద్భక్తి పోత మవలంబితు మక్షమాణాం-*

భగవద్భక్తి యోగ మందు అధికారం లేని ముముక్షువులు ప్రపత్తి యందు అధికారులని చెప్పబడుతున్నది. భక్తి పడవగా నిరూపింపబడింది. భక్తియనే నావను అవలంబించడానికి తగిన జ్ఞానరూపమైన సామర్థ్యం లేనివారికి అని అర్థం.

సాంగోపాంగంగా ఉండే భక్తి యొక్క స్వరూపజ్ఞానాన్ని సంపాదించడం భక్తియోగాధికారికి ఆవశ్యకం. ఇందు 'జ్ఞానం' అంటే వేద శాస్త్ర వాక్యార్థాలను శ్రవణం, మననం చేసే యోగ్యత అన్నమాట. ఇది బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు అనబడే త్రైవర్ణికులు గురువువద్ద అభ్యసించిననే గాని యమ నియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణ ధ్యానాలనే సప్తాంగాలతో కూడిన అంగియైన సమాధి యోగం (సముచ్చయంగా, అష్టాంగ యోగం అనబడే భక్తి) యొక్క నిష్ఠ స్పష్టంగా తెల్యదు కదా! పూర్ణజ్ఞానం లేకుండా భక్తియోగాన్ని అవలంబిస్తే భక్తి చెదరి యోగం- దృఢమైన సంబంధం- భ్రష్టమయ్యే అవకాశం ఉంది.

నావను అవలంబించడమంటే నావను చేతులతో నడపడానికిగల జ్ఞానమన్నమాట. నావకుగల సామగ్రితోనూ, పయనించే మార్గంతోనూ బాగా

పరిచయమూ, నడిపే అభ్యాసమూ ఉండాలి. లేకపోతే సముద్రంలో మహావాయువులచేత నావకు చాంచల్యం కలుగుతుంది. దారి తప్పి సముద్రం లోపల ఉన్న గుట్టలకు తగిలి నావ భగ్నమవుతుంది. అట్లే, భక్తి కూడా కొంచెం అనవధానతను కలిగియుంటే లక్ష్యం పూర్తి కాదని తాత్పర్యం.

వేదాది జ్ఞానంలేని త్రైవర్ణికులే కాదు, మోక్షఫలాన్ని ఆశించే మానవులందరు స్త్రీలు, పురుషులు కూడా ప్రపత్తిని అనుష్ఠించడానికి అధికారులు అని సుస్పష్టం.

*పారం పరం గంతుమనీశ్వరాణాం*–

భక్తియోగం చేత పారభూతుడైన పరమాత్మను పొందడానికి శక్తిలేని ప్రపన్నులకు అని అర్థం.

భక్తియోగాధికారులకు చిరకాలం అనుష్ఠేయమైనది భక్తి. శరీరాన్ని విడిచి పరమ పదానికి ప్రయాణం చేసేవరకు ప్రతిదినం అనుష్ఠింపదగినది. ఇతర విషయాలయందు మనస్సును చేరనీయక, భగవంతుని స్వరూపాదుల విషయంలో తైలధారవలె ఎడతెగకుండ నిరతిశయ ప్రీతిరూపమైన ధ్యానం చేయడానికి "*ఆశిష్ఠో ద్రఢిష్ఠో బలిష్ఠః*" అన్నట్లు దేహేంద్రియాదుల శక్తి యుండాలి.

నావ మీద ఆవలితీరాన్ని చేరడానికి బహుదూరం పయనించే శక్తి కలిగినవాడై యుండాలి. నావకూడా దృఢంగా ఉండాలి. లేనిచో జలచరాదులచే ఆకర్షింప బడినా, నావకు ఛిద్రంబడినా, నావమునిగిపోయే అవకాశముంది.

సంసార సముద్రానికి పరబ్రహ్మ రూపమైన ఆవలిగట్టును చేరుకొనగోరే వ్యక్తి శారీరక శక్తిలేని వాడైననూ ప్రపత్త్యనుష్ఠానానికి అధికారి యని చెప్పబడింది.

*స్వైరం విలంఘయిషతాంభవ వారిరాశిం*
*త్వామేవ గంతుమసి సేతు రభంగురస్త్వమ్*–

భక్తియోగనిష్ఠ కలవారికి భగవద్గుణానుభవ రూప సుఖం ఈ లోకమందు విపులంగా ఉండి, మోక్షం కలుగడంలో ఆలస్యమవుతుంది. ప్రారబ్ధావసానమందే

మోక్షం కలుగుతుంది. ప్రారబ్ధకర్మ ఈ జన్మలో కాక మరొకటి, రెండు జన్మలలో పూర్తి (సమాప్తి) కావచ్చు కదా! సంసార సముద్రాన్ని దాటడానికి ఎంతకాలమైనను విలంబాన్ని సహించడం భక్త్యధికారి లక్షణం.

ప్రపత్తినిష్ఠునికి ఈ లోకంలో జీవయాత్ర సారవంతంగా ఉండదు కాబట్టి, మోక్షం కోసం కాల విలంబాన్ని సహించకపోవడం ప్రపత్త్యధికారి లక్షణం.

*"ఆవిక్కోర్ పత్తుకొంబు నిన్నలాలటిగిల్లిలేన్ నాన్;*
*కూవిక్కొళ్ళాయ్ వన్దు అన్దో!" (తి.వా.మొ. 10-10-3)*

ఓ శ్రియఃపతీ! నా యాత్మకు పట్టుకొమ్మవైన నీవు తప్ప నాకు వేఱే అవలంబం లేదు. అయ్యో! వచ్చి పిల్చుకొని పోవయ్యా! అనే సూక్తిలో పరాంకుశుల ఆర్త ప్రపత్తి వైభవం ప్రకాశిస్తున్నది.

*"శ్రీమన్నభీష్టవరద! త్వామస్మి శరణం గతః।*
*ఏ తద్దేహావసానే మాం త్వత్పాదం ప్రాపయస్వయమ్॥"*

(న్యాసదశకమ్-4)

భక్తులు ప్రసన్నులు ఎవరు ఏది కోరితే, వారికి అట్టి వరాన్ని ఇచ్చే శ్రీమంతుడా! ఈ దేహం పడిపోయిన వెంటనే నన్ను నీవే నీ పాద పద్మయుగళ మందు చేర్చుకోవయ్యా! నీ సన్నిధిలో మోక్షం కోసమే శరణాగతుడనయ్యాను అని నిగమాంత దేశికుల నివేదన.

ఈ (30) శ్లోకమందున్న వరద! అనే సంబోధన సాభిప్రాయమే స్వైరం- సంసారసముద్రాన్ని స్వేచ్ఛగా సంతరించే అపేక్ష ఉండి, జ్ఞానం, శక్తి, కాల విలంబ సహనం లేని ప్రపన్నులకు భక్తియోగాన్ని- నావను ఆశించకుండా, నిరపేక్ష సాధనమైన సేతువుగా రూపొందినాడు భగవానుడు.

భక్తినావగానూ, సిద్ధోపాయమైన భగవానుడు సేతువుగానూ రూపించబడి నందువల్ల, లోకంలో పడవకు- వంతెనకు ఎంత భేదమున్నదో, భక్తి ప్రపత్తులకూ

అంత భేదమున్నది. నావనవలంబించిన వ్యక్తికి ఉపద్రవం సంభవించే అవకాశం ఉన్నట్లే సేతువు కూడా శిథిలమైనదైతే దానిమీద నడిచిపోయే వ్యక్తి అది కూలిపోయినప్పుడు, అధః పతితుడయ్యే ప్రమాదముంది. కాని ఈ వంతెన జీర్ణమైనది కాదని 'అ భంగురః' దృఢమైనదని నొక్కి చెప్పబడింది కదా!

పారాన్ని చేరడానికి దృఢమైన సేతువు ఉండగా నౌకను అవలంబించే ప్రసక్తియే ఉండదు. ప్రపత్త్యధికారిని తన దగ్గరికి చేర్చుకోవడానికి స్వీకృతభరుడైన భగవానుడు తానే సేతువుగా రూపొందడం వల్ల భక్తియోగాద్యన పేక్షత్వం 'సేతు' శబ్దంచేత సూచింపబడింది.

ఆవలిగట్టుకు చేరడానికి వంతెనపైన నడిచిపోయే వ్యక్తి తనతో పాటు గ్రుడ్డివాణ్ణి కూడా తీసుకొనిపోయే లాభం ఉంది. ఇక తన ఆత్మీయులనూ వదలకుండా తీసుకొని పోగలడని వేరే చెప్పనక్కర లేదు కదా! ప్రపన్నులెందరో నిర్భయంగా నడుచుకొంటూ పారం చేరుతారు.

లౌకిక సేతువు- వంతెన యందు ప్రాపకం వేరు, ప్రాప్యం వేరు. సంసార సంతరణ సేతువునందు రెండూ వరదుడే- భగవానుడే అని 'ఏవ' కారం సూచిస్తున్నది.

*"ప్రపత్తే రితరాపేక్షామా వృత్తించని వారయన్।*
*ప్రపన్నా భయదోహస్తః పాతునః శార్ఙ్గధన్వనః॥"*

భగవదర్చామూర్తి యొక్క అభయముద్రగల దక్షిణహస్తం ప్రపత్తికి ఇతరాపేక్షనూ, ఒక్కసారే తప్ప (మళ్ళీ మళ్ళీ చేయడాన్నీ) పౌనః పున్యాన్నీ నివారిస్తున్నట్లు సూచిస్తుంది. (తిరునెడున్దాణ్డకమ్ 'మైవణ్ణ' పాశురం, 21- వ్యాఖ్యానంలో అభయ హస్తస్తుతి).

'పరాధికరణం' (3-2-7)లో 'సేతువు' అంటే పరబ్రహ్మమని సిద్ధాంతీకరింపబడింది. "అమృతస్యైష సేతుః"- (ముం.ఉ. 4-5) సంసార

సముద్రం నుంచి అవతలి యొడ్డుకు చేతనులను ఈ పరమ పురుషుడే చేర్చుతాడు కాబట్టి 'సేతువు'గా వ్యవహరింపబడుతున్నాడని అర్థం. అవతలి యొడ్డు మోక్షస్థానమే.

*"య ఆత్మాస సేతు ర్విధృతి రేషాంలోకానాం అసంభేదాయ"*– (ఛాం. ఉప. 8–4–1) ఈ లోకాలను చెదరిపోకుండా ఉండునట్లు చేయడం కోసం ఎవడు వాటిని బంధించాడో, ఆ పరమాత్ముడే సేతువుగానూ, ధారకుడుగానూ పేర్కొనబడుతున్నాడు.

సినోతి–బధ్నాతి, స్వస్మిన్ సర్వం చిదచిద్వస్తు జాత మితి= సేతుః; అనే సేతు శబ్ద వ్యుత్పత్తిని బట్టి చిదచిద్విశిష్టమైన ఈ జగత్తునంతను తనయందు బంధించుకొనేది సేతువు.

*"ఉపపత్తేశ్చ"*– (3–2–34) *"ప్రాప్యస్య పరమపురుషస్య స్వప్రాప్తౌ స్వస్యైవో పాయప్రపత్తేః"* శ్రుత్యుపపత్తి యుండడం వల్ల ప్రాప్యుడైన సర్వేశ్వరుడు తానే స్వయంగా తనను పొందించే ఉపాయం అని శ్రీభాష్య పంక్తి.

సంసారమనే మున్నీటిలో మునుగుతున్న అజ్ఞులూ, అశక్తులూ అయిన ప్రపన్నులకు దరి, దారి రెండూ శ్రీమన్నారాయణుడే యని శ్లోక సారార్థం. వసంత తిలక.

*32. అశ్రాంత సంసరణ ఘర్మ నిపీడితస్య*
*భ్రాంతస్యమే వరద! భోగమరీచికాసు।*
*జీవాతురస్తు నిరవగ్రహమేధ మానో*
*దేవ! త్వదీయ కరుణామృత దృష్టి పాతః॥*

**అర్థం:** హే దేవ!= ఓ దేవుడా!; అశ్రాంత సంసరణ ఘర్మ నిపీడితస్య= ఎడతెగని సంసారమనే గ్రీష్మర్తువు నందు చాలా పీడింపబడుతున్నట్టి; భోగ మరీచికాసు= విషయ సుఖాలు అనే ఎండమావులయందు; భ్రాంతస్య= భ్రమతో తిరుగుతున్న; మే= నాకు;

హే వరద= ఓ వరద రాజా!; నిరవగ్రహం= అడ్డులేని; ఏధమానః= వృద్ధిని కలిగియున్నట్టి; త్వదీయ కరుణామృత దృష్టిపాతః= నీయొక్క దయాగుణం అనే అమృత పూరితమైన కటాక్ష ప్రసారం; జీవాతుః= జీవింపజేసే ఔషధం; అస్తు= అవుగాక!

**తా॥** ఓ వరద దేవా! నిరంతరం సంసారమనే గ్రీష్మతాపంచేత పీడింపబడుతూ, విషయభోగాలనే ఎండమావుల యందు పరిభ్రమిస్తున్న నాకు, ఏ ప్రతిబంధకం లేకుండా వర్ధిల్లుతున్న నీ కృపామృత పూర్ణమైన కటాక్ష ప్రసారం ప్రాణధారక మవుగాక! అని ప్రార్థన.

**వ్యాఖ్య:**– సంసారతాప పీడితునికి భగవత్కృపామృత వర్షపాతమే ఉజ్జీవన హేతువు అని సుశ్లోకితం.

నివృత్తి ధర్మమైన మోక్షేచ్ఛకు ముందు దానికి సంబంధించిన అనుష్ఠానమే ఉండదు కాబట్టి, ప్రవృత్తి ధర్మ రూపానికి మోక్ష ప్రయోజకత్వం అసంభవం. భక్తి ప్రపత్తులకు మోక్షోపాయత్వం సంభవమే అయినా, మోక్షప్రాప్తికై ఆలస్యాన్ని సహించని ప్రపత్త్యధికారికి ఆచార్య సంబంధం లేకుంటే, మోక్షోపాయం సిద్ధించడం దుర్ఘటం. సదాచార్య సంబంధం పొందడానికి భగవత్కృపాకటాక్షం అత్యంతావశ్యక మని ప్రకటిస్తున్నది ఈ శ్లోకం.

*అశ్రాంత సంసరణ ఘర్మ నిపీడితస్య–*

అనాదికాలం నుంచి సంసారమందు సంచరించే వ్యక్తి యొక్క ప్రవృత్తులన్నీ బహుశః పాపాలనే కలిగిస్తుంటాయి. వేసవికాలమందు ఎండలో తిరిగే వ్యక్తికి తాపం పుట్టి చాలా బాధపడుతాడు. అట్లే సంసారం అనే గ్రీష్మర్తుకాలమందు నిర్విరామంగా సంచరించే వ్యక్తికి ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికం అనే తాపత్రయం కలగడం చేత అతడు చాలా పీడితుడవుతాడు.

*భోగ మరీచికాసు భ్రాంతస్య–*

తాపతప్తుడైన వ్యక్తి దాహ మార్పుకోవడానికి ఎండమావులను జూచి నీటి ప్రవాహమని భ్రమించి, వాటి వెంటబడి వ్యర్థంగా పరుగెత్తుతాడు. వనితాది

విషయ సుఖాలే మరీచికలు- ఎండమావులు. సర్వోపకరణాలతో పరిపూర్ణమైన మానవ జన్మ భగవత్ప్రాప్తికి సుగమసోపానమై లభించింది. భగవంతుడిచ్చిన బుద్ధిని, ఇంద్రియాలను దుర్వినియోగ పరచి మానవుడు చెడిపోతున్నాడు. శబ్ద స్పర్శ రూప రసగంధాలు 'విషయాలు' అనబడుతాయి. ఒక్కొక్క ఇంద్రియం చక్కగా ప్రవర్తించకపోతే చావు తప్పదు. లేడి పాటకు, ఏనుగు స్పర్శకు, మిడుత- దీపపు పురుగు- రూపానికి, చేప రుచికి, తుమ్మెద వాసనకు లొంగిపోయి నశిస్తున్నాయి. మానవుడు అన్నిటికీ లొంగి చెడిపోతున్నాడు.

ఎండమావులలో ఎంత సేపు సంచరించినా నీరు దొరకదు, తాపం ఆరదు. అట్లే సంసారమందు విషయ సుఖ భ్రాంతిచే ఎంతకాలం సంచరించినా సుఖం లభించదు, తాపత్రయ పీడ తప్పదు.

*నిరవగ్రహ మేధమానః త్వదీయ కరుణామృత దృష్టి పాతః మే జీవాతు రస్తు-*

'అవగ్రహం' అంటే వర్ష ప్రతిబంధకం- అనావృష్టి. 'నిరవగ్రహం' నిష్ప్రతి బంధకం అన్నమాట. అడ్డులేనిదని అర్థం. తాప తప్తునికి వర్షం సుఖాన్ని కలిగిస్తుంది. వర్షం లేకుంటే తాపం తీరడానికి ప్రతిబంధకం కదా! భగవత్కరుణామృత వర్షం, ప్రతిబంధకం- అడ్డు- లేకుండా, వృద్ధిని పొందుతుంటుందని భావం.

కరుణయే అమృతం. అమృతం అంటే 'నీరు' అని అర్థం.

*"సలిలంకమలం జలం, పయః కీలాల మమృతం జీవనం భువనం వనమ్"* (అమరకోశం).

కరుణామృతం తాపహరం; జరామరణ విధ్వంసకమైనదని అర్థం. కరుణామృతం చేత పూరితమైన దృష్టి= కరుణామృత దృష్టి. మధ్యమ పదం లోపించిన సమాస పదమిది.

సంసార విషయ లంపటంచేత దుఃఖపడుతున్న చేతనునికి ఏ ప్రతిబంధకం లేకుండా వృద్ధిని పొందే భగవద్దయాగుణం అనే అమృతంతో నిండిన కటాక్ష ప్రసారమే శ్రేయస్సిద్ధిని కలిగిస్తుంది.

భగవత్కృపా పూర్ణమైన కటాక్ష ప్రసరణం ముముక్షువునకు ఆచార్య సంబంధాన్ని ఆపాదించి, తత్త్వజ్ఞాన రూపమైన జీవనానికి ఔషధం అవుగాక, అని 'అస్తు'- అస్ ధాతువు యొక్క ప్రార్థనార్థకమైన - విధి 'లోట్' ప్రయోగింపబడినది.

సదాచార్య సంబంధం వల్ల జ్ఞానులకు ఉండలసిన గుణాలు, ఆచార వ్యవహారాలు కలుగుతాయి. హేయ, ఉపాదేయాలను- విడువవలసినవి, గ్రహించవలసినవి ఏవో వాటిని వివేచించి తెలుసుకొనే ప్రవృత్తి ఏర్పడుతుంది.

*"ఈశ్వరస్య చ సౌహార్దం యదృచ్ఛా సుకృతం తథా।*
*విష్ణోః కటాక్ష మద్వేష మాభిముఖ్యంచ సాత్త్వికైః।*
*సంభాషణం షడేతాని హ్యాచార్య ప్రాప్తిహేతవః॥" (శ్రీ.ర.త్ర.సా)*

భగవదిచ్ఛ, యాదృచ్ఛిక సుకృతం, భగవానుని కటాక్షం, అద్వేషం, అభిముఖ్యం, సాత్త్వికులతో సంభాషణ- ఈ యాఱు సదాచార్యుణ్ని పొందడానికి కారణాలుగా శాస్త్రం బోధిస్తుంది. ఈ యాఱింటిలో ముందు ముందున్న కార్యం కంటె ఉత్తరోత్తరం కార్య ప్రాధాన్యాన్ని కలదని సూచిత మవుతుంది.

*"జాయ మానం హి పురుషం యం పశ్యేన్మధు సూదనః।*
*సాత్త్వికః సతు విజ్ఞేయః సవైమోక్షార్థ చింతకః॥"*
*(మహాభారతం-మోక్షధర్మ పర్వం- 358-73)*

జన్మించే కాలాన ఏ వ్యక్తిని భగవానుడు కటాక్షిస్తాడో, అతడు సాత్త్వికుడు కాగలడు. అతడే మోక్షఫలాన్ని పొందడానికి ప్రయత్నిస్తాడు అని శ్లోక తాత్పర్యం.

పుట్టబోయే దశలో భగవత్కటాక్షం ఏ జన్మలో కలుగుతుందో, ఆ జన్మలోనే సదాచార్యులను అవశ్యంగా సమాశ్రయించే వాడవుతాడనే ప్రమాణ వచనాన్ని బట్టి, ముఖ్యంగా భగవత్కటాక్షం, రూపకాలంకారం చేత "కరుణామృత దృష్టి పాతః జీవాతురస్తు" అని సంప్రార్థితం. వసన్త తిలక.

*33. అంతః ప్రవిశ్య భగవన్నఖిలస్య జంతో*
*రాసేదుష స్తవ కరీశ! భృశం దవీయాన్।*
*సత్యం భవేయ మధునాఽపి స ఏ వ భూయః*
*స్వాభావికీ తవదయా యది నాన్తరాయః॥*

**అర్థం:** హే కరీశ!= ఓ హస్తిగిరినాథా!; హే భగవన్= ఓ షాడ్గుణ్య పరిపూర్ణుడా!; అఖిలస్య= సమస్తమైన; జంతోః= ప్రాణులకు; అంతః= లోపల; ప్రవిశ్య= అను ప్రవేశంచేసి; ((చేరి) ఆసేదుషః= చాలా దగ్గరగా ఉన్న; తవ= నీకు; భృశం= మిక్కిలి; దవీయాన్= దూరస్థుడనో; (అట్టి దౌర్భాగ్యుడనైన నేను); తవ= నీ యొక్క; స్వాభావికీ= సహజమైన; దయా= కృప; అంతరాయః= ఆటంకమై; న, యది (భవేత్)= ఉండకుంటే; అధునా, అపి= ఇప్పుడు కూడా; భూయః= మళ్ళీ; సః, ఏవ= నీకు దూరస్థునిగానే; సత్యం= నిశ్చయంగా; భవేయం= ఉండేవాడను.

**తా॥** షాడ్గుణ్య పూర్ణుడవైన ఓ హస్తిశైలేశా! పశు పక్షి కీటాది రూపమైన ప్రాణి యొక్క హృదయ గుహలో ప్రవేశించి, అంతర్యామివై చాలా దగ్గరగా ఉన్నావు. అయినా, నీ స్వరూప స్వభావాలు తెలియని నేను నీకు చాలా దూర మందున్నవాడనయ్యాను. దయాగుణం నీకు స్వభావ సిద్ధమైయున్నది. అట్టి నీ దయ నాకు నీ స్వరూపజ్ఞానం లేకపోవడమనే దూరమందు ఉండడానికి ప్రతిబంధకంగా లేకపోతే నేను ఈ జన్మలో కూడా మళ్ళీ నీకు దూరస్తుడనై యుండే వాడను. ఇది సత్యం.

**వ్యాఖ్య:-** సర్వప్రాణులయందు సర్వేశ్వరుని యొక్క సౌహార్దం స్వాభావికమని వర్ణితం.

'భగవానుడు' అంటే విష్ణుపురాణంలో నిర్వచించిన శ్లోకమిది-

*జ్ఞానశక్తి బలైశ్వర్య వీర్య తేజాంస్య శేషతః।*
*భగవచ్ఛబ్ద వాచ్యాని వినాహేయైర్గుణాదిభిః॥* (6-5-79)

దుర్గుణాలేవీ లేనట్టి సకల కల్యాణ గుణాలకు ఉపలక్షకంగా ఉన్న జ్ఞానం, శక్తి, బలం, ఐశ్వర్యం, వీర్యం, తేజస్సు అనే ఆరుగుణాలు కల పరమ పురుషుడే భగవానుడనడానికి అర్హుడని తెల్పుతున్నది. 'వ్యాస భగవానుడు, వశిష్ట భగవానుడు' అని పూజనీయుల పట్ల ఆ పదాన్ని ఔపచారికంగా వాడుతుంటాం.

జాయమాన కటాక్షం మొదలైనవాటికి ఆదికారణం 'దయ'- 'ఈశ్వరస్య చ సౌహార్దం' (గత శ్లోక భావమందు వివరింపబడింది) సమర్థింపబడుతున్నది.

*అఖిలస్య జంతో రంతః ప్రవిశ్య ఆసేదుషః-*

భగవానుడు దయగలవాడు. పశుమృగ పక్షికీటాది అనేక శరీరాలను ధరించి పుట్టిన జీవుల లోపల హృదయ బిలమందు భగవానుడు కూడా అనుప్రవేశం చేశాడు. ఎంత సౌహార్దమో!

"తత్సృష్ట్వా, తదేవానుప్రావిశత్"- (తై.ఉప) పరమాత్మ జగత్తును సృజించి, దానిలోనే ప్రవేశించాడు.

"*ఆనేన జీవేనాత్మనాఽ ను ప్రవిశ్య*"- (ఛాం. ఉప. 6-3-2) జీవునితో పాటు తాను-భగవానుడు- ప్రవేశించి అని యర్థం.

"*అంతః ప్రవిష్టః శాస్తా జనానాం సర్వాత్మా*"- భగవానుడు జనుల (హృదయం) లోపల ప్రవేశించి వారిని నియమిస్తూ సర్వాంతర్యామియై యున్నాడు (తై.చిత్తి-11). ఎంతో దగ్గరగా ఉన్నాడు కదా!

జనుల యొక్క ప్రేయఃశ్రేయస్సులను కోరియుండడమే సౌహార్దం. ఆ సేదుషస్తవ భృశం దవీయాన్-

జీవాత్మలకు పరమాత్మ చాలా సన్నిహితుడై- సమీపమందే- యున్నాడు. అయినా పరమాత్మయొక్క స్వరూపమెట్టిదో, స్వభావమెట్టిదో జీవులకు తెలియదు కాబట్టి, పరమాత్మకు ఎంతో దూరంగా ఉన్నట్టి వారే కదా!

'అంతర్యామ్యధికరణం' (1-2-4) 'అంతర్యామ్యధి దైవాధి లోకాదిషు తద్ధర్మవ్యపదేశాత్' (1-2-19) అనే బ్రహ్మ సూత్రమందు-

అధిదైవాధిలోకాది పదాలతో కూడిన వాక్యాలయందు అంతరాత్మగా ఉన్నవాడు పరమాత్మయే; ఎందుకంటే, అతని యందు పరమాత్మ ధర్మాలు ఉన్నాయని తెల్పబడింది.

సహజంగా అమృత స్వరూపుడు, సర్వజ్ఞత్వ, సర్వ నియంతృత్వ, సర్వాంతర్యామిత్వ ధర్మాలు కలవాడు పరమాత్మయే.

"నాన్యోఽతోఽస్తి ద్రష్టా"- పృథివి మొదలైన వాటిచే తెలియరానివాడయ్యీ వాటిని జూచేవాడనీ, అట్టి నియామకుని నియమించే వేరొక నియామకుడు లేడనీ చెప్పబడింది.

"య ఆత్మని తిష్ఠన్ య ఆత్మనోఽంతరో యమాత్మానవేద, యస్యాత్మా శరీరం య ఆత్మానమం తరో యమ యతి సత ఆత్మాఽంతర్యామ్య మృతః" (బృహ. ఉప.)

ఎవడు ఆత్మయందుండి, దానిచే తెలియబడక, అదే శరీరంగా కలవాడై లోపల ఉండి నియమిస్తున్నాడో అతడే పరమాత్మ అంతర్యామి, అమృత స్వరూపుడు అయిన నారాయణుడు అని సిద్ధాంతీకరింప బడింది.

జీవాత్మ లోపల- చాలా దగ్గరగా ఉన్న అంతర్యామి యొక్క స్వరూప స్వభావాలు కర్మేంద్రియ జ్ఞానేంద్రియాలచే తెలియబడవు- అన్నందువల్ల, పరమాత్మకు జీవాత్మ చాలా దూరంగా ఉన్నట్లే భావించడం పరిపాటి, దేశికులు తననే నిరూపించుకొన్నారు.

*స్వాభావికీ తవదయా యది నాంతరీయః*
*సత్యం భవేయ మధునాఽపి స ఏవ భూయః-*

"స్వాభావికీ జ్ఞాన బలక్రియా చ"- భగవానునికి జ్ఞానం, బలం, దయ, అఘటిత ఘటనా సామర్థ్యం, ఇత్యాది గుణాలు- ధర్మాలు ఇంద్రియ జన్యమైనవి కావు; కేవలం సహజ సిద్ధమైనవే.

భగవత్స్వరూప తిరస్కారిణియైన ప్రకృతికి ప్రతిబంధకమైనది భగవద్దయ అట్టి భగవానుని స్వాభావికమైన దయ- సకల జనులకు ఎప్పుడో ఒకప్పుడు సంసారం నుంచి నివృత్తిని కలిగించాలనే కోరిక- ప్రతిబంధకంగా ఉండకుంటే, నాకు జాయమాన కటాక్షమూ, ఆచార్య సంబంధమూ మొదలైనవి కలిగించకుండా ఉన్నట్లైతే, ఈ జన్మలో వైష్ణవ జన్మ లభించినప్పటికీ, (స ఏవ) దూరస్థునిగానే ఉండేవాడను. నాకు పూర్వ జన్మలో ఏ విషయవాసనాది రూపమైన స్వభావం ఉండెనో, ఆ స్వభావాన్ని నేను వదలక ఉండే వాడను కదా! అన్నారు దేశికులు. 'సదాచార్య సంబంధం భగవానుని సౌహార్దంవల్ల కలుగుతుంది.

సర్వ చేతనులయందు అంతర్యామిగా ఉండడం వల్ల భగవంతుణ్ణి వారు ఉపాసించడం కోసం ఆయన దయయే మూలకారణం కాబట్టి, సర్వ చేతనుల యందు సర్వేశ్వరుని సౌహార్దం అవశ్యంగా ఉంటుంది. అందరు ముక్తిని పొందడానికి యోగ్యులే. కాని ఎవనికైనా, ఎప్పుడో ఒకప్పుడు ఆ సౌహార్దం కార్యకరమవుతుంది. సర్వచేతన సాధారణమైన సర్వేశ్వరుని సౌహార్దం ఆయన కృప వలననే కలిగినప్పుడు మోక్షప్రయత్నం సఫలమవుతుంది. అది శాస్త్ర బలం వల్ల కూడా అవశ్యంగా సిద్ధిస్తుంది అనే అభిప్రాయంతో 'సత్యం' అని నొక్కి చెప్పబడింది. వసంత తిలక.

*34. అజ్ఞాత నిర్గమ మనాగమ వేదినం మాం*
*అంధం నకించి దవలంబన మశ్నువానమ్।*
*ఏతావతీం గమయితుః పదవీందయాళోః*
*శేషాధ్వలేశ నయనే క ఇవాతి భారః॥*

**అర్థం:** అజ్ఞాత నిర్గమం= తెలియబడని బయటకు పోయేదారి కల్గినట్టి; అనాగమ వేదినం= వచ్చిన దారి తెలియనట్టి; కించిత్= కొంచెం; అవలంబనం= చేయూతను; న, అశ్నువానం= పొందలేని వాడను కాబట్టి; అంధం= గ్రుడ్డివాడనైన; మాం= నన్ను; ఏతావతీం= ఇంతవరకున్న; పదవీం= మార్గాన్ని; గమయితుః= నడిపించుకొని వచ్చిన; దయాళోః= దయగల నీకు; శేష+అధ్వ, లేశ, నయనే= మిగిలియున్న, కొద్దిగానున్న, దారిని నడిపించుకొని తీసుకొనిపోయే విషయంలో; అతిభారః= మిక్కిలి భారం-బరువు; కః, ఇవ= ఏమి ఉన్నదో? నీకేమంత బరువు కాదు కదా!

**తా॥** ఓ వరదా! సంసారమరుకాంతారం నుంచి బయటకు పోవడానికి నాకు దారి తెలియలేదు. ఏ మార్గంలో వచ్చినానో అదికూడా నాకు తెలియదు. ఏదైనా దారి చూపే సహాయం కూడా లభించక అంధప్రాయుడనై నట్టనడి అడవిలో తిరుగుతున్న నన్ను ఇంతవరకు మంచిదారిలో నడిపించావు. పూర్వ జన్మలో నేను చేసిన స్వల్పమైన, యాదృచ్ఛిక సుకృతాన్ని నెపంగా చేసుకొని జాయమాన కటాక్షాన్ని సౌహార్దంతో ప్రసరింపజేశావు. అట్టి దయాళువైన నీకు, మిగిలియున్న నా కొద్ది జీవితకాలాన్ని గడిపించడం, అత్యంత భారమా? ఏమంత బరువు కాదే! నీ దయ తప్ప నాకు వేరే ఆశ్రయమేదీ లేదు, అని తాత్పర్యం.

**వ్యాఖ్య:-** ప్రాపకుడుగా ఉన్న భగవానుడే ఇక తనను ప్రాప్యదశకు చేర్చుకోవాలని దేశికులు ప్రార్థిస్తున్నారు.

నిర్హేతుకంగా అభీష్ట వరప్రదానం చేస్తుంటే, భగవానునికి వైషమ్య నైర్ఘృణ్యాలు- పక్షపాతం, రాగద్వేషాలు- కలవాడని పేరు వస్తుంది. వాస్తవంగా, భగవానుడు సౌహార్దం కలవాడు. అందరికీ శుభాన్నీ, హితాన్ని కోరేవాడు. "నా హితం కారయేద్ధరిః"- శ్రీహరి ఎవరికీ చెడు చేసే వాడు కాదని శాస్త్రం బోధిస్తున్నది.

ఎప్పుడైనా చేతనుడు యాదృచ్ఛికంగానో, ప్రాసంగికంగానో స్వల్పంగా చేసిన సుకృతాన్ని వ్యాజంగా గొని భగవానుడు ఎనలేని కృపను వర్షిస్తాడు.

*"హితమితి జగద్దృష్ట్యా క్షుప్తి రక్లుప్త ఫలాంతరైః*
*అమతి విహితై రన్యైర్ధర్మ్యాయితైశ్చ యదృచ్ఛయా।*
*పరిణత బహుచ్ఛద్మా పద్మా సహాయ దయే! స్వయం*
*ప్రదిశసి నిజాభి ప్రేతంనః ప్రశామ్యద పత్రపా॥" (దయాశతకం-74)*

జగత్కారణుడైన తన భర్త పక్షపాతం, వైషమ్యం లేనివాడని నిరూపించుకోగలిగేది లక్ష్మీదేవి. శ్రీనివాసుని దయా రూపిణియే శ్రీదేవి. తన సంతానం ఏయే పనులు చేస్తుందో అని కనిపెడుతుండడం జగన్మాతయొక్క స్వభావం. లోకంలో దేహధారులు ఏ పనిని చేయకుండా ఉంటే, వారికి దేహయాత్ర గడపడమే దుర్లభం కదా! దయాదేవి చేతనులు చేసిన కర్మలలో లోకహితమైనవని కల్పించుకొన్న కొన్ని సుకృతాలను అన్వేషిస్తుంది.

*యాదృచ్ఛిక సుకృతం:–* ఆలమందలోనుంచి తప్పించుకొన్న ఒక ఆవు దేవాలయ ప్రాకారంలో ప్రవేశించింది. ఆలకాపరి దాన్ని పట్టుకోవడానికి ప్రయత్నించగా, ప్రాకారంలో మూడు చుట్లు తిరిగిన తర్వాత అతనిచే పట్టుబడింది. పుణ్యంకోసం కాకున్నా, ఆవుతో పాటు ఆలకాపరి కూడా దేవాలయంలో మూడుసార్లు ప్రదక్షిణ చేసిన మహిమవల్ల ఆవుకూ, ఆలకాపరికీ ఏర్పడిన సుకృతం యాదృచ్ఛికం.

*ప్రాసంగిక సుకృతం:–* తల్లిదండ్రులు తమ పిల్లలకు భగవన్నామాలను నామకరణం చేస్తారు. తత్ఫలితంగా, వారిని పేర్లతో పిలిచినప్పుడు 'నారాయణా! శ్రీకాంతా! సీతా' అని భగవన్నామాన్ని కీర్తించడం వల్ల కలిగిన మహిమయే ప్రాసంగిక సుకృతం.

*అనుషంగిక సుకృతం:–* ఒక బాటసారిని దొంగలు బాధించి సొమ్మును దోచుకోవడానికి చుట్టుముట్టారు. ఆ బాటలోనే వస్తున్న ఇంకొక దృఢంగా ఉన్న మనిషిని దొంగలు చూడగానే 'ఇతని అంగరక్షకుడే ఆ మనిషి' అనే భ్రమ దొంగలకు కలగడం వల్ల బాటసారిని బాధించకుండా పారిపోయారు. బాటసారికి

దొంగల వల్ల బాధ కలుగక పోవడానికి కారణభూతుడైన ఆ మనిషికి ఏర్పడిన సుకృతమే ఆనుషంగికం.

*అబుద్ధిపూర్వక సుకృతం:-* పవిత్రమైన గంగానది యొడ్డున ఒక వ్యక్తి ప్రకృతి సౌందర్యాన్ని తిలకిస్తూ నడుస్తుండగా, కాలుజారి దొర్లుతూ గంగా ప్రవాహంలో పడి మరణించడం వల్ల కలిగినదే 'అజ్ఞాతసుకృతం'.

ఇట్లు భగవద్దయయే ఇంతకాలం చేతనులను రక్షించక పోతిని కదా! అనే లజ్జను విడిచి, ఏదో ఒక సుకృతాన్ని ఊతగా గొని చేతనులకు శాశ్వతమైన దుఃఖ రాహిత్యమనే మోక్ష పురుషార్థాన్ని ప్రసాదిస్తుంది.

ఈ భావాన్నే శ్రీ పరాశరభట్టర్ శ్రీ గుణరత్న కోశమందు ఇంతకు ముందే ప్రకటించారు.

*"ఐశ్వర్య మక్షరగతిం పరమం పదం వా*
*కస్మై చిదంజలి భరం వహతే వితీర్య।*
*అస్మై నకించి దుచితం కృతమిత్య థాంబ!*
*త్వం లజ్జసే కథయ కోఽ_యః ముదారభావః॥" (58)*

ఓ తల్లీ! నీకు అంజలిని ఘటిస్తున్న అజ్ఞాత భక్తుడైన ఎవరికో గజాంతైశ్వర్యాన్నీ, ఆత్మానందానుభవం అనే కైవల్యాన్నీ, సకలవిధ కైంకర్య రూపమైన మోక్షఫలాన్నీ పూర్తిగా ప్రసాదించావు. అయినా 'ఈ భక్తుని కోసం నేనేమి చేయలేకపోతినే' అని సిగ్గుపడుతున్నావు. ఈ ఔదార్యం అంతులేనిది కదా తల్లీ! 'అంజలి'యే ఆమెకు అంత బరువైనది అని తాత్పర్యం.

*అజ్ఞాత నిర్గమం:-* తన ఊరినుంచి వేరొక యూరికి పోదలచిన అంధుడు మార్గ భ్రష్టుడై మహారణ్యంలో ప్రవేశించినట్లు, నేను సంసారం అనే మరుకాంతారంలో ప్రవేశించి తాపతప్తుడనై యున్నాను. ఇప్పుడు సంసార బంధాన్ని తొలగించుకొని బయటపడడానికి ప్రయోజకమైన నిష్కామ కర్మమార్గం తెలియని వాడను.

*అనాగమ వేదినం:*- ఏ మార్గాన వచ్చినానో ఆ మార్గాననే మళ్ళీపోయి బయట పడాలనుకొంటే, ఆ వచ్చిన మార్గం కూడా తెలియడం లేదు. అంటే, సంసార బంధానికి సాధనమైనది ఏ కామ్య కర్మయో ఏ దుష్కృతమో, అది కూడా తెలియని గ్రుడ్డివాడనయ్యాను. పూర్వ జన్మలో చేసిన ఏ కర్మఫలమో కాని హితాహిత జ్ఞాన శూన్యుడనయ్యాను. మార్గదర్శి కూడా నాకు కనబడలేదు.

*నకించి దవలంబన మశ్నువానమ్:*- హితోపదేశంచేసే సదాచార్య సంబంధమూ లభించిన వాడనూ కాను. కేవలం ఆలు బిడ్డలు అనే విషయ భోగాసక్తుడనైన నన్ను సహజ దయాళుడవైన నీవు యాదృచ్ఛిక ప్రాసంగికాది సుకృతాన్ని వ్యాజంగా గొని గొప్ప వంశమందు జన్మింపజేశావు.

ఏతాపతీం గమయితుః పదవీం దయాళోః:- దేవా! ఇంత చాలా దూరం నన్ను నడిపించుకొని వచ్చిన దయగలవాడవు. సుకృతాన్ని నెపంగా చేసుకొని నన్ను నీ కృపాకటాక్షానికి పాత్రుడను చేశావు. జాయమాన కటాక్షం కంటె ముందే చేతనుని సుకృతం గుర్తించబడిందన్న భావం చేత భగవానునికి వైషమ్యాది ప్రసక్తిలేదని సూచింపబడింది.

*"సత్సంతాన ప్రసూత సదాచార నిష్ఠ వేద విదాచార్యోపనీతస్య"*- అనే శ్రీ భాష్యకారుల సూక్తి ప్రకారంగా, పుండరీకాక్ష యజ్వయొక్క వంశమందు బ్రహ్మవిదగ్రేసరుడైన అనంతసూరికి పుత్రునిగా నన్ను పుట్టించి, వారిచేత ఉపనయనాది సంస్కారాలను చేయించావు. అంతేకాదు, యతీంద్ర మాహానసిక వంశోద్భవుడైన 'అప్పుళ్ళార్' ను ఆచార్యునిగా కృప జేసి చాలా కాలం దాకా జీవితాన్ని గడిపింప జేసిన కృపాళుడవు స్వామీ!

*శేషాధ్వలేశనయనే క ఇవాతి భారః:*- ఇకముందు జీవించే కాలం చాలా కొద్దిగానే ఉంది. కాబట్టి, ఒక విజ్ఞాపన. ఇంతకాలం జీవితాన్ని గడిపింపజేసిన దయాళువైన నీకు ఇక నా మిగిలిన స్వల్ప జీవితకాలాన్ని గడిపించి నీ పాద

కమల సేవను ప్రాప్తింపజేయడం అతి భారం కాదే! నీకు అత్యంత ప్రయత్న మవసరం లేదు. నీ దయకంటె వేరే ఉపాయమూ నాకు లేదు అని దేశికులు వరదునితో విన్నపించుకొన్నారు. ('నయనే' అన్నచోట 'గమనే' అని పాఠాంతరమున్నది).

ఇక్కడ ఈ శ్లోకం స్మరించుకో దగినది–

*"దుర్మోచోద్భట కర్మకోటినిబిడో ప్యాదేశ వశ్యః కృతః*
*బాహ్యైర్నైవ విమోహితోఽస్మి కుదృశాంపక్షైర్న విక్షోభితః।*
*యో మాహానసికో మహాన్యతి పతేర్నీతోఽస్మి తత్పౌత్ర జాన్*
*ఆచార్యానితి రంగధుర్య! మయితే స్వల్పావశిష్టో భరః॥" (9)*

శ్రీ రంగనాథా! నా సంరక్షణ విషయంలో సమస్త భారాన్ని వహించి బహుప్రయాస పడినావు. నేను అత్యుద్ధతమైన అనేక దుష్కృతాలతో కూడి యున్నవాడను. అయినప్పటికీ, నీ ఆజ్ఞారూపాలైన శాస్త్రాలకు వశ్యుడనయ్యాను. వేదబాహ్యులైన బౌద్ధ చార్వాకాది మతాలచేత మోహాన్ని పొందనివాడను. వేదాలకు అపార్థాలను కల్పించిన వారి సిద్ధాంతాలచే ఆకర్షితుడను కాలేదు. భగవద్రామానుజుల వారికి పాక కైంకర్యమందు పెరియ నంబివారిచే నియుక్తులైన కిడంబి ఆచ్చాన్ వారి మనుమలు రామానుజప్పిళ్ళాన్, మునిమనుమలు వాది హంసాంబుదాచార్యులనబడే అప్పుళ్ళార్ (నా మేన మామగారు)కు శిష్యుడ నయ్యాను. కాబట్టి, నా రక్షణ విషయమై నీకు భారం కొంచెమే మిగిలియున్నది. నన్ను రక్షించడం నీకంత భారమేమీ కాదు అని దేశికులు 'న్యాసతిలకం'లో విన్నపించు కొన్నారు. ఈ (34) శ్లోకమందు సమాసోక్త్యలంకారం ఉన్నది.

*"సమాసోక్తిః పరిస్ఫూర్తిః ప్రస్తుతేఽ ప్రస్తుతస్య చేత్"*–

ప్రస్తుతాన్ని చెప్పినప్పుడు అప్రస్తుతం స్ఫురిస్తే అది సమాసోక్తి లక్షణం. వసంత తిలక. త భ జ జ గ గ– గణాలున్న శ్లోకం.

*35. భూయోఽపి హన్త వసతిర్యది మే భవిత్రీ*
*యామ్యాసు దుర్విషహవృత్తిషు యాతనాసు।*
*సమ్యక్ భవిష్యతి తతః శరణాగతానాం*
*సంరక్షితేతి బిరుదం వరద! త్వదీయమ్॥*

**అర్థం:** హే వరద!= వర వరాలనిచ్చే ఓ దేవా!; భూయః, అపి= (శరణాగతుడనైన తర్వాత) మళ్ళీ కూడా; మే= నాకు; యామ్యాసు= యముని సంబంధమైన; దుర్విషహా, వృత్తిషు= సహించరాని, కార్యాలు కలిగిన; యాతనాసు= నరకదండనలందు; వసతిః= వాసం; భవిత్రీ, యది= ఏర్పడినట్లైతే; హంత= అయ్యో! కష్టం!; తతః= అందువల్ల; శరణాగతానాం= శరణు పొందినవారికి; సంరక్షితా= సంరక్షకుడు; ఇతి= అనునట్టి; త్వదీయం= నీదైన; బిరుదం= ఖ్యాతిని పొందిన పేరు; సమ్యక్= భాగానే; భవిష్యతి= ఉండగలదు (ఎత్తిపొడుపు మాట) బాగుండదని అర్థం.

**తా॥** ఓ వరదా! ప్రపత్తి చేసిన తర్వాత కూడా, ఆచార్య సంబంధంగల నాకు పూర్వం చేసిన పాపం అనుభవించక నశించదు- నా భుక్తం క్షీయతే కర్మ- అనే శాస్త్ర ప్రమాణంవల్ల దుస్సహమైన రౌరవాది యమ యాతనలను అనుభవించే నరకలోకవాసం సంభవించినట్లైతే అబ్బా! అదెంత కష్టమో! ప్రపన్నులకూ నరక వాసమేర్పడితే, ఇక 'శరణాగత రక్షకుడు' అనే నీ బిరుదు బాగానే ఉండగలదులే, అని దేశికులు ఉపాలంభనంగా పలుకడమే శ్లోక తాత్పర్యం.

**వ్యాఖ్య:-** ప్రపన్నులకు యమయాతనలు కలిగితే భగవానునికి శరణాగత సంరక్షకుడనే బిరుదు సిద్ధిస్తుందా? అని ఉపాలంభిస్తున్న శ్లోకమిది.

సదాచార్య సంబంధం కలుగడానికి "ఈశ్వరస్య చ సౌహార్దం" అనే ప్రామాణికంగా (32వ శ్లో. వ్యా.లో) చెప్పబడిన శ్లోకమందలి ఆరు కారణాలలో మొదటి త్రికం (3) ఇంతవరకు చెప్పబడింది. అది ఆచార్య సంబంధమేర్పడక ముందు మాత్రముపయోగపడదగినది. ఇక సాత్త్వికులతో అద్వేషాది రూపమైన

రెండవ త్రికం (3) మాత్రం ఆచార్య సంబంధమేర్పడి ప్రపత్తిని అనుష్ఠించిన తర్వాత ఉత్తర కాలమందు కూడా అనువర్తించ దగినది. మహాభాగవత విద్వేషాదుల వల్ల ప్రపత్త్యుపాయం పూర్తి కావడం అసంభవం. ముక్తి ఫలానియమ వ్యవస్థచే నిర్ణయింప బడిన విషయమది. ఉత్తరకాలంలో మధ్యన భాగవత ద్వేషం సంభవిస్తే, ఉపాయ పూర్తి ఎట్లు సిద్ధిస్తుంది? అనే శంక కలుగక మానదు కదా! అందుకు సర్వజ్ఞుడూ, సత్య సంకల్పుడూ అయిన సర్వేశ్వరుడే తనను ఆశ్రయించిన వారికి అట్టి ప్రమాదం కలుగకుండానే తనను పొందే ఉపాయాన్ని పూరించగలడని సమాధానం చెప్పడానికే సర్వేశ్వరుణ్ణి గూర్చి కొంచెం ఉపాలంభ వ్యాజంతో సదాచార సంబంధం పొందిన ప్రపన్నునికి అట్టి ప్రమాదం అసంభవమని దృఢీకరిస్తూ, దేశికులు ఈ శ్లోకం చేత ధైర్యపరచినారు.

యామ్యాసు దుర్విషహ వృత్తిషు యాతనాసు మే భూయోఽపి వసతి ర్యది భవిత్రీ–

నాకు, సదాచార్య సంబంధం పొందిన తర్వాత కూడా భాగవత ద్వేషానికి ఫలమైన, సహింపరాని దుఃఖరూపమైన, కుంభీపాకాది నరక స్థానాలయందు నివసించడం సంభవమేనా? అట్టి ఉనికి కలిగితే, హన్త– పర్వత శిఖరం మీదికి ఎక్కిన వ్యక్తి క్రింది పాతాళంలోకి జారిపడినట్లు, ఆచార్యులను ఆశ్రయించిన వ్యక్తి నరకవాస మనుభవించడమనేది వినే వారికి కూడా చాలా కష్టతరమైనది కదా!

*తతః త్వదీయం శరణాగతానాం సంరక్షితేతి బిరుదం సమ్యగ్భవిష్యతి–*

అట్లైతే, భగవానునికి 'శరణాగతులను రక్షించే వాడు' అనే ప్రసిద్ధమైన పేరు బాగా ఉండగలదు అని కాకుస్వరంతో పల్కుతున్న మాట ఇది. ఒక రకంగా దూషణయే కదా!

భాగవత విద్వేష రూపమైన ప్రబల ప్రతిబంధకం చేత శరణాగతియే ప్రాప్తించదు; పైగా శరణాగతులను రక్షించడమనేది ఎలా సిద్ధిస్తుంది? అట్టి బిరుదును కలిగియుండడం అకీర్తికరం కాదా! అని ఎత్తి పొడుపు మాట.

ఒక్కసారే ప్రపత్తిచేస్తే చాలు. అట్టి ప్రపన్నుడైన ప్రతివ్యక్తిని- "అభయం *సర్వభూతేభ్యః దదామ్యేతత్ వ్రతం మమ*" "శరణాగతులైన ప్రాణులందరిని రక్షిస్తానని అభయ మిస్తున్నాను ఇది నా నియమం, దీక్ష" అని ప్రతిజ్ఞ చేసి, అపకారం చేయని ఒక్క విభీషణుని మాత్రమే, శరణాగతుడైనంత మాత్రాన, రక్షిస్తే ప్రతిజ్ఞా వాక్యానికి అర్థం అది కాదు కదా! 'సర్వ భూతేభ్యః' అనే బహువచనం వల్ల ఆర్ద్రాపరాధియైన రావణాసురుని వంటి వారు కూడా శరణాగతులైతే వారినీ రక్షిస్తానని కదా ప్రతిజ్ఞ చేసిన మాటకు అర్థం.

వెనుకట ఒక ప్రభువు దానం చేస్తానని ప్రచారం చేశాడట. జనులు బారుదీరి 'క్యూ'లో వరుసగా నిలబడినారట. అంతలో ప్రభువు వచ్చి ఒక్క వ్యక్తికి ఒక్క రూపాయిని మాత్రమిచ్చాడు. దాన కార్యం ముగిసిందని ప్రకటించి రాజభవనంలోకి పోయాడట. వాస్తవంగా, దానమేనా ఇది?

"*మాం శరణం వ్రజ! అహంత్వాసర్వ పాపేభ్యో మోక్షయిష్యామి*"- నన్ను శరణు పొందుము; నేను నిన్ను సర్వపాపకర్మ బంధాలనుంచి విడిపించగలను' అని చెప్పి శరణాగత సంరక్షకుడనే బిరుదును వహించాడు భగవానుడు. ఆచార్య సంబంధం పొందినవాడను, ప్రపత్త్యుపాయాన్ని అనుష్ఠించినవాడను, అయినా, ఏదో ప్రామాదిక స్వల్పదోషం వల్ల నాకు నరకలోకమందు ఉనికి కలిగెనేని శరణాగత సంరక్షకుడన్న బిరుదు మిథ్య కాకుండునా? ఆ బిరుదును వహించిన భగవానునికి అప్రఖ్యాతి రాకుండునా? అనే ఉపాలంభనం 'శరణాగతానాం సంరక్షితా' అనే బిరుదు బాగా ఉండగలదు పో అన్న మాటలో నున్నది.

'ఆశై వఴు వాతేత్తు మెనక్కు'- "వాశివల్లీ రిన్ద ...రీర్ వాఴున్దే పోమ్ *నీరే*" (పెరియ తిరుమొఴి. 4-9-4)

'తిరువిందళూరు' నందు వేంచేసియున్న ఓ ...! నిరంతరం మిమ్ము స్తోత్రం చేసే దాసులకు మిమ్ము సేవించాలనే ఆ... ...కమై వచ్చిననూ మీ దివ్య మంగళ విగ్రహ దర్శన భాగ్యాన్ని కల్పించకపో... ...ళా! తరతమ భేదాన్ని

ప్రదర్శించే సమర్థులైన మీరే సుఖంగా ఉండండి పొండు... అని తిరుమంగై యాళ్వార్ సూక్తి.

*"అనన్యాధీనత్వం తవకిల జగుర్వైదికగిరః*
*పరాధీనం త్వాంతు ప్రణత పరతంత్రం మనుమహే।*
*ఉపాలంభోఽయం భోః! శ్రయతి బత! సార్వజ్ఞ్య మపితే*
*తతో దోషం భక్తే ష్విహ వరద! నైవా కలయసి॥"* (వరదరాజస్తవం.2)

ఓ వరదరాజా! *"న తస్యేశే కశ్చన"*– *"త మీశ్వరాణాం పరమం మహేశ్వరం, తందేవతానాం పరమంచ దైవతం"*– అని వేదవాక్కులు ఇతరుల కెవ్వరికీ వశమై ఉండకపోవడమనే నీ స్వాతంత్ర్యాన్ని కీర్తిస్తున్నాయి. మేము మాత్రం నిన్ను ఆశ్రిత పరతంత్రుడవని భావిస్తున్నాం. 'మీరు చేసేది దూషణం కదా!' అని అంటే, ఈ దూషణం నీ యొక్క సర్వజ్ఞత్వాన్ని కూడా ఆశ్రయిస్తున్నది. ఎంత ఆశ్చర్యం! ఎందుకంటే *"దోషోయద్యపి తస్య స్యాత్ సతామేత ద గర్హితమ్"*– అని చెప్పిన రీతిగా, ఈ లోకంలో నిన్ను ఆశ్రయించిన భక్తుల దోషాలను ఏ మాత్రం నీవు చూడడం లేదు కదా! నీ సర్వజ్ఞత్వం కూడా ఆశ్రయించిన వారి దోషాలను, చూడకపోవడమనే నీ వాత్సల్య గుణం చేత పరాహతమైనదని భావం. ఇట్లు శ్రీకూరేశులు వరదరాజస్వామిని స్తుతించారు.

ఈ (35) శ్లోకమందలి తత్త్వమిది:– శాస్త్రార్థాన్ని గ్రహించాలి.

*"వైషమ్య నైర్ఘృణ్యే న సాపేక్షత్వాత్ తథాహి దర్శయతి"*– (బ్ర.సూ. 2-1-34) జీవులయొక్క ధర్మాధర్మాల అపేక్ష ఉండడం వల్ల పరబ్రహ్మకు పక్షపాతమూ లేదు, నిర్దయకూడా లేదు. సర్వేశ్వరుడు ఆయా జీవుల సుకృత దుష్కృత కర్మలకు అనుగుణంగానే విషమ సృష్టి చేస్తాడు.

*"పుణ్యః పుణ్యేన కర్మణా భవతి, పాపః పాపేన కర్మణా"*– పుణ్యకర్మ నాచరించినవాడు పుణ్యాత్ముడుగానూ, పాపకర్మలను చేసినవాడు పాపాత్ముడుగా

అవుతున్నాడు అని శ్రుతి చెబుతున్నది. జీవుల కర్మలే వారి జన్మలకు ముఖ్య కారణమని భావం.

"కామ చారేణ చైకే"- (బ్ర.సూ. 3-4-15)- బ్రహ్మవిద్యయే పురుషార్థ హేతువు. విద్వాంసుడు కర్మలచేత బంధింపబడడు. కాబట్టి బ్రహ్మవిద్య కర్మకు అంగం కాజాలదు అని 'పురుషార్థాధికరణ'మందు తెల్పబడింది.

"తదధిగమ ఉత్తర పూర్వాఘయో రశ్లేష వినాశౌ తద్వ్యప దేశాత్"- (బ్ర.సూ. 4-1-13). బ్రహ్మ విద్యా ప్రాప్తి కలుగగానే ఉపాసకుని యొక్క ఆగామి పాపకర్మలు అతనికంటవు. సంచిత పాపకర్మలు నశిస్తాయి అని శ్రుతులు తెల్పుతున్నాయి.

"తద్యథా పుష్కర పలాశ ఆపో నశ్లిష్యన్తే, ఏవ మేవం విది పాపం కర్మ నశ్లిష్యతే"- (ఛాం. ఉ. 4-14-3) తామరాకును నీరు అంటనట్లే పరమాత్మను ఉపాసించే వ్యక్తిని పాపాలు అంటవు.

"తస్యైవస్యాత్పద విత్తం విదిత్వాన కర్మణాలిప్యతే పాపకేన"- (బృహదా రణ్యకం. 6-4-23) పరమాత్మ స్వరూపాన్ని తెలుసుకొన్న వ్యక్తి అతనిని ధ్యానించి పాపకర్మంతో సంబంధించడు కాబట్టి ఆగామి పాపాలు అతనిని అంటవు అని అర్థం.

"తద్య ధేషీక తూలమగ్నౌ ప్రోతం ప్రదూయే తైవం హాస్య సర్వే పాప్మానః ప్రదూయంతే"- (ఛాం.ఉ. 5-24-3) జమ్ముదూది అగ్గియందు పడగానే దగ్ధమవునట్లు బ్రహ్మవిద్యావంతుని సంచిత పాపాలు నశిస్తున్నాయి.

బ్రహ్మ విద్య సర్వేశ్వరునికి ఆరాధనా రూపమైనందువల్ల ఆయనకు ప్రియమైనది. కాబట్టి, బ్రహ్మవిద్య జ్ఞాని యొక్క సంచిత పాపకర్మలచేత సర్వేశ్వరునికి కలిగిన నిగ్రహాన్ని పోగొట్టుతుంది. అట్లే భావిపాపకర్మలవల్ల సర్వేశ్వరునికి కలుగ బోయే నిగ్రహాన్ని కూడా నిరోధిస్తుంది అని ' తదధిగమాధి కరణం'లో తెల్పబడింది.

*"ఏవం ముక్తి ఫలానియమస్తదవస్థావధృతేః తదవస్థావధృతేః"*- (బ్ర.సూ. 3-4-51) మోక్షఫలాన్ని ఇచ్చే బ్రహ్మవిద్య కల్గడానికి ప్రతిబంధకం ఉండవచ్చు. అది కూడా ఈ కాలమందు కలుగుతుంది అనే నియమం లేదు.

కర్మలు మోక్షసాధనమైన బ్రహ్మవిద్యను కలుగజేయునప్పుడు వాటికంటె బలవత్తరమైన పూర్వకృత భాగవతాపచారాదులు నిర్బంధాలు కావచ్చును అని ముక్తి ఫలాధికరణమందు తెల్పబడింది.

ఇవి శ్రీ భాష్యకారుల సూక్తులు.

*"అపాయ సంప్లవే సద్యః ప్రాయశ్చిత్తం సమాచరేత్।*
*ప్రాయశ్చిత్తి రియం సాత్ర యత్పునః శరణం వ్రజేత్॥"*

శాస్త్ర నిషిద్ధమైనది అపాయం. ప్రపన్నునికి బుద్ధి పూర్వకంగానో, అబుద్ధిపూర్వకంగానో అపాయం-అపరాధాలు సంప్రాప్తాలైతే వెంటనే (క్షమింపుమని భగవంతుణ్ణి ప్రార్థించడమే) ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. ప్రాయశ్చిత్తమంటే మళ్ళీ శరణాగతిని చేయడమే. క్షమాపణం కోరకపోయినట్లైతే (ప్రాయశ్చిత్తం చేసుకోకపోతే) కాకాసురునికి ఒక కన్ను గ్రుడ్డిగా చేసినట్లు- నామకార్థం స్వల్ప దండన విధించి- భగవానుడు రక్షించగలడు. ఇది భగవత్సౌహార్దం.

*"దేవం శార్ఙ్గధరం విష్ణుం యే ప్రపన్నాః పరాయణం।*
*నతేషాం యమసాలోక్యం నచతే నరకౌకసః॥"*

సర్వేశ్వరుణ్ణి శరణుపొందిన వారికి యమదర్శనం కాదు, అట్టి ప్రపన్నులు నరకానికి పోరు. *"నఖలు భాగవతాః యమ విషయే గచ్ఛంతి"*- భగవద్భక్తులు యమలోకానికి పోనేపోరు అని వైష్ణవ, వామన పురాణాలు చెబుతున్నాయి.

ప్రారబ్ధ కర్మకు వ్యతిరేకమైన సంచిత కర్మను, ప్రమాదవశాన చేయబడే ఆగామి కర్మను, అనభ్యు పగత ప్రారబ్ధ కర్మను, అంటే పుణ్య పాపకర్మలనన్నిటినీ

శరణాగతిని చేయడం వల్ల భగవానుడు నశింప జేస్తాడు. ఒక వేళ ప్రమాదవశాన అపరాధం తటస్థించినట్లైతే ప్రాయశ్చిత్తం వల్లనూ ప్రాయశ్చిత్తం చేసుకోపోతే స్వల్పదండన చేతనూ పవిత్రునిగా జేసి అంగీకరిస్తాడు (ర.త్ర.సా.).

స్వల్పదండనమంటే యమయాతనలనుభవించడానికి నరకలోకంలోకి తోయకుండా పుణ్యలోక ప్రాప్తిని ప్రసాదిస్తాడు. మరొక జన్మలో పూర్ణప్రపన్నునిగా జేసి మోక్ష ఫలాన్ని ఇవ్వడానికి రక్షిస్తాడు. ఇదే 'శరణాగత సంరక్షకుడు' అనే గొప్ప బిరుదు అని సారాంశం. వసంత తిలక.

*36. పర్యాకులం మహతి దుఃఖపయోనిధౌ మాం*
*పశ్యన్ కరీశ! యది జోష మవస్థిత స్త్వమ్।*
*స్ఫారేక్షణేఽపి మిషతి త్వయి నిర్నిమేషం*
*పారే కరిష్యతి దయా తవ దుర్నివారా॥*

**అర్థం:** హే కరీశ!= హస్తిభూధర ప్రభూ!; మహతి= గొప్పదైన; దుఃఖ పయోనిధౌ= దుఃఖమనే సముద్రమందు; పర్యాకులం= వ్యాకులపడుతున్న; మాం= నన్ను; పశ్యన్= చూస్తూ; త్వం= నీవు; జోషం= ఊరకయే-మౌనంగానే; అవస్థితః, యది= ఉంటున్నవాడవైతే; స్ఫార+ఈక్షణే= విశాల నేత్రాలు కలవాడవు; అపి= అయినప్పటికీ; నిర్నిమేషం= కను రెప్పపాటు లేకుండా; త్వయి, మిషతి (సతి)= నీవు, చూస్తున్నప్పుడు; తవ= నీ యొక్క; దయా= దయారూపమైన లక్ష్మీదేవి; పారే= ఆవలిదరియందు (మోక్షసామ్రాజ్యమందు); కరిష్యతి= చేర్చగలదు.

**తా॥** ఓ వరదా! కరిగిరీశా! గొప్ప దుఃఖసముద్రమందు క్షోభపడుతున్న నన్ను ఏమీ చేయలేక చూస్తున్న నీవు మౌనంగా ఉండిపోయావు. అయితే, విశాలమైన కన్నులు కలిగి కూడా కనురెప్పలు కొట్టకుండా నీవు బాగా చూస్తుండగా మూర్తీభవించిన (నీ యొక్క) దయాదేవి (లక్ష్మీదేవి) పారభూతుడవైన నీ సన్నిధియందు నన్ను చేర్చగలదు. మోక్షలోకానికి చేర్పించే ఆమెను అడ్డగించడం నీకు చేతగాదు.

వ్యాఖ్య:- దయామూర్తియైన శ్రీదేవి పురుషకారవైభవం సుశ్లోకితం.

సర్వప్రాణులకు అభయమిచ్చి పొందిన శరణాగత రక్షకుడనే భగవానుని బిరుదుకు హాని కలుగ గలదు అని చెప్పబడింది కదా! లోకంలో అపరాధియైన భృత్యుడు, ప్రభువుకు మిక్కిలి ఇష్టుడైన ఒక ఘటకుణ్ణి పురస్కరించుకొని ప్రభు సన్నిధికి చేరి, ఆయనచే అంగీకరింపబడడం పరిపాటి.

"*నివేదయత మాం క్షిప్రం విభీషణము పాగతమ్*"- (రామాయణం). విభీషణుడు (శరణాగతుడై) వచ్చినాడని శ్రీరామచంద్రునికి నన్ను గూర్చి తొందరగా తెల్పండి అన్న మాట ఘటక పురస్కారాన్నే తెల్పుతుంది. శ్రియఃపతి సర్వజ్ఞుడే అయినా, ప్రపత్త్యుపాయనిష్ఠుడు సాపరాధియైనప్పుడు యమలోకానికి పోయే ప్రసక్తిలేకుండా ఉపాయపూర్తికోసం ఘటకుని సహాయం లేకుండా ఈ సంసారిని ఎట్లు అంగీకరిస్తాడు? అనే శంకను పరిహరించే శ్లోకమిది. అంటే, శ్రియఃపతి సంసారియైన ఈ చేతనుణ్ణి అంగీకరింపడనే మాటను ప్రతిషేధిస్తున్నది.

*పర్యాకులం మహతి దుఃఖ పయోనిధౌ మాం*- నేను శరణాగతుడను. సంసారదుఃఖమనే మహాసముద్రంలో పడియున్నాను. సముద్రంలో ప్రాణహాని చేసే మొసళ్ళు మొదలైన జలచరాలు ఎక్కువగా ఉన్నప్పటికీ, కొన్ని చోట్ల ఆణిముత్యాల చిప్పలు కూడా ఉంటాయి. ఈ సంసార సాగరంలో సుఖమే మాత్రమూ లేకుండా దుఃఖమే అధికంగా ఉంటుంది (పర్యాకులం- పరితః, ఆకులం). సముద్రపుటలలలో చిక్కిపోయిన గడ్డిపరక అల్లల్లాడుతూ ఒకప్పుడైనా తీరానికి చేరుతుంది. సంసార జలధిలో ఎత్తైన గుట్టలలాంటి కెరటాలలో చిక్కుకొని కొట్టుమిట్టాడుతూ ఏనాడూ కూడా దరిచేరలేక అవస్థపడుతున్నాను అని భగవంతునితో మొరపెట్టుకొంటున్నారు దేశికులు.

మాంపశ్యన్ కరీశ! యదిజోషమవస్థితస్త్వమ్- ఓ వరదా! ఇట్టి నా బాధ నీకు తెలియదందువా? స్వామీ! ధర్మానుష్ఠాన మాచరించి ఊర్ధ్వలోకానికి- స్వర్గలోకానికి పోదామనుకొంటే, 'స్వర్గేఽపి పాతభీతస్య'- అన్నట్లు పుణ్యకర్మ

క్షీణించగానే పునః ఈ మర్త్యలోకానికి త్రోయబడుతాననే భయంతో స్వర్గానికి పోలేదు. దుఃఖ ప్రచురమైన ఈ సంసార చక్రమందే తిరుగుతూ, శరణాగతుడనైన నన్ను నీవు సాక్షాత్తుగా చూస్తున్నావు. ఏమీ చెప్పక, ఏమీ చేయక ఉదాసీనుడవై యున్నావు.

స్ఫారేక్షణేఽపి మిషతి త్వయి నిర్నిమేషం- నీకు చెంపకు చేరెడేసి కన్నులున్ననూ రెప్పలాడించకుండా బీరిపోయినట్లు చూడడం(దేవజాతికి) స్వాభావికమే. అటువంటి సమయాన-

*పారే కరిష్యతి దయా తవదుర్నివారా*- ఉదార స్వభావం గల నీ దారయైన, దయాదేవిగా రూపొందిన శ్రీదేవియే నన్ను ఈ సంసార సాగరం నుంచి తరింపజేసి పారభూతమైన ముక్తి స్థానానికి చేర్చుతుంది. నీ దయను నివారించడం నీకు శక్యమా? నీ దయారూపాన్ని దాల్చిన శ్రీదేవి 'సంసారార్ణవ తారిణీ' యని బిరుదుగలది కదా! నా పట్ల నీవు మౌనం వహించి, కన్నులప్పళించి చూస్తున్నప్పుడు "స్వాభావికీ తవదయాయది నాంతరాయః" (33శ్లో.) స్వభావ సిద్ధమైన నీ దయ అడ్డులేకుంటే ఆదుకోకపోతే నా పరిస్థితి ఎట్లుండేదో కదా! చేతనులను పరమచేతనుడవైన నీ సన్నిధిలో చేర్చే ఉత్తమ ఘటకురాలు. శ్రీదేవి పురుషకార వైభవాన్ని ఎంత పొగడినా తక్కువే కదా! స్వామీ! శ్రియంత్వత్తోఽప్యుచ్చైః వయమిహ భణామః, శ్రుణుతరామ్-

ఓ శ్రియఃపతీ! శ్రీదేవిని నీ కంటె అధికంగా కొనియాడుతున్నామని కోపపడకయ్యా! నీవు కూడా హృదయంగమంగా వింటుండవయ్యా!

*"దృశౌతే భూయాస్తాం సుఖ తరళ తారే శ్రవణతః,*
*పునర్హర్షోత్కర్షాత్ స్ఫుటతు భుజయోః కంచుకశతమ్" (శ్రీగుణరత్న. 3)*

వింటున్నకొలది నీకు సంతోషాతిశయం కలుగుతుంది. నీ కన్నులు గిర గిర తిరుగుతాయి. హర్షం ఉత్కర్ష మవడం వల్ల భుజాల దగ్గర నీ దుస్తులు

ఒకటి తర్వాత మరొకటి ఎన్ని వేసుకొన్నా, అవన్నీ పటపట పిగిలిపోతునే ఉంటాయి. (శ్రీపరాశ భట్టర్ సూక్తి).

*"వేరి మారాద పూమేలిరుప్పాళ్ వినై తీర్కుమే"*- (తి.వా.మొ. 4-5-11) వాడిపోని పుష్పమందువసించే లక్ష్మీదేవి పాపాలను పోగొట్టుతుంది, అని నమ్మాళ్వార్ల శ్రీసూక్తి. అజ్ఞాత వ్యక్తిని కూడా భగవంతుడు అంగీకరించునట్లు చేస్తుంది భగవతి అని భావం.

వరదరాజా! మీ దాంపత్యం లౌకిక దాంపత్యం వంటిది కాదు కదా! మీది లోకోత్తరమైన దివ్య దాంపత్యం. నీవు చేసే సమస్త చిదచిద్విధానానికి- సృష్టి స్థితి లయాత్మకాలైన కార్యాలనన్నింటికీ శ్రీదేవి తన "అంగీకారి భిరాలోకైః "- కటాక్షాలతోనే అంగీకారాన్ని తెల్పుతున్నది. ఆమె కటాక్షం చేతనే నీ కార్యాలన్నీ సార్థకమవుతున్నాయి.

*"అస్తి కర్మార్హ ఫలదే పత్యౌ కృత్యద్వయం శ్రియః।*
*నిగ్రహాత్ వారణకాలే సంధుక్షణ మనుగ్రహే॥"*

కర్మానుగుణంగా చేతనులను శ్రియఃపతి నిగ్రహిస్తుంటే శ్రీదేవి ఆయన నిగ్రహేచ్ఛను పోగొట్టి, అనుగ్రహాన్ని కలుగజేస్తుంది. భగవానుడే స్వయంగా అనుగ్రహిస్తుంటే, ఆయన అనుగ్రహాన్ని భగవతి మరెంతో వృద్ధి జేస్తుంది. మోక్షమిచ్చేవాడు సర్వేశ్వరుడు. మోక్షమిప్పించే పురుషకారిణి లక్ష్మీదేవి (దేశికులు చతుఃశ్లోకీ భాష్యంలో ఈ కారికను అనుగ్రహించారు).

శ్రీ నృసింహావతారంలో బ్రహ్మాదులందరు భగవంతుణ్ణి సమీపించడానికి భయపడుతుండగా, భగవతి లక్ష్మీదేవియే వారిని భగవంతునితో సంఘటింప జేయడం ప్రసిద్ధం కదా!

*"విముక్తి ఫలదాయినీ"*- (వి.పు. 1-9-120) శ్రీదేవిని పురుషకార భావంతో ప్రపత్తి జేసి, శ్రియఃపతిని గూర్చి ప్రపత్తిని అనుష్ఠించాలని సారార్థం. వసంత తిలక.

37. *కింవా కరీశ! కృపణే మయి రక్షణీయే*
*ధర్మాది బాహ్యా సహకారి గవేషణేన।*
*నన్వస్తి విశ్వపరిపాలన జాగరూకః*
*సంకల్ప ఏవ భవతో నిపుణః సహాయః॥*

**అర్థం:** హే కరీశ!= హస్తిగిరినాయకా!; కృపణే= శక్తిలేని దీనుడనైన; రక్షణీయే= రక్షింపయోగ్యుడనైన; మయి= నా విషయమై; ధర్మ+ఆది, బాహ్యా, సహకారి గవేషణేన= అగ్ని హోత్రం మొదలైన కర్మలను, ప్రపత్తికి భిన్నమైన భక్తి నిష్ఠకు సహకరించే వాటిని వెదకుట చేత; కిం, వా= ఏం ప్రయోజనం?; భవతః= నీ యొక్క; విశ్వపరిపాలన జాగరూకః= సమస్త లోకాలను రక్షించడమందు దృఢమైన; సంకల్పః, ఏవ= సంకల్పమే; నిపుణః= సమర్థమైన; సహాయః= సహాయంగా; అస్తి, నను= ఉన్నది కదా!

**తా॥** అత్యంత అకించనుడనైన రక్షింపదగిన నన్ను కాపాడే విషయమై అగ్నిహోత్రాది నిత్య నైమిత్తిక కర్మలను, కర్మజ్ఞాన సహకృతమైన భక్తియోగాన్ని లేక వేరే సాధనమేదైనా ఉన్నదేమోనని వెదకుతున్నావు. దీని వల్ల నీవు పొందబోయే దేమున్నది? సమస్త చరాచర ప్రపంచాన్ని రక్షించడానికి స్థిరమైన నీ యొక్క సంకల్ప రూప శక్తియే నన్ను కాపాడే విషయంలో సమర్థమైన సహాయమున్నది కదా!

**వ్యాఖ్య:-** భగవత్సంకల్పమే సర్వజగద్రక్షణ సమర్థమైనదని వర్ణితం.

దయా జాయమాన కటాక్షం, సహజసౌహార్దం, ఆచార్య సంపత్తి, పురుష కారం మొదలైనవన్ని యుండగా, ప్రతికూలాచరణం లేకుండా అనుకూలాచరణం ఉండవలెనా?

సర్వేశ్వరుడు ప్రపన్నుని సర్వభారాన్ని స్వీకరించినప్పటికీ భక్తియోగనిష్ఠునికి వలె ప్రపన్నునికి కూడా సంకల్పించబడిన కాలమందే మోక్షం సిద్ధిస్తుందనే నియమం చెప్పశక్యం కాదు; కాబట్టి, భక్తి ప్రపత్తులకు భేదం లేదు అనే శంకకు భగవంతునికి అభిముఖుడై స్వామి దేశికన్ సమాధానమిస్తున్న శ్లోకమిది.

కృపణే రక్షణీయే మయి- కర్మజ్ఞాన భక్తి యోగాలను అనుష్ఠించే శక్తిలేని కార్పణ్యం కలవాడను. అకించనుడను కాబట్టి, వరదరాజా! ప్రపత్తిని వ్యాజంగా చేసుకొని నన్ను రక్షించవయ్యా! నేను ఇది చేశాను, అది చేశాను అని దోషాలను చూచి, ఆశ్రయించిన నన్ను, నీవు చేయి జారవిడువ వలదు. "ఎన్నడియా రదు శెయ్యార్" నా దాసులు తప్పు చేయరు అనే భావంతో నన్ను రక్షింప వలెనని వేడుక.

*మయి ధర్మాది బాహ్య సహకారి గవేషణేన కింవా?*- నా యందు అగ్నిహోత్రాది నిత్యనైమిత్తి కర్మలను, తక్కిన సాధనాలను వెదకితే నీకేం లాభం? ఏ ప్రయోజనమూ లేదు. ధర్మ శబ్దంచేత జ్యోతిష్టోమాది కర్మలు, ఆదిశబ్దంచేత సంధ్యావందనం శమదమాది నిష్ఠలు. 'బాహ్య' అంటే ప్రపత్తి కంటె వేరైన భక్తియోగ నిష్ఠలకు, సహకారిణః- సహకరించేవి. "ధర్మాదయశ్చతే బాహ్యసహకారిణశ్చ= ధర్మాది బాహ్యసహకారిణః" అని విగ్రహవాక్యం.

"*అగ్ని హోత్రాదితు తత్కార్యాయైవ తద్దర్శనాత్*"- (బ్ర.సూ. 4-1-16) అగ్నిహోత్రాద్యాశ్రమ కర్మలు బ్రహ్మ విద్యోపకారకాలుగా విధింప బడినాయి. "*తమేతం వేదానువచనేన బ్రాహ్మణాః వివిదిషంతి యజ్ఞేన దానేన తపసాఽ నాశకేన*"- (బృహ. ఉప. 6-4-22) అనే శ్రుతివాక్యం బ్రాహ్మణులు వేదాధ్యయనం చేతను, యజ్ఞం చేతను, దానం చేతను, ఫలాపేక్ష లేకుండా చేసే తపస్సు చేతను పరమాత్మను తెలుసుకోవడానికి కోరుతారు. అందువల్ల బ్రహ్మ విద్య ఉత్పన్నమై వృద్ధిజెందడానికే యావజ్జీవం- జీవుడు ఈ శరీరాన్ని విడిచిపోయే కాలం దాకా, అగ్ని హోత్రాది నిత్య నైమిత్తిక కర్మలను నిత్యం ఆచరించవలసిందే. లేకపోతే అపరిశుద్ధాంతః కరణం కలిగిన వ్యక్తికి బ్రహ్మవిద్య ఉత్పన్నమే కాదని శ్రీ భాష్యం వివరిస్తున్నది. బ్రహ్మోపాసన యావజ్జీవం అనుష్ఠించవలసిందే కాబట్టి అట్టి ఉపాయ భక్తియోగాన్ని అనుష్ఠించే శక్తిలేని వ్యక్తి న్యాసవిద్యను- ప్రపత్తిని అనుష్ఠిస్తాడు.

"ఉపాయభక్తిః ప్రారబ్ధ వ్యతిరిక్తాఘ నాశినీ।
సాధ్యభక్తిస్తు సా హంత్రీ ప్రారబ్ధ స్యాపి భూయసీ॥"

ఉపాయ రూపమైన భక్తి ప్రారబ్ధం కంటె ఇతరమైన పాపకర్మలను నశింప జేస్తుంది. సాధ్యభక్తి (ప్రపత్తి) మాత్రం ప్రారబ్ధ కర్మను కూడా నశింపజేసి ఫలమిచ్చేది కాబట్టి గొప్పది.

అకించనుడు, అనన్య గతికుడు ప్రపత్తిని అనుష్ఠింపదగిన అధికారి. 'న్యాసః పంచాంగ సంయుతః' అన్నట్లు ఆత్మ నిక్షేపం- భరన్యాసం- ఒక్కటి అంగి యనియు, తక్కినవి ఐదు అంగాలుగా శరణాగతి లక్షణం చెప్పబడింది. సముచ్చయంగా "షడ్విధా శరణాగతిః" అని శాస్త్రం. ఆనుకూల్య సంకల్పం, ప్రాతికూల్య వర్జనం వల్ల భగవదాజ్ఞాతి లంఘన రూపమైన పాపాలనుంచి నివృత్తి కలుగుతుంది. కార్పణ్యం వల్ల ఉపాయాంతర నివృత్తి; మహావిశ్వాసం వల్ల నిస్సంశయత్వం, గోప్తృత్వ వరణం వల్ల భగవంతుడే తన భారాన్ని వహింపవలెననే యిచ్ఛ కలుగుతున్నవి. అంగయుక్తమైన ఈ ప్రపత్తిని అనుష్ఠిస్తున్నప్పుడు సర్వం భగవదధీనమనే జ్ఞానం "ఏష ఏవ సాధు కర్మకారయతి"- అని ఉపనిషత్తు బోధించినట్లు భగవానుడే మంచికారాన్ని చేయిస్తున్నాడని నియమితమైనది.

భక్తియోగ మాచరించే శక్తిలేని కృపణుడు, అత్యంత సన్నిహితుడైన భగవానుడు సహకారియైనందువల్ల రక్షణీయుడని నమ్మియున్నాడు. అట్టి ప్రపన్నుని యందు యావత్కాల మనుష్ఠించదగిన సాధన మేమైన ఉన్నదో అనే ఆకాంక్షతో భగవానుడు అన్వేషించడం ఏమి న్యాయం?

ఆనుకూల్యాదులు యావత్కాలం ఉండనీ, లేకపోనీ ప్రపన్నుణ్ణి సంరక్షించే విషయంలో ఉపపత్తి లేదనేది లేదు.

ప్రపన్నుని రక్షణార్థం సహకరించే దేమిటో ఉత్తరార్ధం తెల్పుతున్నది.

*విశ్వపరిపాలన జాగరూకః భవతః సంకల్పః ఏవ నిపుణః సహాయః అస్తి* నను- సమస్త ప్రపన్న జనానికి అనిష్ట నివృత్తినీ, ఇష్టప్రాప్తిని కలిగించడానికి

సామర్థ్యం కలది; అథవా, బ్రహ్మనాడీ ప్రవేశం, అర్చిరాది గతిని పొందించడం మొదలైన సమస్త రూప పరిపాలనమందు, భగవంతుని యొక్క భరస్వీకారాత్మక మైన సంకల్పమే నిరాటంకంగా సహకరించే సామర్థ్యం కలిగి యున్నది కదా! జాగరూకత యుండి సమర్థత లేకున్నా, సమర్థత యుండి జాగరూకత లేకున్నా ఉపయోగం లేదు. రెండు అవసరమే.

ప్రపన్నుడు ఆత్మనిక్షేపం- భరన్యాసం- చేసినందువల్ల అతని భారాన్ని స్వీకరించిన భగవానుడే సర్వవిధాలా రక్షిస్తాడు. ఆయన సంకల్ప బలం గొప్పది. దాన్ని ఏ ప్రబలశక్తి అడ్డుకోదు. సద్గతిని గూర్చి ప్రపన్నుడు కోరవలసిన అవసరమే ఉండదు. భగవంతుని భరన్యాస రూపమైన సంకల్పమే సహకరించే నైపుణ్యం కలది అని సారాంశం.

*"ఇయం కేవల లక్ష్మీశోపాయత్వ ప్రత్యయాత్మికా।*
*స్వహేతుత్వ ధియం రుంధే, కింపునః సహకారిణామ్॥?*
*ప్రారబ్ధ కర్మావధికో మోక్ష ఇత్థముపాసితుః।*
*దృప్తస్య దేహావధికః ఆర్త స్యార్త్యవధిర్మతః॥"*

శ్రియఃపతియే ఉపాయం అనే నమ్మియుండడం న్యాసవిద్య యొక్క (ప్రపత్తి) స్వభావం. ఒక కారణాన్ని వెదకడం సముచితం కాదు. సహకారాలను అన్వేషించడం ఎలా కూడుతుంది? కూడదు. ప్రపత్త్యుత్తర కాలాన సాపేక్ష హేతుపరంగా ఆనుకూల్యాదులను యావత్కాలం అనువర్తించడమనే అపేక్ష ఉండదు.

ఉపాసకునికి మోక్షప్రాప్తి ప్రారబ్ధకర్మ నశించడమే అవధిగా కలది. దృప్త ప్రపన్నునికి దేహావసానమందే మోక్షం కలుగుతుంది. ఆర్త ప్రపన్నునికి ఆర్తిని ప్రకటించడమే తడవుగా మోక్షం లభిస్తుంది- అని దేశికులు 'న్యాస సిద్ధాంజనం' అనే శాస్త్ర గ్రంథమందు ఈ శ్లోకానికి బలం చేకూర్చే ప్రమాణాన్ని కృపజేశారు. వసంత తిలక.

38. *నిర్యంత్రణం పరిణమంతి న యావదేతే*
*నీరంధ్ర దుష్కృత భవా దురిత ప్రరోహాః।*
*తావన్నచేత్ త్వముప గచ్ఛసి శార్ఙ్గధన్వా*
*శక్యం త్వయాఽపి నహివారయితుం కరీశ!॥*

**అర్థం:** హే కరీశ!= గజేంద్ర రక్షకుడవైన దేవా!; నీరంధ్ర, దుష్కృత భవాః= నిబిడమైన పాప కర్మ బీజాలనుంచి మొలచినట్టి; ఏతే= ఈ; దురిత ప్రరోహాః= పాపపు మొక్కలు; నిర్యంత్రణం= ప్రతిబంధింప శక్యం కాకుండా; యావత్= ఎంతవరకు; న, పరిణమంతి= వృద్ధిని పొందవో; తావత్= అంతవరకు; త్వం= నీవు; శార్ఙ్గధన్వా(సన్)= శార్ఙ్గం అనే ధనుస్సును ధరించిన వాడవవుతూ; న, ఉపగచ్ఛసి, చేత్= నా దగ్గరకు రాలేకపోతే; త్వయా, అపి= నీ చేత కూడా; వారయితుం= (పాపాలను) తొలగించడానికి; న, శక్యం, హి= శక్యం కాదు కదా!

**తా॥** ఓ గజేంద్ర రక్షకా! వరదా! నేను చేయరాని పనులనెన్నో చేశాను. చేయవలసిన పనులను చేయలేదు, అట్టి ప్రాచీన పాపబీజాలనుంచి పాపాల మొలకలు దట్టంగా మొలిచియున్నాయి. అవి పెద్ద చెట్లుగా పెరుగుతాయి. అప్పుడు ఆ చెట్లను పెరికివేయడం శక్యం కాదు. ఆ చెట్లు పెరిగి ఫలాలనిచ్చే కాలంలోపే నీవు శార్ఙ్గమనే ధనుస్సును ధరించి రావాలి. అలా రాకపోతివేని ఆ చెట్లను ఛేదించడం నీకు కూడా శక్యం కాదు. కాబట్టి, త్వరగా వచ్చి నన్ను రక్షించవయ్యా! దేవా!

**వ్యాఖ్య:-** పాప ఫలం పొందక ముందే రక్షించాలని శార్ఙ్గధరుణ్ణి ప్రార్థించడం ఆవశ్యకమని దేశికుల హితబోధ.

ప్రపత్తివల్ల పరమ పురుషార్థ ఫలాన్ని ఆలస్యం లేకుండా సాధించే విషయం సమర్థింపబడింది. ఆచార్య సంబంధం వల్ల తత్త్వ జ్ఞానాన్ని పొందిన ప్రపన్నునికి ప్రాచీన దుష్కృతాలు ప్రబలంగా ఉంటే ప్రపత్త్యుపాయం పూర్తిగా ఎట్లు సిద్ధించ గలదు? అనే చింతతో పాపం పరిపక్వం కాకముందే ఉపాయపూర్తికోసం భగవంతుణ్ణి ప్రార్థించడం అవసరం (ఈ శ్లోక విషయమిది).

*నీరంధ్ర దుష్కృత భవాః ఏతే దురిత ప్రరోహాః*- మహాభారతంలో ఒక ప్రామాణిక శ్లోకమున్నది.

*"తస్మాత్ పాపం నకుర్వీత పురుషః శంసితవ్రతః।*
*పాపం ప్రజ్ఞాం నాశయతి క్రియమాణం పునః పునః॥*
*నష్ట ప్రజ్ఞః పాపమేవ నిత్యమారభతే నరః॥* (ఉద్యోగ. 35-73-74)

నియమంగా జీవితాన్ని గడిపే వ్యక్తి పాపం చేయకూడదు. పదే పదే పాపం చేసే వ్యక్తి యొక్క ప్రజ్ఞను పాపం నశింపజేస్తుంది. మునుపు, ఆచార్య సంబంధం ఏర్పడే వరకు ఏదో అజ్ఞాత యాదృచ్ఛిక సుకృతం ఉండి యుంటుంది. ప్రజ్ఞ- బుద్ధి చెడిపోయిన వ్యక్తి మళ్ళీ నిత్యం పాపం చేయపూనుకొంటాడు అని శ్లోకార్థం.

'నీరంధ్ర దుష్కృత భవాః' అంటే- ఒకటి కాదు, రెండు కాదు, లెక్కించరానన్ని ప్రబల ప్రాచీన పాపాల రూపంలో ఉన్న బీజాలు మొలవకుండా ఉంటాయా? 'దురిత ప్రరోహాః' పాపబీజాలనుంచి పాపపు మొలకలు మొలుస్తాయి. ఆ పాపపు మొక్కలను, పొదగా ఏర్పడినప్పుడు, వ్యక్తిలో ఉన్న సుకృతాలు తగ్గింప జాలవు కదా!

*నిర్యంత్రణం పరిణమంతి నయావదేతే*- పాపపు మొలకలు కాలక్రమేణ మహావృక్షాలవుతాయి. పూస్తాయి, కాయలు కాస్తాయి, ఫలవంతాలై నియంత్రింప- ఫలింప కుండా చేయడానికి - శక్యం కానివిగా బలిసి ఉంటాయి. పాపరాశి పండితే- ఫలమొసగే రీతిగా పరిణమిస్తే, ప్రపత్త్యుపాయానికి విరోధమైనందున ఉపాయం పూర్తిగా సిద్ధించదు; తత్ఫలితంగా, పాప ఫలాన్ని అనుభవిస్తున్న వ్యక్తిని రక్షించడానికి శక్యం కాదు (యావన్న పరిణమంతి). మొక్కై వంగనిది మ్రానై వంగునా? పాపాలు మహావృక్షాలుగా పరిణమించక ముందే భగవత్ప్రార్థన చేయడం శ్రేయస్కరం.

భక్త్యంగమైన క్రతువులను భక్తి నిష్పత్తి కోసమే ఆచరిస్తున్నప్పుడు, భక్తి నిష్పన్నం కాకుండా ప్రబల పాపకర్మలు ఆటంక పరుస్తాయి. క్రతువును అనుష్ఠిస్తున్నప్పుడు క్రతువుకు అంగమైన ఉద్గీథాద్యుపాసన చేస్తున్నప్పుడు పాపకర్మలు నివర్తింపబడితే గాని భక్తి నిష్పత్తి కాదు.

అట్లే, ప్రపత్తి నిష్పత్తికి ప్రతిబంధకాలైన పాపాలు ఒక్కటి కూడా లేకుండా నివర్తింపబడితేగాని ప్రపత్త్యుపాయం సిద్ధింపదు. దేవా! నీవు త్వరగా రావాలి. నన్ను రక్షించాలి. ప్రపత్త్యుపాయం పూర్తిగా సిద్ధించడానికి పాపరాశిని నివర్తింప జేయాలని ప్రార్థన చేయబడుతున్నది.

"పావమెల్లాంశుమ్మైనా దేకైవిట్టోడిత్తూఱుగళ్ పాయ్న్దనవే"– (శెన్నియోంగు –3) ఓ తిరుమలేశా! నీవు నన్ను అభిమానించగానే నన్ను అణగద్రొక్కిన పాపాలన్నీ ఊపిరాడక నన్ను పూర్తిగా వదలి పరుగెత్తి ఎక్కడనో దూరిపోయినాయి అని పెరియాళ్వార్ల శ్రీసూక్తి.

'తావన్నచేత్ త్వముపగచ్ఛసి శార్ఙ్గధన్వా
శక్యం త్వయాఽపి నహివారయితుం కరీశ!–

అంకురాలుగా ఉన్న పాపాలు పెరిగి మహావృక్షాలై ఫలమొసగునట్లు పరిణమించక ముందే నీవు శార్ఙ్గధరుడవై త్వరగా రావాలి. శాఖోపశాఖలుగా పెరిగిన వృక్షాలను ధనుస్సునందు బాణాన్ని సంధించి వేసిననే గాని అవి నిశ్శేషంగా ఛేదింపబడవు కదా! నందకమనే ఖడ్గాన్ని ధరించి వస్తే, దగ్గరగా నున్న వృక్షాలను నరుక వచ్చునేమో కాని, దూరదూరంగా, మహోన్నతంగా పెరిగి దృఢంగా ఉన్న వృక్షాలను ఖడ్గం చేత నరుకడం సాధ్యం కాదు. సప్తసాలాలను భేదించినట్లు, ధనుర్బాణాలచేతనే ప్రబలతరమైన పాపరూప మహావృక్షాలను ఛేదింప సాధ్యమవుతుంది.

నీవు ధనుర్ధారివై త్వరగా రాకపోతే, అంకురాలుగా ఉన్న పాపాలు పైపైన పెద్దగా వృద్ధిపొంది మహా పాతకాలుగా పరిణమించినప్పుడు చేతనులను పాషండ మతాలలోకి ప్రవేశింపజేస్తాయి.

*"యేద్విషంతి మహాత్మానం నస్మరంతి చ కేశవమ్।*
*న తేషాం పుణ్య తీర్థేషు గతిః సంసర్గిణా మపి॥"*

*(భార.శాంతి. 336-36)*

నాస్తికులు భగవంతుణ్ణి స్మరించకుండా ద్వేషిస్తుంటారు. అట్టి నాస్తిక్య బుద్ధికలవారు గంగా, కావేరీ పుణ్య నదీతీర్థాలలో స్నానం చేసినప్పటికీ వారికి సద్గతి లభించదు. భగవద్ద్వేషంతో పాపిష్ఠులైన నరులు యాగాది కర్మలను ఆచరించినా, భగవానునికి సహింప శక్యం కాజాలదు. అట్టివి శుభకార్యాలు కాజాలవు. వారి పాపకర్మలకు తగినట్లే "క్షిపామ్యజస్రం"- (భ.గీ. 16-19) క్రూర జన్మలయందే త్రోసివేస్తాడు అని శాస్త్ర ప్రమాణాలు స్పష్టంగా తెల్పుతున్నాయి కదా!

'శార్ఙ్గం' అహంకార తత్త్వం అభిమాన దేవతగా కలది. "పురుడన్ మణివరమాక" అనే పాశురంలో (అధికార సంగ్రహం-41) చెప్పబడింది. విష్ణుపురాణంలోనూ అస్త్ర భూషణాధ్యాయమందు విశదీకరింపబడింది. కాబట్టి, అహంకార చిహ్నమైన శార్ఙ్గమే దురితాలను త్వరగా ధ్వంసం చేస్తుంది. పాపాలన్నీ గరుడ పక్షిని జూడగానే సర్పాలు పారిపోయినట్లు శార్ఙ్గమనే వింటి యందు బాణాన్ని ఎక్కుపెట్టి వేస్తే, మహాపాప వృక్షాలు సప్త సాలాల లాగా ఛేదింప బడుతాయి.

గజేంద్రుని రక్షించడానికి త్వరపడినట్లే, భగవానుడు ధనుర్ధారియై త్వరగా వేంచేయకుంటే పాపం పండుతుంది. ప్రపత్త్యుపాయం పూర్తిగా సిద్ధించనందువల్ల భగవానునికి కూడా రక్షింప శక్యం కాదు.

అహంకార తత్త్వాభిమానం గల శార్ఙ్గమనే వింటిని చేత బట్టుకొని త్వరగా వచ్చి ప్రపత్త్యుపాయానికి ప్రతిబంధకాలైన పాపాలను ఛేదించి, రక్షించవలెనని భగవంతునికి అభిముఖంగా ప్రార్థన చేయబడింది. వసంత తిలక.

39. *యావన్న పశ్యతి నికామ మమర్షణో మాం*
*భ్రూభంగ భీషణ కరాళముఖః కృతాంతః*
*తావత్ పతంతుమయితే భగవన్! దయాళోః*
*ఉన్నిద్ర పద్మ కలికా మధురాః కటాక్షాః॥*

**అర్థం:** హే భగవన్!= షాడ్గుణ్య పరిపూర్ణుడవైన ఓ వరదా!; నికామం= మిక్కిలి; అమర్షణః= సహింపజాలని; భ్రూ భంగ, భీషణ, కరాళ ముఖః= కనుబొమల ముడిచేత, భయంకరమైన క్రూర, ముఖం కలిగిన; కృతాంతః= యమధర్మరాజు; మాం= నన్ను; యావత్= ఎంతవరకు; న, పశ్యతి= చూడలేడో; తావత్= అంత(కాలం) లోపుగనే; దయాళోః= దయను కలిగియున్న; తే= నీ యొక్క; ఉన్నిద్ర పద్మకలికా మధురాః= వికసించిన తామర పూవులుగా రమణీయాలైన; కటాక్షాః= కడగంటి చూపులు; మయి= నాయందు; పతంతు= పడుగాక.

**తా॥** ఓ భగవానుడా! జ్ఞానశక్త్యాది ఆరుగుణాలచే నిండిన ఓ వరదా! యమధర్మరాజు నేను చేసిన పాపాలను ఓర్వలేని కోపం కలవాడు. కనుబొమల కౌటిల్యంచేత మిక్కిలి భయంకరమైన క్రూరదంష్ట్రలున్న ముఖం కలవాడు. అట్టి యముని దృష్టి నా మీద పడకముందే, పూదేనెతో నిండి అప్పుడే వికసించు తామరపూలను పోలియున్న నీ కరుణామృత పూర్ణ కటాక్షాలు నా యందు ప్రసరింపజేయవలెను.

**వ్యాఖ్య:-** మరొక జన్మ కలుగుననే భయంతో భగవంతుణ్ణి ఈ దేహం అంతమొందక ముందే ప్రపత్త్యుపాయాన్ని నిర్వర్తింపజేయుమని ప్రార్థిస్తున్న శ్లోకమిది.

భరన్యాసం చేసిన ప్రపన్నులు నిర్భరులై, నిర్భయులై యుంటారు. ప్రపత్త్యుపాయ నిష్ఠలోనున్న కొందరికి జన్మాంతర ప్రసంగభయం కలుగకపోదు. ఓ భగవానుడా! మాకు స్వరూప లక్షణం చెడకూడదు; జ్ఞాత, అజ్ఞాత దోషాలు కలుగకూడదు, భాగవతాపచారం చేయరాదు. ఉపాయ నిష్ఠ లోపించే సందర్భాలు

కలుగకుండవలెనని మనస్సు కలవర పడడం తప్పుకాదు. అట్టి భావన ఏర్పడిన ప్రపన్నుడు సర్వజ్ఞుడూ, సర్వస్వతంత్రుడైన భగవంతుణ్ణి ప్రార్థన చేసే విధానం సుశ్లోకితం.

*యావత్ నపశ్యతి నికామమమర్షణం మాం భ్రూభంగ భీషణ కరాళ ముఖః కృతాంతః*– ప్రకృతి బద్ధులైనవారు తెలిసో, తెల్యకయో ఏ మాత్రమైనా పాపం చేయకుండా ఉండలేరు కదా! చేసిన పాపాలను యముడు చూచి క్షమించేవాడు కాదు. మిక్కిలి కోపం కలవాడు. ఆయన ముఖమే భయంకరమైనది. వంకర టింకరగా నుండే కనుబొమలతోనూ, క్రకచ కరాళ దంష్ట్రలతోనూ ఉగ్రమైన ముఖం గల యముని దృష్టిపడితే రౌరవాది నరకంలోకి నెట్టి బాధించకుండునా?

'మృత్యుర్యస్యోప సేచనం'– అన్నట్లు మృత్యువు అంటే యముడు నీకు 'ముఖ్యమైన ఆహారంలో నంచుకోదగిన ఊరగాయవంటి వా'డని ఉపనిషత్తు బోధిస్తున్నది. భగవన్! నీ భక్తుల తెరువు పోకూడదని యముడు తన భటులను ఆజ్ఞాపిస్తాడనియు 'ఆజామిళోఖ్యానం' తెల్పుతున్నది.

*"కమల నయన వాసుదేవ విష్ణో ధరణిధరా చ్యుత శంక చక్ర పాణే!*
*భవ శరణమితీ రయంతి యేవై త్యజ భటదూర తరేణ తాన పాపాన్॥"*

(వి.పు. 3-7-33)

పుండరీకాక్ష! వాసుదేవా! ధరణిధర! అచ్యుత! శంఖచక్రధర! నన్ను రక్షింపుమని ప్రార్థించే వారు పాపరహితులు. కాబట్టి, వారి చెంతకు పోకుండా, దూరంగా పొమ్ము– అని యముడు తన భటునికి రహస్యంగా చెబుతాడట కదా!

*తావత్ పతంతు మయి తే భగవన్! దయాళో* రున్నిద్ర పద్మ కళికా మధురాః కటాక్షాః–

ఓ భగవానుడా! మమ్ములను నరకానికి తీసుకొనిపోకుండా యమునితో యుద్ధం చేయుమని మేము నిన్ను ప్రార్థిస్తున్నామా? లేదు కదా! నీవు స్వాభావికంగానే మిక్కిలి దయకలవాడవు. భీకరమైన కరాళ ముఖంగల ఆ కృతాంతుని దృష్టి- చూపు- మాపైన ప్రసరించకముందే నీ చల్లని చూపు మా మీద ప్రసరింపజేయుమని వేడుకొంటున్నాము.

యముడు తనలోకానికి తీసుకొని పోవడానికి మమ్ము జూడకముందే నీవు మాకు 'ఈ జన్మలోనే మోక్షమిస్తా'ననే సంకల్పం గల నిరతిశయమైన దయాశాలివి. నీవు పుండరీకాక్షుడవు.

"కళికా కోరకోஉ స్త్రియామ్"- (అమరం) పద్మకళిక అంటే తామరమొగ్గ. 'మధుర' మంటే మకరందం కలది. సద్యోవికసితమై మకరంద భరితమైన తామరపూవు (లను) పోలియుండే కన్నులు కలవాడు భగవానుడు. గంభీరాంభస్సముద్భూత సుమృష్టనాళ రవి కర వికసిత పుండరీక నయనుడని 'కప్యాస పుండరీకాక్షు' డనే పదానికి శ్రీభాష్యకారులు వివరించిన సూక్తి ఇది.

అగాధ జలనిధిలో అప్పుడే వికసించిన తామర పూవులనుంచి పూదేనె సొనలు, మీలు మొదలైన జలచరాదులమీద చిందితే అవి ఎంత హర్షిస్తాయో! భగవన్! చలువగల నీ కడగంటి చూపులను మా మీద ప్రసరింపజేయుము. ఈ జన్మను చాలించకముందే ప్రపత్త్యుపాయాన్ని నిర్వర్తించి భరన్యాస స్వీకారాన్ని సూచింపజేస్తూ, మాకు నైర్భర్యాన్ని కలిగించుమని ప్రార్థన చేయబడింది. వసంత తిలక.

*40.* *సత్వం స ఏవ రభసో భవదౌపవాహ్యః*
*చక్రం తదేవ శితధార మహంచ పాల్యః।*
*సాధారణేత్వయి కరీశ! సమస్త జంతోః*
*మాతంగ మాను[illegible]దా నవిశేష హేతుః॥*

**అర్థం:** హే కరీశ!= గజేంద్రుని రక్షించిన ఓ వరదరాజా!; త్వం= నీవు; సః, ఏవ= ఆనాడు గజేంద్ర రక్షణ కోసం పరుగెత్తి వచ్చిన నారాయణుడవే; రభసః= వేగశాలియైన; భవత్+ఔపవాహ్యః= నీ వాహనమైన గరుత్మంతుడు కూడా; సః, ఏవ= ఆనాడు నిన్ను వేగంగా తీసుకొని వచ్చిన ఆ గరుత్మంతుడే; శిత ధారం= పదునైన అంచులుగల; చక్రం= సుదర్శన చక్రం; తత్+ఏవ= ఇప్పుడు నీవు ధరించిన చక్రం కూడా అప్పటిదే; అహం, చ= నేను కూడా; పాల్యః= రక్షింపదగిన వాడను. త్వయి= నీవు; సమస్త జంతోః= ప్రాణులన్నిటికీ; సాధారణే (సతి)= సమానుడవై యుండగా; మాతంగ మానుష భిదా= గజమని, మనుష్యుడని భేద భావం; న, విశేష హేతుః= గొప్ప కారణం కాదు.

**తా॥** ఓ వరదా! నీవు పూర్వం గజేంద్రుని కాపాడిన నారాయణుడవే. నీ వాహనం ఆనాటి గరుడుడే. ఆయన వేగమూ అప్పటి రీతిగనే యున్నది. తీక్షణమైన మొనలుగల చక్రం కూడా ఇప్పుడు నీ చేత ధరింపబడి యున్నది. నేను కూడా గజేంద్రునివలె రక్షింపదగినవాడనే. అది గజమనీ, నేను మనుష్యుడననీ భేద భావానికి కారణమే లేదు. నీవు సర్వప్రాణులను సమభావంతో, రక్షించే నియమం కలవాడవు. కాబట్టి, నా ప్రపత్త్యుపాయాన్ని పూర్తి చేసి నన్ను కాపాడడానికి శీఘ్రంగా రావయ్యా! స్వామీ! అని ప్రార్థన.

**వ్యాఖ్య:-** భగవానుని ఆశ్రిత రక్షణకు ఉపయోగ పడే విభూతి పౌష్కల్యం ప్రకటింపబడే శ్లోకమిది.

భక్తి, ప్రపత్తి రూపమైన విద్యలు నిరూపింపబడినాయి. తత్కారణంగా, సాత్వతశాస్త్రమందు చెప్పబడిన పరవ్యూహాద్యుపాసనలు తెల్పబడినాయి. ప్రపత్తి విద్యచే తెలుసుకోదగిన వాత్సల్య స్వామిత్వ, సౌశీల్య, సౌలభ్య, సర్వజ్ఞత్వ, సర్వశక్తిత్వాది కల్యాణ గుణాలు విశదీకరింపబడినాయి.

విశేషంగా అన్నిటికంటే శ్రేష్ఠమైన, సారతమమైన పరమకారుణికత్వమూ నిరూపింపబడింది. ఇందు సర్వలోక, సర్వభూత రక్షైక దీక్ష కలవాడు భగవానుడని సంస్తుతింపబడుతున్నది.

సత్వం స ఏవ రభసో భవదౌప వాహ్యః– "దిఙ్నాగై రర్చితః"– ఓ కరీశా! తిర్యక్ జంతువులైన ఏనుగులు నిన్ను పూజించినందువల్ల ఈ కరిశిఖరి శిఖర శేఖరాయమాన దివ్యరూప విశిష్టుడవై నిల్చియున్నావు. పూర్వం గజేంద్రుని రక్షణకోసం పరుగెత్తి వచ్చిన నారాయణుడవే ఈ క్షేత్రమందు అర్చావతారుడవై వెలసియున్నావు. "భవాన్నారాయణోదేవః" నీవు నారాయణుడవే అని చతుర్ముఖ బ్రహ్మ కీర్తించినట్లు, మేము నిన్ను స్తుతింపదగిన దివ్యమంగళ విగ్రహ విశిష్టుడవై విరాజిల్లుతున్నావు.

నీ వాహనమైన పక్షిరాజు పూర్వం గజేంద్రుణ్ణి కాపాడవలెనని అతివేగంగా నిన్ను తీసుకొని వస్తుంటే "ఆకర్షన్ ద్విజరాజ మప్యతి జవాత్"– ఆ వేగం చాలదని నీవు గరుడుణ్ణి కూడా నీ ఊరువుల నడమ ఇరికించుకొని అతివేగంగా వచ్చినావు కదా! ఈ నీ వాహనం కూడా ఆ గరుత్మంతుడే. మార్పులేశమైనా లేదు. ఆ గరుడుని వేగమూ ఆనాటి వలెనే ఇప్పుడూ ఉన్నది.

చక్రం త దేవ శితధారం– చుట్టూరా వాడి మొనలు గల చక్రాన్ని చేతబట్టి, మొసలి తల నరికి గజేంద్రుణ్ణి రక్షించినది అదే చక్రం.

అహంచ పాల్యః– భగవన్! గజేంద్రుణ్ణి రక్షించడమే కాదు. నేనూ నీచే రక్షింపదగిన వాడను కదా!

*సాధారణే త్వయి కరీశ! సమస్త జంతోః*– సమస్త ప్రాణులు నీకు సమానంగానే ఉంటాయి.

"దేవానాం దానవానాం చ సామాన్య మధి దైవతమ్"– (జితం. 1, 2) దేవతలైనా రాక్షసులైనా పక్షపాతం లేకుండా అందరినీ సమానంగా రక్షించే దేవుడవయ్యా!

*మాతంగ మానుష భిదా నవిశేష హేతుః*– అది ఏనుగు–తిర్యక్ జంతువు, నేను మనుష్యుడను అని భేదబుద్ధికి ఏదైన కారణం చెప్పబడిందా? లేదే. కాబట్టి

ప్రపత్త్యుపాయాన్ని పూర్తిచేసి శీఘ్రంగా వచ్చి నన్ను రక్షించవలసిందిగా ప్రార్థిస్తున్నాను. వసన్త తిలక.

41. నిర్వాపయిష్యతి కదా కరిశైల ధామన్!
దుర్వార కర్మపరిపాక మహాదవాగ్నిమ్।
ప్రాచీన దుఃఖమపి మే సుఖయన్నివ త్వ
త్పాదార విన్ద పరిచార రసప్రవాహః॥

అర్థం: హే కరిశైల ధామన్= హస్తి గిరియే నివాస స్థానంగా కలవాడా!; త్వత్ పాదారవింద పరిచార, రస ప్రవాహః= నీ పాద కమలాల యందు కైంకర్యం చేయడం వల్ల కలిగే ఆనంద రసప్రవాహం; (మాం= నన్ను) సుఖయన్; ఇవ= సుఖపెడుతూనే; మే= నా యొక్క; దుర్వార కర్మ పరిపాక మహా దవాగ్నిమ్= నివారింపరాని కర్మ ఫలమనే గొప్పదావాగ్ని వంటి; ప్రాచీన దుఃఖం, అపి= వెనుకటి కాలమందలి దుఃఖాన్ని కూడా; (సుఖయన్, ఇవ= సుఖాన్ని కలిగించేది గానే చేయడం); కదా= ఎప్పుడు; నిర్వాపయిష్యతి= ఆర్పగలదో? పోగొట్టునో?

తా॥ ఓ వరదా! హస్తిగిరినే స్థానంగా చేసుకొని యున్నవాడా! తామర కమలాల వంటి నీ పాదాల యందు సేవ చేయడం ఎంతో ఆనందకరమైనది. ఆ యానంద రస ప్రవాహం నన్ను చాలా సుఖపెడుతూనే ఉంటుంది. విలక్షణమైన ఆనంద రసప్రవాహం ఏ విధంగానూ విడువరాని నా పాపాల పరిణామమైన కార్చిచ్చును ఎప్పుడు ఆర్పివేయునో? నీ పాదకైంకర్య రసం ఉంటే, గడచిన కాలాన పడిన కష్టాలన్నీ సుఖదాయకాలుగానే పర్యవసిస్తాయి. ఆ బ్రహ్మానుభవమే పరమ పురుషార్థం కదా! అని తాత్పర్యం.

వ్యాఖ్య:- భగవత్పాద కైంకర్య రసప్రవాహం పాపకర్మ పరిపాకమైన కార్చిచ్చు నెప్పుడార్పివేయునో యని చింతపడుతూ, ప్రార్థన.

హే కరిశైలధామన్- వైకుంఠమందు నవరత్న ఖచిత సహస్ర స్థూణాద్యలం కృతమైన దివ్యస్థలమందు వసించే వాడవైననూ, మొరటుదైన ఈ హస్తిగిరిని

మందిరంగా నేర్పరచుకొని స్వయంగా వచ్చి నివసించడం ఆశ్రితులను రక్షించడం కోసమే యని భావించి, నేను నీ సన్నిధిలోనే ప్రార్థిస్తున్నాను. ఈ దేశంలోకి వచ్చి, దీన్ని దివ్యక్షేత్రంగా మలచుకొని నివసిస్తూ, ఆశ్రితులకు కైంకర్య రసానుభవాన్ని కలిగిస్తున్న వాడవుగా ఉన్నప్పటికీ, నేను ఇంక ఈ సంసార దుఃఖాన్ని అనుభవిస్తూ కష్టపడవలసిందేనా, స్వామీ! అని మానసిక బాధ నివేదింప బడుతున్నది.

త్వ త్పాదారవింద పరిచార రసప్రవాహః సుఖయన్నివ- ఉభయ విభూతి నాయకుడవైన నీ పాద కమలసేవ చేయాలి. "ఒఘివిల్ కాలమెల్లా ముడనాయమన్ని వఘివిలా వడిమై శెయ్య వేండుమ్" అనవరతం మృదువైన కెందామర ఛాయలొలికే నీ పాద సంవాహనం, పాద ప్రక్షాళనం, పూజ మొదలైన సర్వవిధ కైంకర్యం క్షణమైనా విడువకుండా చేయాలి. నీరేజాలవంటి నీచరణ సేవవలన కలిగే ఆనంద రసప్రవాహం సుఖదాయకంగానే ఉంటుంది. మోక్ష దశలోనైతే "సతత్ర పర్యేతి జక్షన్ క్రీడన్ రమమాణః స్త్రీ భిర్వాయానైర్వాజ్ఞాతిభిర్వా"- స్త్రీలతోగానీ, రథాలతోగానీ, జ్ఞాతులతోగానీ భుజిస్తూ, క్రీడిస్తూ, ఆనందిస్తూ, అంతట సంచరిస్తూ సంకల్పమాత్రాన ఆనందమే అనుభవిస్తాడని వేదాంత శాస్త్రం బోధిస్తున్నది. సర్వం ఆనందమయంగానే ఉంటుంది.

పరమ పదంలో బ్రహ్మానందానుభవం విలక్షణమైనది. భూలోకంలో అర్చారూపుడవైన నీ పాదసేవాది సర్వవిధ కైంకర్యం వల్ల కలిగే ఆనంద రసప్రవాహం నన్ను సుఖపెడ్తూనే యుంటుంది.

ఇక్కడ 'ఇవ' శబ్దం 'ఏవ' కారమనే అర్థమిస్తుంది. 'ఏవ మివ సమన్వితో ఔపనిషద సముదాయః' అని శ్రీభాష్యస్థమైన 'ఇవ' శబ్దం 'ఏవ' కారార్థమని 'శ్రుతప్రకాశికా వ్యాఖ్య'తో నున్నందువల్ల 'సుఖయన్నేవ' అని అర్థం.

దుర్వార కర్మ పరిపాక మహాదవాగ్నిం కదా నివారయిష్యతి- తొలగింపరాని పాపకర్మల పరిపాకమనే గొప్ప కార్చిచ్చును ఎప్పుడు

ఆర్పివేయగలదో? భగవత్పాద కైంకర్యం వల్ల కలిగే ఆనంద రసప్రవాహం సుఖదాయకమవుతూనే ఈ సాంసారికమైన దావాగ్నిని చల్లార్చగలదు. అది ఎప్పుడు ఆర్పివేయునో? అని బుద్ధి వికాసంచేతనో, వికారంచేతనో మనోభావన ఏర్పడుతుంది.

*ప్రాచీన దుఃఖమపి మే సుఖయన్నివ*- భగవత్పాద సేవవలని ఆనందానుభవం అనాది కాలం నుంచి అనుభవిస్తున్న ఆపదలనన్నిటినీ సుఖంగానే పర్యవసింప జేస్తుంది. తల్లి శిశువుకు స్తన్యమిస్తూనే చికిత్స చేయునట్లు, భగవత్పాద కైంకర్యం వలన కలిగే ఆనంద రసప్రవాహం పాపాల ఫలమనే మహాదావాగ్నిని చల్లార్పగలదు. ప్రాచీన దుఃఖ నివృత్తిని కలుగజేసి సుఖదాయకంగానే ఉండగలదు. భగవత్కైంకర్య రూపమైన బ్రహ్మానందానుభవమే పరమ పురుషార్థం. వసంత తిలక.

*42. ముక్తః స్వయం సుకృత దుష్కృత శృంఖలాభ్యాం*
*అర్చిర్ముఖైరధి కృతై రతి వాహితాధ్వా।*
*స్వచ్ఛంద కింకరతయా భవతః కరీశ*
*స్వాభావికం ప్రతిలభేయ మహాధికారమ్॥*

**అర్థం:** హే కరీశ!= ఓ కరిగిరినాథా! అహం= నేను; సుకృత దుష్కృత శృంఖలాభ్యాం= పుణ్యం, పాపం అనే రెండు సంకెళ్ళ చేత; స్వయం= స్వయంగా; ముక్తః= విడువబడిన వాడనై; అర్చిః+ముఖైః= అగ్ని మొదలైన; అధికృతైః= అధికారులైన; అతి వాహిత+అధ్వా= అతివాహకులచే పిలిచి తీసుకొని పోబడిన మార్గం కలవాడనై; భవతః= నీకు; స్వచ్ఛంద కింకరతయా= నా యిష్టం వచ్చినట్లు కైంకర్యం చేసే భాగ్యంచేత; స్వాభావికం= స్వభావ సిద్ధమైన; మహాధికారం= పెద్ద పదవి యందలి అనుభవాన్ని; ప్రతిలభేయ= పొందెదను.

**తా॥** ఓ హస్తిగిరినాథా! నేను పుణ్య పాపాలనే రెండు నిగళాలచే తమంత తామే విడిపోబడిన వాడనై అగ్ని మొదలైన అతివాహకులచే అర్చిరాది మార్గంగా

కొనిపోబడినవాడనై నీకు స్వేచ్ఛగా కైంకర్యం చేస్తూ స్వభావ సిద్ధమైన బ్రహ్మాను భవమనే గొప్ప అధికారాన్ని ఎప్పుడు పొందెదనో అని వేడుకొంటున్నారు దేశికులు.

**వ్యాఖ్య:**- కర్మఫలమనే అనిష్ట నివృత్తి తర్వాత అర్చిరాది మార్గాన అతివాహకులచే కొనిపోబడి బ్రహ్మానుభవాన్ని పొందే విషయం వివరింప బడుతున్నది.

బ్రహ్మానుభవమనేది సుకృత దుష్కృతాల నివృత్తి యనేది శుద్ధ సత్త్వగుణం గల దేశమందు చేరిన తర్వాతనే కలుగుతాయి. కాబట్టి, అర్చిరాదిగతి యెట్లు సిద్ధించగలదు? అనే శంకను పరిహరిస్తూ, భక్తి ప్రపత్తి రూప విద్యాసామర్థ్యం వల్లనే గత్యాదికం సిద్ధిస్తుందని వివృతం.

సుకృత దుష్కృత శృంఖలాభ్యాం స్వయం ముక్తః- పుణ్య పాపాలు అనే రెండు నిత్య విభూతికి- పరమ పదానికి పోవడానికి విరోధంగా ఉండేవి కాబట్టి జీవాత్మకు అవి రెండు సంకెళ్ళ వంటివని చెప్పబడినాయి. దేహవియోగ కాలమందే, అంటే మరణం సంభవించినప్పుడే పుణ్య పాపాది సర్వ కర్మలు విడిపోయిననే గాని పరమ పదానికి పోవడం సాధ్యపడదు. నివృత్తి ధర్మానికి కూడా జ్ఞానమందే ఉపయోగం కాని అర్చిరాది గతియందు కాదు. సద్గతిని గూర్చి చింతించడం కూడా శాస్త్ర విధియొక్క బలం వల్ల భక్తికి అంగమే. కాని అది స్వతంత్రంగా గతి మొదలైన వాటికి సాధనం కాదు. అందువల్ల, ప్రపన్నునికి గతి చింతన చేయకున్నను నష్టమేమీ లేదు, ఉండదు. ఇక్కడ, శ్రీ వ్యాస భగవానుని బ్రహ్మ సూత్రాల చేతనూ, శ్రీ భాష్య కారులచేతనూ నిర్ణయింపబడిన శాస్త్రార్థం అవశ్యంగా గమనింపదగి యున్నది.

"సాంపరాయాధికరణ" మందు "సాంపరాయేతర్త వ్యాభావాత్ తథా హ్యన్యే"- (బ్ర.సూ. 3-3-27). దేహం నుంచి జీవుడు బయల్వెడలిన తర్వాత పుణ్య పాపాలవల్ల బ్రహ్మవేత్త పొందవలసిన దేదీ లేనందువల్ల, దేహ వియోగ సమయాననే అవి విడిపోతాయి.

"తస్య పుత్రా దాయ ముపయంతి సుహృదః సాధు కృత్యాం ద్విషం తః పాప కృత్యాం"- అనే శ్రుతిరీతిగా, బ్రహ్మవేత్త యొక్క పుత్రులు దాయలబ్ధమైన ద్రవ్యాన్ని పొందుతారు. అతని మిత్రులు పుణ్యకర్మలను, అతని శత్రువులు పాప కర్మలను పొందుతారు. దాయ లబ్ధంతోనే సుకృత దష్కృతాలు రెండు కూడా మరణ సమయమందే విడిపోతాయి.

"అశరీరం వా వసన్తం నప్రియాప్రియే స్పృశతః"- అంటే, శరీరం విడిచిన వానికి సుఖదుఃఖాల అనుభవం లేదు.

"ఏష సంప్రసాదోఽ స్మాచ్ఛరీరాత్ సముత్థాయ పరంజ్యోతి రుపసంపద్య స్వేన రూపేణా భిసంపద్యతే"- అని శ్రుతి పల్కినట్లు, ఈ జీవుడు శరీరం నుంచి బయల్వెడలి, పరంజోతిస్సును పొంది స్వస్వరూపంతో అభినిష్పన్ను డవుతాడు.

"తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యేఽ థ సంపత్స్యే"- బ్రహ్మవేత్త శరీరాన్ని వదలు వరకే మోక్షం పొందడానికి ఆలస్యం, ఆపైన అతడు మోక్షాన్ని పొందుతాడు. కాబట్టి బ్రహ్మవేత్తకు దేహ వియోగానంతరం బ్రహ్మ ప్రాప్తి తప్ప సుఖదుఃఖాను భవమేదీ యుండదని తెల్పబడింది.

"గతేరర్థ వత్త్వ ముభయథాఽ న్యథా హి విరోధః"- (3-3-29) (ఇదొక ఆక్షేపణ.) "స ఏతం దేవయానం పంథాన మాపద్య అగ్నిలోక మాగచ్ఛతి"- బ్రహ్మవేత్త దేవయాన మార్గంగా పోయి అగ్ని మొదలైన లోకాలను పొందుతున్నాడు (కౌషీ. 1-3-4) అని మొదల్కొని ఆపైన "స ఆగచ్ఛతి విరజాం నదీం తాం మనసాఽ త్యేతి; తత్సుకృత దష్కృతే విధూనుతే"- అనే వాక్యం చేత, అతడు విరజానదిని పొంది దాన్ని మనస్సు చేత దాటి సుకృత దుష్కృతాలను విదల్చుతున్నాడని తెల్పబడింది కదా! కాబట్టి పుణ్య పాపాలలో కొంత భాగం శరీరాన్ని విడిచినప్పుడు, మిగిలినది దేవయాన మార్గమధ్యలోనూ (ఉభయథా) రెండు భాగాలుగా నశిస్తాయి. అంటేనే శ్రుతి సార్థకమవుతుంది. అట్లు కాక

దేహ వియోగ కాలమందే అన్ని కర్మలు నిశ్శేషంగా నశిస్తాయి అన్నట్లైతే, సూక్ష్మశరీరానికి సైతం వినాశ మేర్పడుతుంది. అట్లైతే కేవలం ఆత్మ అర్చిరాది మార్గంగా పోవడం అసంభవం. కాబట్టి, శరీరాన్ని విడిచినప్పుడే సకల కర్మలు నిశ్శేషమవడం అసంభవమని ఆక్షేపించబడింది. ఇందుకు సమాధానం మరొక సూత్రంచే తెల్పబడింది.

*"ఉపపన్నస్తల్లక్షణార్థోప లబ్ధేః లోక వత్"*- (3-3-30) (పైన చెప్పిన శ్రుతి వాక్యంలో - *"తత్సుకృత దుష్కృతే విధూనుతే"* అని మొదట చెప్పి, సుకృత దుష్కృతాలను విదల్చుతాడు. తర్వాత అతడు విరజను పొంది దాన్ని మనస్సుచేత దాటుతాడు అని అన్వయించాలన్నారు శ్రీ భాష్యకారులు).

బ్రహ్మవేత్త యొక్క మరణ సయమందే సర్వకర్మలు నశించిననూ అతడు స్వస్వరూప ఆవిర్భావ రూపమైన మోక్షం కలవాడవడం చేత దేహ సంబంధం వల్ల కలుగవలసిన కార్యం దేహ వియోగానంతరం కూడా కలుగుతుంది. పరంజ్యోతిస్సును పొంది- స్వస్వరూపా విర్భావాన్ని పొంది- ముక్త పురుషుడు భోగాలను అనుభవిస్తూ *"సస్వరాడ్భవతి"* అతడు కర్మవశ్యత లేని వాడవుతాడు. *"తస్య సర్వేషులోకేషు కామచారో భవతి"*- అతడు అన్ని లోకాలలో యథేష్టంగా సంచరిస్తుంటాడు.

*"స ఏ కథా భవతి, త్రిధా భవతి"* (ఛాం. 7-26-2) అనే వాక్యాన్ని బట్టి, అతడు ఒక రూపంతోనూ, మూడు రూపాలతోనూ అవుతుంటాడని తెలుస్తున్నది. శరీర సంబంధం కలిగినప్పుడు చేసే క్రీడనాది కార్యాలనన్నిటినీ శరీర సంబంధం లేనప్పుడు కూడా ముక్త పురుషుడు చేస్తుంటాడని స్పష్టమవుతున్నది.

కాబట్టి, ముక్త పురుషుని కర్మలన్నీ అతని దేహవియోగ సమయమందే నశించిననూ, సూక్ష్మశరీర యుక్తుడవడంచేత ఇతడు అర్చిరాది మార్గాన పయనించడం సంభవమే. సూక్ష్మశరీరానికి కూడా కర్మమే కారణమవడం వల్ల అతని శరీర వియోగమప్పుడే అతని సర్వకర్మలు నశిస్తాయి, అన్నట్లైతే సూక్ష్మ

శరీరం ఎట్లు కలుగుతుంది? అని శంకింప పనిలేదు. అది బ్రహ్మ విద్యా మాహాత్మ్యం వల్ల ఉండవచ్చు.

బ్రహ్మవిద్య స్వయంగా సూక్ష్మశరీరానికి కారణం కాదు. ప్రాకృత సుఖదుఃఖోపభోగ సాధనమైన స్థూల శరీరమూ, సర్వకర్మలూ నిశ్శేషంగా నశించిననూ, బ్రహ్మవిద్య తన ఫలమైన బ్రహ్మప్రాప్తిని కలుగజేయడానికి అర్చిరాది మార్గాన ముక్త పురుషునికి ప్రయాణం సంభవమయ్యే రీతిగా చేయడానికే సూక్ష్మ శరీరాన్ని నిల్పుతున్నది.

లోకంలో సస్య సమృద్ధికై చెరువును త్రవ్వించిననూ, కొంత కాలానికి సస్య వృద్ధికోసం ఇచ్ఛలేకున్నా, స్నాన పానాద్యుపయోగం కోసం చెరువును కాపాడుకోవడం పరిపాటి.

ఏ కోరిక చేత చెరువును త్రవ్వించారో ఆ కోరిక ఇప్పుడు లేకపోయినా ఆ చెరువు స్నాన పానాదులకు ఉపయోగపడుతున్నది. ఇచ్ఛ నశించినా, ఇచ్ఛాకార్యమైన చెరువు నశించడం లేదు కదా! అట్లే, సూక్ష్మ శరీరం కూడా తన ఉత్పత్తికి కారణాలైన కర్మలు నశించిననూ, ముక్తాత్మకు అర్చిరాది మార్గ ప్రయాణ సాధనంగా ఉపయోగపడుతూ బ్రహ్మ విద్యచేత స్థాపింపబడుతున్నది.

దేహ వియోగ కాలాన జ్ఞానులందరి సర్వకర్మలు నశిస్తాయి అనడం సమంజసం కాదు. శరీర పాత సమయాన వెంటనే అర్చిరాది మార్గాన ప్రయాణం ఏ జ్ఞానులకు కలుగుతున్నదో వారి కర్మలు మాత్రమే శరీర వియోగ కాలమందు నిశ్శేషంగా నశిస్తాయని తెల్పబడింది.

సూత్రకారులచే, భాష్యకారులచే నిర్ణయింపబడిన విధంగా పుణ్యపాపాలు విడిపోవడం కూడా భక్తి, ప్రపత్తి రూపమైన విద్యలయొక్క విశేష సామర్థ్యం వల్లనే అనీ; భక్తులకూ, ప్రపన్నులకూ అర్చిరాది గతి కూడా బ్రహ్మ విద్యా న్యాస విద్యా మహిమ వల్లనే కలుగుతుందనడంలో సంశయం లేదు.

స్వయం ముక్తః- నన్ను సంకెళ్ళ వలె బంధించిన పుణ్యపాపాలు రెండు ఓ దేవా! నీ యనుగ్రహం వల్ల తమంత తామే విడిపోయినందువల్ల ముక్తుడ నవుతానని దేశికులు స్తుతిస్తున్నారు.

అర్చిర్ముఖై రధికృతై రతి వాహితాధ్వా- ఆర్చిస్సు- అగ్నిలోకం మొదలైనవి ప్రకృతిలోని ఊర్ధ్వలోకాలు.

మూర్ధన్య నాడిలో ప్రవేశించిన ముముక్షువు సూక్ష్మదేహమనే బ్రహ్మపురంలోనుంచి బ్రహ్మనాడి-సుషుమ్నా నాడి చివర హార్దుడు- హృదయ మందున్న సర్వేశ్వరుడు, వెలుగుచూపగా- తద్వారా బయల్వెడుతాడు. భగవత్ప్రేరితులైన అధికారులు ముక్తాత్మను అర్చిస్సు, అహస్సు, పూర్వపక్షం మాసం, అయనం, సంవత్సరం (ఇవి కాలాభిమాని దేవతల లోకాలు) తర్వాత వాయువు, సూర్యుడు చంద్రుడు, వైద్యుతుడు ఆహ్వానించి, పూజిస్తారు. ఈ లోకాలన్ని భోగ భూములు. కాబట్టి, అర్చిరాద్యభిమాని దేవతలు గౌరవించగా దేవయాన మార్గం అంటే అర్చిరాది మార్గాన ముక్తాత్మను తీసుకొని పోతారు.

*"అతివాహికాస్తల్లింగాత్"*- (4-3-4) అర్చిరాదులు పరబ్రహ్మ వద్దకు తీసుకొని పోవడానికి భగవంతునిచే నియమింపబడే దేవతలని చెప్పబడింది.

*"వైద్యుతేనైవ తతస్తచ్ఛ్రుతేః"*- (4-3-5)

*"తత్పురుషోఽ మానవః స ఏనాన్ బ్రహ్మ గమయతిః"*- అనే శ్రుతిరీతిగా, విద్యుత్తును పొందిన తర్వాత ఆ విద్యుల్లోక మందుండే అమానవ పురుషుని చేతనే బ్రహ్మవేత్తలు తీసుకొని పోబడతారని తెలుస్తున్నది. ఈ అమానవ పురుషునికి సహకారులుగా వరుణుడు, ఇంద్రుడు, ప్రజాపతి అనేవారు కూడా పరబ్రహ్మ వద్దకు తీసుకొనిపోయే వారని చెప్పబడింది.

(ఇదే అర్చిరాది గణం, అతివహనమంటే తీసుకొనిపోవడం కాబట్టి, 'అతివాహికాః' అని బహువచనం సూత్రమందు చెప్పబడింది).

*'స్వచ్ఛంద కింకరతయా భవతః కరీశ*
*స్వాభావికం ప్రతిలభేయ మహాధికారమ్-*

ప్రపన్నుడు చిరకాలంగా ఆశపడినట్టి దేశవిశేషానికి పోయిన వెంటనే, కర్మానుభవానికి మాత్రం కాకుండా, విద్యచే స్థాపింపబడినదై గమన సాధనకోసం ఈ జీవునితో గొనిరాబడిన సూక్ష్మశరీరాన్ని, నదిని దాటడానికి ఎక్కిన తెప్పను-పడవను ఒడ్డుకు చేరిన తర్వాత విడిచిపెట్టినట్లు, విడిచిపెట్టించి విరజానది యావలి ఒడ్డుకు తీసుకొనిపోతారు అతివాహకులు. అక్కడ ఈ జీవునికి అప్రాకృత శరీర మొసగబడుతుంది. 'ఐరం మదీయం' అనే సరస్సు వద్ద, అశ్వత్థ వృక్షం దగ్గర ఐదువందల దివ్యాప్సరలు ముక్తాత్మను ఎదుర్కొని, వస్త్ర భూషణాదుల నొసగి బ్రహ్మాలంకారంతో అలంకరిస్తారు.

"*వైకుందం పుగుదలుం వాశలిల్వానవర్*"- (తిరువాయ్ మొషి. 10-9-9) అనే పాశురాలు వివరించిన రీతిగా, వైకుంఠ ద్వార గోపుర వాసులు, నిత్య సూరులు అప్రాకృత రాజోపచారాలతో సత్కరిస్తారు. ఆనందమయ మండపమందున్న సుందరమైన గోష్ఠిలోకి ముక్తాత్మను తీసుకొనిపోతారు.

"*సంపద్యా విర్భావః స్వేన శబ్దాత్*"- (బ్ర.సూ. 4-4-1)

"*స్వేన రూపేణాభినిష్పద్యతే*" అనే శ్రుతి ప్రకారంగా పరంజ్యోతిస్సును పొందిన తర్వాత ముక్తపురుషునికి స్వీయరూపం సిద్ధిస్తుందని తెలుస్తున్నది.

"*య ఆత్మా అపహత పాప్మావిజరో విమృత్యుర్విశోకో విజిఘత్సోఽ పిపాసః సత్య కామః సత్య సంకల్పః*" (ఛాం. 8-7-1) అనేది ప్రజాపతి వాక్యం. ఆత్మ పాపరహితుడు, ముదిమిలేనివాడు, చావులేనివాడు, దుఃఖంలేనివాడు, ఆకలి దప్పులూ లేనివాడు, సత్యకాముడు, సత్యసంకల్పుడు అనే ఎనిమిది గుణాలు కలవాడని ఆత్మయొక్క స్వరూపం తెల్పబడింది.

ఆత్మకు అపహతపాప్మత్వాది స్వరూపం నిత్య ప్రాప్తమే అయిననూ, సంసార దశయందు కర్మరూపమైన అవిద్యచేత తిరోహితమైనది. పరంజ్యోతిస్సును పొందిన తర్వాత ముక్తాత్మకు సహజమైన స్వరూపం సిద్ధిస్తుంది.

*"యథా నక్రియతే జ్యోత్స్నా మలప్రక్షాళనాన్మణేః।*
*దోష ప్రహాణా న్న జ్ఞానమాత్మనః క్రియతే తథా॥"*

మణియందున్న మాలిన్యాన్ని తుడిచి వేయగానే కాంతి సృజింపబడనట్లు, దోషాలను పోగొట్టినంత మాత్రాన ఆత్మ యొక్క జ్ఞానానందాది స్వరూపం కొత్తగా సృజింపబడదు. ఆ స్వరూపం ఆత్మకు స్వాభావికమైనది.

*"యథో దపానకరణాత్ క్రియతే న జలాంబరమ్।*
*సదేవ నీయతే వ్యక్తిం అసతః సంభవః కుతః?"*

బావిని తవ్వడం చేత నీరు సృజింపబడదు. భూమి పొరలను తొలగించడమే కాని నీటిని నూతనంగా సృజించలేము. భూమి పొరలక్రింద ఉన్న ఉదకమే స్పష్టంగా బయల్పడుతుంది. ఉన్న వస్తువే ప్రకటితమవుతుంది. కాని లేనిదెట్లు సంభవం?

*"తథా హేయ గుణ ధ్వంసా దవబోధాదయో గుణాః।*
*ప్రకాశ్యంతే నజన్యంతే నిత్యా ఏవాత్మనో హితే॥"*

అట్లే, హేయగుణాలు నశించడంవల్ల జ్ఞానాది గుణాలు ప్రకాశిస్తున్నాయే కాని అవి సృజింపబడుతుండడం లేదు. ఆత్మయందు జ్ఞానాది గుణాలు ఎప్పుడు ఉండేవే కదా! (స్వస్వరూపావిర్భావ మంటే శాస్త్రం అలాగా విశదీకరించింది).

ఈ విధంగా "నిరంజనః పరమం సామ్యముపైతి" (ముం. 3-1-3) ప్రకృతి సంబంధంలేని వాడై ముక్తపురుషుడు పరబ్రహ్మతో పరమ సామ్యాన్ని పొందుతున్నాడు.

స్వచ్ఛంద కింకరతయా– ముక్తుడు భగవంతునికి కింకరుడు. అందువల్ల, తన ఇష్టం వచ్చినట్లు భగవత్కైంకర్యం చేస్తాడు. లోకంలో భగవదారాధకులు అధికారులకు అధీనులై– 'ఇది చేయు, అది చేయకు అని వారు చెబుతున్న విధి నిషేధాలకు వశ్యులై ఉండవచ్చునుగాక!

"అత ఏవ చానన్యాధి పతిః"– (బ్ర.సూ. 4–49). ముక్తపురుషుడు సత్య సంకల్పుడవడం చేతనే 'అనన్యాధిపతి' అనబడుతున్నాడు. అంటే, విధినిషేధాలకు అధీనాలైన ప్రవృత్తి నివృత్తులు కలవాడు కాడు. కాబట్టి, తాను ఇష్టపడిన విధంగా భగవత్ప్రీత్యర్థం కింకరత్వాధి రాజ్యాన్ని పొంది యుంటాడు. "సస్వరాట్ భవతి"– ముక్తుడు కర్మ వశ్యుడు కానివాడు కదా! స్వాభావికం– అనన్యార్హ శేషత్వ రూపమైన స్వభావానికి సముచితమైన మహాధికారాన్ని పొందుతాడు. స్వతంత్రంగా, భగవత్కైంకర్య సామ్రాజ్య పట్టాభిషిక్తుడవుతాడని అర్థం.

*"సాయుజ్యం ప్రతిపన్నాయే తీవ్ర భక్తాః తపస్వినః।*
*కింకరా మమతే నిత్యం భవంతి నిరుపద్రవాః॥" (భగవచ్ఛాస్త్రం)*

'సయుక్' యొక్క భావం సాయుజ్యం. 'సయుక్'– అంటే బ్రహ్మమనే భోగ్యవస్తువునందు పరబ్రహ్మతో పాటు ముక్త పురుషుడు కూడా ఉండి, ఉభయులు భోక్తలై అన్వయించి యున్నందువల్ల ముక్త పురుషుడు 'సయుక్' అనబడుతున్నాడని అర్థం.

*"సాయుజ్యముభయోరత్ర భోక్త వ్యస్యా విశిష్టతా!"*– ఆత్మకు పరమాత్మలకు భోక్తవ్యమందు భేదం లేకపోవడమే సాయుజ్యం.

"నా పట్ల చాలా భక్తిగలవారై, తపోవంతులైన ఏ ప్రపన్నులు నాతో సాయుజ్యాన్ని పొందినారో, అట్టివారు ఎల్లప్పుడూ నా యొక్క కింకరులే. వారికెన్నడూ ఏ విధమైన ఉపద్రవం కలుగనేరదు" అని భగవంతుడే స్వయంగా చెప్పిన శ్లోకార్థం. భగవద్విషయమందు గల వైలక్షణ్యాన్ని గురించిన జ్ఞానం ప్రపన్నులకు దేహత్యాగంకంటె పూర్వమే పుష్కలంగా ఉండడంవల్ల, దేశికులు

సుకృత దుష్కృతాలనుంచి ముక్తుడనై, అర్చిరాది మార్గాన అతివాహకులచే గొని పోబడినవాడనై శ్రియఃపతి సన్నిధిలో కింకరునికి స్వభావసిద్ధమైన- శేషత్వానికి యోగ్యమైన దాస్యమనే గొప్ప అధికారాన్ని అవశ్యంగా పొందుతానని, వరద రాజస్వామి యెదుట విజ్ఞప్తి చేసిన విషయమిది (అయిననూ, యథార్థాన్ని లోకులు గ్రహించి ఉజ్జీవించగలరనియే వివరింపబడినది కదా!)

*"శార్న్ద విరువల్వినైగళుమ్ శదిర్త్తు మాయప్పత్త ఱుత్తు*
*తీర్న్దు తన్బాల్ మనమ్ వైక్కత్తిరుత్తి వీడు తిరుత్తు వాన్"*
*(తిరువాయ్. 1-5-10)*

సర్వేశ్వరుడు నాతో జేరిన సుకృతదుష్కృతాలనబడే రెండు విధాలైన క్రూర కర్మలను పోగొట్టి, ఆ పాపాలచే వచ్చిన సంసార బంధాన్ని ఛేదించి, తానే ప్రాప్య ప్రాపకుడనే బుద్ధిని నాకు కలిగించి, నిత్య కైంకర్యం చేయదానికి తన వద్దకు రాబోతున్నానని ప్రతీక్షిస్తూ, మోక్షస్థానమైన పరమ పదాన్ని- వైకుంఠ నగరాన్ని బాగా అలంకరిస్తున్నాడని శ్రీ శఠకోపదివ్య సూరి సూక్తి సుధ. వసంత తిలక.

*43. త్వం. చేత్ ప్రసీదసి తవాస్మి సమీపతశ్చేత్*
*త్వయ్యస్తి భక్తి రనఘా కరిశైలనాథ।*
*సంసృజ్యతే యది చ దాస జనస్త్వ దీయః*
*సంసార ఏష భగవన్న పవర్గ ఏవ॥*

**అర్థం:** హే కరిశైలనాథ! = ఓ హస్తిగిరియందున్న దేవా!; హే భగవన్= షాడ్గుణ్య పరిపూర్ణుడవైన వరదా!; త్వం= నీవు; ప్రసీదసి, చేత్= ప్రసన్నుడవైతే; తవ= నీ యొక్క; సమీపతః= సమీపమందు; అస్మి, చేత్= ఉన్నవాడనైతే; త్వయి= నీ యందు; అనఘా= దోషం లేని; భక్తిః= అతిప్రేమ; అస్తి, చేత్= నాకు ఉన్నట్లైతే; చ= మరియు; త్వదీయః= నీ సంబంధమున్న; దాసజనః= శేషభూతమైన భాగవత సమూహం; సంసృజ్యతే, యది= కల్పింపబడెనేని; ఏషః= త్రివర్గ-ధర్మార్థ కామాలకు- స్థానమైన

ఈ; సంసారః= లోకం- లీలా విభూతి; అపవర్గః, ఏవ= మోక్షస్థానమే- నిత్య విభూతియే అవుతుంది.

**తా॥** ఓ హస్తిగిరినాథా! జ్ఞాన శక్త్యాది షడ్గుణాలతో పరిపూర్ణుడవు. నీవు నా పట్ల ప్రసన్నుడవైతే, నీ దగ్గర నేను ఉన్నట్లైతే, నీ యందు నిర్దుష్టమైన భక్తి నాకు ఉన్నట్లైతే, నీకు దాసులైన భాగవతులతో నాకు సహవాసం కల్పింపబడితే ఈ ఘోర సంసారం కూడా మోక్షస్థాన తుల్యమే అవుతుంది.

**వ్యాఖ్య:-** ప్రస్తుతం దేహమున్నంతవరకు అవిచ్ఛిన్నంగా భగవదనుభవం కల్గవలెనని ప్రార్థించే శ్లోకం.

పూర్వ శ్లోకమందు దేహవియోగం తర్వాత పరమ పురుషార్థం ప్రార్థింప బడింది. ఇప్పుడు, దేహమున్నంత వరకు యావజ్జీవం భగవంతుని యనుగ్రహం వల్ల భగవత్సన్నిధిలో సర్వవిధకైంకర్యం చేయవలెను అని వేడుకొనబడింది. ఇట్లు సర్వేశ్వరుడు కృపతో కటాక్షిస్తే, సంసారం కూడా మోక్షపదవితో సమాన మవుతుంది.

త్వం ప్రసీదసి చేత్- నీవు నా యందు ప్రసన్నుడవైతే- సకల కల్యాణ గుణపూర్ణుడైన పరమాత్మకూ, అతనిచే నియమింపబడిన జీవ వర్గానికి స్వస్వామి సంబంధమున్నది. అంటే, భగవానుడు స్వామి. జీవవర్గమంతా అతని సొమ్మే. తన సొత్తును తాను కాపాడుకోవాలనే అభిమానం స్వామికి ఉంటుంది. సర్వోత్కృష్టుడైన స్వామి జీవుని పాపాల కారణంగా నరకంలో పడవేయనూ కలడు. జీవుడు అనన్యగతికుడై ప్రార్థించినట్లైతే, దాన్ని వ్యాజంగా గొని స్వామి ప్రసన్నుడూ కాగలడు.

తవ సమీపతః అస్మిచేత్- భగవానుడు అనుగ్రహిస్తేనే జీవుడు స్వామికి దగ్గరి వాడవుతాడు. అంటే, ప్రాకృతిక భోగాలను ఆశించకుండా, భగవత్కైంకర్య పరుడవుతాడు.

త్వయి అనఘా భక్తిః అస్తిచేత్– భగవత్ప్రసాదం వల్ల జీవునికి భగవంతుని యందు దోషరహితమైన భక్తి కలుగుతుంది. 'అఘం' అంటే దోషం, పాపం అని అర్థం. అఘం లేనిది 'అనఘం' అనబడుతుంది. భగవంతునికి ప్రేమ పూర్వకంగా సేవ–పూజ–చేస్తే అది అనఘమవుతుంది. అలా కాక , వేరే ప్రయోజనాన్ని ఆశించి, వేరే కోరికలను పొందడానికి భగవంతుణ్ణి భజిస్తే, ఆ భక్తి దోషయుక్తమని శాస్త్రం.

*"గచ్ఛతా మాతులకులం భరతేన తదాஉ నఘః"*– (రా. అయోధ్యా) రాముని యందు అత్యంత భక్తిని కలిగియున్న భరతునితో మేనమామ ఇంటికి అనఘుడైన శత్రుఘ్నుడు వెళ్ళినాడు, అన్నాడు వాల్మీకి భగవానుడు. కేవలం భగవంతుని యందు మాత్రమే భక్తిని కలిగియుండక, భగవద్భక్తుల యందు కూడా భక్తి కలిగియున్నట్లైతే, ఆ భక్తి అనఘమనబడుతుందని గోవిందరాజస్వామి ఆ శ్లోకాన్ని వ్యాఖ్యానించారు.

*"ఏకః స్వాదు న భుంజీత"* మధుర పదార్థాన్ని ఒక్కడే అనుభవించకూడదు. భగవద్భక్తులతో చేరి భగవంతుణ్ణి భజిస్తే శ్రేయస్కరమని అర్థం.

త్వదీయః దాసజనః సంసృజ్యతే యదిచ– ఇతరులకు దాస్యాన్ని వహించక, భగవంతునికీ, భగవంతునికి దాసులైన వారికి కూడా దాస్యం చేసినట్లైతే అని అర్థం.

*'శన్మ శన్మాన్తరమ్ కాత్తడియార్ గళై క్కొణ్డు పోయ్*
*తన్మై పెఱుత్తి త్తన్ తాళిణైక్కీష్ కొళ్ళు మప్పనై,*
*తొన్మై పి దత్త వల్లారై ప్పిదత్తు మవర్ కణ్డీర్*
*నన్మై పెఱుత్తెమ్మై నాళుయ్య క్కొళ్ గిన్ఱ నమ్బరే॥ (తి.వా.మొ. 3–7–7)*

తన దాసులను జన్మపరంపరలో నుంచి రక్షించి, కొనిపోయి మోక్షాన్ని పొందించి, వారికి తన కైంకర్యాన్ని చేసే భాగ్యాన్ని కల్పించే శ్రియఃపతి యొక్క

కల్యాణ గుణాలను స్తోత్రం చేసే వారిని ఆశ్రయించిన భాగవతోత్తములే మనకు భగవంతుని కైంకర్యం చేసే శక్తినిచ్చి కాపాడుతారని ఆళ్వార్ల శ్రీసూక్తి.

"తస్మాద్విష్ణు ప్రసాదాయ వైష్ణవాన్ పరితోషయేత్।
ప్రసాద సుముఖో విష్ణుః, తే నైవస్యాన్న సంశయః॥"

విష్ణుమూర్తి యొక్క అనుగ్రహాన్ని సంపాదించడం కోసం విష్ణుభక్తులకు దాస్యం చేసి వారిని సంతోష పరచవలెను. తత్ఫలితంగా, విష్ణు భగవానుడు ప్రసన్న ముఖుడు కాగలడనే విషయంలో సంశయం లేదని భాగవత వైభవం చెప్పబడింది.

"తస్యే దమితి ధీహేతు రప్యుపకారీ"- ఇదంతా, భగవత్సంబంధమైనదే అనునట్టి అధ్యవసాయాన్ని కలుగజేస్తూ, జీవునికి ఉపకరిస్తుంది.

"అత్తిగిరి పత్తర్ వినై తొత్తఅవర్కు మణి యత్తి గిరియే"- భగవద్భక్తుల పాపాలను ఛేదించే చక్రాయుధం లాగా భగవంతునికి ఆభరణమై, నివాస స్థానమైన కాంచీపురం విష్ణుభక్తులకు తగిన నివాస స్థలమని దేశికుల శ్రీసూక్తి.

భగవానుని అనుగ్రహం ఇలాగా దేహమున్నంత వరకు కలిగితే సంసారానికి, మోక్షానికి భేదమే ఉండదని సారార్థం. వసన్త తిలక.

44. ఆహూయమాన మనపాయ విభూతి కామైః
ఆలోక లుప్త జగదాంధ్యమనుస్మరేయమ్।
ఆలోహితాంశుక మనాకుల హేతి జాలం
హైరణ్య గర్భ హయమేధ హవిర్భుజం త్వామ్॥

**అర్థం:** అనపాయ విభూతి కామైః= అపాయం లేని నిత్య విభూతి యనబడే మోక్షాన్ని కోరే వారిచేత; ఆహూయమానం= ఆహ్వానింపబడునట్టి; ఆలోక, లుప్త, జగత్+ఆంధ్యం= కటాక్ష వీక్షణంచేత లోపించిన లోకమందలి (జనుల) అజ్ఞాన మనే చీకటి కలిగినట్టి; ఆలోహిత+అంశుకం= మొత్తం తెల్లని వస్త్రం- పీతాంబరం కలిగినట్టి;

అనాకుల హేతి జాలం= సంభ్రమం లేని ఆయుధ సముదాయం కలిగినట్టి; హైరణ్యగర్భ హయ మేధ హవిర్భుజం= బ్రహ్మ సంబంధమైన అశ్వమేధ యాగమందు హవిస్సును భుజించినట్టి;

ఇక అగ్ని పరమైన అర్థం:- అనపాయ, విభూతి, కామైః= అనిష్ట నివృత్తినీ, ఇష్టప్రాప్తినీ కోరే యజమానులచేత; ఆ, హూయమానం= సాకల్యం చేత ఆహుతులియ్యబడునట్టి; ఆ లోక, లుప్త జగత్+అంధ్యం= ప్రకాశంచేత పోగొట్టబడిన లోకమందలి చీకటి కలిగినట్టి; ఆ లోహిత+అంశుకం= ఎఱ్ఱని కిరణాలు కలిగినట్టి; అనాకుల హేతిజాలం= పొగలేని జ్వాలల సమూహం కలిగినట్టి; హైరణ్యగర్భ హయమేధ హవిర్భుజం= హాటక గర్భుడైన బ్రహ్మ యొక్క అశ్వమేధ యజ్ఞమందలి అగ్నివంటి-

త్వాం=నిన్ను, అను స్మరేయం=హృదయమందు నిరంతరం ధ్యానించెదను.

**తాత్పర్యం:-**

1) మోక్షాన్ని కోరే ప్రపన్నులచేత ఆర్తితో పిలువబడేవాడు భగవానుడు ఇష్టమున్న కోరికను పొందాలని యాగం చేసే వారిచే నెయ్యి, సకల ద్రవ్యాలను హోమమందు ఆహుతులుగా సమర్పింపబడేవాడు అగ్నిహోత్రుడు.

2) తన కటాక్ష ప్రసారం చేత లోకుల అజ్ఞానమనే అంధకారాన్ని పోగొట్టేవాడు హస్తిగిరినాథుడు.

తన ప్రకాశంచేత జగత్తులో వ్యాపించిన చీకటిని తొలగించే వాడు అగ్ని హోత్రుడు.

3) మలిసంజలో సూర్యుని కాంతివంటి వన్నెగల పీతాంబరాన్ని ధరించిన వాడు కరిగిరీశుడు. లోహిత కిరణాలు కలవాడు వీతిహోత్రుడు.

4) శాంతమైన చక్రాద్యాయుధాలు కలవాడు కాంచీపుర వరదుడు. ధూమం లేని జ్వాలలు కలవాడు హవ్యవాహనుడు.

5) హిరణ్యగర్భుడు చేసిన అశ్వమేధ యాగమందు సమర్పించబడిన హవిస్సును భుజించినవాడు హస్తి శిఖరియందు వెలసిన దేవరాజు. చతుర్ముఖ బ్రహ్మ ఆచరించిన హయమేధమనే యజ్ఞకుండమందు జాజ్వల్యమానుడైన జాత వేదుని వంటి వాడైన ద్విరదశైలవాసుని అర్చామూర్తియైన వరదరాజస్వామిని హృదయమందు సర్వదా స్మరిస్తుంటాను.

**వ్యాఖ్య:-** అపవర్గ తుల్యమైన అవిచ్ఛిన్నమైన, అర్చారూప భగవదనుభవం ప్రార్థింపబడుతున్నది.

"యజ్ఞో వైవిష్ణుః" - యజ్ఞమందు ప్రతిష్ఠింపబడిన అగ్ని విష్ణుభగవానుడే. కాబట్టి యజ్ఞ పురుషుడైన వరదరాజస్వామి యాగాగ్నితో పోల్చబడి, శ్లేషాలంకారంతో వర్ణింపబడుతున్నాడు.

ఆహూయమాన మనపాయ విభూతి కామైః- అపాయమంటే ఇష్టముండనిది. ఇష్టం లేని అపాయాన్ని తొలగించుకొనే ఉపాయం, 'అనపాయం' అనబడుతుంది. కాబట్టి, 'అనిష్ట నివృత్తి' అని అర్థం.

'విభూతి' అంటే 'భూ-ప్రాప్తౌ' అనే ధాత్వర్థంచేత విశిష్టమైన ప్రాప్తి- ఇష్టప్రాప్తి అని అర్థం. అనిష్ట నివృత్తినీ, ఇష్టప్రాప్తినీ కలిగించే శ్యేనయాగం, జ్యోతిష్టోమాది కర్మలు శాస్త్రమందు చెప్పబడినాయి. ఆ కర్మల ఫలాన్ని కోరేవారు (ఆహూయమానం) యజ్ఞాగ్ని యందు ఆజ్యం, సోమరసాది హవిస్సులు సమగ్రంగా సమర్పిస్తుంటారు. అట్టి అగ్ని హోత్ర వైభవం కలవాడు హస్తి గిరినాథుడు.

అనపాయ విభూతి కామైః ఆహూయమానం- జనన మరణాలు లేనట్టి నిత్య విభూతిని కోరే ముముక్షువులచే తమ ఎదుట ఉన్న అర్చామూర్తి తమ హృదయ కమలమందు వెలసి యుండాలని ఆహ్వానింప బడే కర్మ భూతుడు కరిగిరీశుడు.

"ఏహ్యేహి ఫుల్లాంబుజ పత్ర నేత్ర
నమోఽస్తుతే దేవ వరా ప్రమేయ।
ప్రసహ్యమాం పాతయ లోకనాథ
రథోత్తమాత్ భూత శరణ్య సంఖ్యే॥"

(భారతం-భీష్మపర్వం) కురుక్షేత్ర యుద్ధమందు ఆయుధం చేత పట్టనని తాను చేసిన ప్రతిజ్ఞను విడిచిపెట్టి రథం నుంచి దూకి భీష్ముని ఎదుర్కొనడానికి రథ చక్రాన్ని చేత ధరించిన శ్రీకృష్ణ భగవానునితో భీష్మాచార్యులు పలికిన మాట ఇది.

శ్రీకృష్ణుడు, రథం మీది నుంచి కుప్పించి లంఘించగా కుండలాల కాంతి చెక్కిళ్ళపైన చెంగలించిన సౌందర్యాన్నీ, లోతైన నీటిలో జనించి పాదుతో కూడుకొన్నదై సూర్యకిరణాలచేత వికసింపబడిన కెందామర పూవురేకుల వంటిదైన విశాలనేత్ర సౌందర్యాన్నీ, చేతబట్టిన రథాంగ సౌందర్యాన్నీ, గజం లాగా, సింహంలాగా నడుస్తున్న భగవానుని గమన సౌందర్యాన్ని జూచిన కురు పితామహుడైన భీష్ముడు "అప్రమేయుడవైన ఓ దేవదేవా! నీకు నమస్కరిస్తున్నాను. నీవు లోకనాథుడవు, సర్వభూతశరణ్యుడవు. రావయ్యా! రా! యుద్ధమందు బలాత్కారంగా నన్ను రథం మీదినుంచి నేలకొరగించుమని ఆహ్వానించాడు.

"తామ్రై నీళ్ వాశత్తడంబోల్ వరువానే యొరునాళ్ కాణవారాయే"-(తి.వా.మొ. 8-5-1) తామరపూలతో పరిమళించే తటాకం వలె వచ్చి, ఒకనాడైనా సేవ సాదింపుమని నమ్మాళ్వార్లు సర్వేశ్వరుణ్ణి ప్రార్థించారు.

తిరుక్కచ్చినంబి, నడాదూర్ అమ్మాళ్ అనే ప్రపన్నులు దేవరాజును స్తుతించి, ఆయన సాక్షాత్కరించగానే ముఖాముఖిగా సంభాషించే వారట. అలాగా, దేశికులు తమ హృదయ సాన్నిధ్యార్థం దేవరాజును ఆహ్వానిస్తున్నారన్న విషయం గమనీయం.

ఆలోక లుప్త జగదాంధ్యమ్– ప్రపంచంలో బయట వ్యాపించిన చీకటిని అగ్ని తన ప్రకాశంచేత తొలగిస్తాడు (గుహలోనున్న చీకటి తొలగిపోదని ధ్వని) శ్రియఃపతి తన దయా తరంగితమైన దృష్టిచేత ప్రపంచమందలి జనుల హృదయ గుహలలో వ్యాపించి యున్న అజ్ఞానమనబడే అంధకారాన్ని నివారిస్తాడు. పరంజ్యోతి కారణ తేజస్సు కదా!

ఆలోహితాంశుకం– ఎర్రని కిరణాలతో శోభించేవాడు అగ్నిహోత్రుడు. సాయంసంధ్యా కాలంలో రవికిరణ పుంజం లాగా ప్రకాశించే పీతాంబరాన్ని ధరించిన సుందర మూర్తి హస్తిగిరివాసి అర్చామూర్తి.

అనాకుల హేతి జాలం– అగ్నికి సంబంధించిన 'ఆకులం' అంటే ప్రకృతి యందు వ్యాపించి– కన్నులను, బట్టలను, చిత్తాన్ని – క్షోభింపజేసే 'పొగ' అని అర్థం. పొగ ఉన్నంతవరకు హవిస్సును సమర్పించరాదు. పొగలేని జ్వాలలు ప్రజ్వలించినపుడే హోమం చేయాలి. కాబట్టి ధూమరహితమైన జ్వాలలతో ప్రకాశించేది యాగాగ్ని.

యుద్ధ సంభ్రమం లేకుండా ప్రశాంతమైన శంఖచక్ర గదాఖడ్గ శార్ఙ్గములనే పంచాయుధాలతో ప్రకాశించే పరాత్పరుడు వరదుడు.

హైరణ్యగర్భ హయమేధ హవిర్భుజం– హిరణ్యగర్భుడు ఆచరించిన అశ్వమేధ యాగమందు ఆజ్యాది హవిస్సులను స్వీకరించే పవిత్ర పావకుడు అని అగ్ని పరమైన అర్థం. చతుర్వదనుడైన బ్రహ్మచేసిన తురగ సవనమందు హవిర్భుజుడై ఫలప్రదానం చేసిన దివ్యమంగళ విగ్రహుడు దేవరాజు.

ఇక్కడ "తురగ సవన వేద్యాం శ్యామలో హవ్య వాహః"– అనే మొదటి శ్లోకంలోని రెండవ పాదమందలి వ్యాఖ్యను గమనించవలె.

అట్టి యజ్ఞాగ్ని సముడైన కరిగిరియందలి అర్చామూర్తి నా హృదయమందు వేంచేసి యుండగా నేను అనవరతం అనుస్మరిస్తానని ప్రార్థన. సర్వేశ్వరుణ్ణి

స్మరించడానికి ఎప్పుడు కూడా హాని కలుగకూడదని దేశికులు వరదరాజును ప్రార్థించారు. శ్లేషాలంకారం, వసంత తిలక.

*45. భూ యోభూయః పులకనిచితై రంగకైరేధ మానాః*
*స్థూల స్థూలాన్ నయన ముకుళై ర్బిభ్రతో బాష్ప బిందూన్।*
*ధన్యాః కేచి ద్వరద భవతః సంసదం భూషయంతః*
*స్వాంతై రంతర్వినయనిభృతైః స్వాదయంతే పదం తే॥*

**అర్థం:** హే వరద!= ఓ వరదరాజా!; పులకనిచితైః= రోమాంచాలతో నిబిడమైన; అంగకైః= కృశించిన శరీరాలచేత; భూయః, భూయః= మళ్ళీ మళ్ళీ; ఏధ మానాః= వర్ధమానులైనట్టి; నయనముకుళైః= కనుమొగ్గలచేత- ముడుచుకొన్న కన్నులచేత; స్థూల స్థూలాన్= అతి స్థూలంగా ఉన్న; బాష్ప బిందూన్= కన్నీటి బొట్లను; బిభ్రతః = ధరించియున్నట్టి; అంతర్వినయనిభృతైః= అంతర్యామి- లోపలనున్నవానియందు వినయభావంతో నిశ్చలమైనట్టి; స్వాంతైః= హృదయాలతో; ధన్యాః= ధన్యులైన; కేచిత్= కొందరు మహాత్ములు; భవతః= నీ యొక్క; సంసదం= సభను; భూషయంతః (సంతః )= అలంకరించినవారై; తే= నీ యొక్క; పదం= చరణాలను గూర్చి- క్షేత్రాన్ని గూర్చి; స్వాదయంతే= (ఇతరులకు) అభిరుచిని కలిగిస్తున్నారు.

**తా॥** ఓ వరదరాజా! నిన్ను సేవించిన ఆనందంతో పులకాంకితాలైన భాగవతోత్తముల బక్కచిక్కిన శరీరాలు పదే పదే వృద్ధిని పొందుతున్నాయి. కొంచెం మూసుకొన్న కన్నుల్లో ఆనంద బాష్పబిందువులు నిండుకొన్నాయి. అంతర్ముఖులైనందువల్ల వినయంతో ఏకాగ్రచిత్తులైన కొందరు ధన్యాత్ములు నీ ఉత్సవ మంటపమందలి గోష్ఠిని భూషింపజేస్తున్నారు. అట్టి మహాత్ములు నీ సన్నిధిలో ధ్యానమగ్నులై యుంటూ, గోష్ఠిలో ఉన్న పామర జనులకు కూడా నీ చరణారవిందాలయందు, నీ క్షేత్రవాసమందు ఆసక్తినీ, అభిరుచినీ పెంపొందిస్తున్నారు.

వ్యాఖ్య:- భగవద్భక్తులకు భగవద్గుణానుభవం కంటె భాగవత గుణానుభవం పరమ పురుషార్థమని ఆవిష్కరిస్తూ, నిరుపమ భగవద్వైభవమూ వ్యక్తీకరింప బడుతున్నది.

"త్వంచేత్ ప్రసీదసి, తవాస్మి సమీపత శ్చేత్"- (శ్లో. 43) అని ప్రార్థించిన భక్తి పారవశ్యం ఈ శ్లోకమందు సాక్షాత్కరింప బడుతున్నది.

*భూయోభూయః పులకనిచితైరంగకై రేధ మానాః*- భగవద్భక్తుల శరీరాలు స్వాభావికంగా ఉపాయ దశలో నిరశన వ్రతాలతోనూ, అకుంఠిత దీక్షలతో కృశించి యుంటాయి. ('అంగకైః' అన్నచోట కప్రత్యం అల్పార్థకం). వరదరాజ స్వామి సన్నిధిలోని గోష్ఠిలో భగవంతుణ్ణి సేవిస్తున్న అనుభవం చేత కలిగిన ఆనందం అతిశయించడం వల్ల కృశించి యున్న భాగవతోత్తముల శరీరాలు పునః పునః పులకించినవై వృద్ధి జెందుతున్నాయి. భగవదనుభవానందం లోపల ఇముడక, పెల్లుబికి, కొంచెం తెరువబడియున్న వారి కన్నుల్లో ఆనంద బాష్ప బిందువులు అధికమవుతున్నాయి.

స్థూలస్థూలాన్ నయన ముకుళైర్బిభ్రతో బాష్పబిందూన్- వికసింపనున్న తామర మొగ్గల మీద నీటిచుక్కలు నిలిచి యున్నట్లు ఆనంద బాష్పబిందువులు గోచరిస్తున్నాయి. అంటే, విలక్షణమైన భగవదనుభవం వల్ల పరమ భాగవతులు బాష్ప వారి పరిపూర్ణ లోచనులయ్యారు.

*అంతర్వినయనిభృతైః స్వాంతైః ధన్యాః*- బాహ్య విషయాలపట్ల విరక్తి కలిగి, అంతర్ముఖులై తమలోపల నున్న అంతర్యామి, ప్రత్యక్షంగా సాక్షాత్కరిస్తున్న అర్చామూర్తి వేర్వేరుకారు- ఒక్కరే అని వినయ భావం గలిగి, చలించని అంతః కరణాలతో భగవదనుభవ రూపమైన మహాధనాన్ని పొందియున్నారు.

కేచిత్- అట్టి భాగ్యశాలురైన తిరుక్కచ్చినంబి, నడదూర్ అమ్మాళ్, అప్పుళ్ళార్ వంటి మహాత్ములు ఇప్పుడు లేకున్ననూ, వేదాంత దేశికులు, వారికి అనుబంధించి యున్న మహాత్ములు.

భవతః సంసదం భూషయంతః తే పదం స్వాదయంతే- వరదరాజ స్వామి యొక్క సభను అలంకరించి యున్నారు.

*"మాం మదీయం చ నిఖిలంచేతనాచేతనాత్మకమ్।*
*స్వ కైంకర్యోపకరణం వరద! స్వీకురు స్వయమ్॥" (న్యాస దశకం. 7)*

ఓ దేవరాజా! నన్ను, నాకు సంబంధించిన చేతన, అచేతన వస్తువులన్నిటినీ నీ కైంకర్య సాధనాలుగా స్వీకరింపుమని ప్రార్థించారు. మోక్ష ఫలం కోరక, కైంకర్యమే ముఖ్యమైన ఫలమని భావించిన ప్రపన్నులు వేదాంత దేశికులు.

సభలో ప్రపన్నులూ, పామరజనులూ ఉంటారు. కాబట్టి, పామరులు కూడా పరమ భాగవతుల భగవదనుభవాన్ని సేవించి, భగవానుని సన్నిధిలోనే ఉండి, భగవచ్చరణ కమలాలను నిరంతరం ధ్యానం చేస్తూ, భగవత్కటాక్షానికి పాత్రుల మవుతామనే అభిరుచిని కలిగియున్నారు. పరమ భాగవత సహవాసం, భగవంతుని సేవ చేసే భాగ్యాన్ని కలిగిస్తుందని సారాంశం. ఇది స్వభావోక్త్యలంకారం.

మందాక్రాంతావృత్తం- మ భ న త త గ గ- గణాలు కలది. (మందాక్రాంతా జలధి షడగైః మోభనౌ తౌ గురూచేత్).

*46. వరద తవ విలోకయంతి ధన్యాః*
*మరకత భూధర మాతృకాయ మాణమ్।*
*వ్యపగత పరికర్మ వారవాణం*
*మృగమదపంక విశేష నీలమంగమ్॥*

**అర్థం:** హే వరద!= వరాలనిచ్చే ఓ భగవానుడా!; మరకత భూధర మాతృకాయ మాణం= మరకత మయమైన పర్వతానికి మూలమైనట్టి; వ్యపగత పరికర్మ వారవాణం= తొలగింపబడిన ఆభరణాలు, కవచం కలిగియున్నట్టి; మృగమద పంక విశేష నీలం= కస్తూరిని లేపనం చేయడం వల్ల మిక్కిలి నీల వర్ణమయిన; తవ= నీ యొక్క అంగం= విగ్రహాన్ని- శరీరాన్ని; ధన్యాః= భాగ్యవంతులు; విలోకయంతి= దర్శిస్తుంటారు.

**తా॥** ఓ వరద రాజా! మరకత పర్వతాన్ని సృష్టించడానికి కారణమైనట్టి, భూషణాద్యలంకారాలు, కవచమూ తీసివేయబడినట్టి, కస్తూరిని పూయడం చేత ఎక్కువ నీలవర్ణంగా ఉన్న నీ సుందర రూపాన్ని ధన్యాత్ములు చూస్తారు, సేవిస్తారని తాత్పర్యం.

**వ్యాఖ్య:-** భూషణాలు, కవచంలేని వరదరాజస్వామి యొక్క స్వచ్ఛమైన నీల విగ్రహ సౌందర్యాన్ని ఏకాంత రసికులైన అర్చకులు సేవిస్తారు.

మహోత్సవ సేవా రసికులైన మహా భాగవతుల స్వభావాన్ని గత శ్లోకం వర్ణించింది. ఆరాధన కాలం కంటె ముందు, స్వచ్ఛమైన విగ్రహ సౌందర్యాన్ని కనబడకుండా చేసే భూషణ కవచాదులు లేని దివ్యమైన అర్చామూర్తిని సందర్శించే భగవదారాధకులైన మహాభాగవతుల ధన్యత సుశ్లోకింపబడుతున్నది.

మరకత భూధర మాతృకాయమాణం- చతుర్ముఖ బ్రహ్మ, కంచివరద భగవానుని గాంభీర్య సౌందర్య, నైల్యాదులుగల స్వచ్ఛమైన రూపాన్ని జూచి మరకతమణి మయమైన కొండను సృష్టించాడన్న విధంగా, భగవద్విగ్రహం మరకత పర్వతానికి మాతృకగా గోచరిస్తున్నది.

వ్యపగత పరికర్మ వారవాణం- రాజులు వేటకు, ఉత్సవాలకు పోవునప్పుడు ఆయా కాలాలకు తగినట్లుగా, అలంకారాలనూ, కవచాదులను ధరించిపోతారు. తిరిగి వచ్చిన తర్వాత అంతఃపురంలోకి ప్రవేశించునప్పుడు వాటినన్నిటినీ తొలగించి పోవడం పరిపాటి. ఆ విధంగానే, సర్వేశ్వరుడు మృగయార్థమో, ఉత్సవార్థమో వేం చేయునప్పుడు ధరించిన భూషణాలను, పూల హారాలను, దుస్తులను, కిరీటాన్ని, కవచాన్ని అంతఃపురంలోకి- శయన మందిరంలోకి ప్రవేశించే ముందు తొలగించి ఏకాంతసేవా రసికులకు, దేవేరులకు తనను సందర్శించే భాగ్యాన్ని కల్పిస్తాడు. సామాన్యులకు ఇట్టి సాక్షాత్కారం కలుగదు.

*మృగమద పంక విశేష నీలం అంగం ధన్యాః విలోక యంతి*- కస్తూరి అనే మృగం లేడి- జింక జాతులలో ఒక తెగకు సంబంధించింది. కస్తూరి

మృగం యొక్క మదం అడవుల్లో అక్కడక్కడ నేలమీద పడుతుంది (స్రవిస్తుంది అన్నమాట). వేడిగానూ, చాలా సువాసనగల ఆ పదార్థాన్ని ఆటవికులు గమనించి, చల్లారిన తర్వాత ఆ మద పంకాన్ని భద్రపరచి నగరాల, పట్టణాల-కు తెచ్చి వ్యాపారులకు ఇచ్చి ధనాన్ని పొందుతారని ప్రఖ్యాతి.

పరిమళ భరితమైన ఆ కస్తూరిని శరీరానికి లేపనం చేస్తే, శరీరం నీలవర్ణంతో బాగా శోభిస్తుంది.

అర్చకులు కస్తూరిని అర్చామూర్తికి తిరుమంజనం సమర్పించినప్పుడు పూసినందు వల్ల అధికమైన నీలవర్ణ సుషమతో దివ్య విగ్రహం చూడముచ్చటగా నుంటుంది. ఏకాంత సేవారసికులైన మహా భాగవతులకే అట్టి భగవద్దివ్య మంగళ విగ్రహ సౌందర్యాన్ని సేవించే భాగ్యం కలుగుతుంది. ఇతరు లెవ్వరికీ ఆ భాగ్యం కలుగదు కదా!

తిరుక్కచ్చినంబిగారు వరదరాజస్వామి శయనమందిరంలో నున్నప్పుడు-రాత్రిపూట శయనాసనమందున్నప్పుడు, వింజామర వీచే- తిరువాలవట్టం-సేవ చేస్తుండే వారని ప్రసిద్ధి. అట్టి కైంకర్య భాగ్యం కలవారే ధన్యులని అనుసంధింప బడుతున్నది.

"ఎనక్కినియార్ నిగర్ నీణిలత్తే"- (తి.వా.మొ.6-4-7) నాతో సంశ్లేషించిన శ్రియఃపతి యొక్క సకల కల్యాణ గుణాలను అనుభవించే నాకు ఈ విశాలమైన పృథివిలో సాటి ఎవరు? నాకు ఎవ్వరూ సమానులు కారు అని నమ్మాళ్వార్లు తమ ధన్యతను అనుసంధానం చేశారు.

ధర్మ లుప్తోపమాలంకార సజ్జితశ్లోకమిది. పుష్పితాగ్రావృత్తం

*అయుజి నయుగ రేఫతో యకారో యుజిచ న జౌ జరగాశ్చ పుష్పితాగ్రా.*

1, 3 పాదాలలో 'న న ర య' గణాలు. 2, 4 పాదాలలో 'న జ జ ర గ' గణాలు.

ఇది అర్ధ సమవృత్తాలలోనిది. 'ఔపచ్ఛందసికం' అని కూడా దీన్ని వ్యవహరిస్తారు.

47. *అనిభృత పరిరంభై రాహితా మిందిరాయాః*
*కనక వలయ ముద్రాం కంఠదేశే దధా నః।*
*ఫణి పతిశయ నీ యాదుత్థిత స్త్వం ప్రభాతే*
*వరద సతత మంతర్మానసం సన్నిధేయాః॥*

**అర్థం:** హే వరద!= ఓ వరదరాజా!; ఇందిరాయాః= లక్ష్మీదేవి-పెరుందేవి యొక్క; అనిభృత పరిరంభైః= గాఢమైన ఆలింగనాల చేత; ఆహితాం= ఏర్పడిన; కనక వలయ ముద్రాం= బంగారు గాజుల ముద్రను; కంఠదేశే= కంఠభాగమందు; దధానః (సన్) ధరిస్తున్న వాడవై; ప్రభాతే= ప్రాతఃకాలమందు; ఫణిఫతి శయనీయాత్= సర్పరాజు అనే పర్యంకం నుంచి; ఉత్థితః= లేచిన; త్వం= నీవు; సతతం= ఎల్లప్పుడు; (మే= నా యొక్క); అంతర్మానసం= హృదయం లోపల (మానసమందు) సన్నిధేయాః = సాన్నిధ్యం వహించి ఉండవలెను.

(సన్నిపూర్వక 'ధా' ధాతువు యొక్క ఆశీర్లింజమందలి మధ్యమ పురుషైక వచన రూపం)

(అంతర్మానసం- మనస్సునందు అని అర్థం. అధి, అంతః అనేవి అవ్యయాలు అధికరణార్థకాలు. "అవ్యయం విభక్తిః" అనే రీతిని బట్టి "మానసే= అంతర్మానసం" అని సమాసం).

**తా॥** ఓ వరదా! పెరుందేవి యొక్క గాఢాలింగనాలచేత కంఠమందు ఏర్పడిన సువర్ణ కంకణాల చిహ్నాలను ధరిస్తూ, శేష పర్యంకం నుంచి ప్రభాత కాలమందు లేచిన నీవు నా మనస్సున సర్వదా వేంచేసి యుండవలెను అని దేశికులు ప్రార్థిస్తున్నారు.

**వ్యాఖ్య:-** భగవానుడేకాంతసేవలో పొందిన ఆభరణాలు లేని, విశేష సుందర రూపం తన మనస్సులో స్థిరంగా నిల్చియుండాలనే దేశికుల ప్రార్థన.

మహాభాగవతుల గుణానుభవము పురుషార్థమని సూచితం. గత శ్లోకమందు అంతఃపురంలో భగవానుడు సేవింపబడినాడు. రాత్రి గడిచింది. ప్రాతః కాలమందు పడక నుంచి లేచిన భగవద్విగ్రహ సౌందర్యాన్ని సేవించాలని ఆశించారు ఆచార్యులు. ఇది ఏకాంత విషయం. ఇంగితజ్ఞులు అధికంగా వర్ణించలేరు.

*అనిభృత పరిరంభై రాహితామిందిరాయాః*
*కనక వలయ ముద్రాం కంఠ దేశే దధానః-*

శ్రియఃపతి మేను అత్యంత సుకుమారమైనది. శ్రీ పెరుందేవి మేను అంతకంటె మృదువైనది. మరకత శైల సదృశమై, కస్తూరీ చర్చితమై, భూషణ కవచాదులు లేని స్వచ్ఛమైన మహోన్నత గంభీర దివ్య స్వరూపాన్ని జూచిన పెరుందేవి వరదరాజస్వామిని పలుసార్లు గాఢంగా కౌగిలించుకొన్నది. దేవి తనచేతుల కలంకరించుకొన్న సువర్ణ కంకణాల సంఘర్షణ చేత వాటి రేఖల గుర్తులు భగవానుని కంఠభాగమందు స్పష్టంగా ముద్రింప బడినాయి. అవి కాలమెక్కువగా గడువనందువల్ల మాసిపోలేదు. ఆ కనక వలయ ముద్రయే ఆభరణాదులు లేని ఆ దివ్యమైన తనువునందు సర్వాభరణాల స్థానమందు శోభిస్తున్నట్లు గోచరించడం విశేషం.

*ఫణిపతిశయనీయా దుత్థితస్త్వం ప్రభాతే సతత మంతర్మాన సం సన్నిధేయాః* - రాత్రి ఏకాంత సేవలో భగవతి ఇందిరాదేవి యొక్క సౌభాగ్యంవల్ల చిహ్నితమైన భగవానుని దివ్యరూప సౌందర్యాన్ని "పంచశయనత్తిన్మేలేరి" అన్నట్లు, మెత్తని, ఎత్తైన, తెల్లని, చల్లని, పరిమళభరితమైన ఆదిశేషుడనే పడక మీది నుంచి ప్రాతః కాలమందు లేవగానే సేవించే భాగవతులు మహాధన్యులు. ఏకాంత సేవాభాగ్యం దేశికులకు లభించలేదని అర్థమవుతున్నది.

*"ధన్యాదేవాస్సంగంధర్వాః సిద్ధా శ్చ పరమర్షయః।*
*మమ పశ్యంతి యే నాథం రామం రాజీవ లోచనమ్॥"*
*(రా.సుం.26-41)*

నానాథుడైన రాజీవ లోచనుడైన శ్రీరామచంద్ర స్వామిని దేవతలు గంధర్వులు, సిద్ధులు, మహర్షులు ఎవరైతే చూస్తారో వారే ధన్యులు అని సీతమ్మ అన్న రీతిగా, దేశికులు భగవానుని ఏకాంత రాసిక్యాన్ని సేవించిన భాగవతులు గొప్ప ధన్యాత్ములు అన్నారు.

పరమభోగ్యాతిశయమైన ఆ దివ్యరూపం మరపునకు రాకుండా, నిత్యం స్మరించుకొనదగినట్లు, తమ హృదయమందు భగవానుడు స్థిరంగా వేంచేసి యుండాలని జ్ఞాన వైరాగ్య భూషణులైన వేదాంత దేశికులు వేడుకొన్నారు.

పరమ భాగవతులకు ధర్మం, అర్థం, కామం, మోక్షం అన్నీ సర్వేశ్వరుడే. చేతనునికి ఈ లోకంలోగానీ, పరలోకంలోగానీ భగవత్కైంకర్యమే పురుషార్థం కదా! అన్ని ఆభరణాలకంటె భగవానునికి ఇందిరయొక్క కనక వలయు ముద్రయే మిక్కిలి శ్రేష్ఠమైన ఆభరణమని రసికులైన భాగవతుల అధ్యవసాయం.

సౌశీల్య సౌలభ్య గుణాలు కలిగిన భగవానునికి కూడా ఒక పురుషార్థమున్నది. తాను ఏకాంత వాసమందు పొందిన రసానుభవాన్ని భాగవతోత్తములకు సూచన మాత్రంగా ప్రదర్శించి వారు ఆనంద పడుతుంటే చూచి భగవానుడు ఆనంద పడడమే భగవత్పురుషార్థం.

రసికులైన భక్త జనులందరు మంగళా శాసన సందర్భమందు అనుసంధింప దగినట్లున్నదీ శ్లోకం.

ఈ శ్లోకమందున్నది స్వభావోక్తియే, అతిశయోక్తి లేదు. మాలినీవృత్తం- 'న న మ య య' గణాలు కలది.

48. *తురగ విహగరాజ స్యందనాందోళికాది*
*ష్వధిక మధిక మన్యామాత్మ శోభాం దధానమ్।*
*అనవధిక విభూతిం హస్తిశైలేశ్వరం త్వా*
*మనుదిన మని మేషై ర్లోచనై ర్నిర్వి శేయమ్॥*

**అర్థం:** హే వరద!; తురగ, విహగరాజ, స్యందన+ఆందోళికాదిషు= అశ్వం, పక్షిరాజైన గరుడుడు, రథం, పాలకి మొదలైన వాహనాల మీద; అధికం, అధికం= చాలా ఎక్కువగా; అన్యాం= విలక్షణమైన; ఆత్మశోభాం= స్వీయ దివ్యమంగళ శోభను; దధానం= ధరిస్తున్న వాడవైన; అనవధిక విభూతిం= అపరిమితమైన వైభవాన్ని కలిగియున్న; హస్తిశైల+ఈశ్వరం= కరిగిరినాథుడవైన; త్వాం= నిన్ను; (అహం= నేను); అనిమేషైః= రెప్పపాటులేని; లోచనైః= కన్నులతో; అనుదినం= ప్రతిదినం; నిర్విశేయం= అనుభవిస్తు సుఖించవలెను.

**తా॥** దేవరాజా! రథ గజతురగ శిబికాది వాహనాల యందు ఆ రూఢుడవై అమిత వైభవంతో కాంచీపుర వీధులయందు వేంచేస్తుంటే, విలక్షణమైన నీ దివ్య మంగళ శోభ అధికంగా గోచరిస్తుంది. అట్టి నీ సేవను మనో నయనా నందంగా ప్రతిదినం నేను అనుభవిస్తూ, సుఖంగా ఉండునట్లు కృప జేయుము.

**వ్యాఖ్య:-** దేవరాజు దివ్య వాహనాలను అధిరోహించి, ప్రతిదినం తిరువీధ్యుత్సవ సేవను భక్తులకు అనుభవింప జేయాలని ప్రార్థన.

ఇంతకుముందు, ఏకాంత భోగ లక్షణ లక్షితమైన భగవద్దివ్యరూపం తనుహృదయమందు నెలకొని యుండాలని ప్రార్థింపబడింది. ఈ శ్లోకమందు, వివిధ దివ్య వాహనాల మీద వేంచేసి వీధ్యుత్సవ వైభవాన్ని సర్వప్రాణులు మనసార సేవించే భాగ్యాన్ని అనుభవింప జేయాలని దేవాధి రాజు ప్రార్థింప బడుతున్నాడు.

తురగ విహగరాజ స్యంద నాందోళికాదిషు అధికమధికం అన్యాం ఆత్మ శోభాందధానమ్- ఉత్సవాలలో భగవానుడు దేవేరులతో కూడి దివ్య వాహనాల మీద అధిరోహించి, దేవమానవ తిర్యక్ స్థావరాది సర్వభూతాలు తనను సేవించి, ఆనందించే విధంగా మాడవీధులయందు అతి వైభవంగా సంచరిస్తుంటాడనే విషయం శాస్త్రీయం. అది భక్తులకూ, భగవంతునికీ ఆనందకరమైనది.

(బస్సుమీద ప్రయాణం చేసిన దానికంటే, రైలు ప్రయాణం, దానికన్ననూ విమాన యానం ఆనంద దాయకం కదా!) అశ్వవాహనంమీద పయనిస్తే ఒక

విధమైన శోభ, రథం మీద వేంచేసినప్పుడు మరొక రకమైన ఆనందం, గరుడాధిరూఢుడైనప్పుడు దివ్యమంగళ విగ్రహ తేజస్సు విలక్షణంగా గోచరిస్తుంది.

*"ప్రాసాదస్థో రథగతం దదర్శా యాంతమాత్మజమ్।*
*గంధర్వ రాజ ప్రతిమం లోకే విఖ్యాత పౌరుషం।*
*నతతర్ప సమాయాంతం పశ్యమానో మహీపతిః"* (రామా)

గంధర్వ రాజుతో సమానమైన పరమశోభకలిగినట్టి, ప్రఖ్యాత వీరుడైన, తన పుత్రుడైన శ్రీరామభద్రుడు రథారూఢుడై రాజ వీధి మార్గాన వస్తూండగా, మేడ మీది నుంచి అతణ్ణి చూస్తున్న దశరథ మహారాజు తృప్తి పడలేదు అన్నాడు. వాల్మీకి భగవానుడు. అంటే, మహారాజు ఆనందానికి మితిలేదన్నమాట.

ఒక్కొక్క వాహనం మీద వేంచేసే భగవానుని దివ్య కాంతి విలక్షణంగా ఉంటుంది. రథ గజ తురగ విహగ శిబికాది యానారూఢుడై వీధుల గుండా వేంచేస్తుండే దేవాధిరాజు యొక్క శోభ దేనికదే ప్రత్యేకమై, అనిర్వచనీయంగా వర్ధిల్లుతుంటుంది.

కంచిగరుడ సేవ (నానుడి) జగత్ప్రసిద్ధిని పొందినదే కదా!

స్వభావ సిద్ధమైన భగవద్దివ్య శోభ ఉన్నప్పటికీ, ఆయా వాహనాలను అధిరోహించడం వల్ల జనించిన శోభ విలక్షణంగా అతిశయించి ఉంటుంది. అనన్యాధీనమైన 'ఆత్మశోభ' ఆయా వాహనశోభతో అధికమవుతుంది.

అనవధిక విభూతిం– ఛత్ర చామరవ్యజన కాహళ మృదంగ పటహాద్యనేక వాద్యాలతోనూ నటనర్త కాదులతోనూ దేవాధిరాజు యొక్క సేవా వైభవం ఎన్నరానిది, ఎల్లలు లేనిది.

త్వాం అనుదిన మనిమేషై ర్లోచనై ర్నిర్విశేయమ్– అట్టి హస్తిగిరినాథుడైన దేవాధిరాజ సేవను కళ్ళార, మనసార ప్రతిదినం అనుభవించి, సుఖంగా ఉండాలని ప్రపన్నులు అభిలషించడం స్వాభావికం.

కన్నులు రెప్పగొట్టకుండా (అనిమేషైః) చూడడం అంటే, ఎంతసేపు చూచినా తృప్తి కలుగదనీ, చూచినా కొద్ది ఇంకా చూడాలనే కోరికకు అంతం ఉండదనీ అర్థం.

లోచనైః- కన్నులు రెండే ఉన్నా, అవి చూడడానికి కారణమైనది మనస్సు. మనస్సు లగ్నమైననే కాని వస్తువుమీద దృష్టి పడదు.

"మనోఽస్య దైవం చక్షుః"- దివ్యమైన కన్ను 'మనస్సు' అని శ్రుతి. రెండు కన్నులు మరియు మనస్సు కన్నే. కాబట్టి బహువచనం ప్రయుక్త మైనది. భగవత్సేవను అనుభవించడానికి రెండు కళ్ళు చాలవన్నమాట.

దేశికులు, తన జన్మ స్థలమైన 'తూప్పుల్' అనే గ్రామానికి చాలా దగ్గరగా ఉన్న కాంచీపుర దివ్యక్షేత్రమందు వెలసియున్న తేవప్పెరుమాళ్ళ యొక్క నిత్య సేవను ప్రతిదినం కన్నులతోనూ, మనస్సుతోను, అనుభవించి సుఖపడునట్లు తనను అనుగ్రహించవలసినదిగా దేవరాజును అభ్యర్థించారు. మాలినీ వృత్తం.

*49. నిరంతరం నిర్విశత స్త్వదీయం*
*అస్పృష్ట చింతాపద మాభిరూప్యమ్।*
*సత్యం శపే వారణ శైలనాథ*
*వైకుంఠ వాసేఽపి నమేఽభిలాషః॥*

**అర్థం:** హే వారణశైలనాథ!= ఓ హస్తిశైలాధిపా!; అస్పృష్ట చింతాపదం= స్పృశింపబడని భావనకు స్థానం కల్గియున్నట్టి; త్వదీయం= నీదైన; ఆభిరూప్యం= రూపసౌందర్యాన్ని; నిరంతరం= ఎడతెగకుండా; నిర్విశతః= చూచి సుఖించే; మే= నాకు; వైకుంఠవాసే, అపి= వైకుంఠలోక నివాసమందు కూడా; అభిలాషః= కోరిక; న= లేదు; సత్యం, శపే= సత్యమని శపథం చేస్తున్నాను.

**తా॥** ఓ వరదా! మనస్సుతోనైనా ఇది ఇట్లు ఉంటుందని భావించే అవకాశం లేని నీ మూర్తి సౌందర్యాన్ని నిత్యం కన్నార చూసి ఆనందించే నాకు వైకుంఠమందు నివసించాలనే ఆశ లేదు. సత్యం సుమా!

వ్యాఖ్య:- దేవాధిరాజు యొక్క దివ్య సౌందర్యాది గుణానుభవమే పురుషార్థం; కాంచీక్షేత్రవాసాన్ని వదలి వైకుంఠవాస మందు ఎందుకాశపడాలి? అని స్వాభినివేశం సుశ్లోకితం.

సమస్త కల్యాణ గుణాత్మకుడు పరమాత్మ. భావ ప్రధాన నిర్దేశంగా కల్యాణ శబ్దాన్ని పేర్కొని కల్యాణత్వం స్వభావంగా గల దివ్యాత్మ స్వరూపం కలవాడని అర్థం. 'ఆత్మన్' శబ్దం 'స్వరూప పర' మన్నమాట. సమస్త ప్రదేశం కల్యాణంగా-అనుకూలంగా ఉండడమని భావం.

"ఉయర్వఱ ఉయర్ నలం ఉడై యవన్" అని నమ్మాళ్వార్ల శ్రీసూక్తి. దీనినే "స్వాభావికానవధికాతిశయే శిత" నారాయణుడని యామునాచార్యుల శ్రీసూక్తి.

'ఆత్మశోభ' అనే పదం గతశ్లోకంలో ప్రయుక్తం. కల్యాణ గుణాలతో భగవానునికి వైభవం రాలేదు. పైగా, కల్యాణ గుణాలకే శోభ కలిగింది. భగవత్స్వరూప వైభవం దేనికీ అధీనమైనది కాదు. ఆ దివ్యాత్మవైభవం అనన్యాధీన ప్రకాశమని అర్థం.

అస్పృష్ట చింతాపదమాభిరూప్యమ్- 'ప్రాప్తరూప సురూపాభిరూప' శబ్దాలు 'మంచిరూపం' అనే అర్థం కలవి. దివ్యావయవ సౌష్ఠవం గల రూపమని భావం. స్వామి యొక్క అవయవాలు పరస్పరం సహకరించుకొంటాయి. భక్తుల నేత్రాలను, ఒకదానిలోని సౌందర్యాన్ని అనుభవించిన తర్వాత మరియొక అవయవంలోని సౌందర్యాన్ని అనుభవించడానికి తీసుకపోతాయి. అవయవాల్లో సముదాయ శోభను 'లావణ్యం' అంటారు.

"భూయిష్ఠం తేజ ఏవాద్భిర్బహులాభిర్మృదీకృతం।
చక్షురానంద జనకం 'లావణ్య' మితి కథ్యతే॥"

ఎక్కువ నీటితో మెత్తగా చేయబడి నయనానందం కలిగించే తేజస్సు లావణ్యమని నిర్వచింపబడింది.

*"క్షణే క్షణే యన్నవతాముపైతి తదేవరూపం రమణీయతాయాః"*- రెప్పపాటు కలిగినప్పుడల్లా అందంలో కొత్తదనం కనబడితే, అది రమణీయ రూపమని 'మాఘకవి' మాట.

అభిరూప్యమంటే రూపసౌందర్యం అని అర్థం.

*"ఒరు దేశత్తి లేపోనాల్ అను భావ్యమామ్బడియిరుక్కే యన్టిక్కే వైలక్షణ్యత్తిల్ వాశియరిన్దవర్ గళుక్కు" ఎన్నముతినైక్కణ్ణ కణ్‌గళ్ మత్తొన్నినై క్కాణావే" ఎన్నుమ్బడి అనుభావ్యమాయ్ ఇరుక్కైయుమ్"*- అర్చామూర్తిలో రుచిజనకత్వం, అశేష లోక శరణ్యత్వం, అనుభావ్యత్వం పూర్ణంగా ఉన్నాయి. అర్చామూర్తి తన సౌందర్యం చేత చూచేవాళ్ళకు భక్తిని కలిగించి, శరణ్యమై, పరమపదంలోని అనుభవాన్ని ఈ లోకంలోనే కలిగిస్తుందని (పై, తత్త్వత్రయ వ్యాఖ్యాన పంక్తికి) సారార్థం.

*"ఉయ్యలల్లాల్ మత్తైయార్కు ఉయ్యలాయే"*- అన్నట్లు అర్చావతార ప్రావణ్యమే ఉజ్జీవన హేతువు. ఆళ్వార్లు అందరు అర్చామూర్తి గుణగణాలను అనుభవించి శరణాగతి చేసిన వారే కదా!

*"తామర్చయేత్, తాంప్రణమేత్, తాం వదేత్, తాం విచిన్త యేత్"*- అర్చామూర్తినే పూజించాలి, నమస్కరించాలి, స్తుతించాలి, మననం చేయాలి అని శౌనక మునీశ్వరుని శ్రీసూక్తి.

దేవాధిరాజు యొక్క ఆభిరూప్యం అస్పృష్ట చింతాపదం. తాకరానిది. మనస్సు చేతనూ స్పృశించరానిది.

*"యతో వాచో నివర్తంతే, అప్రాప్యమనసాసహ"*- బ్రహ్మానంద గుణం వాక్కుకూ, మనస్సుకూ గోచరం కానట్లే, ఆభిరూప్యం కూడా వాఙ్మనస్సులకు గోచరించనిది అన్నారు దేశికులు.

*త్వదీయం ఆభిరూప్యం నిరంతరం నిర్విశతః మే*- అయినా, దివ్యరూప సౌందర్యాన్ని, ఇతర విషయాల నేమాత్రమైనా చింతించనట్టి, భగవదనుగ్రహ

పాత్రమైనట్టి మనస్సు చేత- ఆదరాతిశయంతో సంతతం భావించి, నయనానందకరంగా సేవించే యోగ్యత కలవారు దేశికులు.

వైకుంఠవాసేఽపి అభిలాషః నాస్తి- నిత్య విభూతిలో ఉండే భగవదనుభవం శ్రీమద్ఘంటావతారులైన దేశికులకు లీలా విభూతిలోనూ, (మెయ్యంకచ్చి) సత్యాద్రి క్షేత్రం- కాంచీపురంలోనూ అవిచ్ఛిన్నంగా కలుగుతున్నప్పుడు ఈ దేశం, ఆ దేశం అనే భేదం లేదు. తిరుమంగైయాళ్వార్ల అర్చాప్రావణ్యం విలక్షణమైనది. ఆయనకు పర, వ్యూహ, విభవ, అంతర్యాములు- ఉపాయాంతరాలు అనే భావం ఉండడం వల్ల, ఆ మూర్తులను ఆశ్రయించినవారికి ఉజ్జీవనం లేదు అన్నాడు.

"ఏరార్ ముయల్ విట్టుక్కా క్కైప్పిన్ బోవదే"- (శిరియ తిరుమడల్-8) భూమి మీద తిరిగే ఉపభోజ్యానికి తగిన కుందేటిని వదలి, ఉపభోజ్యానికి తగనిదైన ఆకాశంలో ఎగిరే కాకి వెంట పడడమా? అని అర్చామూర్తి కంటె ఇతర మూర్తుల యందు తిరుమంగైమన్నన్ అనాదరాన్ని ప్రకటించారు.

*"ఇచ్చువై తవిర యాన్ పోయ్ ఇందిర లోక మాళుం*
*అచ్చువై పెరినుం వేండేన్ అరంగ మానగరుళానే"*

ఇచ్చువై= ఈ నామ మాధుర్యం. అచ్చువై= మోక్షానందం పరమ పదం. ఓ రంగనాథా! ఈ సంకీర్తనామృతాస్వాదాన్ని విడిచి పరమ పదానికి పోయి అక్కడ నివాసాన్ని ఆనందాన్నీ పొందిననూ నేనిష్టపడను అని తొండరడిప్పొడియాళ్వారు (తిరుమలై-2) శ్రీ సూక్తి. మోక్షానందం శాస్త్రమాత్ర బోధితం. సంకీర్తనానందం ప్రత్యక్ష సిద్ధం.

అర్చామూర్తి సౌందర్యానుభవాన్ని వదలి, పరమ పదానికి పోవాలా? కాంచీపురవాసం కంటె వైకుంఠవాసమందు విశేషమేమీ లేదని దేశికులు ప్రకటించారు.

సత్యం శపే- వైకుంఠ వాసమందు నాకాశలేదు. ఇది సత్యం, అని శపథం చేస్తున్నాను అని దేవరాజుతో విన్నపించారు దేశికులు.

కౌసల్య 'నీవే రామ వనవాసానికి కారణం' అని భరతునితో పల్కినప్పుడు భరతుడు "వ్రణే తుద్యేవ సూచినా" అంతకుముందే రాముడు అడవికి పోయినాడని విలపిస్తూ గాయపడిన తన హృదయానికి సూదులతో గ్రుచ్చినంత బాధ పడినాడు.

కౌసల్యకు తన మీద విశ్వాసం కల్గడం కోసం, తన నిర్దోషిత్వాన్ని నిరూపించుకోవడానికి 'రామ వనవాసానికి నేనే కారణమైతే ఆయా ఘోరపాప ఫలితాలను అనుభవింతును గాక' అని భరతుడు యాభై (50) శపథాలను చేశాడు (ఒట్టులను పెట్టుకొన్నాడు).

అట్లే, కైశిక పురాణమందు - మాలదాసరిని బ్రహ్మపిశాచం భక్షింప యత్నించినప్పుడు 'తిరుక్కురుంగుడి' కోవిల ద్వారం ముందు భగవంతుని కీర్తనలను వివిధ రాగాలతో పాడి, తిరిగి వచ్చిన వెంటనే నన్ను భక్షించు'మని ప్రార్థించినప్పటికీ పెడచెవిన పెట్టిన బ్రహ్మరాక్షసుణ్ణి నమ్మించడానికి మాలదాసరి ముప్పది రెండు (32) శపథాలను చేశాడు. "నేను తిరిగి నీ దగ్గరికి నన్ను భక్షించుమని రాకపోతే, ఆయా పాపాలను చేసిన వారి లాగా నరక మనుభవింతును గాక" అని ఒట్టు (లను) పెట్టుకొన్నాడు.

భరతుడు, మాలదాసరి చేసినవి 'నిర్బంధమైన- బలాత్కారంగా చేసిన శపథాలు.

ఇక్కడ దేశికులు చేసిన శపథ మట్టిది కాదు. సత్యమైన శపథం.

"భోగమాత్ర సామ్యలింగాచ్చ"- (బ్ర.సూ. 4-4-21) బ్రహ్మానుభవ రూపమైన భోగమందు మాత్రం ముక్తపురుషుడు పరబ్రహ్మతో సమానుడని, బ్రహ్మవలె జగద్వ్యాపారమందు మాత్రం ముక్తాత్మకు సామర్థ్యం లేనట్లు బ్రహ్మసూత్రం సూచిస్తున్నది.

"సోऽశ్నుతే సర్వాన్ కామాన్ సహబ్రహ్మణా విపశ్చితా" అనే శ్రుతి వాక్యం- ముక్తపురుషుడు సర్వజ్ఞుడైన పరబ్రహ్మతో గూడా సర్వభోగాలను

అనుభవిస్తుంటాడని ముక్త పురుషుడు పొందే ఐశ్వర్యాన్ని అంటే పరమ పురుష సామ్యాన్నీ, సత్యసంకల్పాన్నీ వర్ణిస్తున్నది.

పరమ పురుష సామ్యం ఎప్పుడో వైకుంఠ వాసమందు కల్గుతుంది. దానికంటెను, భగవద్భాగవత కైంకర్యం చేస్తూ, భగవదనుగ్రహం వల్ల కలిగిన అర్చారూప సౌందర్యాన్ని ఎడతెగకుండా సేవించే భాగ్యరూపమైన భగవదనుభవం కాంచీపుర దివ్యక్షేత్రవాసమందు తనకు లభించడం చాలును; అనే ధిషణ ప్రభవించి, వైకుంఠ వాసమందు తనకు అభిలాష లేదనే సత్యాన్ని తనంత తానే ప్రకటించి, శపథం చేశాడనడం విపశ్చితుల వైచక్షణ్యం.

ఇందు అతిశయోక్త్యలంకారం సుస్పష్టం. ఉపజాతి వృత్తం రెండు వృత్తాల సంకరం (మేళనం). ఉపజాతి మొదటి పాదంలో 'జతజగగ' గణాలుకల ఉపేంద్ర వజ్రావృత్తమున్నది. తర్వాత మూడు పాదాలలో 'తతజగగ' గణాలు కల ఇంద్రవజ్రావృత్తమున్నది. "త్రిష్టుప్' ఛందో భేదాలలో 'కీర్తి' అనే ఉపజాతి వృత్తమిది. (ఉపేంద్ర వజ్రా జతజాస్తతో గౌ॥ స్యాదింద్ర వజ్రాయది తౌజగౌగః॥)

(ఉపజాతి వృత్తాలలో చతుర్దశ (14) భేదాలున్నాయి).

*50. వ్యాతన్వానా తరుణ తులసీదామభిః స్వామభిఖ్యాం*
*మాతంగా ద్రౌ మరకతరుచిం పుష్ణతీ మానసే నః।*
*భోగైశ్వర్య ప్రియ సహచరైః కాఽపి లక్ష్మీ కటాక్షైః*
*భూయః శ్యామా భువన జననీ దేవతా సంనిధత్తామ్॥*

**అర్థం:** తరుణ తులసీదామభిః= పచ్చని కొత్త తులసీ దళాల మాలికల చేత; భోగ+ఐశ్వర్య ప్రియ సహచరైః= పరమ పదమందలి మోక్ష భోగమందు, జగత్తును నియమించడమందునూ, ప్రీతితో తోడ్పడునట్టి; లక్ష్మీకటాక్షైః= లక్ష్మీదేవి యొక్క కడగంటి చూపులచేతనూ; భూయః= మళ్ళీ, ఇంక; శ్యామా (సతీ)= నీలవర్ణమవుతూ, మాతంగ+అద్రౌ= హస్తిగిరియందు; స్వాం= తనదైన; అభిఖ్యాం= కాంతిని;

వ్యాతన్వానా= వ్యాపింపజేస్తున్నది, (అతః, ఏవ= కావుననే); మరకతరుచిం= మరకత మణిమయమైన నీలకాంతిని; పుష్ణతీ= పెంచుతున్నట్టి; భువన జననీ= జగత్తును జనింప జేసినట్టి; కా, అపి= అనిర్వాచ్యమైనట్టి; దేవతా= పరదేవత (యైన దేవాధి రాజు); నః= మాయొక్క; మానసే= మనస్సునందు; సంనిధత్తాం= నిల్చియుండు గాక.

**తా॥** స్వతః వరదరాజ భగవన్మూర్తియొక్క నీలమేఘశ్యామ వర్ణం అభినవ తులసీమాలికలచేతనూ వైకుంఠంలో భోగావస్థయందు మరియు జగన్నియామక దశయందు ప్రేమపూర్వకంగా సహకరించే లక్ష్మీకటాక్ష వీక్షణాల చేతనూ ఇంక ఎక్కువగా శోభిస్తున్నది. కరిగిరియందు దేవరాజు యొక్క శ్యామల కాంతి, వ్యాపించడం వల్ల, దాన్ని మరకత పర్వతంగా గోచరింపజేస్తున్నది. లోకమాత వలె జగత్కారణమైన, సాటిమేటి లేనట్టి, పరదేవత (వరద భగవానుడు) మా హృదయమందు వేంచేసి యుండవలెనని ప్రార్థన.

**వ్యాఖ్య:-** ఆదరాతిశయం చేత భక్తుల హృదయమందు భగవానుని సన్నిధానం అభ్యర్థింప బడుతున్న శ్లోకం.

"*ఉలగమేత్తుమ్ కండియూర్ అరంగం మెయ్యం కచ్చి పేర్ మల్లై యెన్ఱి మణ్ణినార్*"- జగమంతా స్తుతించే హరశాప విమోచన క్షేత్రం శ్రీరంగం. సత్యాద్రి క్షేత్రం కాంచీపురం, తిరుప్పేర్‌నగర్ మహాబలిపురం అనే దివ్య దేశాలలోని అర్చామూర్తుల యందు తిరుమంగైయాళ్వార్లు అతి ప్రావణ్యం గలవారు.

శ్రీమద్వేదాన్త దేశికుల వారు కాంచీపురమందు సుప్రతిష్ఠితులైన ప్రణతార్తి హరుని (అర్చామూర్తి) ప్రాభవ వైభవాలు వైకుంఠ నాథుని ప్రాభవ వైభవాల(కు) వలె, ఏ మాత్రం కొరతలేనివై, పరిపూర్ణమైనవని మిక్కిలి ప్రావణ్యం కలవారు. కాబట్టి వైకుంఠ వాసమందు ఆశలేదు అని చెప్పిన విధంగా మహానందాన్ని అనుభవిస్తూ, ఆనందాతిశయంతో, ఆ దేవాధిరాజు సాక్షాత్తుగా తమ హృదయమందు స్థిరంగా నిలిచి యుండాలని ప్రార్థించారు.

తరుణ తులసీదామభిః స్వామభిఖ్యాం– పరదేవతయైన శ్రియఃపతి వర్షింప నున్న నీలజలదం వలె శ్యామలమైన వన్నెకలవాడు. కాంచీపురమందలి తులసీ వనాలలోని కృష్ణతులసీ దళాలచే అల్లబడిన చల్లని, పచ్చని మాలికలను తన గళమందు ధరించడం వల్ల ఆ శ్యామల వర్ణ శోభ ఇంక ఎక్కువ అయింది. అంతే కాదు.

భోగైశ్వర్య ప్రియ సహచరైః– 'భోగం' అంటే తనను ఆశ్రయించిన, శరణు పొందిన వారికి ప్రసాదించే 'మోక్షానందం'. నిత్య విభూతి– పరమ పదంలో భగవదనుభవ రసానందమే 'భోగం' అని అర్థం.

'ఐశ్వర్యం' అంటే జగత్తును శాసించడం, విశ్వాన్ని పాలించే సామర్థ్యం, ప్రభుత్వమని అర్థం. ఇది లీలా విభూతి విషయం.

శ్రీ శ్రియఃపతుల దాంపత్యం నిత్యయోగ మని ప్రసిద్ధి కదా! ఒకరి నొకరు విడిచి ఉండని దేవతా దాంపత్యం.

భోగ, ఐశ్వర్య దశలలోనూ లక్ష్మీదేవి యొక్క కరుణాకటాక్ష వీక్షణాలతో శ్రియఃపతి తను శోభ– శ్యామ వర్ణం అధికంగా ఉద్దీపిస్తుంది. లక్ష్మీదేవి యొక్క కన్నులు నల్ల కలువల కాంతి వంటి కాంతి కలవి కదా! రెండు దశలలోనూ లక్ష్మీదేవి యొక్క (దృష్టి) చూపులు ప్రీతిపూర్వకంగా భగవంతునితో సహచరిస్తూ ఉంటాయి. అంటే తోడ్పడుతాయి అని అర్థం. లేదా– భోగదశలో లక్ష్మీకటాక్షం భగవంతునియందు ప్రసరించడం వల్ల 'ఇన్నాళ్ళకు మన బిడ్డడు మన దగ్గరకు వచ్చాడు కదా!' అనే భావంతో సతి పతిని కడగంటితో– ప్రేమతో చూస్తుంటే భగవద్విగ్రహ తేజస్సు వృద్ధి పొందుతుంది. శరీరం పైన పులకలు అంకురిస్తాయి. భోగదశలో ప్రేమ, అనుగ్రహం మాత్రమే ఉంటుంది. మోక్షానంద మందు దేవి చూపులు ప్రియంగా ప్రసరిస్తుంటాయని అర్థం. అది బహుమానం. "విముక్తి ఫలదాయిని"– అని లక్ష్మీదేవికి పేరున్నది కదా!

ఇక ఐశ్వర్యదశయందు- జగత్కార్య నిర్వహణమందు శ్రియఃపతి *"యస్యావీక్ష్యముఖం తదింగిత పరాధీనో విధత్తే"* (శ్రీ కూరేశుల శ్రీస్తవం-1) లక్ష్మీదేవి ముఖాన్ని చూస్తూ, ఆమె యొక్క ఇంగిత పరాధీనుడై సృష్టిస్థితి లయాత్మకమైన జగత్తును చేస్తుంటాడు.

*"అంగీకారిభిరాలోకైః సార్థ యంత్యై (శ్రియై) కృతోఽంజలిః"*- భగవానుని సృష్ట్యాది కార్యాలనన్నిటినీ అంగీకరించే చూపులతో సార్థకం చేస్తున్న లక్ష్మీదేవికి అంజలి ఘటిస్తున్నాను అన్నారు (శ్రీ గుణరత్నకోశం.-1) శ్రీ పరాశర భట్టరు. భగవానుడు సృష్టికర్త. భగవతి అంగీకారిణి. లక్ష్మీదేవి కటాక్షం చేతనే ఆమె ఆమోదించడం వల్లనే- లక్ష్మీపతి తన కార్యాలను నెరవేర్చుకొనగలుగుతుంటాడని భావం.

జగత్కారణుడైన శ్రియఃపతి హితకాముడై అప్పుడప్పుడు నిగ్రహించినా, శ్రీదేవి "న కశ్చిన్నాపరాధ్యతి"- తప్పు చేయని వాడెవ్వడు? అని హెచ్చరించి, ఆయన నిగ్రహాన్ని అనుగ్రహంగా పరివర్తింపజేసేవి ఆమె చూపులు.

"లక్ష్మీః పురుషకారత్వే నిర్దిష్టా పరమర్షిభిః"- మహర్షులు 'లక్ష్మీదేవి పురుషకారిణి' అని ప్రశంసించారు. ఐశ్వర్య దశలో- జగత్తును శాసించే కృత్యాలలో శ్రీదేవి యొక్క కటాక్షాలు శ్రియఃపతికి సహకరిస్తాయి.

ఇట్లు లక్ష్మీ కటాక్షాలు భోగదశలో ప్రియంగానూ, ఐశ్వర్య దశయందు సహకారంగానూ ఉంటాయని (క్రమంగా) అన్వయించనగును.

సర్వావస్థల యందు కూడా అనుగ్రహ పూర్వకంగా సహచరించే లక్ష్మీదేవి యొక్క కటాక్ష వీక్షణాలచే లక్ష్మీపతి యొక్క విగ్రహ మందలి నీలఘనశ్యామల కాంతి మరెంతో ఉజ్జ్వలంగా ప్రకాశిస్తున్నది.

భూయః శ్యామా- భగవంతుని విగ్రహతేజస్సు *"అవిరళ తులసీ దామ సంజాత భూమా"*- ఎల్లప్పుడు పచ్చని తులసీ మాలికలచేత అధికమైనది అనీ,

"లక్ష్మీ నేత్రోత్పలశ్రీ సతత పరిచయాత్ ఏష సంవర్ధమానః"- శ్రీదేవి యొక్క నల్ల కలువలవంటి కన్నుల కాంతి పదే పదే శ్రీపతిమీద పడడం వల్ల, తద్గుణం సంక్రమించడం వల్ల ఆతని శ్యామలమైన వన్నె- తను కాంతి బాగా వృద్ధిని పొందుతున్నది అని దేశికులు 'తత్త్వముక్తా కలాపం' అనే గ్రంథమందు వర్ణించారు.

*స్వామభిఖ్యాం మాతంగాద్రౌ వ్యాతన్వానా మరకత రుచిం పుష్ణతీ-*

"అభిఖ్యా నామశోభయోః" (అమరం) 'అభిఖ్యా' శబ్దానికి పేరు, కాంతి అని అర్థద్వయం.

"*శోభయన్ దండకారణ్యం దీప్తేన స్వేన తేజసా*"- (రామాయణం) శ్రీరామ చంద్రమూర్తి తన ఉజ్జ్వలమైన నీలఘనశ్యామ కాంతిచేత దండకారణ్యాన్ని శోభింపజేశాడని వాల్మీకి వాక్కు

వరదరాజు యొక్క స్వతః ఘనశ్యామలమైన తను కాంతి తులసీ దామాల చేతనూ, లక్ష్మీదేవి యొక్క కువలయ దళశ్యామలమైన కటాక్షాలచేతనూ బాగా పెంపొంది, హస్తిగిరి మీద వ్యాపించడం వల్ల, చూచే జనానికి ఆ పర్వతం 'ఇది మరకత మణిమయ పర్వతం' అనే బుద్ధిని జనింప జేస్తున్నది.

కాఽపి భువన జననీ దేవతా- అనిర్వచనీయమైన ఈ పరదేవత, లోకమాత, "*త్వమేవ మాతాచ పితాత్వమేవ*"- "*తాయాయ్ తంద్రైయాయ్*"- "నీవే తల్లివి తండ్రివి" అని కీర్తింప దగినది. లోకంలో తల్లి తన పుత్రునికి స్తన్యమిచ్చి శరీరాన్ని పోషిస్తుంది. లోకమాత మనకు చైతన్యం అనే చనుపాలనిచ్చి ఆత్మను పోషిస్తుంది.

లోకంలో తల్లి, తండ్రీ, పుత్రుడు, తోబుట్టువు, భార్య, మిత్రుడు మొదలైనవారు, ఒక్కొక్కరు ఏదో ఒక కొంత లాభాన్ని చేకూర్చుతారు.

*"పితృ మాతృసుత భ్రాతృ దారా మిత్రాదయోఽపి వా।*
*ఏకైక ఫల లాభాయ; సర్వ లాభాయ కేశవః॥"*

భగవానుడు అన్ని లాభాలను కల్పిస్తాడని అర్థం.

ఈ భువన జనని 'సర్వ ఫల ప్రద'గా విరాజిల్లుతున్నది. తన సంతానం ఆకలితో చనుపాల కోసం ఏడుస్తుంటే, తల్లి ఒక్కొక్కప్పుడు పాలనీయక, తన పనిని తాను చేసుకోవడం కూడా సంభవమే.

"రుషానిరస్తోఽపి శిశుః స్తనంధయో నజాతు మాతుశ్చరణౌ జిహాసతి"- (స్తో.ర. 26) పాలు త్రాగే తన శిశువును తల్లికోపంతో పక్కకు నెట్టివేసినా, ఆ శిశువు తన తల్లి పాదాలను వదలాలని అనుకోకుండా, పట్టుకొని బ్రతిమాలడమూ సంభవమే.

ఈ లోకమాత అటువంటిది కాదు. అజ్ఞాత నిగ్రహ. ఈ తల్లికి కోపమే తెల్యదు, రాదు కూడా.

"వాత్సల్య నిర్భరతయా జననీ కుమారం స్తన్యేనవర్ధయతి దష్టపయోధరాఽపి"- (గోదాస్తుతి-27). పాలు త్రాగుతున్నప్పుడు పాలపంటితో చనుమొనను కొరికిననూ, లోకమాత నిండు వాత్సల్యంతో కుమారుణ్ణి, స్తన్యమిచ్చి పెంచుతుంది.

ఇతర దేవతలైన ఇంద్రాదులకు "దేవాదీనాం పశుః" పిండి బొమ్మకంటె మేకను యాగపశువుగా చేయడమే సమంజస మన్నందువల్ల "ఇది చేయడం తప్పు, అది చేయడం తప్పు" అనే రంధ్రాన్వేషణ పరుల చేత శపింపబడిన వారి గాథలను పురాణాలు చెబుతున్నాయి.

"భువన జననీ" అని 'కాఽపి దేవతా" అని చెప్పబడిన పరదేవతయైన సర్వేశ్వరుడు ఇతర దేవతల కంటె విలక్షణుడనీ "సర్వేషా మేవలోకానాం పితా మాతాచ మాధవః। గచ్ఛధ్వమేనం శరణం శరణ్యాం పురుషర్షభాః॥" 'సమస్త జనులకు తండ్రి, తల్లియు శ్రియఃపతియే అని కీర్తింపబడుతున్నాడు. కాబట్టి, శరణ్యుడైన ఆయననే శరణు పొందండి' అని పూజ్యులైన మహానుభావులచే పురుషార్థులు ఉపదేశింపబడినారు.

ఎందరు ఎన్ని చాడీలు చెప్పినా, దయాసముద్రుడైన శ్రియఃపతి “ఎన్నడి యారదు శెయ్యార్, శెయదారేల్ నన్ఱు శెయ్ తార్”– నా దాసులు అపరాధాలు చేయరు, ఒకవేళ చేసినా, నాకు అది ఇష్టమే అని ప్రకటించే ప్రభువు.

సుగ్రీవాదులు విభీషణుణ్ణి చేర్చుకోరాదని చెప్పినా, శ్రీరాముడు “దోషోయద్యపి తస్యస్యాత్”– అతని యందు దోషముంటే ఉండుగాక, “మిత్ర భావేన సంప్రాప్తం నత్యజేయం కథంచన”– స్నేహభావంతో నన్ను ఆశ్రయించిన వ్యక్తిని నేను ఎట్లైనా విడువను, అని తన నిర్ణయాన్ని ప్రకటించాడు. అంతేకాదు. ఆ సందర్భాన్ని పురస్కరించుకొని “నేను నీ వాడను అని ఒక్కసారి ఆత్మ నిక్షేపం భరన్యాసం చేసిన సర్వ ప్రాణులకు, రక్షిస్తానని అభయమిస్తున్నాను, ఇది నా నియమం” అని ప్రతిజ్ఞ చేశాడు సీతాపతి.

దేవతానః మానసే సన్నిధత్తామ్– పరదేవతయైన నీలమేఘశ్యామల మూర్తి దేవాధిరాజు నా యొక్క, నాకు సంబంధించిన వారి యొక్క మనస్సులో స్థిరంగా నివసించి యుండవలెనని దేశికులు ప్రార్థించారు.

ఇది భక్త జనులదరు ధ్యానించదగిన శ్లోకం.

‘దేవ’ శబ్దం మూడు లింగాలలోనూ ఉంది. ఉపనిషత్తులే ఉదా:-

పుంలింగం:- శుద్ధో దేవ ఏకో నారాయణః. నారాయణోపనిషత్తు.

ఏష హ్యేవానందయాతి - తైత్తిరీయోపనిషత్తు.

స్త్రీ లింగం:- సేయం దేవతా ఐక్షత- ఛాందోగ్యోపనిషత్తు

సైవ హి సత్యాదయః- (బ్రహ్మసూత్రం. 3-3-37)

నపుంసక లింగం:- తద్ బ్రహ్మ- తైత్తిరీయోపనిషత్

సదేవ సోమ్యేదం- ఛాందోగ్యోపనిషత్.

(దేవః, దేవతా, దైవతం; సః, అయం, ఏషః సా, ఇయం, ఏషా, తత్, సత్, ఇదం, ఏతత్;- ఇలా పదాలు లింగ త్రయమందున్నాయి).

"అణిల్లన్ పెణ్ణల్లన్ అల్లావలియు మల్లన్" (తి.వా.2-5-10)

భగవానుడు మగవాడు కాడు, ఆడమనిషి కాడు, నపుంసకుడూ కాడు. 'అన్య ప్రత్యయం' వల్ల ఇతరులకంటె విలక్షణుడైన పురుషోత్తముడు- అని వకుళాభరణులవాణి. మందాక్రాంతావృత్తం.

*51. ఇతి విహిత ముదారం వేంకటేశేన భక్త్యా*
*శ్రుతి సుభగమిదం యః స్తోత్రమంగీకరోతి।*
*కరిశిఖరి విటంక స్థాయినః కల్పవృక్షాత్*
*భవతి ఫలమశేషం తస్య హస్తాప చేయమ్॥*

**అర్థం:** ఇతి= ఈ విధంగా; వేంకటేశేన= శ్రీ వేంకటేశ్వరునిచేత/ వేంకటనాథుడనే పేరుగల వేదాంత దేశికులచేత; భక్త్యా= భక్తితో; విహితం= చెప్పబడిన; ఉదారం= గంభీరమైన; శ్రుతి సుభగం= చెవులకింపైన/ వేద ప్రమాణాలచే ఆనంద జనకమైన; ఇదం= ఈ; స్తోత్రం= వరదరాజ స్తోత్రాన్ని; యః= ఎవడు; అంగీకరోతి= అంగీకరించునో- స్తుతించి ఆనందించునో; తస్య= అతనికి; కరిశిఖరి విటంక స్థాయినః = కరిగిరి శృంగమందు స్థిరంగా నెలకొని యున్న; కల్పవృక్షాత్= కల్పవృక్షం (అనే దేవరాజు) నుంచి; అశేషం= సమస్తమైన; ఫలం= (కోరిన) ఫలాన్ని; హస్త+అపచేయం= చేతులతో తెంపుకోదగినట్లుగా; భవతి= ఉంటుంది.

**తా॥** ఈ రీతిగా శ్రీమద్వేదాన్తదేశికులచేత భక్తితో చేయబడిన గంభీరమైన, శ్రుతి సుభగమైన ఈ 'వరదరాజ పంచాశత్' అనే స్తోత్రాన్ని అనుసంధానం చేసే వ్యక్తికి హస్తిశైలాగ్రమందున్న కల్పవృక్షం నుంచి కోరబడిన ఫలాలను నేలమీదనే ఉండి చేతులతో పట్టి పొందునట్లుగా నుండును.

సర్వంకషా వ్యాఖ్య:- ఈ స్తోత్రానుసంధానం సకలాభీష్టసిద్ధిని సమకూర్చును అని ఉపదిష్టం.

ఇతి- ఈ విధంగా- తత్త్వ హిత పురుషార్థాల యందు కలిగే సందేహాలను తొలగించే రీతిగా అని అర్థం.

వేంకటేశేన-

*కృతయుగే దేవరాజః త్రేతాయాం రంగనాయకః।*
*ద్వాపరేతు జగన్నాథః, కలౌ వేంకట నాయకః॥*

కృతయుగమందు 'కాంచీపురం'లో దేవరాజు, త్రేతాయుగమందు శ్రీరంగనాథుడు, ద్వాపరయుగమందు 'పూరి'లో జగన్నాథుడు, కలియుగమందు 'తిరుమల'లో శ్రీవేంకటేశ్వరుడు, స్వయంగా వ్యక్తమైన అర్చామూర్తులు.

విహితం- కలియుగాదిలో ప్రాణుల రక్షణకోసం స్వయం వ్యక్తమైన, పరమ కారుణ్య భరితుడైన శ్రీనివాసునిచే చెప్పబడిన స్తోత్రం, అనడం వల్ల ఈ స్తోత్రమంఖిరి వక్తృదోషానికి అవకాశం లేదని సూచితం.

శ్రీ వేంకటేశ ఘంటాంశతో ఆవిర్భవించారని ఆప్తులు చెప్పిన రీతిగా, తల్లిదండ్రులు వేంకటనాథుడని పేరు పెట్టారు. తర్వాత జ్ఞాన వైరాగ్య భూషణులై భక్తిచేత, విశిష్టాద్వైత సిద్ధాంత ప్రచారం చేయడం వల్ల వేదాంతాచార్యులని ప్రసిద్ధి పొందిన వీరు ఈ స్తోత్ర రచన శ్రీవేంకటేశ్వరుని దయా కార్యమనియే భావించారు. ఇట్లు గ్రంథకర్త యొక్క నామధేయం ఈ శ్లోకమందు ముద్రితమైనది.

ఉదారం, శ్రుతి సుభగం ఇదం స్తోత్రం- పరిపూర్ణమైన శబ్ద సౌష్ఠవమూ, అర్థ గాంభీర్యమూ, భావరచనా సౌందర్యమూ కలిగి యున్న స్తోత్రమిది. వేద శాస్త్ర ప్రమాణాలచేత భగవానుని కల్యాణ గుణాలను కీర్తిస్తున్నది ఈ స్తోత్రం. స్తోత్రాన్ని పఠించేవారికి గ్రంథస్థ విషయ వైభవం ప్రకటింపబడింది. శ్రోతలకు రుచిజనకమైనది. అర్థపరిజ్ఞానం లేకున్ననూ పద, వాక్య, ప్రమాణాలచే పరిపూర్ణమైన ఈ స్తోత్రాన్ని విన్నంత (మాత్రాన) నే దెందమానంద కందళిత మవుతుంది.

ఇది స్తోత్ర ప్రబంధ విషయమని సుస్పష్టం.

కరిశిఖరి విటంకస్థాయినః కల్పవృక్షాత్ భవతి ఫలమశేషం తస్య హస్తాప చేయమ్- కోరికల నీడేర్చే కల్పవృక్షం స్వర్గమందలి నందనోద్యాన వనమందు ఉండడం వల్ల అది దుర్లభం కదా!

ఆ కల్పవృక్షం భూలోకమందు కాంచీపురమనే దివ్యక్షేత్రమందు కరిగిరి శిఖరంపైన నెలకొనియున్నది. దేవాధిరాజు కల్పవృక్షంగా పోల్పబడినాడు.

ఆచార్యులు అనుగ్రహించిన, భగవద్గుణాభి ధానరూపమైన ఈ స్తోత్ర ప్రబంధాన్ని పఠించిన వ్యక్తులు 'ప్రణతార్తి హరుడు' అనే కల్పవృక్షం నుంచి నేల మీదనే ఉండి, సమస్త ఫలాలను చేతులతోనే తెంపుకొని మధురంగా అనుభవింప యోగ్యమైనది.

అశేషం ఫలం హస్తాపచేయం- అన్ని ఫలాలను అంటే మోక్షఫలం కూడా సంగతం.

"అమరర్గళధిపతి యవనవన్"- (తి.వా.మొ. 1-1-1) ఆళ్వార్లు కృప జేసిన విధంగా, దేవరాజును శరణుపొంది చతుర్విధ పురుషార్థాలను అత్యంత సులభంగా పొందే అవకాశమున్నది కదా!

*"యద్యేన కామకామేన న సాధ్యం సాధనాంతరైః।*
*ము ముక్షుణా యత్సాం ఖ్యేన యోగేన చ భక్తితః॥*

*ప్రాప్యతే పరమంధామ యతో నావర్తతే పునః।*
*తేన తేనా ప్యతే తత్తత్ న్యాసేనైవ మహామునే॥"*

*(అహిర్బుధ్న్యసంహిత. 37-25)*

మోక్ష ఫలాన్ని కోరే వ్యక్తి ఇతర సాంఖ్య, యోగాది సాధనాల- ఉపాయాల చేత మోక్షాన్ని సాధింపలేడు.

పరమ పదనాథుడైన శ్రియఃపతిని గూర్చి శరణాగతి జేస్తే, పునర్జన్మలేని మోక్ష సామ్రాజ్యాన్ని అవశ్యంగా పొందుతాడు అని భావం.

"కలశజలధి కన్యావల్లరీ కల్పశాఖీ"– అని ఈ స్తోత్రారంభ శ్లోకమందు చెప్పబడింది. చివరి శ్లోకమందు "కల్పవృక్షాత్ ఫలమశేషం హస్తాపచేయం భవతి"– అని ఫలశ్రుతి విహితమైనది.

ఇట్లు కర్త, విషయం, సంబంధాధికారి, ప్రయోజనం అనే అనుబంధి చతుష్టయం సుశ్లోకితం. మాలినీ వృత్తం.

*"కవితార్కిక సింహాయ కల్యాణ గుణశాలినే।*
*శ్రీమతే వేంకటేశాయ వేదాన్త గురవేనమః॥"*

ఇది శ్రీ మాలోల నృసింహస్వామి కటాక్ష పాత్ర, హరితసగోత్ర, శ్రీమాన్ కారంచేటి తిరుమల మనోహరాచార్య ప్రథమ పుత్ర, వేంకట రాఘవాచార్య విరచిత ఆంధ్రటీకా, తాత్పర్యం, సర్వం కషా వ్యాఖ్యాసమేత శ్రీమద్వేదాంత దేశికానుగృహీత 'శ్రీ వరదరాజ పంచాశత్' స్తోత్రమ్.

卐

## శ్రీమాన్ కే.వి. రాఘవాచార్యుల రచనలు

**మాఘకావ్యవైభవమ్**

**గోదాస్తుతి** – పరిమళవ్యాఖ్య

**భగవద్విషయం** – ఈడు అవతారికలు – ఆంధ్రానువాదం

**భగవద్ధ్యాన సోపానమ్** – మనోరమా వ్యాఖ్యానమ్

**శ్రీ మద్రామానుజులు – వర్ణాశ్రమధర్మాలు**

**శ్రీ రంగనాథపాదుకాసహస్రమ్** 5 సంపుటాలు

(రమణీయాంధ్ర టీకాతాత్పర్య వ్యాఖ్యాన సహితమ్)

**గరుడ దండకమ్** – సుషమాంధ్ర టీకాతాత్పర్య వ్యాఖ్య

**ఆళ్వార్లు – భక్తిప్రపత్తి మార్గాలు**

**శ్రీనారాయణ శతకమ్** – రాఘవీయ వ్యాఖ్య

**దివ్య ప్రబంధత్రయి** – ఆంధ్ర టీకాతాత్పర్య వివరణమ్

(తిరుప్పల్లాణ్డు – తిరుప్పళ్ళియెషుచ్చి – కణ్ణినుణ్శిఱుత్తామ్బు)

**ద్రవిడోపనిషత్తాత్పర్య రత్నావళి** – ప్రకాశికా వ్యాఖ్య

**శ్రీ సుదర్శనాష్టకమ్** – జ్వాలా వ్యాఖ్య

**శ్రీ రుక్మిణీ కల్యాణమ్** – వైష్ణవీ వ్యాఖ్య

**కాంతా చతుః శ్లోకి** – దీపికా వ్యాఖ్య

**యతిరాజ సప్తతి** – చంద్రికా వ్యాఖ్య

**ఆభీతిస్తవమ్** – సంజీవనీ వ్యాఖ్య

**శ్రీస్తుతి** – హిరణ్మయీ వ్యాఖ్య

**ఉభయ వేదాన్తాల ఐక కంఠ్యమ్**

**దయాశతకమ్** – అమృతాస్వాదినీ వ్యాఖ్య

**శ్రీ వేదాన్త దేశిక దర్శనమ్**

**న్యాస వింశతి** – శ్రేయసీ వ్యాఖ్య

**న్యాస దశకమ్** – బుధరంజనీ వ్యాఖ్య

**శ్రీవరదరాజ పంచాశత్** – సర్వంకషా వ్యాఖ్య

**యాదవాభ్యుదయ మహాకావ్యమ్** – సుబోధినీ వ్యాఖ్య

(రచన సాగుతున్నది)



# శ్రీవణ్ శఠకోప
# శ్రీ రంగనాథ యతీన్ద్ర మహాదేశికన్

శ్రీ అహోబిలమఠం 46వ పీఠాధిపతులు



# శ్రీ కే.వి. రాఘవాచార్యుల జీవన రేఖలు

| | | |
|---|---|---|
| జననం | : | విభవ, పుష్య శుక్ల ద్వాదశి, 22 జనవరి 1929 |
| స్వగ్రామం | : | నారాయణపురం, ఎల్లారెడ్డిపేట మండలం, కరీంనగర్ జిల్లా (ఆం.ప్ర.) |
| తల్లిదండ్రులు | : | కీ॥శే॥ తిరుమల వెంకటమ్మగారు, కీ॥శే॥ తిరుమల మనోహరాచార్యులు గారు |
| భార్య | : | కీ॥శే॥ పద్మావతి |
| సంతానం | : | డా.॥ కె.వి.రమణాచార్యులు ఐ.ఎ.ఎస్; మనోహరాచార్యులు; శకుంతల; రమాదేవి, సువర్ణ |
| చదువు | : | సంస్కృతం ఎం.ఏ; తెలుగు ఎం.ఏ; బి.ఇడి |
| సోదరసోదరీమణులు | : | తిరుమల పార్థసారథి, తిరుమల నరసింహాచారి, డా॥ తిరుమల శ్రీనివాసాచారి, కీ॥శే॥ డా. వెంకట రమణాచారి, కొండమ్మ, శ్రీనివాసమ్మ |
| గురువులు | : | తండ్రిగారు, దివ్యప్రబంధాలు (ద్రావిడం), సంస్కృత సాహిత్యం, శ్రీమాన్ నమిలకొండ శ్రీరంగాచార్య స్వామి వారు, (నారాయణపురం), బ్ర.శ్రీ. భావికృష్ణ శాస్త్రిగారు (నారాయణపురం), బ్ర.శ్రీ. జోగా వెంకన్న శర్మగారు. |
| ప్రోత్సాహకులు | : | కారంచేటి తిరుమల వెంకట నరసింహాచార్యులు గారు (మెదక్) |
| భగవత్ విషయ బోధకులు | : | ఉ.వే. శ్రీమాన్ కందకుంట (ఎలిజర్ల) సీతారామాచార్య స్వామి వారు |
| వృత్తి | : | విశ్రాంత ఆంధ్రోపన్యాసకులు |
| ప్రవృత్తి | : | పురాణ, ప్రబంధ కాలక్షేపం; దైవమానుషయాజ్ఞికం; గ్రంథ పఠనం, రేడియో టివీ ప్రసంగాలు |